# సినీ గోవు

మాసపత్రిక

నవంబర్ - 2010
వెల : రూ.10/-





60 వసంతాల

అశోక్‌కుమార్ ప్రత్యేక సంచిక

# ఫ్లాష్‌బ్యాక్


1972 రెండుపదుల్లో


2010 ఆరు పదుల్లో


1954 బాల్యంలో


1997లో 25వ పెళ్లిరోజున

1. అన్న వెంకట నమో సూర్యనారాయణరావు, అక్క గంగారత్నం, తమ్ముడు అరవిందకుమార్‌తో
2, 3. సహచరి కుమారితో
4. 60 వసంతాల అశోక్

# చినుకు మాట..

'చినుకు' సంపాదకవర్గ సభ్యునిగా
స్నేహం, బాధ్యత కలబోసిన వ్యక్తిగా
నిరంతర సాహితీ చైతన్యం మూర్తీభవించిన శక్తిగా

## 'అశోక్‌కుమార్ గారి
## ఆరుపదుల సంబరానికి'

'చినుకు' వేదికకావడానికి
ఒక మంచి సాహితీ ప్రేమికుడిని
'శ్రీశ్రీ మనవడి'ని
'మినీ కవితల సంద్రాన్ని'
'మంచి మనిషిని'ని
చినుకు పాఠకులకు
పరిచయం చేయడమే
ఈ ప్రత్యేక సంచికను ఇలా తీసుకురావడం..

ధన్యవాదాలతో...

**ఎడిటర్, నండూరి రాజగోపాల్**

---

గమనిక : డిసెంబర్ నుండి నెలనెలా చినుకులతో మనం కలుస్తూ ఉందాం.

# సందర్భం

## సంపాదకీయం



**'అ' అంటే 'అమ్మ' గుర్తొస్తుంది. అక్షరమూ గుర్తొస్తుంది.**

అమ్మ అనగానే అమితమైన ప్రేమ ఇష్టంగా కప్పేస్తే 'అక్షరం' మనలని ఆవిష్కరిస్తుంది.
అలా మలచిన ఎందరో అక్షరశిల్పులలో కొందరే మనకు పదేపదే జ్ఞాపకం వస్తారు.
వారిలో కూడా కొద్దిమందే మనసుకు దగ్గరవుతారు.
ముగ్గురో..నలుగురో మన జీవితంలో మనతోపాటే ఉంటారు.
మనల్ని నడిపిస్తారు. మనకు ఉత్తేజాన్నిస్తారు.
నిరంతరం తలకొనే అక్షరాలవుతారు.
తలచుకున్న కొద్దీ శక్తినిచ్చే భావాల్ని నింపుతారు.
భావంలో జారేకొద్దీ...కదిలించే ఆవేశమవుతారు.
ఆవేశపడుతున్నప్పుడు ఆలోచనలై ఆచరణవైపు నడిపిస్తారు.
అలాంటి కొద్దిమందిలో అశోక్‌కుమార్‌గారు ఒకరు.
'కమ్మో రెడ్డో కాపో అంటాడు గాని మనిషినని చెప్పరే'...
'ఇక్కడ మనుషులు లేరా! లేదా ఉన్నవాళ్లు మనుషులు కారా'
అని ప్రశ్నిస్తున్న అశోక్‌కుమార్‌గారి అక్షరం మనల్ని అశోక్‌కుమార్‌గారి వైపు నడిపిస్తుంది.
మనిషి కోసం వెతికే అశోక్‌గారి దగ్గరికి మనలని చేరుస్తుంది.

**'అ' అంటే అనుబంధం కూడా.**

అశోక్‌కుమార్‌గారిని కలిసినపుడు ఎందుకో ఒక కంఫర్ట్‌ని ఫీలవుతాం.
అది ఎంత సౌకర్యంగా వుంటుందంటే...
మొట్టమొదటిసారి 'చినుకు' పత్రికను ప్రారంభించాలన్న ఆలోచనను
33 సంవత్సరాలలో కలిసిన అందరికన్నా ముందు అశోక్‌గారితోనే పంచుకోవాలన్నంత నమ్మకాన్ని ఇచ్చింది.
ఆ నమ్మకం ఆయన ప్రోత్సాహాన్ని, భరోసాని గెల్చుకుంది.
ఏ పత్రిక అయినా నిలవాలంటే తొలి రెండు మూడు సంవత్సరాలు చాలా కీలకమయినవి.
ఆ మూడేళ్లూ అశోక్‌గారు 'చినుకు' కోసం పడిన శ్రమ, తీసుకున్న శ్రద్ధ, వెచ్చించిన సమయం
కేవలం ఒక సంపాదకీయంలోనో, వ్యాసంలోనో, ప్రసంగంలోనే ఇమిడేది కాదు.
ఆ తరువాత 'శ్రీశ్రీ సాహిత్యనిధి'తో ఆయన చాలా బిజీగా ఉన్నా...
'చినుకు' ఎప్పుడూ ఆయనను 'outside the stage' అనుకోలేదు.
అలాగే 'అశోక్'గారు చినుకును ఎప్పుడూ 'Neighbours' door' గా ఫీలవలేదు.
ఏ క్షణంలో వెళ్లినా, ఫోన్లో పలకరించినా పరిష్కారమై పలికే అశోక్‌గారి సలహా...
చినుకుకు ఎప్పుడూ పెట్టుబడి పెట్టకుండా వచ్చే లాభమే.
అనుబంధాలు నిలవాలంటే క్లారిటీ ఉండాలి.

అశోక్‌గారి నమ్మకాలు, సిద్ధాంతాలు, ఆయన పనిచేసిన సంస్థలు,
ఆయన పనిచేయాలనుకునే విధివిధానాలు, ఆయన అభిమానాలు, ఆయన పక్షపాతాలు...
ఏరోజూ 'చినుకు' మీద 'అప్లై' చేయాలనుకోలేదు.
ఎప్పుడైనా అవసరం డిమాండ్ చేసినపుడు...
ఆయన కన్విన్స్ చేసే తీరు కాదనడానికి అవకాశం లేకుండా చేసేది.
అలా వచ్చినవే శ్రీశ్రీ, కొ.కు., రావిశాస్త్రి ప్రత్యేక సంచికలు,
శ్రీశ్రీ క్విజ్, కలంయోధులు, అణువు, 'దీపకరాగాన్ని' చినుకులో పలికించడం,
'రంగనాయకమ్మ' గారిని 'చినుకు'లో శీర్షికకు ఒప్పించడం అశోక్‌గారి కృషే.
అయితే కాలం గడుస్తున్న కొద్దీ పెరుగుతున్న అనేక ఒత్తిడులు పత్రిక రూపాన్ని మార్చడానికి తొందరపెడుతూ వుంటాయి..
ఆ తొందరలో.. కొన్ని శీర్షికలు ఆగిపోయినా...
అర్థం చేసుకున్న సంస్కారం అశోక్‌గారితో అనుబంధాన్ని దగ్గర చేసింది..బలపర్చింది.

**'అ' అంటే అశోక్‌కుమార్ గారు.**
'చినుకు' అంటే రాజగోపాలే కాదు అశోక్‌కుమార్‌గారూ గుర్తొస్తారు.
నాకు ఆయనకూ మధ్య ఇరవై ఒక్క సంవత్సరాల వయస్సు అంతరం వుంది.
ఏ విషయాన్నైనా పంచుకునే ఆత్మీయ అనుబంధం వుంది.
బహుశా అందుకేనేమో విజయవాడలో ఆయన గురించి పూర్తిగా తెలిసిన ఒకరిద్దరిలో
నేను మొదటివాడిగానే వుంటానేమో అన్న 'గర్వం' అప్పుడప్పుడూ వీపు తడుతూవుంటుంది.
నేను పుట్టింది కాకినాడలో అయితే, ఆయన పెరిగింది కాకినాడలో. ఇద్దరూ స్థిరపడ్డది విజయవాడలోనే.
సినిమాలంటే మా ఇద్దరికీ ఇష్టం.
పటిష్టమైన కుటుంబ నేపథ్యంతో పాటు బలమైన అనుబంధాలను పెనవేసుకున్న వ్యక్తిత్వం అశోక్‌ది.
ఆయన అక్షరం ఎంత పదునుగా వుంటుందో ఆయనంత బోళాగా కనిపిస్తారు.
చూడగానే ఒక మల్టీనేషనల్ కార్పొరేట్ కంపెనీకి ఫైనాన్స్ అండ్ మార్కెటింగ్ డిపార్ట్‌మెంట్ హెడ్‌లా ఉంటారు.
నిజానికి మార్కెటింగ్ నైపుణ్యం ఆయనని, ఆయన ప్రేమని, ఆయన కుటుంబాన్ని నిలబెట్టింది.
ఆయన ప్రణాళిక బయటనుండి చూసేవాళ్లకి ఆర్థిక, వ్యాపార సంబంధంలా కనపడుతుంది.
కానీ ఒక్క క్షణం ఆయన దగ్గర కూర్చున్నప్పుడు-
ఆయన శ్రీశ్రీ గురించి, శ్రీశ్రీ సాహిత్యాన్ని గురించీ ఎంత చెపుతారో...
జీవితంలో కావలసిన మెలకువను గురించి, వ్యాపారపరమైన పరిపాలన గురించి, ఆర్థిక ప్రణాళికల గురించి అంతే చెపుతారు.
సినీమాలు గురించి ఎంత మాట్లాడుతారో...
ప్రజానాట్యమండలి గురించి, వంగపండు గురించి, గద్దర్ గురించి, సుబ్బారావు పాణిగ్రాహి గురించిన
అనుభవాలు చెపుతూ పరవశించి పోతారు.
ఉద్యమాల గురించి, ఉద్యమ జీవితాల గురించి ఎంత చెపుతారో...
తన గురించి, తన జీవితం గురించి తన నెచ్చెలి గురించి, తన పిల్లల గురించి అంత చెపుతారు.
చాలామంది ఆయన్నీ, నన్నూ కూడా అడుగుతారు. అశోక్‌కుమార్‌గారికి 'చినుకు'లో వాటా ఉందా? అనీ లేదా
'చినుకు'కు ఆయన పెట్టుబడి పెడుతుంటారా? అనీ
నిజానికి 'చినుకు'కు సంబంధించి ఏ ఆర్థిక, వ్యాపార సంబంధం లేని మంచి అనుబంధం మాది.
వ్యక్తులమీద సంచికలు తీసుకురావడానికి – నేను చాలా వ్యతిరేకిని...
కొందరి విషయంలో అశోక్‌గారిమాటని కూడా చాలాసార్లు కాదన్నా...
ఇప్పుడు ఆయన వద్దంటున్నా ఈ ప్రత్యేక సంచికను తీసుకురావడం...
అశోక్‌కుమార్‌గారికి నేను చెప్పే కృతజ్ఞతగా కాదు.,
ఒంటరిగా వచ్చి వ్యవస్థగా మారుతున్న ఆయన చాకచక్యానికి...వ్యక్తిత్వానికి...స్నేహానికి మురిసిపోతూ...
నాకు నేనుగా ఒక వేదికవ్వాలనుకున్న సందర్భం ఇది ...
అభినందనలతో......
మీ.... **నండూరి రాజగోపాల్**



# చినుకు

మాసపత్రిక

సంపుటి - 6 : : సంచిక - 8



సంపాదకులు

**నండూరి రాజగోపాల్**

సెల్ : 98481 32208



68

పేజీలు : 120+4



సబ్ ఎడిటర్

**శ్రీజనార్దన్ లంకె**

సెల్ : 98485 36113

ఫీచర్స్ ఎడిటర్

**సింగంపల్లి అశోక్ కుమార్**

సెల్ : 98485 04649



| | | |
|---|---|---|
| **సంవత్సరచందా** | : **రూ. 150/-** | |
| **3 సంవత్సరాలకు** | : **రూ. 400/-** | |
| **విశిష్ట చందా** | : **రూ. 3000/-** | |
| U.S.A | - | 25 $ |

చందాలు ఎం.ఓ / డి.డి / చెక్కుల రూపంలో ఈ క్రింది చిరునామాకు "చినుకు మాసపత్రిక, విజయవాడ" పేర పంపవలెను.



**చినుకు మాసపత్రిక,**

దత్తాసనయాబజార్, రాజ్‌యువరాజ్ థియేటర్స్ ఎదురుగా,

గాంధీనగర్, విజయవాడ - 520 003.

**Phone: 0866-6640595,**

E-mail : editor_chinuku@yahoo.com




అశోక్‌కుమార్‌పై

## చినుకుల హర్షం



Madras,
Dt : 7- 5- 1973

**Dear Ashok Kumar,**

*Have received with thanks and*
*read your book*
*'Thallee! Evaru Nuvvu?'*
***This is a brilliant Writing***
***charged with***
***destructive dynamite.***
*I expect many more such writings from you.*

Yours Sincerely,
**Sri Sri**

( అశోక్‌కుమార్ తొలి కావ్యం 'తల్లీ! ఎవరు నువ్వు? ( ఏప్రిల్, 1973) హేతువాద దీర్ఘకావ్యానికి మహాకవి శ్రీశ్రీ పోస్టు కార్డు ప్రశంస,
ఇది వరుసగా నాలుగు ముద్రణలు పొందింది (1973,75,78,2006)

# కొడవటిగంటి కుటుంబరావు



“కుళ్లిన పదార్థంలోంచి
పురుగులు రావటం సహజం.
అలాగే
కుళ్లిపోయిన ఈ సమాజంలోంచి
ఈ తల్లులు, బాబాలు పురుగుల్లా
పుట్టుకొస్తూనే ఉంటారు.
ఒకవైపు నుంచి విప్లవం కార్చిచ్చులా
వీటన్నిటినీ దహిస్తూ వ్యాపిస్తోంది.
‘తల్లీ! ఎవరు నువ్వు? వంటి
విప్లవోచితమైన, బలమైన రచనలు
విప్లవానికి చాలా అవసరం.”

( అశోక్‌కుమార్ తొలి కావ్యం ‘తల్లీ! ఎవరు నువ్వు? ( ఏప్రిల్, 1973) హేతువాద దీర్ఘకావ్యానికి
కొడవటిగంటి కుటుంబరావు గారి ఇన్‌లాండ్ లెటర్ (30-04-1973) ప్రశంస )



## సోమరిపోతు

కాలు తీసి / కాలువేసేది / దున్నేపోతు
కాలుమీద / కాలు వేసేది / దున్నపోతు



# అశోక్‌కుమార్ శ్రీమతి

# కుమారి తో..

'చినుకు' ఇంటర్వ్యూ

**చినుకు : మీ పేరు ?**

కుమారి : కుమారి

**చినుకు : అంటే శ్రీమతి కుమారి అన్నమాట. శ్రీమతి కుమారి అనడం థ్రిల్లింగ్‌గా అనిపిస్తోంది కదూ?**

కుమారి : పెళ్లికి ముందు ఇంకా థ్రిల్లింగ్‌గానూ అనిపించేది.

**చినుకు : అంటే.**

కుమారి : హైస్కూల్లోనూ, కాలేజీలోనూ వేదిక మీదకు పిలిచేప్పుడు కుమారి కుమారి అని పిలవడం, అందరూ ఒక్కసారి నావైపు చూడటం కొంత పైగానూ కొంత థ్రిల్లింగ్‌గానూ ఉండేది.

**చినుకు : వేదికల మీదకు అంటే ఎడ్యుకేషన్ విషయాలలోనా? లేక సాంస్కృతిక విషయాలలోనా?**

కుమారి : చదువుల విషయంలో కంటే, సాంస్కృతిక కార్య క్రమాల్లోనే ఎక్కువసార్లు.

**చినుకు : సాహిత్యంలో ప్రవేశం ఉందా? కవిత్వమా? కథలా?**

కుమారి : సాహిత్యం చదవడం వరకే. హైస్కూలు, కాలేజీ వార్షికోత్సవాల్లో పాటలు పాడేదాన్ని. నాటికల్లోనూ పాల్గొనేదాన్ని.

పాటలు పాడటం ఎక్కువ ఉత్సాహంగా ఉండేది. హైస్కూలు, కాలేజీల్లో బహుమతులు కూడా వచ్చాయి. 1969లో-జిల్లా పరిషత్ నాటికల పోటీలో 'కరుణశ్రీ' గారి నాటిక 'కరుణామయి'లో నాయిక వేషానికి బహుమతి వచ్చింది. 1971లో కాలేజి వార్షికోత్సవంలో 'ఆదివిష్ణు' నాటిక 'వాంటెడ్ ఫాదర్స్'లో బాబ్జీ (మగపాత్ర)వేషానికి బహుమతి వచ్చింది. ఇలాంటి చిన్న చిన్న గుర్తింపులు చాలా ఉన్నాయి. మా కాలేజీకి ఫైన్ ఆర్ట్స్ సెక్రటరీ నేనే.

**చినుకు : మీకు ఈ విషయాలలో ఇన్‌స్పిరేషన్ అశోక్‌కుమార్ గారేనా?**

కుమారి : కాదండి. మా అన్న(కజిన్) అదృష్టదీపక్. వాడికి నేను పాడే ఎంకి పాటలంటే చాలా ఇష్టం. అడిగి మరీ పాడించుకునే వాడు. కవితలు రాసే వాడు. కథలు రాసేవాడు. పాటలు పాడేవాడు. నాటికల్లో వేషాలేసే వాడు. తరువాత కాలంలో సినిమాలకు నలభైవరకు పాటలు రాశాడు.

**చినుకు : అశోక్‌కుమార్ మీకు ఎలా పరిచయం?**

కుమారి : మా అన్న(తోబుట్టువు)కు బాల్యస్నేహితుడు. నాలుగవ తరగతి నుంచి హైస్కూలు వరకు కలిసి చదువుకున్నారు. 1963లో రామచంద్రపురం నుంచి వాళ్ల కుటుంబం కాకినాడ వలస వెళ్లి పోవడంతో అక్కడ స్థిరపడ్డారు. నా హైస్కూలు చదువు అనంతరం కాకినాడ పాలిటెక్నిక్ కాలేజీలో చేరింతరువాత తిరిగి కొత్తగా పరిచయం-ప్రేమ-పెళ్లి. ఇందులో మా అన్న (తోబుట్టువు) పాత్ర చాలా వుంది. వాడికి అశోక్ అంటే చాలా ఇష్టం. కోటి రూపాయల కంటే విలువైన నా బాల్యమిత్రుడు నా వల్లే నీకు దక్కాడంటూ ఇప్పటికీ దెప్పుతుంటాడు.

# అక్షర హాలికులు

అశోక్‌కుమార్



## కందుకూరి వీరేశలింగం

(1948 - 1919)



### వైధవ్యవైరి

వైధవ్యం మహామారి
దురంతాల గుండెచీరి
విధవరాళ్ల నుదుటరాత
తిరగరాసె కందుకూరి

**చినుకు : అంటే మీది ప్రేమ వివాహం అన్న మాట?**

కుమారి : ఇంకా వివరాలు కావలిస్తే - మాది కులాంతర, నాస్తిక, ప్రేమ వివాహం అన్న మాట.

**చినుకు : కులాంతర ప్రేమ వివాహం వరకు సరే. నాస్తిక వివాహానికి మీరు మనస్ఫూర్తి గానే అంగీకరించారా?**

కుమారి : పెళ్లయ్యాక మార్పిజం తెలిసుండొచ్చు, కానీ నేను రంగనాయకమ్మగారి ప్రభావంతో పెళ్లికి ముందే నాస్తికురాలిని. మాది రిజిస్టర్ మ్యారేజి, సంతకాలపెళ్లి కూడా కాదు. కేవలం గుండెల్నే దండలుగా మార్చుకున్నాం.

**చినుకు : మీరు రంగనాయకమ్మ అభిమానులా? అశోక్‌కుమార్‌గారికి కూడా అనుకుంటాం?**

కుమారి : అవును ఇద్దరికీ రంగనాయకమ్మగారంటే చాలా ఇష్టం. అసలు మాపెళ్లికి పెద్దగా రంగనాయకమ్మగారినే పిలవాలని ఆశపడ్డాం. అవి ఆవిడ విడాకుల గొడవలు జరుగు తున్న రోజులు కావడం వలన పిలిచే అవకాశమే లేకుండా పోయింది. ఆవిడ ప్రభావంతో అప్పుడూ ఇప్పుడూ మా ఇంట్లో నేను స్వీట్‌హోం 'విమల'నే, కానీ పాపం అశోక్ అప్పుడప్పుడూ మాత్రమే బుచ్చిబాబు కాగలుతాడు.

**చినుకు : మరి శ్రీశ్రీ అంటే.**

కుమారి : శ్రీశ్రీ కవిత్వం అంటే ఇష్టంలేని ప్రగతిశీల వాదులు ఉంటారని నేను అనుకోను.

**చినుకు : మీ అభిమాన రచయిత్రి రంగనాయకమ్మగారి మాటేమిటి?**

కుమారి : రంగనాయకమ్మగారి పేచీ అల్లా శ్రీశ్రీ కవిత్వంతో కాదు ఆయన అలవాట్ల తోనూ, బలహీనతలతోనూ.

**చినుకు : 'అనంతం'లో స్త్రీలపై శ్రీశ్రీ రాసిన రాతలపై రంగనాయకమ్మగారి విమర్శపై మీ అభిప్రాయం?**

కుమారి : అవి శ్రీశ్రీయే కించపడేరాతలుగా పేర్కొన్న కృష్ణక్క (తుమ్మల కృష్ణాబాయి) అభిప్రాయమే తన అభిప్రాయం అంటాడు అశోక్. నాది కూడా అశోక్ అభిప్రాయమే. కె.వి. రమణారెడ్డిగారన్నట్టు రంగనాయకమ్మగారితో శ్రీశ్రీ చేసింది 'బిలో ది బెల్ట్' యుద్ధమే.

**చినుకు : మీ పిల్లల గురించి.**

కుమారి : ఒక అమ్మాయి, ఒక అబ్బాయి. అమ్మాయి డాక్టరు జ్వలిత, అబ్బాయి హార్డ్‌వేర్ ఇంజనీర్ విక్రాంత్. ఇద్దరికీ పెళ్లిళ్లయ్యాయి. అమ్మాయి, అల్లుడు సత్య (బిల్డింగ్ హార్డ్‌వేర్ బిజినెస్), విజయవాడలోనూ, అబ్బాయి, కోడలు సత్యసుధ (సాఫ్ట్‌వేర్ ఇంజనీర్) ఐర్లాండులోనూ ఉంటున్నారు. అశోక్ వాళ్లని అల్లుడు, కోడలు అనడు. అననివ్వడు. మరోకొడుకు, మరో కూతురు అంటాడు. అమ్మాయికి ఒక అమ్మాయి - ఆపిల్‌గా పిలుచుకునే అనన్య

**చినుకు : మీదే కాకుండా మీ పిల్లలిద్దరిదీ జనవరి ఒకటో రోజునే పెళ్లిళ్లు జరిగాయని విన్నాం. ఏం? ఎందుకు అలా? ఏమిటా ప్రత్యేకత?**

కుమారి : అవును. మా పెళ్లి రోజు 1972 జనవరి ఫస్టు. మా అమ్మాయి పెళ్లిరోజు 2000 జనవరి ఫస్ట్. మా అబ్బాయిది 2005 జనవరి ఫస్ట్. ఇది కేవలం సౌకర్యం కోసమే.

**చినుకు : ఇందులో సౌకర్యం ఏముంది?**

జవాబు : ఎందుకులేదు. మా ఇంట మా పుట్టిన రోజులూ, పెళ్లి రోజులే పండుగలు. అందరివీ పుట్టిన రోజులు జరుపుకుంటాం. అందరూ కలిసి ఒకే రోజున పెళ్లి రోజు జరుపు కుంటాం. ఒకేరోజున జరుపుకోవడం చాలా సౌకర్యం కదా. పైగా డబ్బు, కాలం, ఆదా కూడా!

**చినుకు : " అగ్గిలా ఆవేశం చెలరేగినప్పుడు చల్లార్చేదీ తనే !**
**బొగ్గులా ఆలోచనలు చచ్చుబడినప్పుడు రగిలించేదీ తనే "**
**నా సహచరి, స్నేహితురాలు శ్రీమతి కుమారికి -**

అంటూ కవితా రూపంలో తన 'శుభాకాంక్షలు' కావ్యం మీకు అంకితం ఇచ్చారు కదా? ఆ అంకితంపై మీ స్పందన?

కుమారి : చాలా విరామం తరువాత అశోక్ తీసుకు వచ్చిన పుస్తకం అది. ఆ అంకితం గురించి అది అచ్చు అయ్యేవరకు నాకు తెలియదు.

**చినుకు : అంటే-తెలిస్తే ఒప్పుకునేవారు కాదా?**

కుమారి : ఎందుకు ఒప్పుకోను. మొగుడు, మగవాడు అనే అహంకారంతో సహచరి సలహాలను ఆడముండ సలహాలుగా కొట్టిపారేయకుండా స్పందించడం, స్వీకరించడం సంతోషమేగా!

**చినుకు : అంటే అశోక్‌కుమార్ గారు మీరు సంతోషపడే కవిత రాశారన్న మాట.**

కుమారి : ఇంతకంటే నాకు ఇష్టమైంది అతను అసూయపడుతూ రాసిన కవిత !

**చినుకు : అవునా? అసూయపడుతూనా?**

కుమారి : అవును. అసూయపడుతూనే. మా పిల్లలు అడిగితే మా ఇరవై ఐదో పెళ్లిరోజున రాసిన కవిత.

**చినుకు : గుర్తుందా? చెప్పగలరా?**

కుమారి : తప్పకుండా ? మర్చిపోతే గదా !

**ఓ కుమారీ !**
**ఓ మాయలమారీ !**
**నిన్ను జూస్తే అసూయేస్తుంది నాకు**
**ఏ ముగ్గువేసి మొగుణ్నీ**
**ఏ ఉగ్గుపోసి పిల్లల్నీ**
**మంత్రం వేసి మాయజేశావో మరి !**
**మనిషి మీద ఈగను వాలనివ్వని పిల్లలూ**
**మనసు చుట్టూ ఈగలా తిరిగే మొగుడూ !**
**ఓ కుమారీ !**
**ఓ మాయలమారీ !**
**నిన్ను జూస్తే అసూయేస్తుంది నాకు**

**చినుకు : శ్రీశ్రీపై అశోక్‌కుమార్‌గారు అతిగా చేస్తున్నారని కొందరు... మీరేమంటారు?**

జవాబు : అతనెప్పుడూ అతివాదే. మితంగా చెయ్యడం అతనికిష్టం ఉండదు. ఏ పనైనా ఉద్యమ రూపంలో చేయడమే అతనికిష్టం. తొలి రోజుల్లో హేతువాదిగా, ఆ తర్వాత మినీకవితల కవిగా అతను చేసిందదే. ఇప్పుడు శ్రీశ్రీ సాహిత్యనిధి విషయంలో చేస్తున్నదీ అదే.

**చినుకు : అశోక్‌కుమార్‌గారు శ్రీశ్రీ సాహిత్యనిధి తనకు ఎంతో తృప్తినిస్తోందంటున్నారు, మరి మీకో?**

జవాబు : పెద్ద ప్రాజెక్టును భుజానికెత్తుకున్నాడు. మంచి పని గాబట్టి సంతోషమే. నావంతు నేను సహకరించినా, ఆరోగ్యం లెక్కచెయ్యని అతని మొండితనంపై సహచరిగా కాస్త అసంతృప్తి తప్పడం లేదు.

**చినుకు :: అరవయ్యో పుట్టిన రోజు చేసుకోవడంపై మీ అభిప్రాయం?**

జవాబు : అరవయ్యోది ఏమిటి, ఇప్పటికి యాభైతొమ్మిది పుట్టిన రోజులు చేసుకున్నాడు. ఇప్పుడు అరవై పుట్టిన రోజు చేసుకుంటున్నాడు. ఇది అరుదైన విషయమే.

మనిషి పుట్టిన తరువాత పుట్టిన రోజులు వస్తుంటాయి. అది ఇరవై అయిదోదీ యాభయ్యోదీ, అరవయ్యోదీ, కావచ్చు, ఆపైదీ ఆపైదీ కావచ్చు. భౌతికంగా నశించే వరకు వాటిని సందర్భంగా తీసుకుని మనం చైతన్య పడడం, పదిమందినీ చైతన్యపరచడం జీవితం కావాలనేది అశోక్ అభిప్రాయం. దానితో పూర్తిగా ఏకీభవిస్తున్నాను.

**చినుకు : ఆరుపదుల సందర్భంగా అశోక్‌కుమార్‌పై 'చినుకు' తీసుకు వస్తున్న ప్రత్యేక సంచికపై మీ స్పందన?**

జవాబు : అశోక్‌కుమార్ చేసిన గోరంతసాయానికి 'చినుకు' ఇస్తున్న కొండంతగౌరవం. ■

## అక్షర హాలికులు

అశోక్‌కుమార్



## గురజాడ అప్పారావు

**(1862 - 1915)**



## అడుగుజాడ

తెలుగుజాతికి పరువు
ప్రజలభాషకి ఎరువు
మహాకవి శ్రీశ్రీకి
దారిచూపిన గురువు



## అశోక్‌కుమార్‌కి

బాపు-రమణ

# శతమానం భవతి

చెన్నై,

**02-11-2010**

## గ్లోబలి

మనిషికై / సరుకులు పుట్టడం / సివిలైజేషన్
మనిషినే / సరుకుగా పెట్టడం / గ్లోబలైజేషన్





# శ్రీశ్రీ అశోక్‌కుమార్

తుమ్మల కృష్ణాబాయి

**విశాఖ సాగర తీరాన్నుంచీ కాకినాడ సాగరతీరానికి**
**విరసం వ్యాపించిందని( 1973)**
**కామ్రేడ్ త్రిపురనేని మధుసూదనరావు వర్తమానం పంపినపుడు అందరం ఆనందించాం.**
**కాకినాడ యూనిట్ కన్వీనర్ అశోక్‌కుమార్ పలుకున్న కవి కూడాను.**

సమాజంలో అమ్మలూ, బాబాలూ తామరతంపరగా పెరుగుతూన్న కాలంలో 'తల్లీ! ఎవరు నువ్వు?' అంటూ నిలేసిన అశోక్‌కుమార్

**' మహా మహోన్నత / మహిమాన్వితురాలివే ఐతే-**
**నిరంతర చందాల / వసూళ్లెందుకు? హుండీల కలక్షన్లెందుకు ?'**
**'ఆస్తికతా అజ్ఞానపు అచ్ఛాదనల్ని / హేతువాద ఖడ్గాలతో చీల్చి /**
**మేధను కదిలిస్తాం ! / అజ్ఞానాన్ని వదిలిస్తాం / జనంతో తిరుగుబాటు చేస్తాం ! '**
**అని హెచ్చరిస్తాడు.**

ప్రస్తుతం దేశంలో గుళ్లూ గోపురాలూ అయోధ్య వివాదాలు పెచ్చరిల్లిపోతున్నాయి. అంత బొజ్జతో వున్న వినాయకుడిని బుల్లి ఎలుక ఎలా మోయగలదని గానీ, అసలు ఏనుగు తలతో మనిషయినా దేవుడయినా ఎలా వుండగలరని గాని విద్యావంతులైనా ప్రశ్నించకుండా చేసే నిమజ్జన కార్యక్రమాలు -ఏటేటా విపరీతంగా పెరిగిపోతూన్న శబ్ద కాలుష్యాన్ని అదుపుచేసే వ్యవస్థ మనకి లేదు. పిల్లలచేత చిన్నతనాన్నుంచే గణపతి పూజలు చేయిస్తూ వుగ్గుపాలతో మూఢ నమ్మకాల్ని రంగరించి పోస్తున్నారు.

'తల్లీ!ఎవరు నువ్వు?' 'మత ప్రస్థానం' లాంటి హేతువాద రచనల అవసరం ఇప్పటికీ ఎంతో వుంది. 'ఎందుకు'అని ప్రశ్నించడం నేర్పిన నాన్నకి' తన పుస్తకం అంకితమిచ్చాడు మేధావి, రచయిత త్రిపురనేని గోపీచంద్. అలా పసితనం నుంచే పిల్లలకి హేతువాద దృష్టి కలిగించాల్సిన అవసరం ఎంతయినా ఉంది.

మే1974లో 18-21ల మధ్య విప్లవ రచయితలు త్రిపురనేని మధుసూదనరావు, వరవరరావు, చెరబండరాజు యం.టి.ఖాన్, యం.రంగనాథంలను కుట్రకేసులో ప్రభుత్వం చేసిన అరెస్టులకు నిరసగా అందోళనచేస్తూ 'కుట్ర! కుట్ర! కుట్ర!' పేర 6-6-1974న కాకినాడ విరసం సభ్యుల రచనలతో పాటూ ఈ బులెటిన్ కోసం కొడవటిగంటి కుటుంబరావు రాసిన 'ప్రాథమిక ప్రజాస్వామ్యం' అనే వ్యాసంతో కాకినాడ విరసం యూనిట్ ఓ బులెటిన్ వెలువరించింది. ఆ బులెటిన్ సెంటర్‌స్ప్రెడ్‌న 'విప్లవ రచయితల సంఘం' స్వగతం లాగా విరసం యూనిట్ కన్వీనర్ అశోక్‌కుమార్ రాసిన గీతంలోని కొంత భాగం-

నక్సల్‌బరీ, శ్రీకాకుళాలలో పారిన
ప్రజా వీరుల నెత్తుటి వాగుల్లో
పురిటి స్నానం చేసిన నేను-

..............................

ప్రతి అంగుళంలో అన్నాన్నీ-
ప్రతి గుండెలో ఆనందాన్నీ-
పండించి,
మరో మహత్తర లోకాన్ని సృష్టించిన
మాసియాంగు మహదాశయాల్ని
పల్లవిగా చేసుకొని
పాటలల్లుతున్న నేను-

..............................

పొలాల్లో పంటలకు ఎరువుగా
ఫ్యాక్టరీలకు ఇంధనంగా
తమ రక్తాన్ని ధారపోస్తున్న
శ్రామికుల జీవితాల్నీ-భవిష్యత్తునీ
ముక్కలు ముక్కలుగా నరికి-
ఆ ముక్కలను
సామ్రాజ్యవాదం అంగళ్లలో
విక్రయిస్తోన్న
దళారీ వ్యవస్థ కుష్టు చేతుల్ని
నరికి పారేయడానికి-

ప్రతి శ్రామికుడూ
ఆయుధం పట్టాల్సిన ఆవశ్యకతను
అక్షరాలు అక్షరాలుగా
నిప్పులు నిప్పులుగా
గాలిలోకి-నీటిలోకి
నింగిపైకి-నేలపైకి
విడిచి పెడుతున్న నేను-

ఆంధ్ర దేశం నలు మూలలా
విప్లవకవితాగ్ని జ్వాలల్ని రగిలించి
ప్రబంధ, పురాణ, భావకవితా
కుష్టురోగాల అవశేషాల్నీ,
కుహనా అభ్యుదయ చీడపురుగుల్నీ,
మండించి మసి చేస్తున్న నేను-

పీడిత ప్రజల కలాన్ని !
ప్రజా పోరాట గళాన్ని !!
విప్లవ రచయితల సంఘాన్ని !!!

ఈ ఝంఝు ఆగదు !
ఈ ఝరి నిలవదు !!

ఉద్యోగరీత్యానో, పెళ్లిళ్లవడంతో నాటి కాకినాడ విరసం సభ్యులు తలా ఒకచోటికి వెళ్లడంతో కాకినాడ యూనిట్ రద్దయింది. సమతా కోటేశ్వరరావుని పెళ్లాడిన హైమ విజయవాడ సభలూ సమావేశాల్లో తారస పడుతూండేది. అశోక్ ప్రచురించే పుస్తకాలు అందుతూండేవి. 'చినుకు' పత్రికతో ఒక్కసారి చుక్కల్లే ఊడిపడ్డాడు అశోక్, విజయవాడలో.

అది పంద్రాగస్ట్-2005, అభివృద్ధి పేరు మీద రాష్ట్ర విధ్వంసానికి నడుంకట్టి నడుస్తూన్న వై.ఎస్. పరిపాలన కొనసాగుతోంది. అప్పటికే నల్లమలలోని మల్లెమొగ్గలని చిదిమి ఛిద్రం చేసేశాడు. అక్కడితో ఆగకుండా రెండు రోజుల్లోనే విరసంని నిషేధించాడు. ప్రపంచ చరిత్రలోనే సాహిత్య సంఘంమీద ఉక్కుపాదం మోపిన ఘనకీర్తి సాధించింది కాంగ్రెస్ !

విరసం సభ్యులు తమ ఇబ్బందులు చెప్పుకునే స్థితిలేదు. విరసంతో అనుబంధం, ఆత్మీయత ఉన్న వారు కూడా ముందుకి రావడానికి వెనకాడే ఒక విచిత్ర పరిస్థితి. అయితే, క్రమంగా తెలుగు సాహిత్యలోకం ముందుకి వచ్చి మా సంఘానికి మద్దతు ప్రకటించింది. ప్రభుత్వాన్ని నిగ్గదీసింది. గొంతెత్తింది. సాహిత్య లోకం నుంచి మాకింత తోడ్పాటు, ఆదరణ, అభిమానం లభించినందుకు మురిసి పోయాం. అప్పుడు నేను విరసం కార్యదర్శిని. కాని విరసం యూనిట్లు బలంగా వున్నచోట్ల కూడా మాకుగా మేం సభలు నిర్వహించలేని పరిస్థితి. అలాంటి సమయంలో మిత్రుడు అశోక్‌కుమార్ పూనుకుని, అందర్నీ కూడగట్టి, ప్రభుత్వచర్యని నిరసిస్తూ విజయవాడలో సభ నిర్వహించాడు.

ఇక శ్రీశ్రీ రచనలగురించి..
శ్రీశ్రీ సాహిత్యనిధి గురించి..

అశోక్‌కుమార్‌కి శ్రీశ్రీ మీద వున్న అభిమానం వ్యక్తిభక్తి కాదు. ఆయన రచనల్ని విశ్లేషిస్తూ ఎందరితోనో రాయించాడు. ప్రశ్నావళి 'చినుకు'లో ప్రతినెలా నిర్వహించాడు. మరెన్నో ప్రయోగాలు చేశాడు.

'శ్రీశ్రీ సాహిత్యనిధి' ప్రవేశపెట్టాడు. అసంఖ్యాకంగా శ్రీశ్రీ గురించిన బుక్‌లెట్స్ ప్రచురించాడు. సాహిత్యం నిరంతరం ప్రవహించే జలపాతం. ఆ సాహిత్యంలో శ్రీశ్రీ స్థానం ఏమిటి? శ్రీశ్రీ ఏ పాత్ర నిర్వహించాడు అనే ఆసక్తి అందరికీ ఉంటుంది. ఈ రంగంలో అశోక్‌కుమార్ కృషి అనన్య సామాన్య మైనది. అందుకు మరీ మరీ అశోక్‌కుమార్‌కి అభినందనలు. ■

## అక్షర హాలికులు

అశోక్‌కుమార్



## గిడుగు రామమూర్తి

(1863 - 1940)



## గిడుగు పిడుగు

రామమూర్తి పంతులు గిడుగు
'సవర'ణానికి తొలి అడుగు
గ్రాంధికాలపై గర్జించిన
వాడుక భాషోద్యమ పిడుగు.



## విశ్వప్రయత్నం

దిక్కులను / పోల్చాలని / లైట్‌హౌస్
దిక్కులను / కూల్చాలని / వైట్‌హౌస్



# సింగంపల్లి కవికిశోరం

చలసాని ప్రసాద్

**'ఇకముందు తెలుగు సాహిత్య చరిత్ర రాసే వారెవరయినా సరే తెలుగు సాహిత్యం శ్రీశ్రీ సన్మానానికి (01-02-1970) ముందు-తరువాత అని యుగ విభజన చేయవలసి వుంటుంది'అని అప్పుడు తెలంగాణా నుంచి వెలువడే సాహిత్య పత్రిక- విద్యుల్లత -సంపాదకీయం రాసింది. ఈ సన్మానం విశాఖపట్నంలో జరిగింది. తెలుగునేల నాలుగు చెరగులనుంచి సాహిత్య వేత్తలు తరలి వచ్చారు. అటు తరువాతే 'విరసం' హైదరాబాద్ (4-7-1970)లో పుట్టింది. కాని పురిటి నొప్పులు విశాఖలోనే మొదలయ్యాయి.**

ఇక్కడ ఒక ముఖ్య విషయం వివరించవలసివుంది. విరసంఅంటే కేవలం ఆ సంస్థలో సభ్యులుగా ఉండేవారికే పరిమితమయింది కాదు. నిర్మాణంలో ఇమడలేనివారూ,ఇతరేతర కారణాలవలన ఎడంగానే ఉందామనుకునేవారు, ఎందరెందరో విరసంకి తమ అండ దండలు అందిస్తూనే ఉన్నారు. ఇది చెరిపినా చెరగనిసత్యం. ఆ మాటకొస్తే వ్యవస్థాపక సభ్యులతో పాటు, వ్యవస్థాపక అసభ్యులు -నాన్ మెంబర్స్-కూడా ఎందరెందరో వున్నారు. కలుసుకున్నప్పుడూ, తలచుకున్నప్పుడూ కులుక్కుంటూ ఉంటాం. తొలి దశాబ్దంలో విరసం కార్యదర్శిగా వున్న కెవిఆర్ మాటల్లో చెప్పాలంటే విరసంలో ఉండేవారి కన్నా, విరసంతో ఉండేవారే ఎక్కువ. ఈ మాటలు విరసంనుంచి వెళ్లిపోయిన వారికి కూడా వర్తిస్తాయి. అయితే అలా వెళ్లిపోయిన వారూ, సంస్థలో కొనసాగేవారూ కూడా అటు తర్వాత కత్తులు దూసుకునే వారు కాదు. చెలిమి, సహకారం, సౌజన్యం, ఆర్ద్రత నిరంతరంగా కొనసాగేవి. సామాజిక వాస్తవికత అద్దంలాంటిది. ఆ అద్దంలోనే విరసం తన ప్రతిబింబం చూసుకుంటుంది. ఇది అప్పుడూ, ఇప్పుడూ,ఎప్పుడూ నిజమే. సాహిత్య వస్తువుకి సార్థకత కలిగించడంలో విరసం ఎంతో కృషి చేసింది. ఆ మాటకొస్తే తొలినాటి నుంచీ తెలుగులో సాహిత్య సంఘాలు ఈ పని చేస్తూనే వున్నాయి. విరసం ఆకాశంనించి ఊడిపడ లేదు. నిరంతరం ప్రవహించే సాహిత్యం అనే సెలయేరులో తన ఉనికి సార్థకం చేసుకుంది.

ఈ నేపథ్యంలో దూసుకువచ్చినవాడే 'అశోక్‌కుమార్'.
అతను ఏకరూపి కాదు, బహురూపి!
కాకినాడ అశోక్, విరసం అశోక్, చినుకు అశోక్, శ్రీశ్రీ అశోక్ !.
శ్రీశ్రీ అశోక్‌కుమార్‌గా విజయవాడలో స్థిర పడ్డాడు.
వాటేసుకుంటే మనకి అమరడు. విశాలమైన మనిషి.
నీ అభిమాన కవి ఎవరంటే 1. శ్రీశ్రీ, 2. శ్రీశ్రీ, 3. శ్రీశ్రీ. అని

## అక్షర హాలికులు

**అశోక్‌కుమార్**



## పాణిగ్రాహి సుబ్బారావు

**(1933-1969**



## ఎరుపు

పెన్ను నువ్వు గన్ను నువ్వు
ఎరుపెక్కిన కన్ను నువ్వు
దిక్కుమొక్కు లేని జనం
ఒక్కొక్కరి వెన్ను నువ్వు

రకీమని జవాబు చెబుతాడు.

'శ్రీశ్రీ సాహిత్య సర్వస్వం' ప్రచురణకి విరసం పూనుకుంది. ఆ కృషి 15 ఏళ్ల పాటు కొనసాగించింది. కూర్పు పని మా సంస్థ నాకు అప్పగించింది.

అలాగే శ్రీశ్రీమీద పుంఖానుపుంఖంగా వెలువడిన సాహిత్యాన్ని పోగుచేసి అందరికీ అందించే పనికి పట్టుదలగా పూనుకున్నాడు అశోక్. శతజయంతికి మూడేళ్ల ముందే మేల్కొని 2007నించి విడవకుండా శ్రీశ్రీ బులెటిన్స్‌ను బుల్లెట్లలాగా దేశంమీదకి వదులు తున్నాడు. ఈ పనిలో ఎక్కడెక్కడివారివో, ఎందరెందరివో నేలమాళిగల్లోంచి వెలికిరప్పించి వాళ్లమీద వెలుగుప్రసరింప చేస్తున్నాడు. శ్రీశ్రీని సూర్య సమానుడిగా చేస్తున్నాడు. అజాత శత్రువు మా అశోక్ ఇంకా ఇంకా విస్తరించాలి.

**ఇక ఇతని సాహిత్య కృషి గురించి :**

ఇతని లేఖినినుంచి వెలువడిన ఖండ కావ్యాలు పది వరకూ ఉన్నాయి. నిర్విరామంగా రాస్తూనే ఉన్నాడు. ఇతని కవితల్లో వ్యాకరణాల సంకెళ్లు, ఛందస్సుల పరిష్వంగాలులేవుగాక లేవు. శ్రీశ్రీ కవిత్వ లాలసుడు, ప్రియశిష్యుడు కనక ఇతని కవితల్లో కారం ఉంటుంది, కొరడా దెబ్బలుంటాయి. నిప్పు రవ్వలు కణకణమని మండుతూంటాయి.వచన కవితతో ఓనమాలు దిద్ది, అలాఅక్షరాలనీ, పదాల్నీ, పొట్టిపొట్టి మాటలని పేరుస్తూ రాస్తూ ఉన్నాడు. మినీకవిత విస్తరించకముందునుంచే మినీకవితలు రాస్తూన్న 'క్లుప్తకవి' మన అశోక్‌కుమార్. అయితే క్లుప్తత ఇతని వ్యక్తీకరణలోనే వుంది గాని వస్తు సేకరణలో లేదు. ఎదరగిలించి, మదిని రగిలించి, బుర్రని కణకణ మండించే విషయాలెన్నో ఉన్నాయి. అశోక్‌కుమార్ విల్లు ఎక్కుపెట్టి బాణాలు సంధించి సూటిగా ఘాటు చేసిన ఉదాహరణలు లెక్కకు మిక్కిలిగా వున్నాయి.

ఆకారాదిక్రమంలోఅద్దేపల్లి, అద్ృష్టదీపక్, జ్వాలాముఖి,పెద్దిభొట్ల సుబ్బరామయ్య, ద్వానా శాస్త్రి, నిఖిలేశ్వర్, కెవియస్‌వర్మ, శివారెడ్డిల మన్ననలు పొందాడు.

ఆదిలోఅమ్మల్నీ,బాబాల్నీ, బాలయోగులనీ, మోసగాళ్లని ఎండగట్టాడు-అటు తరువాత ఓట్లనీ, ఆకుపచ్చనీట్లనీ, రాజకీయ మాఫియా లనీ, ధనమదాంధులనీ, అధికారం ముసుగులోని హంతకులనీ తూర్పారబట్టాడు.లేదు ఇంకా ఇంకా ముందుకు సాగిపోతూనే వున్నాడు. తాజాగా మూడు మహమ్మారుల మీద ఈటెల లాటి మాటలతో అక్షర యుద్ధం సాగిస్తున్నాడు. ఆ మూడు ముద నష్టాలు ప్రపంచ ప్రజలందరికీ ప్రధానశత్రువులు ప్రపంచీకరణ, ప్రైవేటీకరణ, సరళీకరణ.ఈ మూడు మాయదారి మహారాక్షసుల మీద తూటాలు పేలుస్తున్నాడు అశోక్. ఎడతెగకుండా, చివరి కంటూ ఈ కవితా సమరం అశోక్ సాగించాలని నా కోరిక. ■



## డా॥ జి. మిత్రా

**( 1930 - 2007 )**

బాబాల్ని, అమ్మల్ని, పూజించే జనం చాలా మంది కనిపిస్తారు. అలాగే బాబాల్ని అమ్మల్నితంతామనేవారు చాలా కొద్దిమందే ఉండొచ్చు.ఈ కొద్ది మందే రాబోయే సమాజానికి మార్గదర్శకులు.కొత్త సమాజానికి కొత్తమానవులు.పూజించడం పాత సంస్కృతికీ, దోపిడికీచిహ్నం. హేతువాదంతో ఎదుర్కోవటం, పోరాడటం, నవసమాజ వసంతానికి చిహ్నం. ఈ ప్రయత్నంలో అశోక్ కుమార్ చెప్పినట్లు-

**" జిల్లెళ్ల మూఢమ్మపై /**
**ర్యాలి పురాన**
**బహిరంగ వేదికపై /**
**ఆర్భాటిస్తుండగా/**
**చెప్పు విసిరి /**
**ప్రతిఘటించిన ప్రజా చైతన్నాన్ని "**

ముందుకు తేవాలి.

బాబాల్ని అమ్మల్ని విమర్శిస్తేనే సరిపోదు. వాళ్లని మానసికంగానే కాక శారీరకంగాకూడా విమర్శించాలి, విరగ దన్నాలి. బడితెతో హేతువాదం చేయాలి. ఈ బడితె -హేతువాదంలో భాగంగానే నేను అశోక్ కుమార్‌గారి రచనలు చూస్తున్నాను.

వీరు, తమ హేతువాద పోరాటాన్ని, నాస్తికత్వాన్ని ముందుకు తీసుకొనిపోయే ఇంకా ఇంకా ఎన్నో ఎన్నో సమర్ధవంతమైన రచనలు చేస్తారని ఆశిస్తాను

**( ఏప్రిల్ - 1975 )**

## దేశభక్తి

తెల్లవాడిని / వెడలగొట్టింది / వందేమాతరం
తెల్లమేడని / పగలగొడుతుంది / మందేమాతరం





# మళ్లీ మరోసారి అభినందన

డా॥ రావి రంగారావు

ఈ రోజు కవిత్వం రాసే వాళ్లు బాగా పెరిగిపోయారు. కాని మంచి కవిత్వం ఉన్న వాళ్లు తగ్గిపోతున్నారు. కలం పట్టుకున్నామంటే కవులు నిజాయితీ కొలబద్దలుగా మారి తీరాలి. సమాజంలో మంచిమార్పు తీసుకురావటానికి కవులు పూనుకోవాలి. సమాజం కోసం కవి పాటు పడాల్సిన పని లేదనే వాళ్లు కనీసం ఒక సంగతైనా గుర్తుంచుకోవాలి. సమాజంలో మంచి మార్పు కోసం కృషి చేయకపోయినా ఉన్న సమాజాన్ని చెడగొట్టేవాడిగా కవి పనిచేయకూడదు.

సాహిత్యంలో బాగా కృషి చేసిన వాళ్లు, కొద్దిగా కృషి చేసిన వాళ్లు, ఏ కృషీ చేయనివాళ్లు కూడా ఈ రోజు అవార్డుల కోసం, పురస్కారాలకోసం, సన్మానాలకోసం...పాకులాడుతున్నారు. సాహిత్యంలో బాగా కృషి చేసిన వాడు కూడా తన కృషి చేసుకుంటూ పోవాలి కాని తగిన గుర్తింపు రాలేదని కంగారు పడకూడదు. చరిత్రచాలా పెద్దది. ఈ తరం వాళ్లు గుర్తించక పోయినా తర్వాతి తరం వాళ్లు తప్పక గుర్తిస్తారు.

ఇదంతా ఇప్పుడు చెప్పి తీరాలి, ఎందుకంటే మినీ కవిత కోసం కొందరు గొప్పగా కృషి చేసినా మంచి గుర్తింపు రాలేదు, కొందరు కాకతాళీయంగా కృషి చేసినా వారికి గొప్ప పేరు వచ్చింది. కొందరికి పేరు రాకపోయినా తెచ్చుకోగలరు కూడా. దీనికి అనేక కారణాలున్నాయి. అవన్నీ ఇక్కడ అనవసరం. అశోక్ కుమార్ గురించి చెప్పుకోవాలి.

మినీ కవిత కోసం నిజంగా తపన ఉండి కృషి చేసినవాడు అశోక్‌కుమార్. అందుకే 'చినుకు' మాసపత్రికలో 'అణువు' అనే శీర్షిక నిర్వహించటం ప్రారంభించాడు. పేరు కోసం ఆ పని మొదలు పెట్టలేదు. మినీ కవిత సాధించగలిగే ప్రయోజనాల్ని అవగాహన చేసుకున్నాడు గనకే ఆ శీర్షిక మొదలుపెట్టాడు. ఆ శీర్షిక మొదలుపెట్టగానే నేనెంతో సంతోషించాను.

మినీ కవిత గురించి ఎంతో నమ్మకం ఉన్నవాడని రుజువు చెయ్యటానికి అశోక్ కుమార్ మినీకవిత గురించి రాసిన అనేక మినీ కవితలు సాక్ష్యాలు. నిజమైన మినీ కవితకు సరిగ్గా సరిపోయే నిర్వచనాలు ఇచ్చిన వాడు ఆరుద్ర తర్వాత అశోక్‌కుమార్ ఒక్కడే. మిగిలిన వారు మినీ కవిత గురించి ఇచ్చిన నిర్వచనాలు అందంగా చెప్పటానికి ప్రయత్నించినవే.

‘అక్షరాలూ గుప్పెడు, అణువులు పగిలిన చప్పుడు’ అన్నది అశోక్‌కుమారే.

**“జనానికీ/ ప్రయోజనానికీ / చెందడం లక్ష్యం! కేదరుకీ / పేపరు రీదరుకీ / అందడం ముఖ్యం!! ”**

‘అక్షరాలు -విడిగా అగ్ని / కలిస్తే శతఘ్ని’

‘అక్షరం-డైనమోలా/ తిరిగితే /వచనకవిత! డైనమైటై / పేలితే / మినీ కవిత’

“ మినీ కవిత – అక్షరాలు లెక్కపెట్టడం కాదు – అక్షరాలు ఎక్కుపెట్టడం ”

“ మినీ కవిత – అక్షరాల్ని పేర్చడం కాదు- అక్షరాల్ని పేల్చడం”

“ మినీ కవిత – లెక్కన అక్షరాలు స్వల్పం- చెక్కిన మనోహర శిల్పం ”

“ మినీకవిత – గుప్పెడు అక్షరాలు సిద్ధం – తప్పుడు అక్షరాలపై యుద్ధం”

“ అక్షరాలు – ప్రయోగానికి లెక్కపెట్టడం ఎనీకవిత ! ప్రయోజనానికి ఎక్కుపెట్టడం మినీకవిత”

“ అక్షర దీపం-అక్షరాలదీపం వచన కవిత/ అక్షరమే దీపం మినీ కవిత !

మరొక్క సంతోషకరమైన మంచి లక్షణం నేను అశోక్‌కుమార్లో చూశాను. పేరు కోసం మినీ కవితల్ని వేరుచేసి కొత్త ప్రక్రియ మొదలుపెట్టానని చెప్పలేదు. మినీ కవితలకే అక్షరాలని, పాదాలని ...సంకెళ్లు వేసి కొందరు ప్రసిద్ధకవులతో పాటు కొత్తవారు కూడా నానీలని, రెక్కలని మామీలని, సృష్టించటంతో ఒక కొత్త కవిత్వ ప్రక్రియ సృష్టికర్తగా పేరుతెచ్చుకుంటున్నారు. అది అప్రయత్నంగా జరిగిందా లేక పేరుకోసం ప్రయత్న పూర్వకంగా జరిగిందా అంటే రెండు రకాలుగానూ ఈ కొత్త కవిత్వ ప్రక్రియలు తెలుగులో తామరతంపరగా పెరిగిపోతున్నాయి. అశోక్‌కుమార్ తాను రాసే మినీ కవితలకు ఒక నిర్మాణ సమత పెట్టుకున్నాడు. ఆయన రాసే మినీ కవితలకు ఆరు పాదాలు ఉంటాయి. మూడో పదానికి నాలుగో పాదానికి అంత్య ప్రాస ఉంటుంది. ఈ లక్షణాలు చెప్పి ఆయన తను ఒక కొత్త ప్రక్రియ కనిపెట్టానని చెప్పవచ్చు. కాని ఆయన ఆ పని చెయ్యలేదు. మినీ కవితలో ఎన్నో నడకలు వచ్చాయి. అందులోరాని నడకలు లేవు. అందులో కొన్ని నడకలను తీసుకొని కొందరు ప్రత్యేకంగా రాసికొత్త కవిత్వ ప్రక్రియలని పేరుపెట్టుకున్నారు. కాని అశోక్ కుమార్ ఆ పనిచెయ్యలేదు. మినీకవితలో వచ్చిన ఒక నడక ఆయనకు నచ్చింది.ఆ నడకలో మినీ కవి తలు రాసుకుంటూ వస్తున్నారు. తను రాస్తున్నవి మినీ కవితలు అనటంలో వాస్తవికత ఉంది. అందుకే నేను మళ్లీమరోసారి అశోక్‌కుమార్ను అభినందిస్తున్నాను. ■



# ఎరుపు ఆలోచనలు పండిస్తున్న అక్షరహాలికుడు

నిఖిలేశ్వర్

**‘పొద్దు పూసింది / జగతి నిండా / ఎరుపు పరిమళం’**
అంటూ పరిమళానికి రంగు చూపుతున్న కవి అశోక్‌కుమార్.
సౌందర్యానుభూతి కోసం వెంపర్లాడే ‘హైకూ’ కవుల్లా కాకుండా,
పోరాట చైతన్యం కోసం తన కవితల్ని సంధిస్తున్నాడు.

అమ్మలు, బాబాలు, బాలయోగులు, మొదలైన మోసగాళ్ల బండారాల్ని బట్టబయలు చేస్తూ మూఢ నమ్మకాలకు విరుద్ధంగా కవిత్వం రాస్తున్న మిత్రుడు అశోక్‌కుమార్ తన రచనా వైఖరిపట్ల స్పష్టమైన అవగాహన ఉంది.

**‘నేటి కవితకు / అల్లిక నేర్పే కాదు / అల్లిక తీర్పూ కావాలి’** అనే కవితాశయం, ఒక సామాజిక నిబద్ధతను, కవి బాధ్యతను వ్యక్తం చేస్తున్నది.

‘పొద్దు పూసింది’ కవితాసంపుటిలో అశోక్‌కుమార్ ఎన్నుకొన్న కవితారూపం ‘లఘు కవితలు’. తన సామాజిక చైతన్య కవితాభివ్యక్తికి, మూడు పాదాలతో, తక్కువ అక్షరాలతో భావ విస్ఫోటనం కలిగించే కవితలివి. ఇవి స్థిరమైన అక్షర సంఖ్య, ఒక జెన్ తాత్వికతవుండే ‘హైకూ’రూపం కాదు. వీటిలో క్లుప్తత ఉందితప్ప, గుప్తతలేదు. కావలిసినంత ఉక్తి వైచిత్రితో, సామాజిక స్పృహతో అశోక్‌కుమార్ లఘు కవితలు ఆలోచింపచేస్తున్నాయి.

**‘శ్రమజీవి / పరిశ్రమల రెక్క / ఆహారపు మొక్క’** అయినా ఈ దేశంలో కష్టజీవి **‘కూలి డబ్బులు / బతుకు పెనం మీద / నీటి చుక్కలు’**. రోజువారీ కూలి సంపాదన ఏ రోజుకారోజు ఆవిరై, ఆ మరుసటి రోజుకు ఎలాంటి జీవన భద్రతా లేని సగటు శ్రమజీవికి, ఈ వ్యవస్థ ఆకలిని, కన్నీళ్లను, అనారోగ్యాన్ని, మృత్యువును సమకూరుస్తోంది.

ఇక వ్యవస్థలోని అనైతికతను, అన్యాయాన్ని, అక్రమార్జననూ కాపాడే పోలీసు యంత్రాంగం పౌరులకు రక్షణవలయం కాకుండా పోతున్నది. యథాతథ స్థితికి కాపలాకాసే బంట్లుగా, పోలీసులు ఏనాటికైనా సమాంతరంగా సాగుతారు తప్ప సామరస్యం అరుదు.

అందుకే **‘ప్రజలూ / పోలీసులూ / రైలు పట్టాలు’**. అందువల్లే సమూలమైన సామాజిక రాజకీయ మార్పు కోసం అవిరామంగా జనం తాము విప్లవిస్తే తప్ప వ్యవస్థ మారదు. **‘రెండూ తుపాకులే / ధనం తరపున ఒకటి / జనం తరపున ఒకటి’**

**‘పొద్దుపూసింది’** కవితాసంపుటిలో అశోక్‌కుమార్, సమకాలీన సామాజిక యథార్థ దృశ్యాల వెనకనున్న నిజాలనుచెబుతూ ఎరుపు ఆలోచనలను పండిస్తున్నారు. ఇక మౌలికంగా శ్రీశ్రీ ఆవహించిన అశోక్‌కుమార్, ఆధునిక తెలుగు కవుల విప్లవ వారసత్వాన్ని కొనసాగిస్తారని ఆశిస్తున్నాను.

( అక్టోబరు - 2004 ) ■

## మనుషులు చేసిన దేవుళ్లు

మన దేవుళ్లకు / సతులు ఎవరో, సుతులు ఎవరో / మనకు ఎరుకే !
వాళ్లనంతా / సృష్టి చేసిన మహాకర్తలు / మనం గనుకే !





# అందరివాడు అశోక్‌కుమార్‌కి అరసం శుభాకాంక్షలు

పెనుగొండ లక్ష్మీనారాయణ

**సింగంపల్లి అశోక్‌కుమార్ తెలుగు సాహిత్యలోకానికి సుపరిచితుడు. అతనిది పూర్తిగా సాహిత్య హృదయం. ప్రగతిశీల దృక్పథం. అతని సహృదయతను అందరూ అనుభవించినవారమే.**

విద్యార్థి దశనుండి వామపక్ష భావాలతో మమేకమైనవాడు. అరవయ్యేళ్ల వయస్సు నాటికి తను విశ్వసించిన మార్గంలో మరింత ఎరుపెక్కాడు. ఏనాడూ వెనక్కి చూడలేదు. ముందుకే మున్ముందుకే అతని ప్రయాణం.

అశోక్‌కుమార్‌ని అన్ని సాహిత్య సంస్థలూ అభిమానిస్తాయి. సాహితీవేత్తలూ ప్రేమిస్తారు. అతను అందరివాడు అందరిలోనివాడు. ఒక వ్యక్తికాదు – ఒక సంస్థకు పరిమితమైన మనిషి. మా అభ్యుదయ రచయితల సంఘానికెంతో ప్రీతిపాత్రుడు.

శ్రీశ్రీ సాహిత్యనిధిని నెలకొల్పి ముందు మేల్కొని, తెలుగుజాతిని మేల్కొలిపి దేశమంతటా ఆ మహాకవి శతజయంతి ఉత్సవాలు ఘనంగా జరపటానికి, జరగటానికి ప్రేరణ అయ్యాడు. సాంస్కృతిక వారసత్వ పరిరక్షణలో ప్రధాన భాగస్వామి అయ్యాడు. శ్రీశ్రీని గురించి అశోక్‌కు తెలియని విషయంలేదంటే ఏమాత్రం ఆశ్చర్యం లేదు. ఎన్నెన్నో పుస్తకాలను, ప్రత్యేక సంచికలను ప్రచురించాడు. శ్రీశ్రీని మళ్లీ వెలిగించాడు. మనకు మార్గదర్శకుడయ్యాడు.

అశోక్‌కుమార్ 'విశాలాంధ్ర' దినపత్రిక ఆదివారం అనుబంధంలో 108 వారాలు 'అక్షరం' శీర్షిక నిర్వహించాడు. చినుకు, ప్రజాసాహితి మాసపత్రికల్లో శీర్షికలను సమర్థవంతంగా నిర్వహిస్తున్నాడు. అవి చదివిన వారిలో ఆలోచనలు రేకెత్తించాయి. రచయితగా అశోక్‌కుమార్ ముఖ్యంగా చిన్న కవితలు బాగా రాస్తాడు. ఆ చిన్న కవితలలోనే ఎంతో సారాంశాన్ని అందిస్తాడు. ఎందరో ముందుతరం ఉత్తమ సాహితీవేత్తలను వివిధ సందర్భాలలో పరిచయం చేశాడు. మనకోసం కలంపట్టిన ఆ అక్షరయోధులను మనకు దర్శనంగావించాడు.

అశోక్‌కుమార్ ధనాన్ని ఖర్చుచేయటడమేకాదు, భౌతికంగానూ సుశిక్షితుడైన సైనికుడిలా సాహిత్యం కోసం నిరంతరం శ్రమిస్తున్న వ్యక్తి. ఇంతటి మహోన్నతమైన సేవలనందిస్తున్న అశోక్‌కుమార్‌ను మా అరసం 2010 ఆగస్ట్ 1వ తేదీన విశాఖలో సత్కరించింది.

ప్రజా సాంస్కృతికోద్యమంలో కవిగా కార్యకర్తగా యిష్టంతో కష్టపడుతున్న అశోక్‌కుమార్ మనమెప్పుడూ గుర్తుపెట్టుకోవాల్సిన మనిషి. అతనికి షష్టిపూర్తి సందర్భంగా శుభాకాంక్షలు. ■



## డబ్బు డబ్బులు

చచ్చిపోతున్నా కూడా / వైద్యం చేయనివి / గవర్నమెంటు ఆసుపత్రులు !
చచ్చిపోయినాక కూడా / వైద్యం చేసేవి / కార్పొరేట్ ఆసుపత్రులు !



# శ్రీశ్రీకి గుడి కడితే

బ్నిం

### శ్రీశ్రీకి గుడి కడితే పూజారి ఎవరు?

దానికో పూజారా ??

పోనీ పూజారినే పెడదాము.

ఎవ్వడా సహస్రనామార్చకుడు... ఎవ్వడా కమిట్మెంటాంతరంగుడు.

ఇంకెవడో...తెలీక భూనభోంతరాళాల నినదిస్తే శ్రీశ్రీ ఒకవేళ ప్రతిధ్వనిస్తే Bird view లో Zoom అ..శో..క్..కు..మా..ర్.. యస్! అశోక్‌కుమార్ కాదు, సి.అశోక్‌కుమార్. Sree అశోక్‌కుమార్. శ్రీశ్రీ (అశోక్) కుమార్ అంటాడేమో!

నాకు 'మహాప్రస్థానం' రిథమిక్‌గా కంఠతావచ్చు - దానిక్కొంచెం ముందు పుట్టపర్తి సాయిబాబా గురించి ఎవరో అశోక్‌కుమార్ రాసిన ఓ పుస్తకం బట్టీగావొచ్చు. అది నేను బోల్డంత మెచ్చుకొని, రెచ్చిపోయి చదువుతుంటే... మా అమ్మ చెంపలు వాయించుకుని, నా నెత్తిమీద మధ్యవేలు ముడిచి వాయించి.. ఒచ్చే జన్మలోనైనా ఇంకోలా నేను పుట్టాలని ఆశించి, ఆ దేవుడు నన్ను శపించకుండా చూడాలనుకొనేది. ఒట్లు, మొట్లు తిని కొంతమర్చి పొయ్యా! ఆ తర్వాత ఒద్దనుకున్నా అశోక్ కుమార్ నాకు...'శ్రీశ్రీ వేగమంత' ఇష్టం అయ్యాడు. తాళ, జతి, యతి, ప్రాసగతుల శైలియుత కవనమంతిష్టం ఏర్పడింది.

ఆ తర్వాత ఆయన జిల్లెళ్లమూడమ్మని 'నమకం' చేసా ! ముమ్మూఢ... సారీ ! మమ్మిడివరం, బాలయోగి ఉపన్యాస దీక్ష, గొడౌన్ల చిరదీక్ష, తపస్యమీక్షా'శ్చమక'పారాయణం చేశా! నా గురించి వదిలేద్దాం -

ఆయన గురించి ఆశ్చర్యపోదాం. అరవయ్యేళ్లు వచ్చేస్తున్నాయట. మోకాళ్ల నొప్పులొస్తాయా? మోక్షద్వారాలు తెర్చుకుని, వజ్రాసనంలో మోకాళ్లు నొక్కుకుంటూ, ఎవర్నో మొక్కు కుంటూ వృద్ధాప్యాన్ని మూలుగుతూ నిశ్వాసిస్తాడా... పెన్నుతోడు అందులో ఎర్రింకుజోడు. అశోక్‌కుమార్ అలా చైడు. ఆయన శ్రీశ్రీ గుళ్లో పూజారిగానే ఉంటాడు. ఎన్ని తుపాన్లొచ్చినా గర్భగుళ్లో పీడితగ్రహాలని ప్రతిష్టిస్తూనే ఉంటాడు.

Surpress జనా:సుఖినోభవంతు. ■



## కృ'శీ'వలుడు

తన దేశం / ఎల్లల ఆకలికి / తన చేవే ఆహారం
తన దేహం / పిల్లల ఆకలికి / తన చావే పరిహారం



# ఆరుపదుల అశోకాగ్ని

అదృష్టదీపక్

**తన 'కలంవేగానికీ-గళం రాగానికీ' మహాకవి శ్రీశ్రీని గురువుగా భావించి, సాహిత్యరంగంలో నిత్యం పోరుదారిలోనే పయనిస్తున్న కలం యోధుడు అతడు !**

**అసమర్థులూ, అకవులూ కలసి శవయాత్రకు సిద్ధం చేస్తున్న మినీకవితకు కొత్త ఊపిరులు అందించి ప్రాణకాంతిని ప్రజ్వలింపజేస్తున్న 'వ్యూహ'కర్త అతడు!**

**అవగాహనకూ, ఆచరణకూ ఆటపట్టుగా స్వయంకృషితో జీవితాన్ని అందంగా మలచుకున్న 'సెల్ఫ్‌మేడ్ పెర్సన్' అతడు !**

ఇప్పుడు నేను నా ఆత్మబంధువు అశోక్‌కుమార్ గురించి మాట్లాడు తున్నాను. అవును - అభిప్రాయాలు ఎంత స్థిరంగా ఉంటాయో - మనిషి అంత నిశ్చలంగా ఉండే స్థితప్రజ్ఞుడు 'సింగంపల్లి అశోక్‌కుమార్' గురించి మాట్లాడు తున్నాను. మాటలకంటే చేతలకే ప్రాధాన్యం ఇచ్చే కార్యశూరుడూ, మాటల్లోనే కాదు - కవిత్వంలోనూ క్లుప్తతకు పెద్దపీటవేసే నిరాడంబరుడూ అయిన కవి అశోక్ కుమార్ గురించి మాట్లాడుతున్నాను.

జీవితంలోనూ, కవిత్వంలోనూ తూర్పు గోదావరి జిల్లాలో తొలి అడుగులు వేసిన అశోక్‌కుమార్ ఇప్పుడు విజయవాడలో స్థిరపడి, తన ఆలోచనల్నీ, ఆశయాల్నీ కలబోసి దావాగ్నిలా వ్యాపింపజేస్తున్నాడు.

ప్రారంభయౌవనంలో రంగనాయకమ్మ రచనల ప్రభావంతో తీవ్రమైన హేతువాదిగా రూపుదిద్దుకున్నాడు. తన అభి ప్రాయాలకూ, అనుభూతులకూ ఆలంబనగా నిలచే 'కుమారి'ని 1972 జనవరి మొదటిరోజున 'ఆదర్శ వివాహం' చేసుకున్నాడు. తరువాత కాలంలో తన కూతురు, కొడుకుల పెళ్లిళ్లు కూడా పురోహితుల మాయమంత్రాలు లేకుండా జనవరి ఒకటినాడే ఆదర్శంగా జరిపించాడు.

చైతన్య ప్రేరకాలైన ఇలాంటి కార్యక్రమాలను అలుపూ, సొలుపూ లేకుండా నిర్వహిస్తున్న మా అశోక్‌కుమార్‌కు నవంబర్ 6వ తేదీన అరవైఏళ్లు నిండుతున్న సందర్భంగా ఆత్మీయమైన అభినందనలు అందజేస్తున్నాను!

డెబ్భై దశకంలో ఆంధ్రదేశంలో హేతువాద ఉద్యమానికి తమరచనల ద్వారా సి.వి, డాక్టర్ మిత్రాలు ఎంతగానో దోహదం చేశారు. వారి తరువాత

# అక్షర హాలికులు

అశోక్‌కుమార్



## రాచమల్లు రామచంద్రారెడ్డి

(1922 - 1988)



## 'సవ్యసాచి'

సంవేదనా రాచమల్లు
అభ్యుదయాల హరివిల్లు
సమీక్షా సమరాంగణాన
మడంతిప్పని మహామల్లు

రంగప్రవేశం చేసిన అశోక్‌కుమార్ తూర్పుగోదావరి జిల్లా కాకినాడ కేంద్రంగా చేసుకొని తన రచనలతో గొప్ప అలజడి సృష్టించాడు.

ఏ ఉద్యమమైనా కొంతమంది వ్యక్తుల స్వార్థంతోనూ, అహంకారంతోనూ ముక్కలుగా చీలిపోవడం ఆంధ్రదేశంలో సర్వసాధారణంగా జరిగే విషయం ! హేతువాద ఉద్యమానికీ ఈ దుర్గతి తప్పలేదు. అయితే ఉద్యమాన్ని బలహీనపరిచే ఇలాంటి అనవసరమైన వాదవివాదాలలో తలదూర్చ కుండా, అశోక్ కుమార్ తనదైనశైలిలో హేతు వాద ఉద్యమంలో వన్‌మేన్‌ఆర్మీలా చెలరేగి పోయాడు.

ఆనాడు సమాజంలో అంటురోగాల్లా విజృం భించిన అమ్మలనూ, బాబాలనూ, స్వాములనూ -ఏ ఒక్కరినీ విడిచిపెట్టకుండా కలం యుద్ధం కొనసాగిం చాడు. ఆధ్యాత్మికత ముసుగులో ఆర్థిక దోపిడీ చేస్తూ, అసమ సమాజపు అవలక్షణాలకు అండగా నిలుస్తున్న గజదొంగలమీద ఉప్పెనలా విరుచుకుపడ్డాడు.

నమాజంలో పెరిగిపోతున్న ఆర్థిక అసమానతలనూ, తరాల అంతరాలనూ ఏమాత్రం పట్టించుకోకుండా దేవుణ్నీ, సంప్రదాయాన్నీ తెగతిడుతూ నాస్తికత్వం ఒక్కటే సర్వరోగ నివారిణిగా భావించే కొంతమంది నవ్యమానవవాదులకు భిన్నంగా అశోక్‌కుమార్ మార్క్సియ దర్శనంతో హేతువాదాన్ని సక్రమమార్గంలో పయనింప జేశాడు.

ఆదికాలంలో దేవుడిఉనికిని ప్రశ్నించిన చార్వాకులు, అసితకేశ కంబళుడు, మక్కలి గోశా లుడు, ప్రకృద్ధ కాత్యాయనుడు మొదలైన మాన వతా వాదులు ఎగరేసిన హేతువాదపతాకానికి మార్క్సియ దృక్ప థంతోఎరుపురంగు అద్ది ఆధునికయుగంలో ముం దుకు నడచినవారిలో అశోక్‌కుమార్ ముందు వరుసలో నిలబడతాడు.

రష్యన్‌కవి మయకోవ్‌స్కీ కమ్యూనిజంలోంచి కవిత్వంలోకి దూకినట్టే-అశోక్‌కుమార్, మహాకవి శ్రీశ్రీ రచించిన 'మహా ప్రస్థానం'కావ్యాన్నీ, కొద్దోగొప్పో మార్క్సిజాన్నీ అధ్యయనం చేశాకా, శ్రీశ్రీ షష్టి పూర్తి సంవత్సరంనుంచీ కవితాసేద్యం మొదలుపెట్టాడు.

తొలినాళ్లలో హేతువాద దృక్పథంతో దీర్ఘ కవితలు వెలయించాడు.ఇటీవలి సంవత్సరాల్లో సామ్యవాద వాస్తవికతతో కూడిన మినీకవితా రచనను ఒక ఉద్యమంగా చేపట్టాడు. 'తల్లీ! ఎవరునువ్వు?' (1973), 'శ్రీ బాబామహత్యం' (1975), 'బాల యోగీశ్వర సందర్శనం' (1976), 'మతప్రస్థానం' (1976), 'శుభాకాంక్షలు' (2003).దీర్ఘకవితల తరువాత 2004లో 'తంత్రం' సంపుటంతో తన మినీకవితా ప్రస్థానం మొదలుపెట్టాడు. అచిర కాలంలోనే 'పొద్దు పూసింది'(2004)'ఆధ్యాత్మిక ర'హా'స్యాలు'(2004), 'వ్యూహం'(2006), 'గ్లోబలి'(2007) పుస్తకాల ద్వారా మినీ కవిత్వంలో తన స్థానాన్ని సుస్థిరం చేసుకున్నాడు. అంతేకాదు - 'చినుకు' మాస పత్రికలో తాను నిర్వహిస్తున్న 'అణువు' పేజీని మినీకవులకూ, మినీ కవితలకూ వేదికగా తీర్చిదిద్దాడు.

ఇవన్నీ ఒక ఎత్తు అయితే 'శ్రీశ్రీ సాహిత్య నిధి' స్థాపన ఒక ఎత్తుగా చెప్పు కోవాలి. మహాకవి శ్రీశ్రీ శతజయంతి (2010)కి మూడేళ్ల ముందే అశోక్‌కుమార్ 'శ్రీశ్రీ సాహిత్యనిధి' నెలకొల్పి పెద్ద సంచలనం సృష్టించాడు. శతజయంతి ఉత్సవాలకు అనేక కార్యక్రమాల ద్వారా అభిమానుల్ని సన్నద్ధం చేశాడు. విశ్వవిద్యాలయాలో, అకాడెమీలో నిర్వహిం చవలసిన కార్యాన్ని ఒంటరిగా చేపట్టి, విజయ వంతంగా కొనసాగిస్తున్నాడు. మూడునెలలకోసారి వెలువరిస్తున్న 'శ్రీశ్రీ బులెటిన్'లు శ్రీశ్రీ సర్వస్వాన్ని పాఠకులకు అందజేస్తున్నాయి. 2010 ఏప్రిల్ 30న జరిగిన శ్రీశ్రీ శతజయంతి ఉత్సవాలలో, విజయ వాడ-తుమ్మలపల్లి కళాక్షేత్రంలో 'ఎక్స్-రే' సంస్థ నెలకొల్పిన మహాకవి కాంస్య విగ్రహంముందు ఆవిష్కరణ జరిగిన 'శ్రీశ్రీ-100' గ్రంథం, శ్రీశ్రీపట్ల అశోక్‌కుమార్‌కి ఉన్న అభిమానానికీ, అతని కార్య దీక్షకూ పరాకాష్ఠగా నిలుస్తుంది.

ఈ సందర్భంగా ఎక్కడెక్కడో ఉన్న శ్రీశ్రీ అభిమానులకూ, శ్రీశ్రీ రచనలకూ, శ్రీశ్రీ మీద రచనలకూ వారధిగా ఏర్పడిన 'శ్రీశ్రీ సాహిత్యనిధి'ని కర్తా, కర్మా, క్రియా-అన్నీ తానై నిర్వహిస్తున్న సారథి అశోక్ కుమార్‌ను మనస్ఫూర్తిగా అభినందిస్తున్నాను.

ప్రస్తుతం తెలుగులో సాహితీసేద్యం చేస్తున్న వారిలో నలుగురైదుగురు అశోక్ కుమార్‌లు ఉన్నారు. వారిలో తన కలం వేగానికీ, గళం రాగానికీ శ్రీశ్రీని ఊపిరిగా భావించే సింగంపల్లి అశోక్‌కుమార్ ఇంటి పేరు ఇప్పుడు శ్రీశ్రీగా మారిపోయింది.

అందుకే...

**శ్రీశ్రీ కవితార్ణవంలో**
**హాయిగా తేలిపోతున్న**
**ఈ గజ ఈతగాణ్ని -**
**శ్రీశ్రీ సాహిత్యాకాశంలో**
**స్వేచ్ఛగా విహరిస్తున్న**
**ఈ గరుత్మంతుణ్ని -**
**అభినందించడానికి**
**ఒకటి కాదు -**
**రెండు శ్రీలు కావాలి!**

**రెడ్ శాల్యూట్స్ టు**
**'శ్రీశ్రీ అశోక్‌కుమార్' !!** ■



## కార్పొరేట్ చదువు

ప్లానింగు చూస్తే / ఎంతో పరిశ్రమే / నిత్యం
స్కానింగు తీస్తే / అంతా అమెరికా / పైత్యం !



# 'నేనెరిగిన అశోక్'

సమతా కోటేశ్వరరావు

**నా సహచరి హైమ ద్వారా అశోక్ నాకు 1973లో పరిచయమయ్యాడు. ఆయేడే నేనూ అతనూ కలసి పౌరహక్కుల మహాసభకి గుంటూరు వెళ్లడం, అక్కడ అతను నాకు చెరబండరాజునీ వరవరరావునీ పరిచయం చేయడం బాగా గుర్తుంది. 1975లో అతని ద్వారానే పరిచయమైన సురా (అప్పటికతను రాడికల్ విద్యార్థి సంఘ బాధ్యుడు) త్వరలోనే నా ఆత్మీయ మిత్రుడయ్యాడు. 75లో మా పెళ్లికి రిజిస్ట్రార్ ఆఫీస్‌లో సాక్షి సంతకాలు చేసిన యిద్దరిలో ఒకరు అశోక్, మరొకరు (పీకాక్ క్లాసిక్స్) గాంధీ.**

నాకు పరిచయమయ్యే నాటికి అతను వృత్తిరీత్యా వ్యాపారరంగంలో వున్నాడు. నక్సల్బరీ రాజకీయాలస్ఫూర్తితో వుండి, జిల్లా క్రాంతి రచయితల సంఘంలో అద్దేపల్లి, శర్మగార్లతో బాటు పనిచేస్తుండేవాడు. 1973లో విరసంలో చేరి కాకినాడ యూనిట్ కన్వీనర్‌గా బాధ్యతలు నిర్వర్తించాడు. 71 నుండి ఎమర్జన్సీ వరకు పిలుపు, ప్రభంజనం, సృజన, ప్రజాసమస్యలు, ఎరుపు (విరసం ప్రత్యేక సంచిక) మొదలైన పత్రికలలో అతని కవితలు విస్తృతంగా వచ్చేవి. కాకినాడ యూనిట్ తరపున 'కుట్ర కుట్ర, కుట్ర' అనే విలువైన బులెటిన్ (ఒక సంచిక) తీసుకు వచ్చాడు.

మరోపక్క 73 నుండే హేతువాద కవిత్వం ప్రారంభించి 'తల్లీ! ఎవరునువ్వు?, శ్రీ బాబా మహత్యం, బాలయోగీశ్వర సందర్శనం, మతప్రస్థానం' అనే నాలుగు దీర్ఘ కవితలు పుస్తకాలుగా తీసుకువచ్చాడు. శ్రీశ్రీ, కొ.కు, సి.వి, మిత్రా వంటి వాళ్లు ఈ రచనలను బాగా ప్రోత్సహించారు. 'కుళ్లిన పదార్థంలోంచి పురుగులు రావడం సహజం. అలాగే కుళ్లిపోయిన ఈ సమాజంలోంచి ఈ తల్లులు, బాబాలు పురుగుల్లా పుట్టుకొస్తూనే వుంటారు. ఒక వైపు నుంచి విప్లవం కార్చిచ్చులా వీటన్నిటినీ దహిస్తూ వ్యాపిస్తోంది. 'తల్లీ! ఎవరునువ్వు?' వంటి విప్లవోచితమైన, బలమైన రచనలు విప్లవానికి చాలా అవసరం' అని కొడవటిగంటి ప్రశంసించారు. డా.ఎ.టి. కోవూర్ తన బృందంలో రాష్ట్ర మంతటా పర్యటిస్తూ ఉద్యమస్థాయిలో హేతువాదాన్ని ప్రచారం చేసిన కాలమది. ఆ ప్రభావం అశోక్ మీద పడింది.

అశోక్ కవిత్వంమీద శ్రీశ్రీ, సివి, ఆరుద్ర, ప్రభావం వుంది. కె.వి. రమణారెడ్డి, త్రిపురనేని మధుసూదనరావు అశోక్‌ని బాగా అభిమానించేవారు. అతను కన్వీనర్‌గా వున్న కాలంలో కాకినాడ యూనిట్ బాగా పనిచేసిందని మెచ్చుకునేవారు. తరువాతి కాలంలో వాళ్లని నేనెప్పుడు కలిసినా అశోక్ గురించి అడుగుతుండేవారు.

కొడవటిగంటి 'పంచకల్యాణి'లో సుశీల తనను ప్రేమించిన రామకృష్ణ వేరని, డబ్బు సంపాదించే రామకృష్ణ వేరని, పెళ్లాం పిల్లలు గల రామకృష్ణ

## అక్షర హాలికులు

**అశోక్‌కుమార్**



## కొడవటిగంటి కుటుంబరావు

**(1909 -1 980**



## 'కొడవటివంటి'

ఒరలో కత్తి నిదానం
ఒలిచిన పండు విధానం
సుతిమెత్తగ చెడుకుత్తుక
కత్తిరించడం ప్రధానం

వేరని భావిస్తూ ఆదిది ఒక అవతారం తరువాత యింకో అవతారం ఎత్తుతుందని, మగవాడు ఒక్కసారే చాలా అవతారాలెత్తుతాడని అనుకుం టుంది. అలాగే సంసారిగా, వ్యాపారవేత్తగా, కవిగా అశోక్ అవతారాలు వేరు వేరు. చాలామందికి వీటిలో ఒకటే అవతారం తెలుసు. వ్యాపారవేత్తగా అశోక్ దీక్షాదక్షతలున్న వాడు. లోగడ కాకినాడలో సైకిళ్ల వ్యాపారంలోనూ, ప్రస్తుతం ఒక బెంగళూరు కెమికల్ కంపెనీకి ఆంధ్రాబ్రాంచి మేనేజరుగానూ అతని పాత్ర సమర్థవంతమైనది. (ఐతే, ప్రగతిశీల సాహిత్యం ప్రచారం చేయాలనే సదాశయంతో కాకి నాడ లో కొంతకాలం నియోలిటరరీ సెంటర్ అనే పుస్తకాల షాపునడిపి సహజంగానే చేతులు కాల్చుకున్నాడు).

ఆదర్శాలను వల్లించడం కాకుండా అశోక్ ఆచరణలో చూపాడు. కుమారిని ప్రేమించి పెళ్లి చేసు కున్నాడు. 1972 జనవరి1న అదృష్టదీపక్, రారాసిల ఆధ్వర్యాన వీళ్లకు కులాంతర వివాహం దండల మార్పిడి పద్ధతిన జరిగింది. వీళ్ల అమ్మాయి జ్వలిత గూడా కులాంతర ప్రేమ వివాహం, అబ్బాయి నాస్తిక వివాహం చేసుకోవడం విశేషం.

అశోక్ మా 'సమత'లో క్రియాశీల సభ్యుడిగా వుండి విలువైన సూచనలు ఇస్తుండేవాడు. అతని మొదటి నాలుగు పుస్తకాలను మా సంస్థ ప్రచురిం చింది. వాటిలో 'తల్లీ! ఎవరు నువ్వు?', 'శ్రీ బాబా మహత్యం' పాఠకులలో ఎంతో సంచలనం కలిగిం చాయి. అమ్మకాలలోగూడా రికార్డ్ సాధించాయి.

'విజయవాడ సమత / హేతువాద ప్రజ్వలిత మౌఢ్యం బుద్ధుల్ని గుద్దీరుద్దీ / వికసింపజేయ యువత' అంటూ మా సంస్థపై కవిత గూడా రాసాడు. మా సంస్థ కొంతకాలం పూర్తిహేతువాదసంఘంగా వుండేది.

**'పడి / వయసులో / నాస్తికత్వం,**
**నడి / వయసులో / ఊగిసత్వం,**
**కడ / వయసులో / ఆస్తికత్వం'**

అని అశోక్ అన్నట్లే (ఆధ్యాత్మిక రహాస్యాలు), అప్పటి మా సభ్యులలో చాలా మంది కాలక్రమంలో హేతు వాద భావాలకు తిలోదకాలిచ్చారు. ఇప్పటికీ అవే భావాలతో నిలచిన అతికొద్ది మందిలో కుమారి అశోక్‌ల జంట ఒకటి.

1980 తర్వాత అశోక్ సుమారు 2 దశాబ్దాలు సాహితీ సృజనకే కాక సాహితీ సమావేశాలకు, సభలకు దూరంగా ఉన్నాడు. కొన్ని కవితలను రాసినా పత్రికలకి పంపలేదు. 2003 జనవరిలో 'శుభాకాంక్షలు' దీర్ఘకవిత ప్రచురించి పునఃప్రవేశం చేశాడు. అక్కడి నుండి వరుసగా 'తంత్రం' (2004), పొద్దు పూసింది (2004), ఆధ్యాత్మిక రహాస్యాలు (2004), వ్యూహం (2006), గ్లోబలి (2007) అనే కవితా సంపుటాలు ప్రచురించాడు. ఇవన్నీ మినీ కవితలే. వీటిలో కొన్ని హేతువాద కవితలు. వాటిలోనూ ఆర్థిక దోపిడి గురించి స్పష్టంగా చెప్పాడు.

**'మతాలన్నీ/ 'అసలు' దోపిడీకి/ పుట్టిన వడ్డీలే! వడ్డీ మాఫీ కావాలంటే/ అసలు / అంతరించాల్సిందే!'** (ఆధ్యాత్మిక రహాస్యాలు)

మిగిలినవి సామ్రాజ్యవాద ప్రపంచీకరణకు వ్యతిరేకంగా రాసిన శక్తిమంతమైన కవితలు. వాటిలో 'పంపకం' అనే కవితలో

**'జన్మభూమి వీడిది / రామజన్మభూమి వాడిది! మాతృభూమి అప్పులోడిది !'** (తంత్రం),

**'రెండూ తుపాకులే / ధనం తరఫున ఒకటి / జనం తరఫున ఒకటి'** (పొద్దు పూసింది) అనే స్పష్టమైన దృక్పధంతో రాసాడు.

అశోక్‌తొలిదశలో రాసిన కవితలు గూడా పుస్తక రూపంలో తీసుకువస్తే బాగుంటుంది. అప్పుడు అతని కవితా చైతన్యంలోని వివిధ పరిణామదశలను ఎవరైనా సమీక్షించవచ్చు. ఆ సమీక్ష ఎలా వుండాలో గూడా అతనే ప్రకటించాడు.

**'సమీక్షలో / రచన రేంకులను /మార్క్సుతోనే కొలవాలి'** అని (పొద్దుపూసింది).

అనేక సాహిత్య సాంస్కృతిక సంస్థలలో క్రియా శీలంగా పాల్గొనడమే కాకుండా, 2005 ఏప్రిల్‌లో ప్రారంభమైన 'చినుకు' పత్రికకు ఫీచర్స్ ఎడిటర్‌గా సమర్థవంతమైన పాత్ర నిర్వహిస్తున్నాడు. ఇరవై సంచి కల పాటు 'శ్రీశ్రీక్విజ్' నిర్వహించాడు. 'అణువు' 'కలం యోధులు'శీర్షికలు నిర్వహిస్తున్నాడు. ఇదేగాక 'వార్త'లో 'అక్షరహాలికులు' శీర్షికన పలు స్కెచ్‌లు రాసాడు.

శ్రీశ్రీ శతజయంతికి సరిగా మూడేళ్లముందు శ్రీశ్రీ సాహిత్యనిధి ప్రారంభించి, ఆరుద్ర సమగ్రాంధ్ర సాహిత్య చరిత్రలో కూరుకుపోయినట్లు అశోక్ గూడా కూరుకుపోయాడు. 2007 ఏప్రిల్ నుంచి క్రమం తప్పకుండా బులెటిన్లు తేవడం, శ్రీశ్రీ రచనలు, శ్రీశ్రీపై రచనలు సేకరించి ప్రచురించడం చేస్తు న్నాడు. వీటిని శతజయంతితో ఆపకుండా కొన సాగించడం విశేషం. శతజయంతి సందర్భంగా వివిధ సంస్థలు నిర్వహించిన సభలలోనూ, పోటీల లోనూ విజయవాడలోనే కాక యితర ప్రాంతాల లోనూ అశోక్ వుత్సాహంగా పాల్గొన్నాడు.

స్వభావరీత్యా అశోక్ మంచి సంభాషణా చతు రుడు. వ్యక్తిగత మిత్రులతోనూ సాహితీ మిత్రుల తోనూ సరదాగా చతురోక్తులతో మాట్లాడే వాడు. ఆ సంభాషణ గూడా పదునుగా, కవితాత్మకంగా, అంత్యప్రాసలలో సాగేది. మా పెళ్లైనకొత్తలో అశోక్‌ని అతనిమిత్రుడడిగాడు 'మీది యింటర్‌కాస్ట్ మ్యారేజా?' అని అశోక్ తడుముకోకుండా 'ఇంటర్ క్లాస్ మ్యారేజీ' అని చెప్పాడు. మిత్రులకి పుస్తకాలు బహుకరిం చేటప్పుడు వాటిమీద చక్కటి కవితలు రాసియివ్వడం అతని అలవాటు.

కవిత్వం తర్వాత అతని అభిమాన విషయం సినిమాలు. ముఖ్యంగా పాతసినిమాల గురించి చాలా వివరాలు సాధికారికంగా చెప్పగలడు. ఈ పరిజ్ఞానం తోనే మనసు ఫౌండేషన్ వారికి 'శ్రీశ్రీ ప్రస్థానత్రయం' సినిమా పాటల విభాగంలో సహకార మందించాడు.

చాలామంది యువకవులకు కవిత్వ రచనలో మెళకువలు నేర్పేవాడు. 'జనగానం' సంపాదడు దేవేంద్ర (ఇతని పాటకి నంది బహుమతి గూడా వచ్చింది) అశోక్ శిష్యుడే.

అశోక్‌లో సౌందర్యదృష్టిహెచ్చు. అతని దస్తూరీ చక్కగా అక్షరాలు చెక్కినట్లుంటుంది. 'శ్రీశ్రీ సాహిత్య నిధి' ప్రచురణలన్నీ అందంగా ప్రచురించాడు. అన్నిటికీ ఆకర్షణీయమైన, అర్థవంతమైన కవర్ పేజీలు డిజైన్ చేయించాడు. ప్రచురణలన్నింటికీ యూనిఫామిటీ పాటించాడు.

'శ్రీశ్రీ సాహిత్యనిధి' తరపున అశోక్ చేసిన, చేస్తున్న కృషి కె.వి.రమణారెడ్డి, చలసాని ప్రసాద్‌ల కృషికి విజయవంతమైన కొనసాగింపుతో పాటు శ్రీశ్రీగురించిన సాహిత్యంపై కూడా చేయడం చెప్పుకోదగింది, గుర్తించదగింది.

అశోక్ భజనపరులను దూరంగావుంచడం మంచిది. ('మహాభారతంలోలేనిది సమాజంలో లేదు అంటారు గానీ అశోక్‌కుమార్ రాసిన ఈ ఆధ్యాత్మిక రహస్యాలులో లేనిది సమాజంలోలేదు అనొచ్చు' అనడం ఖచ్చింగా డబ్బాకొట్టడమే కదా!)

అశోక్ ఒకప్పుడు మంచి చదువరి. ప్రస్తుతం సాహిత్యనిధి కార్యకలాపాలలో మునిగిపోవడంవల్ల, విజయవాడలోని అనేక సాహితీ సంస్థలకి తలలో నాలుకలా వ్యవహరిస్తుండడంవల్ల కవిత్వంతప్ప తక్కిన సాహిత్యం చదవడం బాగా తగ్గిపోయింది. దీన్ని సరిచేసుకోవడం 'సాహిత్యనిధి' భవిష్యత్కార్య క్రమాల దృష్ట్యా గూడా అవసరం.

అశోక్ ఇన్ని కార్యకలాపాలు విజయవంతంగా నిర్వహించడంలో తెరవెనుక విరసం(చలసాని) ప్రసాద్, 'ప్రజాసాహితి' ప్రధాన సంపాదకుడు కొత్తపల్లి రవిబాబు, శ్రీశ్రీ సాహిత్యనిధి కార్యక్రమాలలో అశోక్‌కి పూర్తి చేదోడు వాదోడుగా వుంటున్నారు. ఇక మరో ముఖ్యమైన వ్యక్తి కుమారి. అశోక్ చెప్పినట్లు అతని ఆలోచనలు బొగ్గులాచచ్చుబడినప్పుడు రగిలించేది, అతణ్ని వెన్నుతట్టి ప్రోత్సహించేదీ ఆమే. ఇంటిపనులు, బాధ్యతలు దాదాపు తానే నిర్వర్తిస్తూ అతనికి సాహిత్యవ్యాపకాలకి వెసులుబాటు కల్పిస్తున్నది ఆమే. 'సాహిత్యనిధి' అభిమానుల తరపున వీళ్లకి అభినందనలు

షష్టిపూర్తి, సప్తతిపూర్తి లాంటి వుత్సవాలకు నేను వ్యతిరేకం. ఐనా ఆత్మీయమిత్రుడు అశోక్ గురించి ఇప్పటి వాళ్లకు తెలియని కొన్ని విషయాలైనా తెలియజేసేందుకే యీ ప్రయత్నం. ■



# అబ్బురమైన గోల్డు నిబ్బు...ర

వేణూ సంకోజు

అనవరతం అశేష జనుల
అభ్యున్నతి కోసమే ఆచంచలంగా
పరిశ్రమించే క్రమంలో సింగంపల్లి అశోక్‌కుమార్ (సి.అ)
అప్పుడప్పుడూ తిరగబడుతుంటాడు
'అసి'ధారావ్రతానికి - అసుర లక్షణ విచ్చేదనానికి
అలుపెరగక పూనుకుంటాడు
అక్షర తూణీరం అందుకుంటాడు!

అట్లో వినమ్రంగా తోస్తూనే
ఆజిలో వెన్నుచూపబోయే మెకాలమీద
అంతెత్తుకు లేచి నిలుస్తుంటాడు
ఉస్తాద్ నిర్మించిన ఆహిత్య మార్గాన్నే
విడువక అనుసరిస్తూ వస్తుంటాడు
అందుకేమరి - అత్యవసర పరిస్థితినీ అధిగమించి
కుట్రను 'కుట్ర...'గానే నిరూపించి నడుస్తుంటాడు!

కష్టజీవికి యిరువైపులా వుంటూ నన్నవాడికి
రెండు పక్కలా తానై నిలవాలని నిర్ణయించుకున్నది తడవు
ఆచరణ సాధ్యంచేసి జయిస్తాడు
వెన్నుతడుతూ కుమారి - సహచరి
తోడుండబట్టి 'మతప్రస్థానా'న్ని నిలువరిస్తూ
హేతువాదమే యోగ్యమని ఆ సొంతం -
మార్క్సిజాన్ని మెచ్చుతూ - హెచ్చుతూ వచ్చాడు!

'చినుకు'లో చినుకుగా ఒదిగిపోతూ
ఒక అందమైన చందంగా తన సామాజిక బాధ్యతను
ఆదర్శప్రాయం చేస్తూవచ్చాడు
మరందుకే మన అశోక్‌కుమార్ అందరికన్న మిన్నగా
శ్రీశ్రీని అబ్బురమైన గోల్డు నిబ్బుగా వరించాడు - ధరించాడు! ■



## ఎరుపు

కొందరికి / భయం !
ఎందరికో / అభయం !



# ఆగని గడియారం

లోచన్

**కొన్నిసార్లు ఫోన్లో మాట్లాడుకోవడం తప్ప అశోక్‌కుమార్‌తో నాకు వ్యక్తిగత పరిచయం లేదు. కాని అతడు శ్రీశ్రీ సాహిత్యాన్ని అమితంగా ప్రేమించాడు. అందుకే అశోక్ నాకు చిరపరిచితుడు. గత సంవత్సర కాలంగా అతడితో ఒక ఆత్మీయ సంబంధమున్నట్టు ఫీల్ అవుతున్నాను. ఇది అక్షర సంబంధం - భావ బాంధవ్యం.**

శ్రీశ్రీ కవిత్వంయెడ అశోక్‌కుమార్‌కున్న ప్రేమాభిమానాలు చూస్తుంటే ఎంతో ఆశ్చర్యం, ఆనందం కలుగుతుంది. శ్రీశ్రీలోలాగే తనలో కూడా ఒక శిశువు, ఏదో అలజడి,ఆందోళన దు:ఖితులయెడ స్పందించే హృదంలేనిదే శ్రీశ్రీని అంతగా ఆరాధించడు. స్వచ్ఛమైన మనసు, సామాజిక నిబద్ధత ఉంటే తప్ప ఒక దశాబ్దం పాటు శ్రీశ్రీ సాహిత్యాన్ని వెలువరించే బృహత్తర కార్యక్రమాన్ని భుజాన వేసుకోడు. శ్రీశ్రీస్టైల్‌లో చెప్పాలంటే అశోక్ కుమార్ చేస్తున్న కృషి అనితర సాధ్యం-అద్భుతం- మనందరికీ తెలుసు అంతకుముందు తనకి అన్నయ్యలాంటి చలసాని ప్రసాద్ శ్రీశ్రీమార్క్ మరో అద్భుతం- శ్రీశ్రీ సాహిత్య సర్వస్వాన్ని ఎంతో నిష్టతో మనకు అందించిన అరుదైన సాహిత్యజీవి. వీరిద్దరూ తెలుగుసాహిత్యానికి చేసిన, చేస్తున్న సేవ అపూర్వం- డాక్టర్ సామ్యేల్ జాన్సన్‌కి ఒకే బాస్వెల్- మన శ్రీశ్రీకి యిద్దరు.

శ్రీశ్రీని జనంబాధ ఊరుకొనివ్వలేదు- శ్రీశ్రీకవిత్వం అశోక్ కుమార్‌ని నిలవనియ్యలేదు. ఇదిగో ఇప్పుడు మనల్ని అతడు శ్రీశ్రీ అక్షరాల వెల్లువలో, వెలుగులో ఊపిరి సలపనివ్వడంలేదు.

'స్వేచ్ఛా జీవితం' ఏ సిద్ధాంతానికీ కట్టుబడదు, అనే నిలకడలేని పోస్ట్ మాడ్రన్ పోకడలలో పడిపోకుండా, మనుషుల్ని ప్రాణంలేని రోబోలుగా, రోగులుగా మారుస్తున్న ప్రపంచీకరణ ప్రభావంతో కొట్టుకుపోకుండా, సజీవ సామాజిక పురోగమి శక్తులుగా ఎదగాలనే బలమైన 'ఆకాంక్ష'తో అశోక్ కుమార్ యీ 'సాహిత్యనిధి' ద్వారా శ్రీశ్రీ పోరాటసంస్కృతిని యువతరానికి అందిస్తున్నాడు -ఇదొక లిటరరీ మెగా'మేగజీన్' అక్షరాయుధాల గిడ్డంగి.

1950లో మహాప్రస్థానం వెలుగు చూడడం, అశోక్‌కుమార్ లోకంలో కన్నుతెరవడం ఒక అందమైన Coincidence. 1970లో శ్రీశ్రీ షష్టిపూర్తి సందర్భంగా పెన్ను తెరవడం తన సాహితీయాత్రకి ఒక అర్థవంతమైన ఆరంభం. అందుకేనేమో అశోక్‌కుమార్ ఊపిర్ల నిండా శ్రీశ్రీయే.

కవిగా శ్రీశ్రీ యీ సమాజానికి తాను యివ్వగలిగింది ఎంతో ప్రేమతో, కృతజ్ఞతతో యిచ్చాడు. అశోక్‌కుమార్ కూడా 'శ్రీశ్రీ సాహిత్యనిధి'ని ఎంతో ఆరాధనగా, అప్యాయంగా, అవసరంగా మనకు అందిస్తున్నాడు.

క్వార్ట్జ్ గడియారం ఆగుతుందేమో కాని, శ్రీశ్రీ కవిత్వపు సెల్ వేసుకున్న అశోక్ గడియారం ఆగదేమో అనిపిస్తున్నది.

నిద్రలేపే, రేపటి ఆలోచనలను రేపే శ్రీశ్రీసైరన్ మనల్ని 'జాగ్రేరహా,అని హెచ్చరిస్తూనే ఉంటుంది.అలా 'శ్రీశ్రీ సాహిత్యనిధి' మన విధిని,నడవాల్సిన పథాన్ని,దారితప్పవద్దనే సిగ్నల్స్‌ని మనకి అందిస్తూనే ఉంటుంది. పదండి ముందుకి.

అశోక్ కుమార్ మూఢ నమ్మకాలకి, దొంగగురువుల మోసాలకి, అశాస్త్రీయ, అమానవీయ ఆలోచనలకు వ్యతిరేకంగా చాలానే పోరాటం చేశాడని తెలుస్తున్నది.

శ్రీశ్రీ కవితానుభూతికి ఒక అర్థవంతమైన, అందమైనరూపం అశోక్‌కుమార్. అరవై వసంతాలు చూసిన మన అశోక్ అలా నూరువసంతాలు,నాటుతూ పోవాలని, శ్రీశ్రీ మరోప్రపంచపు దారిలో తాను సైతం పూల మొక్కై పూయాలనీ, మైలు రాయి కావాలనీ మనసారా ఆకాంక్షిస్తూ...తనని అభినందించడానికి ఈ చిన్న అవకాశాన్నిచ్చిన 'చినుకు'కి కృతజ్ఞతలు. ■

## ఆట

ఎన్నికల ముందు / వాడికీ వీడికీ / నువ్వే గోలువి
ఎన్నికల పిదప / వీడికీ వాడికీ / నువ్వే బాలువి





# శ్రీశ్రీకి జేజే... సింగంపల్లికి జేజే...!!

సింగమనేని నారాయణ

**ఎవడా అన్నది సింగంపల్లికి అరవైఏళ్లని ?**
**అంటే మరో 20 ఏళ్లకో 25 ఏళ్లకో వెళ్లిపోమ్మనేకదా?**
**మహాకవి శ్రీశ్రీ ఏమన్నాడు? కవి వయసు ఎప్పుడూ 30 ఏళ్లనే కదా?**
**నేనంటాను శ్రీశ్రీ కవిత్వలాలసుడి వయసు కూడా ఎప్పుడూ 30 ఏళ్లేనని !**

సింగంపల్లి శ్రీశ్రీ కవిత్వలాలసుడే కాదు ! శ్రీశ్రీ కవిత్వ కంఠోపాఠకుడు కూడా !
శ్రీశ్రీ ఆరాధకుడూ, శ్రీశ్రీ వీరాభిమాని కూడా !!
శ్రీశ్రీని గుండెల్లోనే కాదు జీవితమంతా నింపుకున్నవాడు ! శ్రీశ్రీ కోసమే జీవిస్తున్నవాడు !
తాను జీవిస్తూ శ్రీశ్రీ కోసం కవిత్వాభిమానులందర్నీ జీవించమని శ్రీశ్రీ కవితాయజ్ఞం నిరంతరంగా సలుపుతున్నవాడు.
అలాంటివాడిని పట్టుకుని అరవైఏళ్లంటున్నారేమిటి? సింగంపల్లి వయసు ఇప్పుడేకాదు ఎప్పుడూ 30 ఏళ్లే!

మూడేళ్ల క్రితం నాకు సింగంపల్లితో తొలిపరిచయం. శ్రీశ్రీ సాహిత్యనిధి ఏర్పాటు చేసి, శ్రీశ్రీ బులెటిన్లు తెస్తున్నాడు అప్పటికే!
శ్రీశ్రీ 24వ వర్ధంతి సందర్భంగా (15-06-2007) శ్రీశ్రీ సాహిత్యనిధి వేదిక ఏర్పాటు చేసిన సభలో శ్రీశ్రీ గురించి మాట్లాడటానికి విజయవాడకు నన్ను ఆహ్వానించినాడు. అప్పుడు చూశాను సింగంపల్లిని. అతడిని చూసి ఏభైఏళ్లు ఉంటాయేమో ననుకున్నాను.
అంత చురుగ్గా ఉత్సాహంగా కనిపించినాడు నాకు. ఆ తర్వాత మరో రెండుసార్లు కలయిక.
శ్రీశ్రీ బులెటిన్లు కాదు, శ్రీశ్రీ గురించి ఇప్పటికి 21 పుస్తకాలు తెచ్చినాడు సింగంపల్లి.
'శ్రీశ్రీ-100' (శ్రీశ్రీ శతజయంతి విశేష సంచిక) తేవటానికి ఎంత శ్రమించినాడని?
ఏ సంస్థో చేయవలసిన పనిని తన ఒక్క చేతిమీదుగా చేసి ఆ పుస్తకం తెచ్చినాడు.
శ్రీశ్రీ శతజయంతి పూర్తయినా శ్రీశ్రీ గురించితాను తెచ్చే పుస్తకాల పరంపర ఆగదన్నాడు.
అది నిరంతరంగా కొనసాగుతూనే వుంటుందని చెప్పి శ్రీశ్రీ అభిమానుల గుండెల్లో జ్వాలను ఎగదోస్తూనే ముందుకు సాగుతున్నాడు.
**శ్రీశ్రీ అంటే సింగంపల్లి... సింగంపల్లి అంటే శ్రీశ్రీ సాహిత్యనిధి.**
అతనికి నా వందనమ్ ! అభినందనమ్!! ■

## జీవితం

సమస్యే / నిన్ను చంపితే / చావు
సమస్యను / నువ్వు చంపితే / బతుకు





# కార్యకర్త కాదు... ఇతడు బహు కావ్యకర్త

చెరుకూరి సత్యనారాయణ

సింగంపల్లికి అరవై యేళ్లు నిండే సందర్భంలో నవంబర్ 'చినుకు'ను ప్రత్యేక సంచికగా తెస్తున్నామని సంపాదకులు ఫోన్ చేయగానే సంతోషంతో మాట రాలేదు. లబ్ధప్రతిష్టులూ, బహుకావ్యకర్తలు, తమ రచనల్తో సమాజంలో గొప్ప మార్పుకి కారకులైన అశేష శేముషీ దురందరులకు మాత్రమే లభించే గౌరవం అశోక్‌కుమార్ లాంటి సాధారణ సాహితీ కార్యకర్తలకు లభించటం అందులోనూ చినుకులాంటి ప్రామాణిక సాహిత్య పత్రిక ప్రత్యేక సంచిక వెలువరించ బూనుకోవటం గొప్ప గౌరవం. ఈ గౌరవానికి అన్నివిధాలా సింగంపల్లి అర్హుడు.

'శ్రీశ్రీ భావాలు సాగు చెయ్యడం శ్రీశ్రీ అభిమాని విధి !
శ్రీశ్రీ భావాలు పోగు చెయ్యడం సాహిత్య నిధి !

అంటూ శ్రీశ్రీ సాహిత్యనిధి కర్తవ్యంగా ప్రకటించి మహాకవి రచనల విశేషాలతో ప్రతి మూడు నెలలకోసారి శ్రీశ్రీ శతజయంతి వరకూ సభలు జరుపుతూనే వుంటాయి. బులెటిన్స్ వెలువడుతూనే వుంటాయి అంటూ 2007 ఏప్రియల్‌లో తొలి బులెటిన్‌ను తెచ్చి దాన్ని ఉచితంగా పంపిస్తానని ప్రకటించినపుడు 'మరో పొద్దెరగని కొత్త బిచ్చగా'డొచ్చాడని చాలా మందిలాగే నేనూ భావించాను. నిర్విరామంగా ఆ బులెటిన్లు తెస్తూ యావత్ ఆంధ్రావనిని ఒంటిచేత్తో మహాకవి శతజయంతికి సమాయత్తపరిచినాక అతడు కోతల రాయుడు కాదు చేతలవీరుడని తెలుగు సాహితీ ప్రియులందరితో పాటు నాకూ అర్థమైంది.

శ్రీశ్రీకి ఇతడు 'కైక' కాదు కదా కనీసం 'రాధ' కూడా కాదు. వారసత్వం కోసం కొట్టుకుంటున్న 'జ్ఞాతి' కాదు భారం మోయాల్సిన ఆ వీరులంతా కాడికిందేస్తే ఆ యజ్ఞాన్ని పరిపూర్తి చేయడంలో అశోక్‌కుమార్ కనబరిచిన పట్టుదల, దీక్ష, అనితరం.

కొత్తపల్లి రవిబాబు, దివికుమార్‌తో కల్సి ఒకసారి గుంటూరులో మా ఇంటికొచ్చినపుడు పరిచయం చేయబడ్డాడు. ఎక్కడో చూచిన గుర్తు. అడిగితే బాగుండదని ఊరుకున్నాను. అతనూ మౌనంగానే వున్నాడు. కాని చాలా సార్లు బుర్రలో ఆ ఆలోచన తొలుస్తూనే వుంది.

గత సంవత్సరం శ్రీశ్రీపై నిర్వహించిన ఒక సభలో పాల్గొనేందుకు విజయవాడ వెళ్లాను. అక్కడ సభకు నన్ను పరిచయం చేస్తూ 70వ దశకంలో తూర్పుగోదావరి జిల్లాలో తాను వున్నప్పుడు రాజమండ్రి సభ కోసం వచ్చిన శ్రీశ్రీని రైలుకి సమయం చాలదని రాలేనని చెప్పినా నేను పెద్దాపురం తీసుకొచ్చిన విషయం ప్రస్తావించారు. ఎక్కడో చూశాననే నా సంశయం ఆరకంగా నివృత్తి చేయబడింది.

సాహిత్యనిధి కోసం ఎంతో శ్రమిస్తున్న అశోక్ కుమార్ గారి విషయంలో ఉడతపాత్ర పోషిద్దామని బులెటిన్లు పదీ కలిపివేసిన పుస్తకాలు ఒక పది అమ్ముదామని తీసుకున్నాను. కాలేజీ రోజుల్లో 'పావలా'కి 'ఆలోచన' పత్రిక, రెండు రూపాయలకు 'జీవనాడి' పత్రికనూ కాలేజీలోనే కాకుండా విద్యార్థుల రూములకు తీసుకెళ్లి అమ్మే వాళ్లం. విద్యార్థి యూనియన్ అధ్యక్షుడిగా వుంటూ పావలాకోసం విద్యార్థుల ముందు చేయి చాపటంలో యేమాత్రం నామోషీ పడేవాణ్నికాదు. ఊరంతా తిరిగి అర్థ రూపాయి చొప్పున 'జనశక్తి' పత్రిక అమ్మటం కూడా నా దినచర్యేకాని, ఈ 'శ్రీశ్రీ బులెటిన్స్' సంపుటులను ఉచితంగా ఇచ్చి, 50 రూపాయల చొప్పున నేను డబ్బుకట్టాను. ఈ చిన్న పనిలో సైతం సింగంపల్లికి కొంత శ్రమ తగ్గించాననే తృప్తి మిగిలింది.

అశోక్‌కుమార్ ఎవరో గుర్తొచ్చినాక అప్పట్లో అంటే 1973, 1974-76 సంవత్సరాల్లో ఆయన రాసిన 'తల్లీ! ఎవరు నువ్వు', 'శ్రీ బాబా మహాత్యం' లాంటి హేతువాద దీర్ఘ కవితలు గుర్తొచ్చాయి. ఆ పుస్తకాల కోసం వెతికితే కనబడలేదు. మిత్రుల దగ్గర వాటి కోసం ప్రయత్నిం చినపుడు ఆశ్చర్యకరమైన మరో విషయం తెల్సింది. ఈ రెండు పుస్తకాలేకాక మరో ఎనిమిది కవితా సంపుటాలు వచ్చాయని సింగంపల్లి కూడా బహు గ్రంథకర్తల కోవలో వాడేనని తెలిసింది.

'తల్లీ! ఎవరు నువ్వు?'(1973), 'శ్రీ బాబా మహత్యం'(1974),'బాలయోగీశ్వర సందర్శనం' (1976), 'మతప్రస్థానం' (1976), 'శుభాకాంక్షలు' (2003), 'తంత్రం' (2004), 'పొద్దు పూసింది' (2004),'ఆధ్యాత్మిక రహస్యాలు'(2004), 'వ్యూహం' (2006), 'గ్లోబలి' (2007) పేరుతో వీరి రచనలు అచ్చులోవచ్చాయి.ఈ పది కావ్యాల్లో మొదటి ఐదు దీర్ఘకవితలు కాగా, చివరి ఐదూ మినీ కవితలు.

'నరబలి','సత్యకామజాబాలి'లాంటి దీర్ఘ హేతువాదకవితల్తో తెలుగుదేశంలోనూ తెలుగు సాహిత్యంలోనూ అప్పటికున్న స్తబ్దతను పారద్రోలిన సి.వి.కి చేదోడుగా హేతువాద దీర్ఘకవితల్తో రంగ ప్రవేశం చేసిన సింగంపల్లి అశోక్‌కుమార్ తన తొలి పుస్తకాన్ని

**'తరతరాలుగా**
**గతానుగతకంగా మోస్తున్న**
**అంధ విశ్వాసాల బరువును**
**ఇప్పుడిప్పుడే ఛేదిస్తూ**
**విప్లవానికాయత్త మవుతున్న**
**ప్రగతి పథ నిర్మాతలు**
**దేశభావి నిర్ణేతలు**
**కార్మిక కర్షకులకు'**

అంటూ అంకితమివ్వటంతోనే తన తాత్విక నేపథ్య మేమిటో తెలుగుపాఠకుల ముందు బహిర్గతం చేశారు.

తర్వాతకాలంలో రాసిన 'శ్రీబాబా మహత్యం' హేతువాద దీర్ఘ కావ్యాన్ని

**' మేధోవికాసాని మడికట్టి**
**శాస్త్ర జ్ఞానాన్ని సన్యసించి**
**బాబాల హస్తలాఘువాలకు**
**బోరున మస్తిష్కాలు స్ఖలిస్తున్నటువంటి**
**సుప్రసిద్ధ సైంటిస్టు సున్నాసులకు'**

అంకితం ఇచ్చారు.

తన 'బాలయోగీశ్వ సందర్శనం' హేతువాద దీర్ఘ కావ్యాన్ని

**'డాక్టరు ఏ.టి. కోవూరు**
**తర్కానికి మరో పేరు**
**బాబాల తోలు ఒలిచిన**
**హేతువాద కైజారు '**

అంటూ ప్రఖ్యాత మానసిక తత్వ శాస్త్రవేత్త డాక్టరు అబ్రహం టి. కోవూర్‌కి అంకితమిచ్చారు.

తన 'మత ప్రస్థానం' కావ్యాన్ని

**'నా కలంవేగానికి**
**నా గళం రాగానికి**
**గురువైన శ్రీశ్రీకి,**

తన శుభాకాంక్షలు' కావ్యాన్ని

**'అగ్గిలా ఆవేశం**
**చెలరేగినపుడు**
**చల్లార్చేది తనే !**
**బొగ్గులా ఆలోచనలు**
**చచ్చు బడినపుడు**
**రగిలించేది తనే' !**

అంటూ తన శ్రీమతికి అంకిమిచ్చినపుడు ఒక్క క్షణం శ్రీశ్రీ 'ఆః' కవితని గుర్తుకు తెస్తాడు.

2006లో ప్రచురించిన 'వ్యూహం'మినీ కవితల సంపుటి 'అగ్నిపుత్రుడు' 'చెరబండరాజు'గాను

**' చెరబండరాజు గానం**
**సమరశీల తెలంగానం**
**అసమానతలను తీసే**
**శ్రమవాద మార్క్సు బాణం '**

అంటూ చెరబండరాజుకి అంకితమిచ్చాడు.

తన 'పొద్దు పూసింది' లఘు కవితల సంపుటిని

**'కలాల హలాలతో**
**ఎరుపు పంటలు పండిస్తున్నారు**
**అక్షర హాలికులకు**

అంటూ అంకితం చేశారు.

తన 'ఆధ్యాత్మిక రహస్యాలు' హేతువాద మినీ కవితా పుస్తకాన్ని

**'ప్రజాకవి వేమన**
**ఈ కవితలకు ప్రేరణ**
**అందుకే ఇది ఆయనకే'**

అంటూ వేమనకు అంకితమిచ్చాడు.

సింగంపల్లి మరో కావ్యం 'గ్లోబలి'. దీన్ని

# అక్షర హాలికులు

అశోక్‌కుమార్



## నార్ల చిరంజీవి

(1925 - 1971)



## 'ఎర్ర గులాబి'

నవతర నార్ల చిరంజీవి
కమ్యూ 'నిజ స్వరం' జీవి
'విషపుత్రికల' దొంగదాడి
తిప్పికొట్టిన కలంజీవి



# స్మైల్

## (1942 - 2008)

మీ 'తంత్రం' ఇవాల్టి దేశకాల పరిస్థితుల నిలువెత్తు దర్పణం. విషయాలు తెలవడం వేరు, తెలిసినదాన్ని కొద్ది మాటల్లో కవిత్వీకరించి చెప్పడం వేరు. ఆగ్రహం, ఆవేదన,వ్యంగ్యం, ఎత్తిపొడుపు యీ క్లుప్త వ్యక్తీకరణలో చెప్పడం ప్రతిభ. ఎంతో ప్రజ్ఞావంతంగా రాశారు కవితల్ని మీరు. నా హృదయపూర్వక అభినందనలు.

'తంత్రం' ఆఖరు పేజీలో మీ ఇతర రచనల వివరాలు చూశాను. మీరు ఏవిషయాల మీద గురి పెడుతున్నారో గ్రహించాను. ఇవాళ యిది చాలా అవసరమైన స్టాండ్. ప్రజలకి ప్రభలంగా తెలియాలి. ఆలోచించే పదిమంది చాలు. ఒక చెయిన్ రియాక్షన్ మొదలవుతుంది. ఒక సీరియస్ రచయితకి యింత కంటే యేం కావాలి?

మీరు చేస్తున్న కృషికి నా సెల్యూట్.

( జూన్ - 2004 )

**అలిశెట్టి ప్రభాకరం**
**నిబద్ధకవితాస్వరం**
**రణ చిత్రాలై రగిలిన**
**మినీ కవన భాస్వరం**

అంటూ 'అలిశెట్టి ప్రభాకర్' కి అంకిత మిచ్చారు.

ఇవన్నీ ఒక ఎత్తుకాగా 'తంత్రం' అనే పేరుతో ప్రచురితమైన సచిత్ర మినీ కవితా సంపుటని

**'కవిగా**
**నాకు జన్మనిచ్చిన**
**మహాప్రస్థానం**
**మహా కావ్యానికి '**

అంటూ అంకితమిచ్చాడు. బహుశా తెలుగు సాహిత్య చరిత్రలోనే కాదు విశ్వసాహిత్య చరిత్రలోనే ఒక పుస్తకాన్ని మరో పుస్తకానికి అంకితమివ్వటం ఇదే ఏకైక సందర్భం అనుకుంటాను.

తన పుస్తకాలు అంకితమివ్వటంలోనే తన ప్రత్యేకత చాటుకున్న సింగంపల్లిఅశోక్‌కుమార్ 'చినుకు', 'ప్రజాసాహితి'వంటి మాస పత్రికల్లో తన కోసం ఒకపేజీని కేటాయింప జేసుకోవటానికి అర్హతను ఏనాడో తన చురుకైన కవిత్వంద్వారా సంపాదించారు.

ప్రపంచబ్యాంకు షరతులు సరళీకరణ విధానాలు-వాటి దుష్పరిణామాలు గూర్చి వందల పేజీల్లో చెప్పలేని విషయాలు

**'ఎగురుతున్న**
**జెండా**
**ఇక్కడ !**

**ఎగరేస్తున్న**
**తాడు**
**అక్కడ !'**

**'ప్రజాస్వామ్యాలను**
**కార్పొరేట్ స్వామ్యంగా మార్చాలని**
**రుణదాతషరతులు !**

**అంగఅంగాలుగా**
**ప్రభుత్వరంగాలఅమ్మకాలే**
**దానికి గురుతులు !'**

లాంటి కుప్తమైన కవితల్లో కరతలామలకంగావివరించాడు

**'ప్రపంచీకరణ**
**ప్రపంచానికే**
**సవాలు !**

**కాలుపెట్టిన**
**దేశాలన్నీ**
**శవాలు !'**

(గ్లోబలి) కూడా ఆ కోవలోనిదే.

చంద్రబాబు-వైయస్‌లపాలనలో తేడాలులేవని

**'జన్మభూమి**
**అంకెల**
**గారడి**

**ప్రజాపథం**
**దానికి**
**పేరడి'**

(తంత్రం)అంటూ విశదీకరించాడు. సింగంపల్లి మిగిలిన తొమ్మిది కవితా సంపుటాలతో పోలిస్తే 'గ్లోబలి' రచన నాటికి వస్తువు లోనూ, శిల్పం లోనూ చాలా పరిణితి కన్పిస్తుంది.

**'బడులలో**
**రాళ్లతో**
**ఆడుకునేది**
**'కేజీ'ల బాల్యం**

**గుడులలో**
**ఆ రాళ్లనే వేడుకొనేది**
**'పీజీ'ల ప్రాయం'**

('ఆధ్యాత్మిక ర'హ'స్యాలు')

**శివుడాజ్ఞలేంది చీమైనా**
**పుట్టరాందీ, గిట్టరాందీ,**
**ఎవరినీ కుట్టరాందీ ఐనప్పుడు-**

**ఈ లూపులూ-నిరోధులూ**
**విరోధించడమేంది?**
**శివుడాజ్ఞను నిరోధించడమేంది? '**

ఇలాంటి అనేక పదచిత్రాలు ఆ పరిణితికి పడుతున్న అద్దం. అశోక్‌కుమార్ రచనల గూర్చి శ్రీశ్రీ, కొడవటిగంటి కుటుంబరావు, త్రిపురనేని మధు సూదన రావు, జ్వాలాముఖి, డా॥మిత్రా, పెద్దిభొట్ల సుబ్బరామయ్య, సి.వి., కె.శివారెడ్డి, నిఖిలేశ్వర్, జి.సుబ్బారావు చిన్నచిన్న ప్రశంసలు చేశారు. సగంపైగా పుస్తకాలకు అద్దేపల్లి రామ మోహనరావు ముందుమాటలు రాశారు అశోక్‌కుమార్ గారికి అద్దేపల్లిగారిపట్ల గౌరవభావానికి అదిగుర్తు ఆ రోజుల్లో గోదావరి జిల్లాకు చెందిన సాహితీ ప్రియులుగా గురుభావం ప్రకటించటం సహజం. కాని 17పేజీల కవితకు 24పేజీల ముందు మాట రాయటంద్వారా అద్దేపల్లిచేసినపని అసహజం.

సింగంపల్లి ఇన్ని పుస్తకాలు రాశాడని తనకి సన్నిహితులైన మిత్రులకే చాలామందికి తెలియదు. అలాంటిది ఈ తరం పాటకులకు తెలుస్తుందని ఆశించలేం. ఈ మొత్తం పదిపుస్తకాల్ని ఒకే సంపు టంగా తెచ్చి సాహిత్య నిధి వంద పుస్తకాల్లో శ్రీశ్రీకి సంబంధం లేని ఏకైక పుస్తకంగా ప్రచురించటం సముచితం. మంచి కవిత్వంతోపాటు శ్రీశ్రీ సాహిత్యనిధి సభ్యులకు రాయితీకూడా లభిస్తుంది కదా ! ఆలోచించమని అశోక్ కుమార్‌కి మనవి. ■

## దినచర్య

విశ్రమించే వాడికి / రాత్రీ / పగలూ
పరిశ్రమించే వాడికి / రాత్రీ / పగలే !





# హేతువాద కవితా కాంతి పుంజం

డి.హనుమంతరావు

**" సిందూరం, రక్తచందనం, బంధూకం, సంధ్యారాగం,**
**పులి చంపిన లేడినెత్తురు, ఎగరేసిన ఎర్రని జెండా,"**
**అశోక్‌కుమార్ ఎజెండా!**

ఈ మధ్య మానవ వికాస వేదిక ప్రధాన కార్యదర్శి బి.సాంబశివరావుగారితో మాట్లాడుతూ 'కేవలం వ్యాసాలు, వ్యాసరూప పుస్తకాలు మాత్రమే హేతువాదంపై వస్తున్నాయి. ఇతర సాహిత్య రూపాలలో బలంగా వున్న కవిత, పాటలు కనిపించడం లేదు' అన్నా వెంటనే ఆయన నా చేతిలో మూడు కొత్త పుస్తకాలు పెట్టారు. ఎవరివబ్బా అనుకుంటూ చూసా. అవి అశోక్‌కుమార్ కలం నుంచి జాలువారిన మేలిమి ముత్యాలు. మూడున్నర దశబ్దాలుగా మతమౌఢ్యాన్ని తన హేతువాద కలంతో చీల్చి చెండాడి ఎందరినో చైతన్యపరుస్తున్న అశోక్‌కుమార్ గురించి తెలియని వారు వుండరు. 'మానవవికాసం' మాసపత్రికలో 'జ్ఞాన గుళికలు' పేరుతో సీరియల్‌గా వచ్చిన మినీ కవితలు డైనమైట్ల వలె పేలి పాఠకుల గుండెల్లో శాశ్వత స్థానం పొందిన విషయం అందరికీ తెలుసు. శ్రీశ్రీ ప్రేరణ, ప్రోత్సాహంతో మొదలైన వారి కవితా ప్రస్థానం 'తల్లీ! ఎవరు నువ్వు? (1973)తో మొదలయి నేటికీ నిరంతరంగా కొనసాగుతూనే ఉన్నది. ■

## తంత్రం

మా 'అభివృద్ధి' అంతా / అప్పు చేసిన / పప్పుకూడే !
పప్పంతా ప్రభువులకు / అప్పు మాత్రం / తరతరాల ప్రజలకు !





# అధిక్షేప కవితలు

నగ్నముని

**అశోక్ కుమార్ 'తంత్రం' నేటి రాచకీయ కుతంత్రాలపై మందుపాతరల కవితల గ్రంథం. ప్రజాస్వామ్య రాజకీయ తాత్విక కవిగా నాకీ కవితల పుస్తకం మరపురాని ఓ విస్మయం. తంత్రం లోని కవితాంశాలు మనం పత్రికల్లో తరుచు చూస్తున్నవే. చర్చోపచర్చల్లో విశ్లేషకుల ద్వారా వింటున్నవే. ఐతే అవే విషయాలు నిబద్ధతా సంపన్నుడైన కవినుండి వస్తున్నప్పుడు మరింత పదునుగా, ఆలోచనాత్మకంగా మారిపోతాయి. నూత్న కోణాలు ఆవిష్కరిస్తాయి.**

నేటి కవితా ముఖ్య లక్షణం ఆలోచన రేకెత్తించడం. దీర్ఘ కవిత అయినా లఘు కవిత అయినా అధిక్షేపణ ఒక ఆయుధం. అంకుశం మినీ కవితాయుధం. మావటి లక్ష్యరహితుడయినప్పుడు కవితా మదగజం అతన్ని కింద పడేసి తొక్కేస్తుంది. దూరంగా విసిరేస్తుంది. ఇది అన్ని సృజనాత్మక కళా రంగాలకు వర్తిస్తుంది. ఈ కవి లక్ష్య నిబద్ధుడు. అలవోకగా తాను చెప్పదలచుకున్నది సూటిగా బలంగా చెప్పగలిగినవాడు. తంత్రం-ఇందుకు ఉదాహరణ. ఇందులోని యాభయ్యొక్క సూక్ష్మ కవితల్లోంచి ఏ ఒక్కటి ఉటంకంచి ఊరుకున్నా, తక్కినవాటి ప్రాముఖ్యత తగ్గించినట్లవుతుంది. అందుకని అన్నింటినీ చదవడం, లోతుగా ఆలోచించడం అవసరం. ఎందుకంటే చూడటానికి కాసిని పదాలుగల మినీ కవితగా కనబడినా ప్రతిదాని వెనుక అంతులేని సామాజిక రాజకీయ అవగాహన ఉంది. ఈ కవి తిరుగులేని ఆధునిక కవి. వర్తమానం నడక నాడి పట్టుకున్న కవి. సాహిత్య ప్రసక్తిలో ఆధునికత అంటే ఏమిటి? అది కాలవాచికమా; రూప సంబంధితమా; అనేది తరుచు చర్చింపబడుతూ ఉంటుంది. నా దృష్టిలో ఉద్యమ స్ఫూర్తితో యింతవరకు వచ్చిన అన్ని అంశాలనూ కలుపుకుంటూ వర్తమాన విషయాన్ని, అదే వస్తువును, అగ్రభాగాన నిలిపినప్పుడు అది ఆధునికం అవుతుంది.

ఇంత వరకూ కొందరు శుద్ధఅనుభూతిని పునాదిగా స్వీకరించి రాశారు. మరి కొందరు అనుభవానికి ప్రాముఖ్యతను ఇచ్చారు. చాలా మంది సమాజంలోని అన్ని విభాగాలనూ వస్తువుగా తీసుకొని రాశారు.రాస్తున్నారు. అయితే రాజకీయాన్ని కేంద్రబిందువుగా స్వీకరించి రచన చేస్తున్నవారు తక్కువ. నేను నినాదాల గురించి మాట్లాడడంలేదు. పాటల గురించి మాట్లాడడంలేదు. ఆధునిక కవితాంశాల గురించి మాట్లాడుతున్నాను. ఇంత వరకు వచ్చినది ఏదో ఒక సామాజిక విభాగంలోకే వస్తుంది.తంత్రం సరాసరి రాజకీయ క్షేత్రంలోకి ప్రవేశిస్తున్నది.

రాజకీయ శక్తి సమాజాన్ని నియంత్రించే అత్యున్నత శక్తి. ఆ శక్తి ఏ విధంగా ప్రవర్తిస్తున్నదో,ఏమార్గంలో ప్రయాణిస్తున్నదో స్పందించవలసిన బాధ్యత కవిమీద ఉంటుంది. ఆ బాధ్యత స్వీకరించినవాడే ఆధునిక కవి.ఆ దృష్ట్యా యీకవి నిఖార్సయిన ఆధునికుడు.

మినీ, లఘు, హ్రస్వ, సూక్ష్మ మొదలైన పేర్లతో ప్రసిద్ధమైన యీ అభివ్యక్తి రూపం అణువుతో సమానమైనది. అక్షరం పదునైన పదమై, పదం భావ గంభీరమై మస్తిష్కంలో విస్ఫోటనం చేస్తుంది యీ పరమాణు కవిత. మన కళ్లముందు జరిగే దుర్మార్గాల్ని అధిక్షేపిస్తుంది. విశ్లేషిస్తుంది. వ్యాఖ్యానిస్తుంది. ఒకే వైపు ఆలోచనకు అలవాటుపడిన చూపుకు మరో వైపు దాగివున్న వికృతాలోచన చూపిస్తుంది. జీవితం అంధకారంతో నిండిన సమయాన చిన్నదీపం వెలిగిస్తుంది. దారీతెన్నూ తెలీక సాగరాన కళవళపడే ఓడకు దిక్సూచిగా పనిచేస్తుంది. మినీ కవిత బహు శక్తివంతమైనది. చిన్ని నోటిలో విశ్వదర్శనం చేయిస్తుంది. ఈ కవి అటువంటి అణు కవితపై అధికారం సంపాదించినవాడు.

**తంత్రం కవిత్వం అశోక్ కుమార సంభవం.** ■

## అమెరికీయం

పెట్టినంత కాలం / గుడ్డు / స్వాహా !
పెట్టకుంటే / కోడి / స్వాహా !





# 'నారికేళ సలిలం' అశోక్‌కుమార్

దివికుమార్

తనను తాను అర్థం చేసుకుని ప్రవర్తించేవాడు ధన్యుడు అని ఎక్కడో చదివినట్టు గుర్తు. అటువంటి వ్యక్తి ఒక పథకం ప్రకారం ఏకాగ్రతతో, క్రమశిక్షణగా పనిచేయటానికి సంకల్పిస్తే ఖచ్చితంగా తాను నిర్దేశించుకున్న లక్ష్యాన్ని చేరుకోగలడు. నేనెరిగిన వారిలో అలాంటి అరుదైన వ్యక్తిత్వంగలవాడు సింగంపల్లి అశోక్‌కుమార్.

మా యిద్దరికీ ముఖాముఖి కలవకముందే పరోక్ష పరిచయంవుంది. అది కాకినాడ ద్వారా. అద్దేపల్లి రామమోహనరావు వల్ల. నేను కాకినాడకు నా బతుకు తెరువులో భాగంగా రెండవసారి వెళ్లినపుడు పూర్తిగా ఒక సంవత్సర కాలం (1970 మార్చి నుంచి 1971 మార్చి వరకు) వున్నాను. ఖమ్మంలో జరిగిన మొదటి విరసం మహాసభకు అక్కడి నుండే వెళ్లాను. నేను కాకినాడ నుండి దివిసీమ (అవనిగడ్డ)కు చేరిన కొద్దినాళ్లలో బందరు నుండి అద్దేపల్లి కాకినాడకు వెళ్లారు. ఈయన ద్వారా కలిగినదే అశోక్‌కుమార్ పరోక్ష, ప్రత్యక్ష పరిచయం.

1971లోనే అనుకుంటాను.'తల్లీ! ఎవరు నువ్వు?'అని జిల్లెళ్లమూడి అమ్మ ల్లాంటి వారిమీద రాసిన ఒక హేతువాదకావ్యం పదికాపీలు అవనిగడ్డ వచ్చాయి. డెబ్బైఐదు పైసలు దాని ఖరీదు. రచయిత అశోక్‌కుమార్. అలా అశోక్‌కుమార్ పరిచయం అయ్యాడు.

తర్వాత గుంటూరులో 1972లో జరిగిన 3వ విరసం మహాసభకు అద్దేపల్లితోపాటు అశోక్‌కూడా వచ్చాడట కానీ చూసిన జ్ఞాపకం లేదు. తిరిగి బెజవాడలో 2003లో ఓ సభలో పరిచయమైన వెంటనే నేను అడిగిన మొదటి ప్రశ్న 'తల్లీ! ఎవరు నువ్వు?' అశోక్‌కుమార్ మీరేనా? అని.

నాకంటే ఒక సంవత్సరమే చిన్నవాడైనా పదేళ్లు చిన్నవాడిలా కనిపిస్తాడు అశోక్ కుమార్. టక్కు చేసిన ప్యాంటు, పొడుగు చేతులచొక్కా, కాలికి తప్పనిసరిగా బూటు (ఇప్పుడు బెల్టు షూస్ వాడుతున్నాడు) ఒక విలక్షణమైన మందగమనపు నడక, అలసట తెలియనివ్వని మొహం. నల్లరంగులీనేజుట్టు, శారీరక మార్పులు బయటపడనీకుండా ఎప్పుడూ నీటుగా కనిపించగలగటంవల్ల తన వయసుకంటె చిన్నవాడిలా కనిపిస్తాడనుకుంటాను. నా దృష్టిలో ఒకప్పుడు 'తల్లీ! ఎవరు నువ్వు?' అశోక్‌కుమార్‌గా ఉండినవాడు యిప్పుడు 'శ్రీశ్రీ సాహిత్యనిధి' అశోక్‌కుమార్‌గా అందరి ముందు నిలబడ్డాడు.

నాకు అశోక్‌కుమార్ పరిచయమైన దగ్గర నుంచి, కలిసిన ప్రతిసారీ, బెజవాడలో వామపక్ష దృక్పథంగల సాహిత్యసంస్థలు రెగ్యులర్‌గా సభలు నిర్వహించే స్థితిలేకపోవడం పట్ల తీవ్ర అసంతృప్తిని వ్యక్తపరిచేవాడు. ఎవరెవరో, ఏవేవో మాట్లాడేసే సభల్లో చిన్నగా తల దూర్చి పైపై అభిప్రాయాలను ప్రకటించే స్థితిపోయి, వామపక్ష దృక్పథంతో మాట్లాడేవారి వేదికవుండాలని గట్టిగా పట్టు బట్టినవాడు అశోక్‌కుమార్. కనీస పాటి నిర్మాణశక్తులు, ఆధారపడదగిన వ్యక్తులు

## అక్షర హాలికులు

అశోక్‌కుమార్



## సుంకర సత్యనారాయణ

**(1909 - 1975)**



### 'వీర కుంకుమ'

మాభూమి గెరిల్లా సుంకర
సమరపథ నిర్మాణ కంకర
కళవాలాలను ఝుళిపించిన
సిరిజన అరివీర భయంకర

లేకుండా సంస్థలను ఏర్పాటుచేయటం, తొలి ఉత్సాహంతో నాలుగు సభలు నిర్వహించటం, సహకరించేవారు లేరనే వాస్తవం గ్రహింపులోకి వచ్చిన తర్వాత చాలించుకోవటం చాలామంది అనుభవంలో ఉన్నదే. ఎన్నో పత్రికల, సంస్థల పరిశీలనతో ఎక్కువ తొందరపడవద్దని చెప్పే వాడిని. రవిబాబుగారు బెజవాడకు మకాం మార్చిన తర్వాత అరసం, విరసం, జనసాహితి, సాహితీ స్రవంతి తదితరులందరినీ కలుపుకుని ఒక పరిమిత లక్ష్యంతో స్థానికంగా సాహిత్య కార్యక్రమాలు నిర్వహించే సంస్థనొకదానిని ఏర్పరచాలనే మా అభిప్రాయానికి ఒక క్రమంలో ఆచరణ రూపం వచ్చింది.(సరిగ్గా యిలాంటి సంస్థనొకదాన్ని బెజవాడ - గుంటూరు- తెనాలి స్థాయిలో ఏర్పాటుకై చేసిన ఒక విఫల ప్రయత్నం సంగతి అశోక్‌కు తెలియదు). దాని ఏర్పాటు వెనకా, సంస్థకు పేరు పెట్టడంలోనూ చొరవ, ఒత్తిడి అశోక్ కుమార్‌దే. 'ప్రజాసాహితివేదిక' అనగానే అది జనసాహితి వారిదనే ఎవరైనా అనుకుంటారుగదా! అంటే-అనుకున్నా పరవాలేదు. దానికి భారం మోయటంలో, బాధ్యత వహించటంలో మీరే ముఖ్యులు కనుక ఖచ్చితంగా ప్రతినెలా వచ్చే మీ పత్రిక కృషిలో విశాల దృష్టికోణం ఒక భాగం కనుక ప్రజాసాహితి వేదిక అనే పేరిడాలని పట్టుబట్టినవాడు అశోక్‌కుమార్. ప్రగతిశీలసాహితీదృక్పథం గల వారందరికీ వేదికలో (సభ్యత్వం) చోటు కల్పిస్తూ సంస్థను నడుపుకు వెళ్లాలనేది నిర్ణయం. యువకులకు బాధ్యత నప్పగిస్తే చురుకుగా ఉండగల్గుతారనీ, సంస్థల నిర్వహణానుభవాన్ని పొందుతారనీ మొదట అమ్ముల నాగరాజునీ,అతని ఆకస్మికమరణంతర్వాత అరసవిల్లి కృష్ణనూ, తర్వాత ఆంజనేయకుమార్‌నూ నిర్వాహకులుగా ఎంపిక చేశాము. ప్రతినెలా 3వ ఆదివారం తప్పనిసరిగా సాహిత్య కార్యక్రమాన్ని నిర్వహిస్తున్నాము. నేటికి సంస్థఏర్పరచి సరిగ్గా 4 సంవత్సరాలయింది. ఈ నవంబర్ 2010 నాటికి 50వ సభ జరుగుతుంది. పదముగ్గురు సభ్యులుగల వేదికలో రెగ్యులర్‌గా రాస్తున్నవాళ్లం ఎనిమిది మందిమి వున్నాం. అప్పుడప్పుడు రాసేవారు ముగ్గురు. రాయని భాస్కరులిద్దరు వున్నారు. ప్రతినెలా ఆఖరి ఆదివారం వేదిక సభ్యులం సమావేశమై చర్చించుకోవటంలో సమకాలీన సాహిత్య ధోరణులు, ఆలోచనలు, వాదవివాదాలను కూడా తప్పకుండా ఎజెండా గావించడంలో అశోక్‌కుమార్ పాత్ర గణనీయమైనది.

శ్రీశ్రీ శతజయంతికి మూడు సంవత్సరాలు ముందే తెలుగు సాహితీలోకాన్ని, శ్రీశ్రీ అభిమానుల్ని, వామపక్ష భావజాల శ్రేణుల్ని శ్రీశ్రీ సాహిత్యావరణంలో నిలపటానికి ఆరంభమై, దీర్ఘకాలిక కృషిగా విస్తరించుకోవటానికి మూలకారకుడు అశోక్ కుమారే!! 'చినుకు' పత్రిక ప్రారంభం నుండి అందులో అశోక్‌కుమార్ నిర్వహించిన 'శ్రీశ్రీ క్విజ్' అనే అణువు 'శ్రీశ్రీసాహిత్యనిధి'గా బ్రహ్మాండంగా విస్తరించుకోవటానికి కారణమైంది. తెనాలి చిట్టి ఆంజనేయుడు హైదరాబాద్ రహదారిలో పరిటాల ఆంజనేయుడయి పోయినట్టు 'శ్రీశ్రీక్విజ్' నిర్వహించే అశోక్ కుమార్, 'శ్రీశ్రీ సాహిత్యనిధి' అశోక్‌కుమార్‌లా పెరిగి పోయాడు.

మూడునెలలకో 'శ్రీశ్రీ బులెటిన్' వెలువరిస్తూ దానికెక్కడో ఒక్క చోటైనా ఆవిష్కరణ జరుపుతూ ఇప్పటికి 15 బులెటిన్లు వెలువరించాడు.

శ్రీశ్రీ గురించి మరణించిన ప్రముఖులు (సంస్మరణ) చెప్పిన విషయాలతో పుస్తక ప్రచురణ ఆరంభమైంది. శ్రీశ్రీ శతజయంతి ఏప్రిల్-2010 నాటికి 12 బులెటిన్లు, 20 దాకా శ్రీశ్రీ గురించి యితరులు (ఉదా: కొ.కు, రావిశాస్త్రి) చెప్పినవీ, శ్రీశ్రీ ఇతరుల గురించి చెప్పినవీ (ఉదా: గిడుగు రామమూర్తి, కొంపెల్ల జనార్దనరావు)లాంటివి వెలువరించ గలిగారు. శ్రీశ్రీ షష్టిపూర్తినాటి (1970) ప్రత్యేక సంచికను గుర్తుకుతెచ్చే విధంగా 'శ్రీశ్రీ-100' ( మహాకవి శ్రీశ్రీ శతజయంతి విశేష సంచిక)ను వందమంది బతికున్న రచయితల రచనలతో, బహుముఖ కోణాలనుండి శ్రీశ్రీని అర్థంచేసుకునే విధంగా వెలువరించారు. అందుకు దాదాపు రెండున్నరసంవత్సరాల ముందునుండే రచనలను సేకరించే పని పెట్టుకున్నారు.

శ్రీశ్రీ శతజయంతి భావనని మూడేండ్ల ముందు నుండే తెలుగు పాఠకుల దృష్టిపథంలోకి తీసుకు రావాలనే తన ఆకాంక్షను వామపక్ష సాహితీ సంస్థలు (అరసం, విరసం, జనసాహితి, సాహితీ స్రవంతి) తదితర శ్రీశ్రీపట్ల ప్రగాఢ అభిమానులుగా ఉండే వారితో కూడిన ఉమ్మడివేదిక ఆధ్వర్యాన ఈ మొత్తం కార్యక్రమం నిర్వహించాలని అశోక్‌కుమార్ కుండిన తొలినాటిఆలోచన. 'శ్రీశ్రీ సాహిత్యనిధి' నిర్వహణకు 'ఉమ్మడివేదిక' ఆలోచన కంటే ఏ మేరకు ఈ వామ పక్ష తదితర సంఘాలు వ్యక్తులు సహకారం అందిస్తే ఆ మేరకు స్వీకరిస్తూ కొనసాగించడం సరైందనిపించి అ విషయమే చెప్పి మావరకు జనసాహితి సంస్థనుండి సాధ్యమైనంత సహకారం అందిస్తామని హామీ ఇచ్చాము.

అప్పటికే ప్రజాసాహితి వేదికను అందరం కలిసి ఏర్పాటు చేసి వున్నాము. కనుక దాని ద్వారా కూడా శ్రీశ్రీ సాహిత్యనిధి కార్యక్రమాన్ని ముందుకు తీసుకు వెళదామని ప్రోత్సహించాం.

శ్రీశ్రీపై తొలి బులెటిన్ (ఏప్రిల్-2007)న వెలువడింది. శ్రీశ్రీ 24వ వర్ధంతి(జూన్-2007) నుండి ప్రజాసాహితిలో ప్రతినెలా శ్రీశ్రీపై రచనలు

శతజయంతి వరకు 3 ఏళ్లు ప్రతినెలా వెలువరించాం. 'శ్రామిక విప్లవ సాహిత్యానికి 70 ఏళ్లు' అనే సంపాదకీయం దానికి ఒక ప్రారంభం.

శ్రీశ్రీ సాహిత్యనిధి తొలి ప్రచురణగా వెలువడిన 'సంస్మరణ'లో మరణించిన 25 మంది ప్రముఖులు శ్రీశ్రీపై చెప్పిన విషయాలుండగా శ్రీశ్రీ గురించి అరసం,విరసం,జనసాహితి,సాహితీ స్రవంతి సంస్థల బాధ్యుల ఆలోచనను అవగాహననూ తెలియపర్చే అభిప్రాయాలు కూడా ప్రచురించారు.

నేనూ, రవిబాబుగారూ అశోక్‌కుమార్‌కు భౌతికంగా అందుబాటులో వుండే అవకాశం ఎక్కువ కనుక మాప్రత్యక్ష తోడ్పాటు సహకారం అందించటానికీ, పుచ్చుకోవటానికీ వెసులుబాటు దొరికింది.

70 ఏళ్ల సోవియట్ యూనియన్,15 రాజ్యాలై పోయిన తర్వాత, సామ్రాజ్యవాద ప్రపంచీకరణపు సాంస్కృతికదాడి తీవ్రతరమైన తర్వాత, వామపక్ష దృక్పథంగల వారు ఉమ్మడికృషిని సాగించే వాతావరణం పెంపొందాలని బలంగా ఆశించిన వారిలో అశోక్ ఒకరు. వినిర్మాణ పోస్ట్ మోడ్రన్ సిద్ధాంతం రచయితలలో తమ గుర్తింపు, తమ రచననే సర్వస్వంగా భావించే ధోరణిని పెంచిన తర్వాత కూడా సాహిత్యోద్యమసంస్థలు లేకుండా ప్రజా ఉద్యమం బలోపేతం కాదుఅని గాఢంగా నమ్ముతూ వస్తున్నవాడు అశోక్ కుమార్. 'ఉద్యమ, నిర్మాణ' దృష్టి లేకపోవటమంటే విప్లవ దృష్టిలేని దానితో సమానమేనని భావించే వాడు అశోక్‌కుమార్.

రాష్ట్రస్థాయిలో ఉమ్మడిసాంస్కృతిక వేదికలు ఏర్పడ్డాయి. కానీ రెండుసార్లు పుబ్బలోనే మాడిపోయాయి. తెనాలి-గుంటూరు-బెజవాడల్లో ఉమ్మడి సాహిత్య వేదిక ప్రయత్నానికి పురిటిలోనే సంధి కొట్టింది. బీజరూపంలోనే అయినా విజయవాడలో సాగుతున్న కృషిలో కొన్ని విశిష్ట అనుభవాలున్నాయి. వాటిని అందించిన వారిలో అశోక్ కుమార్ ఉన్నాడు.

కొన్ని ఆలోచనలను ఆచరణలను మనం తాత్విక స్థాయిలో చర్చించుకుంటేఅవగాహన పెంచుకోవటానికి మనల్నిమనం పరిశీలించు కోవటానికి తోడ్పడుతుంది.

సాహిత్యానికి రాజకీయం ప్రధానం కాకూడదన్నాడు శ్రీశ్రీ. జీవితం కేంద్రం కావాలని కొ.కు. చెప్పాడు. 'శ్రీశ్రీ సాహిత్య నిధి'కి కీలకం ఏది? శ్రీశ్రీయే గదా! శ్రీశ్రీ రాసినివీ, శ్రీశ్రీ గురించి రాసినవీ!! ఇక్కడ గుర్తింపులోకి రావాల్సింది, వచ్చేది శ్రీశ్రీయే! దీన్ని అశోక్ ఉద్యమ లక్ష్యం అనుకుందాం. మరి ఇంత కృషిచేస్తున్న అశోక్‌కుమార్ సంగతి ఏమిటి? 'సలలిత ముగ నారికేళ సలిలము భంగిన్' అంటే కొబ్బరికాయలోకి నీరు చేరునట్లు అశోక్ కుమార్‌కు కూడా గుర్తింపు వుంటుంది, వస్తుంది. ఎప్పుడైతే అతనికృషి శ్రీశ్రీ ఉద్యమకేంద్రం కాకుండా, అశోక్ కుమార్ కేంద్రంగా మారిపోయి,తన గుర్తింపే లక్ష్యమై పోతుందో 'కరి మింగిన వెలగపండు'లా గుర్తింపు ఆర్చుకు పోతుంది. మనందరికీ తెలుసు, శ్రీశ్రీ అంటే వ్యక్తికాదు. రెండక్షరాలైన ప్రపంచ శ్రామిక ప్రజల కత్తీ, సుత్తీ. శ్రీశ్రీ అంటే ప్రశ్నలైకురిసేవాడు, జవాబులై మెరిసినవాడు. శ్రీశ్రీకంటే శ్రీశ్రీ ఆశయం ఉన్నతమైనదని శ్రీశ్రీయే స్వయంగా చెప్పుకున్నాడు. ఇక శ్రీశ్రీ సాహిత్యనిధి అంటే శ్రీశ్రీ లాంటి ప్రజోపయోగ మేలిమి విత్తనాలను భద్రపరచటమని. తమ పెరటిలో పొలాల్లో ఫ్యాక్టరీల్లో నాటుకోవటానికి పదునుపెట్టుకోవడానికి అందరికీ అందుబాటులో వుంచడమని! వెరసి శ్రీశ్రీ ఆశయాన్ని ప్రజల నుండి ప్రజలకు అందించటమని!!

ఈ రోజున తెలుగునాట వేయిన్నొక్క 'సాహితీ' సంస్థలకు, సమాజమూ-ప్రజలూ వారి జీవన సంఘర్షణా కేంద్రంకాదు. సంస్థల నిర్వాహకుల గుర్తింపులూ, సత్కారాలు, చక్రాంకితాలు, ఎవార్డులూ (కొండకచో లాభాలు) కేంద్రంగా, సాహిత్యం అందుకు దోహదపడే వాహకంగా ఇవి నడుస్తున్నాయి. (వ్యాపార పత్రికల రాజకీయార్థికాల గురించి నేనిక్కడ మాట్లాడడం లేదు). చాలామంది రచయితల పరిస్థితి కూడా యింతే. ప్రపంచీకరణమొచ్చి ఈ వైయక్తిక ధోరణికి 'బూమ్' నిచ్చింది. శ్రీశ్రీ సాహిత్యనిధి కృషి వీటికి భిన్నమైనది కనుక దీని గుర్తింపునకు భవిష్యత్ కూడా వుంది. పూలదండలో దారం వున్నట్లు అశోక్ కుమార్ గుప్తనిధి (నిర్మాణం) లాగా వుంటాడు. అతను తన పరి మితులపట్ల తన లక్ష్యంపట్ల స్పష్టత గలవాడు. ఆవేశపరుడేగాని ఆలోచన అదుపులో దాన్ని దాచుకో గలిగినవాడు. శ్రీశ్రీకి నిబద్ధ అభిమానే కాని బద్ధకస్తుడూ, భక్తుడూ కానివాడు. తాను సాగించే వ్యక్తిగత కృషితోపాటు విశాల ఉద్యమ నిర్మాణాత్మక కృషి, ఉద్యమసంస్థల కృషి బలంగా విస్తరించాలని మనఃస్ఫూర్తిగా కోరుకునే తత్వంగలవాడు.

అశోక్ కుమార్‌కు కాలూ, చెయ్యీ, మెదడూ పని చేసినంతకాలం ఆయన కృషి తన లక్ష్యసాధనా నిబద్ధతతో సాగుతుందనే విశ్వాసం నాకుంది. 'అందుకు దోహదపడే' సహకారాన్ని మన మందరం అందిద్దాం.

శ్రీశ్రీని మరింత లోతుగా అర్థం చేసుకోవటానికి తోడ్పడుతున్న నిధి, అశోక్‌కుమార్. అతని కృషి నిరంతరా యంగా సృజనాత్మకంగా కొనసాగాలని.. హృదయ పూర్వకంగా కోరుకుంటూ...

అశోక్‌కుమార్ వరవడి పద్యంతో ముగిస్తాను.

**బుల్లెట్ గర్జన**

**అశ్రువు దాచిన అశోకుడు**
**అస్రనివేదన శోధకుడు**
**మువ్వల సిరిసిరి సవ్వడి కూర్పుల**
**శ్రీశ్రీ ఢమరుక తాంత్రికుడు.** ■



## సి.వి

## (1930)

కందుకూరి, గురజాడ,
త్రిపురనేని రామస్వామివంటి మానవతా
వాదులు వ్యాప్తిలోనికి తెచ్చిన
హేతుబద్ధమైన చింతన
సర్వనాశనమై పోయిందా అన్నంత
వైజ్ఞానికాంధకారం దేశాన్ని చుట్టిన
ఈ దశలో మిత్రుడు అశోక్‌కుమార్
" శ్రీ బాబా మహత్యం "
అనే వచన కవితాకావ్యాన్ని
వెలువరించడం ఆనందదాయకం.
ఈ వైజ్ఞానికాంధకారాన్ని చీల్చివేసే
సాంస్కృతిక విప్లవం నేడెంతో అవసరం.
ఈ మహోద్యమానికి పునాది మానవత్వం.
గీటురాయి హేతువాదం.
భవిష్యత్తు మనపై ఉంచిన
ఈ కర్తవ్యాన్ని నిర్వర్తించేందుకు
నేటి యువతరం కదలాలి.
వినూత్న సాంస్కృతిక విప్లవకాంతుల్ని
వాడవాడలా వెద జల్లాలి.
ఇందుకు ఈ కావ్యం
ఉపకరిస్తుందని నా గాఢమైన విశ్వాసం.

( జనవరి - 1974 )

## ఎన్నిక

ఎన్నికల బరిలో పులీ / తోడేలూ / డేగా, రాబందూ -
మనకున్న ఛాయిస్ / ఎవరికాహారం కావడమో / తేల్చుకోవడం !





# అరవైఏళ్ల అశోక్‌తో... నలభైఏళ్ల నా అనుభవాలు

జి.సుబ్బారావు

తెలుగుగడ్డ నడిబొడ్డు విజయవాడ మారుతీనగర్‌లోకి వెళ్లి, వీరయ్యవీధిలోకి తిరిగి, ఆ చివర్లో వున్న 'ప్రగతి' మెట్లపై నుంచి పైకెళ్లి, 305 నంబర్ ఫ్లాట్ గుమ్మం ముందాగి, బెల్ కొడితే.. తలుపు తెరుచుకోగానే, ఎదురుగా 'మహాకవి శ్రీశ్రీ వీరావేశంతో పుస్తకం తెరచి, కవిత చదువుతున్న చిత్రం' మనకు కనువిందు చేస్తుంది. ఆ చిత్రాన్ని అలా చూస్తూ, చిత్తరువై నిలబడిపోతాం. మనల్ని స్పృహలోకి తెస్తూ ఒక అప్యాయతాగాత్రం చిరునవ్వుతో మనల్ని లోనికి ఆహ్వానిస్తుంది.....

ఆమె 'కుమారి'.

ఆ ఫ్లాట్, ఏ పనికైనా నేను 'శ్రీ' కారం చుట్టను. 'శ్రీశ్రీ'కారం చుడతానని చెప్పే అశోక్‌కుమార్‌ది '

కుమారి' అశోక్ శ్రీమతి.

అతిథుల గదిలోకి మనం అడుగుపెట్టగానే టేబుల్ మీద ఒక కంప్యూటర్, గదిలో చుట్టూ ఒద్దికగా సర్దివున్న పుస్తకాల అరలు. 'ఆ గది ఒక శ్రీశ్రీ నిలయం..శ్రీశ్రీ లోకం..శ్రీశ్రీ సర్వస్వం..శ్రీశ్రీనిధి'.

పెద్దింటి అశోక్‌కుమార్, కె.పి అశోక్‌కుమార్‌ల వంటి ఎందరో అశోక్‌కుమార్‌ల మధ్య నేను 'ఒట్టి'అశోక్‌కుమార్‌నని అశోక్‌కుమార్ చెప్పుకుంటాడుకాని, నిజానికి అతడు 'ఒట్టి'వాడు కాదు. చాలా గట్టివాడు. మంచి కావ్యకర్త. అంతకుమించిన సాహితీ కార్యకర్త. విలక్షణ 'ఆలోచన' పరుడు. ప్రతి అక్షరాన్ని ఒక్కొక్క శిల్పంలా చెక్కగల సృజనకారుడు. తనదైనశైలి, ఒరవడి, వ్యక్తిత్వం, అక్షరక్షరాన, చేపట్టిన ప్రతి కార్యక్రమ రూపకల్పనలోనూ సువ్యక్తం చేయగలదిట్ట. నిజాన్ని నిక్కచ్చిగా చెప్పాలంటే, అతడొక 'సింగంపల్లి' ఎందుకంటే

అతడు 'సింగంపల్లి' అశోక్‌కుమార్.

అశోక్ అధిరోహించిన 'ప్రగతి' మెట్ల వెనుక ఎంతో పెనుగులాట, పోరాటాలబాట వున్నది. అతడు ఇంటా..బయటా ఎన్నో యుద్ధాలు చేశాడు. పొట్టచేత బట్టుకుని కాకినాడ నుండి విజయవాడ ప్రవాసిగా రావడానికి అతని రాజీలేనితనం ప్రధాన కారణం. కాకినాడలో అద్దేపల్లి, నేను, నందనోదయ, ఆర్టిస్ట్ ఈశ్వర్, రారాసి, తిరుపతిరావు, ఇప్పుడు లోకంలోలేని విక్రాంత్ కలిసి నడిచిన అక్షరాలా నలభై సంవత్సరాల అడుగుజాడల్ని, అనుబంధాన్ని నెమరువేసుకుంటే అశోక్ కాకినాడ వదలి రావడానికి కారణం ఒక రకంగా కనిపించదు. మరొక విధంగా అంటే అశోక్ మెదడుతో ఆలోచిస్తే సరియైన నిర్ణయంగానే కనిపిస్తుంది.

అతణ్ని ముందుగా 'శ్రీశ్రీ ఆవహించాడో లేక హేతువాదం ఆక్రమించిందో' సరిగ్గా చెప్పలేను. కానీ అతని ప్రతి అక్షరం వెనుక శ్రీశ్రీ ఆవేశం వున్నది. ప్రతి కవిత్వంలోనూ హేతువాదం దర్శనమిస్తుంది. మొదట్నుంచీ అతడంతే...'మాకు గోడలు లేవు, గోడలు పగులగొట్టడమే మా ధ్యేయం' అన్నంత సులువుగా, బలంగా కవిత్వాన్ని చెప్పగలడు. ఆలోచన, ఆచరణ ఏదిచూసినా అందులో తుపాకీలో కూరిన మందుగుండులాంటి హేతువాదమే కనిపిస్తుంది. అతను కేవలం సాధారణ హేతువాది కాడు బడితివాది. అదుగో ఆ హేతువాదం హేతువువల్లనే అతను ఇంటినీ, కాకినాడనీ వదలి రావలసి వచ్చిందనుకుంటాను. వాళ్ల నాన్న గారికి 'నమోనారాయణ' సైకిల్ స్టోర్సు వుండేది. వాళ్లమ్మ గారిలో శృతిమించిన మూఢభక్తి వుండేది. ఈ రెండూ మనవాడి ఒంటికి సరిపడనివే. ఆ తీవ్రమైన వ్యతిరేకభావన అతణ్ని కవిని చేసింది. 'తల్లీ ఎవరు నువ్వు?'అంటూ జిల్లెళ్ల మూడి అమ్మ మీద కాకినాడ పట్టణంలో కలకలం రేపిన దీర్ఘకవితను 1973లో ప్రచురించేటట్టు చేసింది. ఆ పుస్తకం ఇప్పటికి నాలుగు ముద్రణలు పొందింది. నాలుగో ప్రచురణ పుస్తకాల్ని కాకినాడ సూర్యకళామందిరంలో అద్దేపల్లివారి సప్తతిసభల్లో నాచే ఆవిష్కరింపచేయడం నాకు అందిన గొప్పగౌరవం). కానీ దానికి ముందు మాటగా అద్దేపల్లి రామమోహనరావు గారు రాసిన 'సామాజిక దోపిడీలో మత మహాప్రస్థానం' ఆయన ఉద్యోగానికి ఎసరు పెట్టినంత చేసింది. చిత్రమేమి టంటే బందరు సముద్ర తీరం నుంచి కాకినాడ సముద్రాన్ని, గోదావరిని వదలి 'కృష్ణ'ను కౌగిలించు కున్నాడు. 'తల్లీ! ఎవరునువ్వు?' సృష్టించిన సంచల నాలకు రెండు ఉదాహరణలు...

'కుళ్లిన పదార్థంలోంచి పురుగులు రావడం సహజం. అలాగే కుళ్లిపోయిన ఈ సమాజంలోంచి ఈ తల్లులు, బాబాలు పురుగుల్లా పుట్టుకొస్తూనే వుంటారు.'తల్లీ! ఎవరు నువ్వు?'వంటి విప్లవో చితమైన, బలమైనరచనలు విప్లవానికి చాలా అవసరం . (కొడవటిగంటి కుటుంబరావు).

'ఈ తల్లులు/ భూస్వామ్య, ధనస్వామ్య వ్యవస్థకు /ఆధ్యాత్మిక ఉంపుడుగత్తెలు –త్రిపురనేని మధుసూదన రావు.

అంతేకాదు, మహాకవి శ్రీశ్రీ ఈ పుస్తకాన్నం దుకుని, మద్రాసు నుంచి 7-5-1973న ఆంగ్లంలో ఉత్తరం రాస్తూ

***"This is a brilliant writing charged with destructive dynamite. "***

అని కితాబునిస్తూ ఇటువంటి రచనల్ని మరిన్ని చేయాలని ఆదేశించారు.

సరే, అక్షరాలతో కడుపునిండదు కదా! అన్నం మెతుకులు కావాలి. 'నమోనారాయణ' నచ్చలేదు. 'నియో లిటరరీ సెంటర్' ని స్వంతంగా పెట్టాడు. ఆంధ్రులు కవిత్వాన్ని ఇష్టపడినంతగా కొని చదవడానికిష్టపడరు. పైగా మా వాడి షాపులో అన్నీ కమ్యూనిస్ట్ పుస్తకాలు, కవిత్వపు దొంతర్లు. ఈలోగా నేను కాకినాడ నుంచి అంబాజీపేట పోస్టాఫీస్‌కు బదిలీ అయ్యాను. కొన్నాళ్లు విషయాలు తెలియలేదు. అద్దేపల్లివారుతప్ప, నందనోదయ, ఈశ్వర్, ఉపాధుల్ని మార్చుకుంటూ విశాఖపట్నం వెళ్లిపోయారన్నారు. అశోక్‌కుమార్ సంగతేమిటంటే, విజయవాడ వెళ్లి పోయాడన్నారు. పెళ్లయింది. సరియైన ఉద్యోగం లేదు. ఏం తంటాలు పడ్డాడో, ఎలా రోజుల్ని నెట్టు కొచ్చాడో. కొన్నేళ్లపాటు మాకెవరికీ అశోక్ ఆచూకీ అంతుచిక్కలేదు. దాదాపు మూడు దశాబ్దాలు ఈ అజ్ఞాతవాసం సాగింది.

ఆశ్చర్యం! 2003 జనవరి లో అనుకుంటాను. 'శుభాకాంక్షలు ' అశోక్‌కుమార్ కవితాసంపుటి ఆవి ష్కరణ మీరు రావాలి విజయవాడ సభలో మాట్లా డాలంటూ పుస్తకమూ, ఆహ్వానపత్రమూ అందాయి. అప్పటికి అశోక్‌ని చూసి దాదాపు ముప్ఫై సంవత్స రాలు. సుదీర్ఘమైన ఎడబాటుకి 'శుభాకాంక్షలు'తో పునస్సమాగమం, సభ నిర్వహణ 'ఆలోచన' విజయ వాడ. ఇది అశోక్ 'ఆలోచన' తీరు ముఖచిత్రం మిత్రుడు ఈశ్వర్. ముందుమాటలు అద్దేపల్లి. అశోక్ ప్రియమిత్రులు అదృష్ట దీపక్, కెవిఎస్‌వర్మ. అశోక్ తనముందుమాటలో చెప్పక తప్పదంటూ 'దోసిళ్లకొద్దీ ఉత్సాహాన్ని పట్టిస్తూ, ప్రోత్సహిస్తున్న చిరకాల సాహితీ మిత్రులంటూ అందులో నా పేరు. చెరగని స్నేహానికి అపురూపమైన అక్షరమాల'.

## అక్షర హాలికులు

అశోక్‌కుమార్



## గుర్రం జాషువా

(1895- 1971 )



## 'దళిత జ్వాల'

కదను తొక్కిన గుర్రం కవిత
నిదురలేచిన బగుడు జనత
నాలుగుపడగల హైందవనాగు
మదం అణచిన కలం చరిత



# జ్వాలాముఖి

**(1938-2008)**

కవికి నిజాయితీ చాలాముఖ్యం.
అవగాహన, అధ్యయనం,
బాధ్యత, అభివ్యక్తి, నిర్దుష్టతకు
ప్రజావిధేయత కూడా తప్పని సరి.
కవి క్రాంతిదర్శి, యుగ వ్యాఖ్యాత.
ఒక చైతన్యవంతుడైన కవి
సమాజంలో వెలిశాడంటే,
ప్రత్యామ్నాయ ఆలోచనకు
అంకురార్పణ జరిగినట్లే,
తిరుగుబాటుకు ధ్వజారోహణ జరిగినట్లే.
అశోక్‌కుమార్ లఘు కవితలకి,
పరిమితంకాక
నేటి సంక్షుభిత అవసరాన్నిబట్టి
కవిత్వాన్ని విరాట్ రూపంగా
అభివృద్ధి చేయాలి.
మంచి కవిత్వానికి గీటురాయి చైతన్యం.
అది పుష్కలంగా ఉంది ఈ కవిలో.
అది అతణ్ని నిద్రపోనియ్యదు.
అతడూ ఈ సమాజాన్ని
నిద్రపోనియ్యకుండా
విజ్ఞతతో బాధ్యతగా రాయాలి.
కవిత్వం మానవత్వమేకాదు.
దాని శక్తిని దానికి అందించే
కర్తవ్యం కూడా.
( జనవరి - 2004 )

ఈ పుస్తకం తెరవగానే 'అంకితం...' వెంట నా చూపులు పరుగులు తీసాయి.

**'అగ్గిలా ఆవేశం**
**చెలరేగినపుడు**
**చల్లార్చేది తనే !**
**బొగ్గులా ఆలోచనలు**
**చచ్చుబడినప్పుడు**
**రగిలించేది తనే !**

– నా సహచరి,స్నేహితురాలు శ్రీమతి కుమారికి ప్రేమతో...అశోక్‌కుమార్.

'ఎంతగొప్ప, అందమైన, ఆత్మీయమైన అంకితం! నిజమే ఈ అంకితానికి ఆమె పూర్తిగా అర్హురాలు. కష్టాలను, కన్నీళ్లను, ఆకలిని, ఆవేదనను పంచుకున్న సహచరి, ఎన్ని శ్రమలకోర్చి, ఈ ప్రగతి మెట్లపైకి వచ్చారో?!ఎంతటి ఆనందం.అన్ని విష యాలను సమక్షంలో తెలుసుకున్నాం. ఆవేశపడ్డాం. ఆనందించాం. అప్పటినుంచి ఇప్పటికెన్నోసార్లు అశోక్, కుమారిల ఆతిథ్యం అందుకున్నాను. అందు కుంటూనే వుంటాను.

'శుభాకాంక్షలు' పుస్తకంలో ఇతర రచనల వివరాలుచూసి, ఆశ్చర్యపోయాను. 'తల్లీ! ఎవరు నువ్వు?' సరసన 'శ్రీ బాబా మహాత్యం', 'బాల యోగీశ్వర సందర్శనం' 'సామాన్యుడ్ని భయంకర రాక్షసపాదాలతో తొక్కేస్తున్న 'మతప్రస్థానం' అజ్ఞా తంలో వున్నా రచనలు వెలుగు చూస్తేనే వచ్చాయి. పెళ్లయింది. పిల్లలు ప్రయోజకు లయ్యారు. బతు కులో స్థిరపడ్డారు. ఈ స్థితిలో ఎందరో హేతు వాదాన్ని వదిలి ఆధ్యాత్మిక చింతనలోకి జారి పోతారు..కానీ అశోకుడు ఇప్పటికీ హేతువాద ఖడ్గచాలనం చేస్తూనే వున్నాడు. దానికి నిదర్శనం అతడి ఎనిమిదవ రచన 'ఆధ్యాత్మిక రహస్యాలు' దీన్ని వేమనకు అంకితమిచ్చాడు. దీనికిముందు మాట లను లబ్ధప్రతిష్టులైన అద్దేపల్లి, ద్వానా శాస్త్రిలతో బాటు నాచేత కూడా రాయించడం నాపట్ల అశోక్ కున్న మిత్రవాత్సల్యం, మతం మత్తును, కులం కుళ్లునూ వదిలిస్తున్న అశోక్.

**'కమ్మో, రెడ్డో, కాపో /**
**అంటాడుగాని మనిషినని చెప్పడేం?**
**హిందువో, ముస్లిమో క్రిష్టియనో /**
**అంటాడు గాని / మనిషినని చెప్పడేం?**
**ఇండియనో, అమెరికనో, రష్యనో /**
**అంటాడు గానీ / మనిషినని చెప్పడేం?**
**అసలిక్కడ / మనుషులే లేరా?**
**వీళ్లు మనుషులు కారా??**

అంటూ వాపోతాడు 'మనిషేలేడా?' కవితలో ఎన్నికల యంత్రాంగం మీద 'తంత్రం' ప్రపంచీకరణ దుష్ఫలితాలమీద 'గ్లోబలి', అగ్రరాజ్య ఉగ్రవాదం మీద 'వ్యూహం' ఇలా నిరంతరాయంగా కవిత్వాన్ని ప్రవహింపజేస్తూనే అశోక్ కుమార్ వున్నాడు.

కాకినాడలో మేం వారంవారం జగన్నాథ పురంలో కలుసుకుని కవిత్వాలు చదువుకునేటప్పుడు పత్రిక నడపాలని ప్రయత్నించాం. మావల్లకాలేదు. ఎక్కడో మూలనపడిపోయిన 'హిందూసుందరి' పత్రికను పునరుద్ధరించి నడిపాం. దాన్నీ కొనసాగించ లేకపోయాం. కానీ ఆ కోరిక మిత్రుడు అశోక్‌కి, మాకు 'చినుకు' ద్వారా తీరింది.

చాలా సంవత్సరాలు అందులో అశోక్‌కి 'శ్రీశ్రీక్విజ్' నిర్వహించే అవకాశం 'అణువు' శీర్షికన మినీకవితల్ని తళుక్కుమనిపించే ఛాన్స్ నందూరి రాజగోపాల్‌గారిచ్చారు. వారికి ధన్యవాదాలు చెప్పకుండా వుండలేను. అంతేకాదు, ఇప్పుడు 'అర్వపెల్లి అశోక్‌కుమార్‌ను 'మన ముందుకు' ఆయనే తెస్తున్నాడు. అందుకు మరీ మరీ కృతజ్ఞతలు.

అశోక్‌కుమార్ వ్యక్తిగత జీవితంలో హేతు వాదం గురించి రెండుమాటలు చెప్పకతప్పదు. అవి అశోక్ దంపతుల పెళ్లిగురించి, వాళ్ల అమ్మాయి, అబ్బాయిల పెళ్లిళ్ల గురించి. అవన్నీ జనవరి ఒకటిన కేవలం దండలమార్పిడితో జరగడం నిజంగా అతను హేతువాదాన్ని ఒక నినాదంగా కాకుండా జీవన విధానంగా అనుస రిస్తున్నాడనడానికి నిదర్శనాలు. 'విక్రాంత్' పెళ్లయితే విశాఖపట్నంలో అదృష్టదీపక్, అద్దేపల్లి, నేను కలిసి నిర్వహించాం. ఎంతో గొప్ప సంగతి!

సింగంపల్లి ఎన్నో బృహత్తర సాహితీ కార్య క్రమాలను ఒంటిచేత్తో నడిపిస్తున్నాడు. అందులో 'శ్రీశ్రీనిధి'ని ఉచితంగా బులెటిన్ రూపంలో త్రైమాసికగా తెస్తున్నాడు.

పాతికమంది ప్రముఖుల రచనలతో శ్రీశ్రీ మరణించి ఇరవై అయిదేళ్లయిన సందర్భంగా తెచ్చిన శ్రీశ్రీ సంస్మరణ,శ్రీశ్రీ శత జయంతికి మూడేళ్ల ముందే సన్నాహాలు ప్రారం భించి, వందమంది రచయితల రచనలతో వందేళ్ల శ్రీశ్రీ అపురూప సంచికను తెచ్చి, శ్రీశ్రీ రచనలు, శ్రీశ్రీపై రచనలపై '100 పుస్తకాలను' తేవడం, తేబోవడం- ఈ బృహత్తర కార్యక్రమంలో కొన్ని 'శ్రీశ్రీ భావా లను సాగుచెయ్యడం శ్రీశ్రీ అభిమాని విధి – శ్రీశ్రీ భావాలను పోగు చెయ్యడం శ్రీశ్రీ సాహిత్యనిధి' అంటున్న అశోక్‌కుమార్..శ్రీశ్రీ కవిత్వ లాలసుడు మాత్రమే కాదు..శ్రీశ్రీ వారసుడు కూడా. అతనికి 'షష్టిపూర్తి శుభకాంక్షలు' ■



## ప్రపంచ బ్యాంకు రుణం

ఇంటిని తాకట్టు పెట్టి -
గోడలకు రంగులు వేసుకోవడం !



# ఆరు పదుల అశోకుడు

నందనోదయ

'కంటి చూపు బాగా పనిచేస్తున్న వాళ్లకు చూడ్డానికి చాలా విషయాలుంటాయి. అంచేత వాళ్లు తమ ముందున్న వాటినే గమనించలేకపోవచ్చు...' అంటాడు రస్కిన్ బాండ్ తన కథానిక ఒక దానిలో. ఇది తమాషాగా అనిపించినా నిజమేననిపించింది. అశోక్ షష్టిపూర్తికి వ్యాసం రాయాల్సి వచ్చినపుడు.

అశోకుడి గురించి రాయాలంటే ముప్పయ్యనిమిదేళ్ల స్నేహాన్ని గురించీ ముప్పయ్యనిమిదేళ్ల సహసాహిత్య ప్రయాణాన్ని గురించి రాయాలి. ఏది రాయాలి అన్నది తేల్చుకోవడం అంత తేలికైన పని కాదు.

అసలు అశోకుడు గురించి ఎందుకు రాయాలి? ఇది ఒక స్పష్టమైన ప్రశ్న మాత్రమే కాదు స్పష్టంగా జవాబు దొరికే ప్రశ్న కూడా.

ఆరుపదుల జీవిత ప్రయాణంలో దాదాపు నలభై సంవత్సరాలుగా సాహిత్యకారుడిగా - జన సామాన్యుల సాహిత్యకారుడిగా అదే వామపక్ష సాహిత్యకారుడిగా పయనిస్తూ, ఒక సాహిత్య ఉద్యమశక్తిగా కూడా ఎదుగుతూన్న అశోకుడి గురించి అంటే చాలా రాయాల్సి వుంటుంది. కాని ఇది షష్టిపూర్తి సందర్భం కనుక వ్యక్తిగత విషయాలకే నన్ను నేను పరిమితం చేసుకోవడం బావుంటుందనుకొంటున్నా. సాహిత్యం గురించి సప్తతి పూర్తికి చూసుకోవచ్చు.

కొంత వెనక్కి వెళదాం. ముప్పైయ్యేనిమిదేళ్ల వెనక్కి వెళదాం.

అది 1972, అక్టోబర్ - (బహుశా) నవంబర్ నెలలో ఏదో ఒక రోజు.

ఒక చిరుద్యోగి దగ్గరకు ఓ ఆకర్షణీయమైన యువకుడు వస్తాడు. ఆ యువకుడి తీరులో, తీరుపులో ఓ ప్రత్యేకత వుంది. చూడగానే కాస్తవున్న వాడిలాగానే కనిపిస్తున్నాడు. ఓ ఇరవయ్యేళ్లుంటాయి.

'మీరు ఫలానా కదా?'

అవునంటాడు ఆ ఇరవైయేళ్ల చిరుద్యోగి ఆశ్చర్యంగా.

ఫలానా టైముకి ఫలానా హోటల్‌కి వస్తారా అని అడుగుతాడు.

అలాగేనంటాడు ఆ చిరుద్యోగి.

ఆ వ్యక్తి చాలా డిఫరెంట్‌గా కనిపిస్తున్నాడు. కాదనడం కుదరదు. తరువాత్తరవాత రుజువయింది డిఫరెంట్ కాదు - డిస్టింక్టివ్ అని.

ఆ రోజు నవంబర్-6, 1972.

ఆ హోటల్ కాకినాడ మెయిన్‌రోడ్‌లో వెల్‌కమ్ హోటల్.

ఆ చిరుద్యోగి హోటల్‌కి వెళ్తాడు. అక్కడ తెలుస్తుంది. ఆవేళ అతని బర్త్‌డే అని.

ఆ యువకుడు ఇరవైరెండేళ్ల అశోక్‌కుమార్.

ఆ ఇరవైయేళ్ల చిరుద్యోగి ఈ వ్యాసకర్త అని ఈ పాటికే అర్థమయింది కదా.

ఆ సంవత్సరం కాకినాడ గ్రంథాలయ సంస్థ వాళ్లు గ్రంథాలయ

# అక్షర హాలికులు

**అశోక్‌కుమార్**



## టి.యల్. కాంతారావు

**(1943-1990)**



## 'శ్రీశ్రీ భక్త హనుమాన్'

స్మరిస్తే శ్రీశ్రీ
అరిస్తే శ్రీశ్రీ
కాంతారావ్ కలం
తెరిస్తే శ్రీశ్రీ !

వారోత్సవాల సందర్భంగా కవితల పోటీ పెట్టారు. ఎందుకో తెలియదు కానీ పోటీలంటే ఇష్టంలేకపోయినా నేనూ పోటీలకి పేరిచ్చాను. అక్కడ 'ఏ పాట పాడమంటావు?' అన్న కవితని చదివాను. (దేశ స్వాతంత్ర్య రజతోత్సవాలని ప్రశ్నిస్తూ రాసిన కవిత) అద్దేపల్లి, టిఎల్ కాంతారావు, భమిడిపాటి జగన్నాథరావుగార్లు జడ్జిలుగా వున్నారు. భమిడిపాటి గారు నాదగ్గరకు వచ్చి కౌగిలించుకొన్నారు. ఆ పోటీల్లో రమణమూర్తి అనే ఓ ఇంటర్ స్టూడెంట్‌కు ఫస్ట్ ప్రైజ్ వచ్చింది. అతనే విక్రాంత్ అనే కలం పేరుతో కవితలు రాన్తూ మా బృందంలో ఒకదయ్యాడు ఆ తర్వాత. ఆ విక్రాంత్ ఇప్పుడు లేడు. అతని పేరునే అశోక్ తన కొడుక్కి పెట్టుకొన్నాడు (అశోక్ తన కొడుక్కి మొదట పెట్టిన పేరు అనిల్-ఆ విక్రాంత్ వెళ్లిపోయాక పేరు మార్చాడు-ఆ విక్రాంత్ దరిమిలా మద్రాస్‌లో ఐఐటి చేసి టాటా కంపెనీలో ఉద్యోగం చేస్తూ తొందరపడి వెళ్లిపోయాడు. విక్రాంత్‌తోబాటు చిత్రకారుడూ-కవీ ఈశ్వర్ పరిచయం అయ్యాడు. ఆ కవితల పోటీ వల్లనే పరిచయం అయింది హైమ.తరువాత ఆమె ద్వారా 'సమతా కోటేశ్వరరావు గారు పరిచయం. హైమ ద్వారా పరిచయం ఉమ.

ఆ పోటీలసందర్భంలో అశోక్ నన్ను చూసాడు. ఆ లైబ్రరీ వాళ్ల దగ్గర నా అడ్రస్ సంపాదించి నా దగ్గర్కు వచ్చాడన్నమాట.

అంతకు రెండునెలలముందో మూడు నెల్ల ముందో అశోక్ కవిత 'హజంతోనైనా నిజం కోసం పోరాడుదాం'అనే కవిత 'జయశ్రీ' మాసపత్రికలో ప్రచురితమైంది. అతను అప్పుడప్పుడు కవితలు రాస్తున్నాడు. నేను కొంచెం సీనియర్ ఈ విషయంలో. 1968 నుంచీ రాస్తున్నా.

అశోక్ ద్వారా 'రారాసి', దార్ల తిరుపతిరావు మొదలైన సాహితీమిత్రులు పరిచయం అయ్యారు.

అదృష్టదీపక్ కూడా అశోక్‌కుమార్ ద్వారానే పరిచయం. అలానే ప్రముఖ సంపాదకుడు కె.వి. ఎస్.వర్మగారు కూడా.

అద్దేపల్లివారితో పరిచయం కూడా ఆ రోజుల్లోనే. కవీ, విమర్శకుడూ జి.సుబ్బారావుగారూ అప్పుడే పరిచయం అయ్యారు.

కాకినాడలో ఓ యువ సాహిత్య సంచలనం మొదలయింది. అశోక్, నేనూ, విక్రాంత్, ఈశ్వర్, హైమ, రారాసి కలిసి క్రాంతి రచయితల సంఘంగా ఏర్పడ్డాం. ఓ రూమ్ తీసుకొని సాహిత్య చర్చలు కవితాపఠనం కొనసాగించేవాళ్లం. అశోకుడే సహజంగా మా బృందానికి ఆర్గనైజర్. అద్దేపల్లి క్రమం తప్పకుండా ఈ సాహిత్యపఠన కార్యక్రమానికి హాజరయ్యేవారు. ఆయన కొత్తగా రాసిన కవితల్ని విని పించేవారు. మా కవితల్ని విశ్లేషించేవారు. తప్పులు కనిపిస్తే ఎత్తిచూపించేవారు. ఏ నాడూ ఆధిపత్యం చూపించని వ్యక్తిత్వం ఆయనది. ఆయన ఏనాడూ మాకు 'గురువు' పాత్ర పోషించాలని చూడలేదు.

ఇక్కడ తప్పనిసరిగా చెప్పాల్సిందొకటుంది. అద్దేపల్లి మిగిలిన మా అందరికంటే అనుభవంలో, సాహిత్యరంగంలో, ప్రతిష్ఠలో చాలా ముందున్న వారు. మేం ఆయన్ని అడ్మైర్ చేసాం. ఆయనతోకల్సి సాహిత్య సభలకు వెళ్లేవాళ్లం. ఆయన సాహిత్య పిపాస మాకు స్ఫూర్తి. అంతే కాని కొందరు వెకిలిగా అంటోన్నట్టు లేదా అనుకొంటున్నట్టు, ఆయన మమ్మల్ని తయారుచేసుకొంటే మేం వెళ్లి పోయి విరసంలో కలిసిపోలేదు.

అశోకుడిది సునిశితమైన పరిశీలన. చాలా మందిలాగే నేనూ శ్రీశ్రీ గేయాన్ని 'పదండి ముందుకు పదండి త్రోసుకు' అని చదివేస్తున్నా. వెంటనే అశోకుడు సరిచేశాడు 'పదండి ముందుకు పదండి త్రోసుకు' అని.

ఆ రోజుల్లో జిల్లెళ్లమూడి అమ్మ అని ఒక అమ్మోరు ఉండేది. తానే దేవుణ్నని చెప్పుకొనేది. వూరూరా భజనసంఘాలు ఏర్పాటయి ఓ ఉన్మాదం నడుస్తుండేది. ఓ రోజు ఓ పూర్తి నిడివి సినిమానో లేదా డాక్యుమెంటరీనో సినిమాహాళ్లలో ప్రదర్శించారు. మాకు ఒళ్లుమండింది. అశోక్ సంగతి సరేసరి. వెంటనే రాయటం మొదలుపెట్టాడు. అలా వచ్చింది అతని మొదటి పుస్తకం 'తల్లీ ఎవరు నువ్వు?' అద్దేపల్లి ముందుమాట రాశారు.(అద్దేపల్లి రాసిన మొదటి ముందుమాట అదే. ఆ తర్వాత ఆయన ఎన్ని ముందుమాటలు రాశారో లెక్కకందవు.) ఆ పుస్తకావిష్కరణ ఏర్పాట్లు చేసింది నేను. ఆ పుస్తకం ద్వారా సంచలనం కలిగించిన విషయం మాకు అప్పట్లో అంతగా తెలియదు.ఆ పుస్తకం నాలుగు ముద్రణలు పొందింది.

మా సాహిత్య దృక్పథం విరసం సాహిత్య దృక్పథం ఒకటే. శ్రామికజన పక్షపాతమే. సాహిత్యానికి ఇంకో పరమార్థం వుంటుందని నమ్మని వాళ్లమే. అందుకనే 1973లో మేం విరసంలో సభ్యత్వం తీసుకొన్నాం. అశోకుడు కన్వీనర్‌గా కాకినాడ యూనిట్ విరసం శాఖ ఏర్పడింది. 1976-77 దాకా అందులో సభ్యులుగా కొనసాగేం.

ఆరోజుల్లోనేవరవరరావు, చెరబండరాజు, కె.వి. రమణారెడ్డి మొదలైన విప్లవ సాహిత్యకారుల మీద కుట్ర కేసు బనాయించి వాళ్లని నిర్బంధించింది ఆనాటి ప్రభుత్వం. ఈ అరెస్ట్‌లకు నిరసనగా కాకినాడ విరసం శాఖ 'కుట్ర' అనే బులెటిన్ ప్రచురించింది. ఈ బులెటిన్‌కు సాహిత్యకారుల నుంచి చాలా మంచి స్పందన వచ్చింది. ఓ నిరసనతెలపడానికి ఒక బులెటిన్ ప్రచురించబడ్డం అదే మొదటి సారి బహుశా.

ఆ సంవత్సరంలోనే అశోక్ 'నియో లిటరరీ సెంటర్' అని ఓ పుస్తకాల షాపు పెట్టాడు. క్లాసికల్, అభ్యుదయ, విప్లవ సాహిత్యానికి చెందిన పుస్తకాలు తెప్పించే వాడు. సాహిత్యం కొని చదవడం ఆ నాడు లేదు. అశోక్ బాగా నష్టపోయి ఉండాలి. ఎప్పుడూ నష్టపోయాను అని మా ఎవరి దగ్గరా అనలేదు. అప్పటికే వాళ్ల తొలి సంతానం జ్వలిత పుట్టింది.

'తల్లీ ఎవరు నువ్వు?' తరవాత 'శ్రీ బాబా మహత్యం' రాయాలని సంకల్పించాడు. ఏదో రాసెయ్యాలని అనుకోలేదు. సరిగా రాయడానికి అతని విశేషాలు అధ్యయనం చేయాలి. బాబా జీవితంమీద రాసిన పుస్తకాల కోసం ప్రయత్నించమని మమ్మల్ని అడిగాడు. పరిచయస్తులద్వారా నేను ఓ పనికొచ్చే పుస్తకం సంపాదించి ఇచ్చాను.(పుస్తకంఇచ్చింది మెజిషియన్ / హిప్నాటిస్ట్ బి.వి.పట్టాభిరాం తమ్ముడు డా.నగేష్ అని గుర్తు) ఇలా అధ్యయనం చెయ్యడం ఈ వేళ శ్రీశ్రీమీద అతను చేస్తున్న పరిశోధనతోనే కాదు-ఏనాడో అతనికి అలవాటని తెలియచెబుతుంది. ఈ విషయం తరువాత అశోక్ రాసినవి 'బాలయోగీశ్వర సందర్శనం''మతప్రస్థానం' ఇదంతా 1976 వరకూ.

1975లో విక్రాంత్ పుట్టాడు. జీవితంలో నిలదొక్కుకోవాల్సిన అవసరం కనిపించి చాలా ఆలోచించి బెజవాడ వెళ్లిపోడానికి నిశ్చయించుకున్నాడు. నేనూ సపోర్ట్ చేశాను. ఏదో కొంత భరోసా కూడా ఇచ్చాను. అతను బెజవాడ వెళ్లిపోయాడు 1976లో. 1976-77లలో నేను బెజవాడ వెళ్లినప్పుడల్లా పది పదిహేను రోజులు వాళ్లింట్లోనే మకాం.

అశోక్ ఎప్పుడేనా కాలక్షేపానికి చాలా సన్నిహిత మిత్రులతో 5-3-2 అనేవాడు. నాతో కూడా. నేను ధమవిధ్వాంసుణ్ని ఈ విషయంలో. నేను ముక్కలు పట్టుకొనే తీరు చూసినవాడు ఆ ఆట మీద మక్కువ వున్నవాడైతే ఆత్మహత్య చేసుకొంటాడు. అశోక్ నాతో పందెం వేశాడు. ఎవరు ఓడిపోతే వాళ్లు ఎదుటి వాళ్లకి వాళ్ల వాటా అప్పడాలు ఇచ్చేయాలి. కుమారి(అశోక్‌భార్య) అప్పడాలు వేయించి చూస్తోంది. అశోక్ మూడు ఆటలు ఓడిపోయాడు. అశోక్ కిమ్మనలేదు.అప్పడాలిచ్చేశాడు నాకు. కుమారి మాత్రం 'అశోకా, నువ్వోడి పోవడమేంటి... అశోకా, నువ్వోడిపోవడమేంటి'అని తెగ బాధపడి పోయింది. తన అశోకుడిమీద ఆవిడకంత నమ్మకం. అశోకుడు ఓడిపోవడం ఆవిడ ఊహించనిది.(అశోకుడు-కుమారి ఒకళ్లనొకళ్లు ఇష్టపడిపెళ్లి చేసుకొన్నారు 1972లో.ఆవిడ 'ఎంకి పాటలు' బాగా పాడేది. చాలాసార్లు పాడించుకుని విన్నాను.

వాళ్లది కులాంతర వివాహం మాత్రమే కాదు – ఆదర్శ వివాహం (నిజమైన అర్థంలో) దండల మార్పిడి పెళ్లి. అశోకుడి పిల్లలది కూడా దండల మార్పిడి పెళ్లే. అతను నమ్మిన సిద్ధాంతాన్నే చెప్పేడు. చెప్పిన సిద్ధాంతాన్నే ఆచరించాడు.) వ్యక్తిగత జీవితంలో కాని, సాహిత్య జీవితంలో గానీ ఎప్పుడూ ఏ రకంగానూ రాజీపడకుండా నిలబడగలిగిన అరుదైన వ్యక్తిత్వం అతనిది.

1978-1983 మధ్య కాలంలో అశోక్‌ని కలిసింది ఒకటి రెండు సార్లు మాత్రమే. 1983-2000 మధ్యలో ఒకరి గురించి మరొకరికి తెలియదు. 2000లోనో 2001లోనే అశోక్ నుంచి ఓ ఉత్తరం వచ్చింది. జ్వలిత పెళ్లి అయిందని, రిసెప్షన్‌కి రమ్మనమని. ఆ ఉత్తరం లేటుగా అందడంవల్ల నేను రిసెప్షన్‌కి వెళ్లలేదు కాని ఓ ఉత్తరం రాసాను. వెంటనే జవాబు వచ్చింది. మా అశోక్ అలాగే వున్నాడు. మారిపోలేదని. చాలా ప్రయత్నమే చేశాడు నా అడ్రస్ తెలుసోవడానికి, స్నేహాల్ని పునరుద్ధరించుకోవడం ఒక ఎత్తైతే తన ఆలోచనల్ని సాహిత్యజ్వాలనీ ఏమాత్రం మారిపోకుండా అలాగే కాపాడుకొంటూ రావడం-ఇరవయ్యేళ్ల సుదీర్ఘ విరామం తర్వాత కూడా-మామూలు విషయం కాదు. అదీ లాభనష్టాల మాయామయమైన వ్యాపారరంగంలో వుంటూ...

అసలు అశోక్ ఇరవైసంవత్సరాల మౌనం వ్యూహాత్మకమైన సైలెన్స్ కాదు గదా అనిపిస్తుంది. సాహిత్యానికి తాను చెయ్యాలనుకొన్నది చెయ్యడానికి ఆర్థికంగా బలపడాలనుకొన్నాడేమో ననిపిస్తుంది.

మళ్లీ 2002 నుంచీ కలం ఝుళిపించాడు. 2003లో 'శుభాకాంక్షలు',తర్వాత 'తంత్రం', 'ఆధ్యాత్మిక రహస్యాలు', 'పొద్దు పూసింది', 'వ్యూహం', 'గ్లోబలి'ఆరుపుస్తకాలు ప్రచురించాడు. చివరి అయిదూ అణుకవితా (మినీ కవితలు అని కూడా పిలుస్తుంటారు) సంకలనాలు. అశోక్ సాహిత్యంలో నిజమైన extremist. ఎలాగంటారా? చూడండి. అయిదు పుస్తకాలు దీర్ఘ కవితలు. ఇంకో ఐదు 'మినీ కవితలు' రెండూ extremes కాదా మరి?

అశోక్ మినీ కవితలు ఒక ఫాషన్ నుంచి వచ్చినవో లేదా ఒక రచనా సౌలభ్యం కోసం ఎంచుకొన్నవో కాదు. ఇవి ఒక సాధన నుంచి ఒక ప్రక్రియ అవసరం నుంచి వచ్చినవే. 1973-74లో వచ్చిన హోచ్‌మెన్ కవితా సంకలనం చూశాడు అశోక్. సామాన్య పాఠకుడి సహనాన్నీ, సమయాన్నీ వృధా చెయ్యకుండా తన భావాల్ని వ్యక్తం చేయడానికి అనువైన ప్రక్రియ ఇది అని నమ్మి సంవత్సరాల సాధనతో ఈ ప్రక్రియని సొంతం చేసుకొన్నాడు. ఈ ప్రక్రియ మీద మాస్టరీని సాధించాడు.

2008 తరువాత మళ్లీ పుస్తకాలు రాయడం ఆపు చేసాడు. ఎందుకో స్పష్టంగా తెలుస్తూనే వుంది. 'శ్రీశ్రీ సాహిత్యనిధి' కోసం! శ్రీశ్రీ శత జయంతి సన్నాహాలకోసం! ఒక వ్యక్తిగా కాకుండా ఒక సంస్థగా కృషి చేశాడు. ' మహాకవి శ్రీశ్రీని మరిచిపోవడం



## ఎస్.వి.రామారావు

**సినిమా చరిత్ర పరిశోధకులు.**

మహాకవి శ్రీశ్రీ పేరిట
ఆయనపట్లగల గౌరవంతో
అంకితభావంతో,
ఆయన జీవితానికి,
కవితాజీవితానికీ
సంబంధించిన అనేక విషయాలను
ప్రతి మూడు నెలలకు
ఒక బులెటిన్ రూపంలో
అందించడం
పత్రికారంగంలో
చారిత్రాత్మకంగా
రికార్డు కాదగ్గ అంశం.

వ్యయ ప్రయాసల కోర్చి
ఈ యజ్ఞాన్ని నిర్వహిస్తున్న
శ్రీశ్రీ సాహిత్యనిధి కన్వీనర్
అశోక్‌కుమార్‌గారికి
శ్రీశ్రీ అభిమానిగా
నా కృతజ్ఞతలు.

( జనవరి - 2009)

తెలుగు కవిగా చచ్చిపోవడం' అని నినదించాడు. ఒక వ్యక్తి నాయకత్వం వహించి ఒక సంస్థ ద్వారా ఇలాంటివి సంకల్పించడం సాహిత్యంలో అరుదు కాదు. కాని ఒక వ్యక్తే సంస్థగామారి ఒకజాతి మహా కవికి ఇలా నివాళి అర్పించడం ఏ భాషలోనూ.. ఏదేశంలోనూ జరిగిన దాఖలాలు లేవు. 'చినుకు'లో శ్రీశ్రీ పేజీలు అశోక్‌ని పరిశోధకునిగా మార్చేశాయి. అతని అధ్యయనశీలత గురించి ముందే చెప్పుకొన్నాం గదా. శ్రీశ్రీపట్ల అశోక్‌ది ఆరాధన. మూఢభక్తి కాదు. శ్రీశ్రీపట్ల అశోక్ ఆరాధన అనవసరార్థపు ఫాషన్ కాదని ఘంటాపథంగా చెప్పగలను. 1973-74లో 'శ్రీశ్రీవాడా ఓ విప్లవవీరా' అనే మకుటంతో ఏభైకి పైగా కూనలమ్మ పదాల్లాంటి పదాలు రాశాడు. అందరూ అనుకుంటోన్నట్టు అశోక్ శ్రీశ్రీ శతజయంతి సన్నాహాలు రెండేళ్లవి కావు ముప్పైయేడేళ్లవి!

శ్రీశ్రీ సాహిత్యాన్ని సంపుటాలుగా జాతికి అందించిన వాళ్లు ముగ్గురు. మొదటి వారు కె.వి. రమణారెడ్డి. ఆయన శ్రీశ్రీ షష్టిపూర్తి ఆహ్వాన సంఘం తరపున ఆ పని చేశారు.

రెండవ వ్యక్తి చలసాని ప్రసాద్. విరసం తరపున మరెన్నో శ్రీశ్రీ సాహిత్య సంపుటాలని అందించారు.

మూడవ వ్యక్తి అశోక్‌కుమార్. ఇతనిది వన్‌మేన్ ఆర్మీ. శ్రీశ్రీ (బహుశా కొన్ని శ్రీశ్రీ అముద్రితాలు? లేదా అలభ్యాలతో బాటు) సాహిత్యం మీద వచ్చిన సమస్త సాహిత్యాన్ని (వ్యాసాలు, విమర్శలు, సమీక్షలూ) పుస్తకరూపంలో అందిస్తున్నవాడు అశోకుడే.

తెలుగు జాతికీ, తెలుగు భాషకీ, తెలుగు భవితకీ (అవును, 'భష్యత్తరాలకీ' అనే నా ఉద్దేశం) తను చేస్తున్న సేవ ఎంత విలువైనదో అశోకుడికి బహుశా తెలియకపోవచ్చు. కానీ రాబోయే కాలానికి తప్పక తెలుస్తుంది. శ్రీశ్రీ గురించి ఎవరు చెప్పినా ఏం చెప్పినా అది మానవజాతి వికాసం గురించి చెప్పడమే. నూరు వసంతాల శ్రీశ్రీకి నూరు పుస్తకాల నివాళి అర్పించడమే అశోకుడి సంకల్పం. అశోకుడి సంకల్పం అంటే ఆచరణే!

అశోకుడు తెలుగు భాషకి చేసిన 'సేవ' ఇంకో టుంది. ఈ వేళ పత్రికల వాళ్లూ, టీవీ ఛానళ్లవాళ్లూ అవశ్యంగా వాడుతోన్న అర్థవంతమైన పదం 'మృగాడు' అశోక్‌కుమార్ సృష్టించిందే!

అశోకుడంటే ఒక ఆశయాల ప్రణాళిక.

అశోకుడి ప్రణాళిక అంటే ఒక ఆచరణ నిజాయితీ.అశోకుడు తెలుగు సాహిత్యంలో ఓ విశిష్ట మైన పేజీ.జీవితాల వెలుగులోకి నిక్కచ్చి అయిన సాహిత్యపు పూచీ. అని నిజాన్ని బయట పెట్టడం తప్ప ఇంకేం చెయ్యలేను. ఈ త్రిదశుడి ఆరుపదుల పరిపూర్ణపు వేళలో. ■



# 'ఆరుపదుల అశోక్'

జగద్ధాత్రి

ఎరవన్నారు శ్రీశ్రీని మరచిపోయామని
అంటే గింటే ఎవరన్నా
ఇవ్వండతనికి 'చినుకు' చిరునామా
చెప్పండి వారికి సింగంపల్లి అని
ఉన్నాడొక శ్రీశ్రీ తాతకు మనుమడని
ఆయన సాహితీనిధికి కోశాధికారియై
భావి తరాలకు చిన్ని చిన్న రసగుళికలుగా
చిరు పుస్తకాలుగా అందిస్తూ
శ్రీశ్రీ 100గా అక్షరాభిప్రాయాలకు రూపమిచ్చిన
అసాధ్యమన్న మాటెరుగక
ఏకోన్ముఖుడై శ్రీశ్రీ శత సంవత్సరవ్రతం
సంకల్పించిన మన సాహితీ అశోకునికి
ఆరుపదుల పండుగట.
దశాబ్దాల సాహితీ ప్రేమకు తనని
ఏ లోకాన ఉన్నా ఆశీర్వదిస్తాడు మహాకవి.
రక్తబంధం కాదు..సాహితీ అనురక్తి
బాంధవ్యమెంత ముదావహమో
శ్రీశ్రీ శతవత్సర సంబరాలు విజయవాడన
జరిపిన అశోకుడు మనకు ఆదర్శం.
శ్రీశ్రీ అంటే రెండక్షరాలు కానట్టే
సింగంపల్లి అశోక్ అంటే
ఒక వ్యక్తి కాదు
సమిష్టి ప్రయోజన సమన్వయ కమనీయుడు
అణు అస్త్రాల వంటి చిరు కవితలతో
స్వాతి చినుకై భాసిల్లుతున్న
అశోకుని అరవై ఏళ్ల పండుగకి
ఆనందపూరిత అభినందనలు. ■

## ఎర్రజెండా

కాయ కష్టాలకు/ పోరాట / జెండా
కాయని కష్టాలకు / పోరాడే / ఎజెండా





# అశోక్ కుమార్‌కు అప్పుడే అరవై ఏళ్లా...?

ఎన్. వేణుగోపాల్

**అశోక్ కుమార్ గారి మొదటి పుస్తకం 'తల్లీ ! ఎవరు నువ్వు?' దీర్ఘ కవిత నిన్ననో మొన్ననో చదివినట్టుంది. కౌమారంలో, తొలియవ్వనంలో ఎక్కడపడితే అక్కడ దైవభక్తులను ఖండించడానికి ఆ కితలోని ఎన్నో పంక్తులు గొంతెత్తి చదివిన సందర్భాలు ఇంకా కళ్లల్లో చెవుల్లో ఆడుతూనే వున్నాయి. 'పసిడి రెక్కలు విసిరి కాలం పారిపోయిన జాడలేవీ' అని మహాకవి మాట గుర్తుకొచ్చే సందర్భాలు ఎన్నో వుంటాయి గాని, మహాకవి అభిమానులందరిలోకి అగ్రగణ్యుడు అశోక్ కుమార్‌కు అరవై ఏళ్లు నిండితున్నాయంటే మాత్రం ఆ మాటలు అక్షరాలా సరిపోతాయనిపిస్తోంది.**

అశోక్‌కుమార్‌గారి గురించి 'చినుకు' ప్రత్యేక సంచికకు రాయమని రాజగోపాల్‌గారు అడిగినపుడు నా మనసు ముప్పైఐదు సంవత్సరాల వెనక్కి అప్పుడడప్పుడే బాల్యం ముగుస్తూ, కౌమారంలో అడుగుపెడుతూ బలమైన ప్రభావాలకు లోనవుతున్న కాలానికి వెళ్లింది.

ఎనిమిదో తరగతిలో చేరడానికి 1973లో హనుమకొండ వచ్చి అక్కయ్య-మామయ్య (హేమలత-వరవరరావు)ఇంట్లో చేరిన కొత్తలోనే 'తల్లీ! ఎవరునువ్వు?' నన్ను ఆకర్షించింది. సృజన ప్రచురణలు, విరసం ప్రచురణలు, ఇతర విప్లవ సాహిత్యం అమ్ముతూ సభలకు, సమావేశాలకు తిరుగుతున్నప్పుడూ, ఇంట్లో ఆ ప్రచురణల అమ్మకాలు చూస్తున్నప్పుడూ కూడా ఆ పుస్తకం దాని ఎర్రని, కొట్టవచ్చినట్టు కనిపించే ముఖచిత్రంలో, రెచ్చగొట్టే శీర్షికతో, అప్పుడు ప్రముఖంగా ఉండిన జిల్లెళ్లమూడి అమ్మను పోలిన చిత్రంతో ఎంతో మందిని ఆకర్షించడం గమనించాను. సంచలనాత్మకత వల్ల మాత్రమే కాక చిక్కదనంవల్ల, బలంవల్ల, హేతువాదవాదనా శైలివల్ల, 1970ల తొలి రోజుల్లోని కోపోద్రిక్త యువతరపు వాతావరణంవల్ల ఆ కవిత చదివిన వారందరి మీదా బలమైన ముద్ర వేసేది.

ఆ తర్వాత కొద్ది రోజులకే 'శ్రీబాబా మహత్యం' వెలువడింది. ముఖచిత్రం అదే కొట్టవచ్చే రంగు. స్పష్టంగా పోల్చుకోదగిన పుట్టపర్తి సత్యసాయిబాబా ముఖచిత్రం. కవిత్వంలో అదే బలం. వాదనా పటిమ. ఈలోగా కాకినాడ నుంచి సృజనకు వచ్చే అశోక్‌కుమార్ గారి ఉత్తరాల మీద కుదురైన తీర్చిదిద్దిన అక్షరాలు – ఆయనతో ప్రత్యక్ష పరిచయం లేకుండానే చాలా పరిచయం చేశారు. అశోక్ కుమార్ గారితో పరిచయమిందీ, సన్నిహితమయిందీ మళ్లీ శ్రీశ్రీ సందర్భంగానే. 'శ్రీశ్రీసాహిత్యనిధి' వంటి అవసరమైన, బృహత్తరమైన పని ఎత్తుకుని ఒంటి చేతిమీద లాగుతున్నందుకు కృతజ్ఞతతో కూడిన ప్రశంసతో కూడిన గౌరవంతో ఆయన వికసింపజేస్తున్న ప్రపంచాజ్ఞపు తెల్లరేకుకు ఒక ఛాయనయినా అందించగలిగితే ఎంత బాగుండుననుకున్నాను. శ్రీశ్రీ సాహిత్య నిధి చిరకాలం వర్ధిల్లాలి. అంటే అశోక్ కుమార్ గారి ని చిరకాలం కొనసాగాలి.

అశోక్ కుమార్ వంటి సాహితీ మిత్రుల వయసు శ్రీశ్రీ అన్నట్టు ఎప్పుడూ ముప్పయ్యే. ■

## ప్రపంచబ్యాంకు

ప్రజలను / తాకట్టు / పెట్టుకొని -
ప్రభుత్వాలకు / అప్పులిచ్చే / హైటెక్ రక్త బంధువు !





# ముమ్ముందుకు నడిపించేకవి

యం.కె.సుగమ్‌బాబు

నాకు ఇష్టమైన కవి ' సింగంపల్లి అశోక్‌కుమార్ '

అశోక్‌కుమార్ కవితాప్రస్థానం గురించి చెప్పడానికి ముందు వ్యక్తిగతంగా అతనితో అంతగా పరిచయం లేనిదశలో నాకు కలిగిన Impressions చెప్పాలనుకుంటున్నాను.

ఆ సంవత్సరం కవి, పత్రికాసంపాదకుడు కొల్లూరి సారథ్యంలో వస్తున్న పత్రిక 'ఎక్స్‌రే' నిర్వహించిన కవితల పోటీకి నేను సింగిల్ జడ్జిగా వ్యవహరించాను. విజయవాడలో బహుమతి ప్రదాన కార్యక్రమం. నాకు కొల్లూరి హోటల్ ఐలాపురంలో వసతి ఏర్పాటు చేశారు. ఆ రాత్రి నేను ఒంటరిగా హోటల్ రూమ్‌లో ఉండటం వలన అశోక్‌కుమార్ నాతో చాలాసేపు గడిపాడు. మాటల్లో మాటగా మా సంభాషణలు కవిత్వం వైపు మళ్లాయి. ఆ సందర్భంగా నేను 'మీ అభిమానిని' అని ముందే చెప్పాను. ఆయన సంతోషించాడు. 'అదేవీలుగా' మీ కవితలు కొన్ని చెప్పండని అడిగాను. ఇద్దరి మధ్యా మౌనం. ఆయన తన కవితలను recollect చేసుకుంటూ గొంతు విప్పాడు. బహుశా ఆయన నోటివెంట జాలువారిన తొలి కవిత -

'పొద్దు పూసింది
జగతి నిండా
ఎరుపు పరిమళం' -

ఒక్కసారిగా Alert అయ్యాను. 'ఎరుపు పరిమళం' అన్న పదం అంతవరకు ముద్దగట్టిన నా ఆలోచనలను చిందరవందర చేసింది. చాలా disturb అయ్యాను. నన్ను నా బాల్యంలోకి, ఎన్నికల సందర్భాల్లో కంకి కొడవలి గుర్తుగా ఎర్రజెండా చేతబట్టి ప్రచారంలో తిరగడం ఇవన్నీ గుర్తుకొచ్చాయి. ఒక్క క్షణం నేను దారితప్పానా? అనే ఆలోచన దోషిగా నిలబెట్టింది.

అశోక్‌కుమార్ ఒకదాని వెంట మరొకటి కవితలు చెప్తున్నాడు. నేను క్రమంగా సర్దుకుంటున్నాను. ఆయన కవిత్వంలో లీనమయ్యాను. అలా అలా సెలయేరులా సాగిన ఆయన కవిత్వం నదీ ప్రవాహంలా నిండుగా విస్తరించి అర్ధరాత్రి దాదాపు రెండు గంటల సమయానికి సముద్రమై హోరెత్తింది. ఆ వేడికి నా తల దిమ్మెక్కింది. అశోక్‌కుమార్ జ్ఞాపకశక్తికి ఆశ్చర్యపోయాను. కవిత వెంట కవిత. ఒకక్షణం ఆయన ఆగితే నేను వెంటనే 'చెప్పండి' అనేవాణ్ని. పాతర తీసినట్టు ఎంతో పట్టుదలగా తన కవిత్వం విన్పించేవారు. ఇలా నూరు కవితలకు పైగానే ఆయన చెప్పారు. ఆయన ఉచ్చారణ expressions ఇప్పటికీ

నా చెవుల్లో, నాగుండెల్లో, నా ఆలోచనల్లో. కవి పుట్టుక, కవిత్వం పుట్టుక కూడా ఆవేశంలో నుంచేనని నేను నమ్ముతాను. మనిషిలోని ప్రత్యణువూ ఒకానొక భావావేశంలో రగిలి నపుడు, వివశత్వంలో తపించినపుడు విస్ఫోట నంలా గుండెల్లో పేలిన పలుకే కవిత్వమని నాకు అర్థమైంది. అందుకే మా సింగంపల్లి అశోక్ కుమార్ నాకు డైనమేట్‌లా కనిపిస్తాడు.

Small is Powerful అంటాను నేను. చిన్న కవితకన్నా అందమైనది, శక్తివంతమైనది మరొకటి లేదంటాను. ఇట్టే ఆకర్షిస్తుంది. ఆలోచింపచేస్తుంది. పాఠకుడిలో తనదైన ముద్రవేస్తుంది. దాన్ని సొంతం చేసుకోవాలన్న ఆశను రగిలిస్తుంది. అయితే అందరికీ అది లొంగదు. అక్కడే వుంది తిరకాసు. అది ద్వేషానికి కారణమవుతుంది.

'మంగళవారం మంచమెక్కను' అన్నాడట ఎవరో –

మగాడికి వారంతో పనేముంది? సరే! చేతగానివాడు ఏదైనా నసుగుతాడు. మినీ కవిత వ్యాఖ్యాన సహితంగానే ఉంటుంది. అయితే కొంచెం ఆలోచించాలి. కథనం లేని సూటిదనమే క్లుప్తత.

ఇక అశోక్‌కుమార్ విషయానికొస్తే – ప్రతి కవికీ ఒక ప్రారంభం, ఎదుగుదల, పరిణతి ఉంటుంది. కానీ అందుకు మన కవిగారు మినహా యింపని నేను అనుకుంటాను. ఒక Process ఈయనలో అభివృద్ధి జరిగింది. హేతువాదం, మార్క్సిజం ఆయన వ్యక్తి త్వాన్ని తీర్చిదిద్దాయన్నది స్పష్టం. కవిగా కలం పట్టిన తొలిదశలో 'తల్లీ ఎవరు నువ్వు?' 'శ్రీ బాబా మహత్యం' 'బాలయోగీశ్వర సందర్శనం' 'మత ప్రస్థానం' ఇత్యాది వచన కావ్యాలు రాసినా ఆ తర్వాత అశోక్‌కుమార్ తన ప్రధాన ఆయుధంగా మినీ కవిత్వాన్ని ఎన్నుకున్నాడు. వివిధ సామాజిక రుగ్మతలపై రాజీలేని పోరాటం ప్రక టించాడు. మినీ కవిత్వానికో శక్తిని, యుక్తిని, అధి కారాన్ని కట్టబెట్టాడు. ఒక నిబద్ధతను పాటించాడు. కేవలం చమత్కా రానికో, వ్యంగ్యానికో, అధిక్షేపానికో ఆయన కవిత్వం పరిమితం కాలేదు. గొప్ప సృజనా త్మకత అశోక్‌కుమార్ కవిత్వం నిండా పరచుకొంది. నిజాయితీ నిప్పులు చెరిగింది. 'అశోక్‌కుమార్ మౌలిక హేతువాదిగా తన చైతన్యాన్ని కూడగట్టు కున్నాడు. తర్వాత గతితార్కికతను అవగాహన చేసుకున్నాడు. ఆమార్గంలోనే తన కవిత్వాన్ని విస్తృతం చేసుకున్నాడు' అంటూ ప్రఖ్యాతకవి, సాహితీ విమర్శకుడు డా.అద్దేపల్లి రామమోహన రావు చేసిన విశ్లేషణ అశోక్‌కుమార్ కవిత్వాన్ని అధ్యయనం చేయడానికి ఎంతైనా తోడ్పడుతుంది.

ఆధ్యాత్మిక ర'హస్యాలు' అనే కవితా సంపు టిలో 'బ్లడ్‌గ్రూప్' అనే ఈ కవిత –

**'మానవ రక్తాన్ని/ కులాల/ గ్రూపులు చేశారు!**
**అంతే / ఎవడి గ్రూపు కోసం / వాడు !**

ఖచ్చితంగా మన సమాజం ఎక్కడుందో వేలెట్టి చూపే కవిత ఇది. మతాన్ని, కులాన్నీ VOTE BANK చేశాయి. స్వార్థ రాజకీయాలు. ఓట్ల కోసం రాజకీయ నాయకులు కుల సంఘాలను ప్రోత్సహించడం నేటి దయనీయ స్థితి.

ఈ కోణంలోనే–'సారాంశం' అనే కవితలో

**'విస్కీ , బ్రాందీ, జిన్ను, రమ్ములు**
**మందేదైనా**
**మత్తు ఒక్కటే !**
**హిందూ, ముస్లిం, క్రైస్తవమ్ములు**
**మతమేదైనా**
**కిక్కు ఒక్కటే!'**

సారా మత్తులాంటిదే మతం మత్తు అంటూ నిజాన్ని కుండబద్దలు కొట్టారు అశోక్‌కుమార్. దీన్ని ఖండించడం ఎవరి తరం? మానవత్వాన్ని మంట కలుపుతున్నది ఈ మతాల 'కిక్కే'. కళ్లు తెరవ మంటు న్నాడు కవి.

మనుషులను కలిపి ఉంచేది 'మనం మనుష లం' అన్న భావనే. ఇవాళ అది మృగ్యమైంది. ఒక అభద్రత సర్వత్రా వ్యాపించి వున్న నేపథ్యంలో అందరం కలిసి ఒకటిగా వుంటే బలం అనుకోవడం మాని, ఎవరి కులాన్ని వారు వెతుక్కోవడం వెనుక పెద్ద రాజకీయ కుట్ర దాగివుంది. అమాయక జనాన్ని దారితప్పించేవి అనేక ప్రలోభాలు. ఈ వలలోంచి మనిషి బయటపడాల్సిన అవసరాన్ని 'మనిషేలేడా' అనే కవితలో చెంపచెళ్లుమనేట్టు అశోక్ కొట్టిన తీరు ప్రశంసనీయం.

**'కమ్మో, రెడ్డో, కాపో / అంటాడు గాని**
**మనిషినని చెప్పడేం?**
**హిందువో,ముస్లిమో, క్రిస్టియనో/అంటాడు గాని**
**మనిషినని చెప్పడేం?**
**ఇండియనో,అమెరికనో,రష్యనో/ అంటాడు గాని**
**మనిషినని చెప్పడేం?'**
**అసలిక్కడ / మనుష్యులే లేరా?**
**వీళ్లంతా మనుషులు కారా?**

ఇలా ముక్కలైన మనిషి ఎప్పటికి తన దౌర్భాగ్య స్థితిని తెలుసుకుంటాడు. ఎప్పుడు సంపూర్ణ మాన వుడిగా ఆవిర్భవిస్తాడు? ఇంతకు ముందు వర్గం, వర్గస్వభావం ప్రధాన విషయాలైతే ఇపుడు కులాలు, మతాలు చక్రం తిప్పే విషయాలవడం ఎంత బాధా కరం? ప్రజల్లో చైతన్యం వస్తుందన్న ఆశ నిన్న మొన్నటి వరకు ఉండేది. ఇప్పుడది క్రమంగా సన్నగిల్లుతోంది. సామాన్య మానవుణ్ణి corrupt చేస్తున్న క్షుద్ర రాజ కీయాలకు ముగింపు పలికేరోజు కోసం అశోక్‌కుమార్ ఆగ్రహం! ;

ఒక 'ప్రపంచీకరణ'లో తన ఉనికిని పోగొట్టు

కుంటున్న మనిషి నిస్సహాయతపై అశోక్ కుమార్ సంధించిన ఆవేదనాస్త్రం 'గ్లోబలి' తొలి కవిత ఎంత అద్భుతంగా ఉందో చూడండి –

**'మనిషికై**
**సరుకులు పుట్టడం**
**సివిలైజేషన్ !**

**మనిషినే**
**సరుకుగా పెట్టడం**
**గ్లోబలైజేషన్' ! –**

ఈ కవితను వ్యాఖ్యానిస్తే పెద్ద విషాదకావ్యమే అవుతుంది. మనిషి అమ్మకం వస్తువై పోవడం, ఒక ధరకు అమ్ముడు పోవడం. ఇది వర్ణనాతీతమైన అమానుషమైన దోపిడీ. ఈ దరిద్రానికి కారణం కూడా అశోక్‌కుమార్ 'దూదూనేతన్నలు' అనే కవితలో వివరించాడు –

**'ప్రపంచీకరణకై**
**ప్రపంచ బ్యాంకు**
**విధులైన శాసనాలు !**

**అసెంబ్లీ, పార్లమెంట్‌ల్లో**
**బుర్రలూపుతున్న**
**విధిలేని ఆసనాలు' !**

అదీ సంగతి. ఓటు విలువ పరాభవింపబడుతున్న వైనానికి ఇది నిలువుటద్దం.

కవిగా తనకు శ్రీశ్రీ 'మహాప్రస్థానం' జన్మ నిచ్చిన కావ్యమని అశోక్‌కుమార్ తన తొలి కవితా సంపుటి 'తంత్రం'లో పేర్కొని తన తంత్రాన్ని 'మహాప్రస్థానానికే అంకితం చేశాడు. అది త్యాగాలతో కూడుకున్న గొప్ప దారి అని తెలిసీ అశోక్‌కుమార్ నడుం గట్టి కదం తొక్కడం ఆవేశపూరితమైనచర్యగా ఎవరూ కొట్టేయడానికి వీల్లేకుండా తన నాలుగు పదుల సాహిత్య జీవితంలో అచంచల విశ్వాసంతో ముందుకు, ముమ్ముం దుకు సాగిపోవడం యువ కవులకు స్ఫూర్తినిచ్చే విషయం.మహాకవి శ్రీశ్రీని తన గురువుగా, మార్గదర్శకుడిగా, తనను నడిపే నేతగా నమ్మిన సింగంపల్లి అశోక్‌కుమార్ Self made Poet.

**'అమెరికా కోర్టులో**
**భూమిలేదు!**
**భూమి కోర్టులోనే**
**అమెరికా ఉంది !'**

అంటూ తనదైన 'వ్యూహం'తో ప్రపంచానికే పీడగా మారిన అమెరికాను ప్రాసిక్యూట్ చేయడానికి సన్నద్ధమైన విప్లవకవి అశోక్‌కుమార్ ఒక తీవ్ర నిరసన, ఒక తిరుగుబాటు, ఒక మహోన్నత ఆదర్శం. ఆరు పదుల కామ్రేడ్ అశోక్‌కుమార్ 'షష్టిపూర్తి' ఉత్సవం జరుపుకుంటున్న సందర్భంగా ప్రేమతో జన్మదినోత్సవ శుభాకాంక్షలు తెలియజేస్తున్నాను. ■



# అశోకుడి కలం

భగ్వాన్

అతడి కలం నిరంతరం
సమస్త వాస్తవ ప్రపంచాన్నీ
ప్రేమగా
ముద్దాడుతూ వుంటుంది !

అతడి కలం అనునిత్యం
పేదవాడి తలపాగా కుచ్చులై
స్వతంత్రదేశపు జెండాలా
ఎగురుతూ వుంది !

అతడి కలానికి
చెమ్మగిల్లే కళ్లున్నాయి
అందుకే అది
అగ్నికురుస్తూ ఉంటుంది !

అతడి కలానికి
పరిమళించే హృదయముంది
అందుకే అది
సస్పందన భావసంపదను
విరజిమ్ముతూ ఉంటుంది

అతడి కలానికి
లక్ష ఆలోచనలున్నాయి
అందుకే అది
కవితయై రగులుతూ ఉంటుంది !

అతడి కలం
ఒలకపోసిన అక్షరాలు
కాంతి జలపాత
నక్షత్ర సమూహాలు !

అతడి కలం
పేర్చిన పదాలు
అనురాగ ప్రపూరిత
జనపదాల లోగిళ్లు !

అతని కలం
నడిచినంత మేరా
పరుచుకున్న వాక్యాలు
జనజీవన సంగ్రాపు
అలలకావ్యాలు

ఆ
అశోకుడి కత్తికి
కుత్తుకలు
ఖండించడమే తెలుసు !

ఈ
అశోక్ కలానికి
బతుకులు
పండించడమూ తెలుసు ! ■

## సంపద

కూలివాని / కాయానికి / పూస్తున్న పువ్వు !
యజమాని / ఉదరానికి / చేరుతున్న కొవ్వు !





# కేరాఫ్ ...

సత్యరంజన్

**ఈ సువిశాల భారతదేశంలో 'కేరాఫ్' అడ్రస్‌లేని జనాభా సుమారు 20 కోట్లు అట. అందరికీ 'ఆవాసహక్కు' కల్పించాలనే ఐక్యరాజ్య సమితి డిక్లరేషన్ మీద సంతకాలు అచ్చొత్తిన మహాఘనత వహించిన మనదేశంలో దుస్థితి ఇది. ప్రజలకు కనీస అవసరాలయిన తిండి, బట్ట, తలదాచుకొను గూడు కల్పించాల్సిన బాధ్యత నాగరిక ప్రభుత్వాలది. అయితే ఇవాళ - ఇలాంటి బాధ్యతల నుండి క్రమేపీ తప్పుకుంటున్నారు మన పాలకులు.**

అన్నీ 'మార్కెట్' చూసుకుంటుంది అని సుద్దులు చెపుతున్నారు. ఇళ్లపట్టాలు, సాగుభూములు లక్షిత ప్రజానీకానికి అందించడంమాట దేవుడెరుగు సెజ్‌ల పేరిట, జలయజ్ఞాలపేరిట ఉన్న భూములు, ఉన్న ఇళ్లు, ఊళ్లకు ఊళ్లు లాక్కొని ఘరానా బాబులకు కట్టబెడుతున్నారు. అధికారికంగా లెక్కతేల్చిన కేరాఫ్ అడ్రస్ లేని జనాభా జాబితాకు అనధికారికంగా ఇంకా అంతమందిని జతచేరుస్తున్నారు. అయితే కవులకు, కథకులకు, రచయితలకు, సాహితీవేత్తలకు ఇలా కేరాఫ్ అడ్రస్ లేకుండా పోయే ప్రమాదం లేకపోవడం నిజంగా ఒక వరంగా చెప్పుకోవాలి. 'కాలం' వాళ్ల చిరునామా. అయితే ఇందులోనూ చోటు దొరకని వాళ్లు వుంటే ఉండొచ్చుగాక - అది వాళ్ల స్వకీయప్రారబ్ధం. 'మనిషి'ని నమ్మినవాళ్లు పదికాలాలపాటు చిరస్థాయిగా నిలబడిపోయారు - ఒక గురజాడ, ఒక కందుకూరి, ఒక గిడుగు, ఒక శ్రీశ్రీ లాగా...

కీర్తి కోసం పాకులాడినవాళ్లు, అధికార పీఠం ప్రాపకాల కోసం, అవార్డుల కోసం, బిరుదుల కోసం పాకులాడినవాళ్లు కాలమనే వైకుంఠపాళీలో పెద్దపాము మింగేస్తే జారే చోటుకు చేరిపోయారు. సరే...వాళ్ల గురించి చెప్పుకునేది ఏముంటుంది ఇంక. ఏదో చెప్పబోయి ఎక్కడికో వెళ్లిపోయానంటారా...లేదు లేదు విషయంలోకి వస్తున్నా. కాలాన్ని శాసించిన కవులు, రచయితల గురించి చెప్పుకుంటున్నాం కదా. 'శ్రీశ్రీ' దగ్గర ఆగాం.

కాలాన్ని ఊగించి, శాసించిన 'మహాకవి శ్రీశ్రీ'. అటువంటి మహాకవి ఇవాళ మనమధ్య లేడు..ఉన్నాడు. భౌతికంగా లేడు, కానీ భావజాలపరంగా ఇంకా పదికాలలపాటు, తాను ఆశించిన సమసమాజం ఈ గడ్డమీద పాదుకునేవరకూ ఉంటాడు. అప్పటిదాకా అలాంటి మహాకవి కేరాఫ్ అడ్రస్ ఎక్కడంటే ఏమి చెప్పాలి?

నాకు తెలిసి మా బెజవాడలో రెండు చిరునామాలు ఉన్నాయి. ఒకటి 'శ్రీశ్రీ సాహిత్యనిధి', రెండు 'శ్రీశ్రీ ప్రింటర్స్'. బహుశా ఈ రెండు చిరునామాలు రాష్ట్రానికంతటికీ సుపరిచితాలే. అందులోనూ 'శ్రీశ్రీ సాహిత్యనిధి' ఇప్పుడిప్పుడే ఆ మహాకవి శ్రీశ్రీ శాశ్వత చిరునామాగా రూపుదిద్దుకుంటుంది.

జాతి నిర్మాతలు, స్ఫూర్తిప్రదాతల విగ్రహాలను భక్తిగా హైదరాబాద్ ట్యాంక్‌బండ్‌మీద, విశాఖ సాగరతీరాన, మా బెజవాడ తుమ్మలపల్లి వారి కళాక్షేత్రంలోనూ ప్రతిష్ఠించారు. గాంధీ - అంబేద్కర్‌ల విగ్రహాలూ ఊరూరా వెలిసాయి. ఇవాళారేపూ ఊరూరా కొత్త విగ్రహాలు వచ్చి చేరుతున్నాయి. గాంధీ - అంబేద్కర్‌ల విషయంలోనయితే 'స్ఫూర్తి'ని చంపేసి వాళ్లని ఒట్టి మట్టి 'మూర్తు'లుగా మిగిల్చారు.

మహాకవి శ్రీశ్రీకి ఈ ప్రమాదం తప్పిపోయింది. విగ్రహారాధన తప్పనికాదుగానీ ఒట్టి'మూర్తు'లను నిలపడం మూలంగా ఒరిగేది ఏముంది?

# అక్షర హాలికులు

అశోక్‌కుమార్



## బొమ్మారెడ్డి

(1917 -2006)



## 'ప్రజాశక్తిమంతుడు'

కాదతడువ్యక్తి
రణప్రజాశక్తి
ప్రజాపక్షపాత
పాత్రికేయకత్తి

అందుకే 'శ్రీశ్రీ సాహిత్యనిధి' తన Preambleగా ఏం ప్రకటించుకుందంటే - "శ్రీశ్రీ భావాలను సాగు చెయ్యడం శ్రీశ్రీ అభిమాని విధి ! శ్రీశ్రీ భావాలు పోగు చెయ్యడం శ్రీశ్రీ సాహిత్యనిధి" అని.

గత మూడేళ్లుగా శ్రీశ్రీ పేరిట త్రైమాసిక బులెటిన్, సుమారు నెలకు ఒకటి చొప్పున ఇప్పటి దాకా ఓ ముప్పైకిపైగా శ్రీశ్రీ సాహిత్య ప్రచురణలు వెలువరించింది.

అన్నింటా వ్యాపార ధోరణి ప్రబలిపోయిన ఈ రోజుల్లో ఇంత కృషి చేసిన ఆ సంస్థ ఓ పెద్ద 'ఎస్టాబ్లిష్ మెంట్' అనుకుంటే మీరు పొరబడినట్టే. ఇదంతా నడిపేది ఒక వ్యక్తే. అతడే సింగంపల్లి అశోక్ కుమార్.

అశోక్‌కుమార్‌తో నా పరిచయం గురించి ప్రత్యేకంగా చెప్పుకోవాల్సింది అంతగా ఏమీలేదు. సాహిత్య పఠనం మీద, ప్రత్యేకించి కవిత్వం అంటే ఇంకొంతపాలు ఉన్న ఇష్టంకొద్దీ పుస్తకాల షాపులకు, సాహిత్య సమావేశాలకు కాస్త ఎక్కువగానే తిరుగుతూ వుండేవాణ్ని నేను.

'నవోదయ' రామ్మోహనరావుగారు నేను కనబడ గానే ఆ నెల వచ్చిన కొత్త కథల పుస్తకమో, కవితా సంపుటో తెచ్చి చేతికి ఇచ్చేవారు. 'మైత్రిబుక్‌హౌస్'లో ఉమామహేశ్వరరావునే కథా రచయితగా పొరబడి అమాయకంగా అతన్నే అడిగేసి ఆనక సిగ్గుపడి ఇక ముందు ఎవర్నీ నా అంచనాలను బట్టి పరిచయం చేసుకోకూడదని గట్టిగా ఒట్టుపెట్టుకున్నా. 'ప్రజాశక్తి బుక్‌హౌస్'లో కెవి, మైత్రి ఉమామహేశ్వరరావులు సామాజిక రాజకీయ విషయాల మీద కొత్తగా వచ్చిన పుస్తకం అలాచేతిలో పెట్టేవారు. (డబ్బులకే సుమా) ఇహ నేను హాజరయిన సాహిత్య సమావేశాల్లో రచయి తల, వక్తల పరస్పర అభినందనలపర్వం చూసి మురిసి ముక్కలయిపోయి 'ఇట్లాంటి మీటింగ్ లకు ఇహ పోనుగాక పోను' అని రెండో ఒట్టు పెట్టు కున్నా. మే 1వ తేదీన రెగ్యులర్‌గా శ్రీశ్రీ విశ్వేశ్వరరావు టాగూర్ గ్రంథాలయంలో జరిపే పుస్తకావిష్కరణకు మాత్రం ఈ ఒట్టునుండి మినహాయింపు ఇచ్చు కున్నా. పగటి సమయంలో ట్రేడ్‌యూనియన్ కార్యకర్తగా అంతర్జాతీయ శ్రామిక దినోత్సవ నిర్వహణలో గడిపేసి సాయంకాలానికి విశ్వేశ్వరరావు మీటింగ్‌కు ఠంచనుగా హాజరయిపోయేవాణ్ని. కాస్త చనువు ఏర్పడ్డాక, 'మేడే' రోజున సాహిత్య సమావేశం నిర్వ హించడం బాగా నచ్చిందినాకు, ఉద్యోగులు, కార్మి కులు సాహిత్యాన్ని కూడా తమ జీవితంలో భాగం చేసుకోవాలని గుర్తు చేస్తున్నారు అంటూ నే కనిపెట్టిన థియరీ చెప్పాతనకి. దానికి జవాబుగా విశ్వేశ్వరరావు ఇవాళ 'సుందరయ్య వర్ధంతి' అందుకే ఈ రోజు పెట్టా అన్నాడు ఠకీమని-మళ్లీ నా అజ్ఞానం నా మొహాన ఓ వెర్రి నవ్వు నవ్వింది.

అదిగో అలాంటి మీటింగ్‌ల్లో ఒక మనిషి నాకు ప్రత్యేకంగా తోచేవాడు. మడతనలగని ఇస్త్రీ బట్టలు, ఇన్‌షర్ట్, బెల్ట్, బూటు- కాని చేతిలో అనాకారి తనంగా సంచితో ఒక మనిషి తగిలేవాడు. మనిషి చూడ్డానికి 'టిప్‌టాప్'గా ఉన్నాడు, అసహ్యంగా చేతిలో సంచి ఏమిటి అనుకునేవాణ్ని మనసులో. కాని నా కళ్ల ఎదురుగానే అతను ఆ సంచిలోంచి పుస్తకాలు తీసి మీటింగ్‌కు వచ్చిన కవి, రచయిత ప్రముఖులకు అందజేస్తుంటే అప్పుడు కనిపించింది ఆ సంచి నాకళ్లకి 'అక్షయపాత్ర'లా. కానీ ఆ పెద్ద మనిషి మనకి ఆ భాగ్యం కలిగించలేదు. 'ఫోసోస్' అని బింకంగా, డాబుగా ఉండిపోయా. రెండుమూడేళ్లు ఇట్టానే గడిచి పోయాయి. ఇహమనబెట్టు మెట్టుదిగింది. విశ్వేశ్వ రావుని అడిగా-ఎవరు అతను? అని. 'తెలీదా' అశోక్ కుమార్ కదా! అన్నాడు. ఈ విశ్వేశ్వరరావ్‌తో ఇదే తంటా. అంతా షార్ట్‌హ్యాండ్‌భాష. నేనేమన్నా స్టెనోగ్రా ఫర్నా. వివరంగా చెప్పొద్దూ. తనూ చెప్పలేదు. నేనూ అడగలేదు.

ఆ తర్వాత తర్వాత కొన్నాళ్లకి ఆ 'టిప్‌టాప్' అశోక్ కుమారే నే పనిచేసే ఆఫీస్‌కి వచ్చాడు. అందు లోనూ మనది 'విక్రమార్క సింహాసనం'. 'రండి రండి' అని డాబుగా మా క్యాషియర్ బోనులోకి ఆహ్వానించి, ఉచితాసనం వేయించి, టీ ఒకటి కొట్టించి చెప్పండి అనడిగా. నాతో పనిబడి వచ్చినందుకు హుషార్‌గా ఉన్నా. ఏదో చిన్న బ్యాంక్ లావాదేవీ, గుర్తుకూడా లేదు. అయ్యాక 'మా ఆఫీస్ ఇక్కడే ఒకసారి రండి' అని మాట వరసకి చెప్పి వెళ్లిపోయాడు.

మనం వదుల్తామా, దానికిదే సందుకదా. రమ్మన్నదే ఆహ్వానంగా వాళ్లఆఫీస్‌లోకి దూరి పోయా మర్నాడు. టేబుల్‌మీదా, పక్క ర్యాకుల్లో పుస్తకాలు. చూడగానే మనకి పనికొచ్చే సరుకే అను కున్నా. ఎదురుగా ఉన్న పుస్తకం అందుకుని తిరగేసా. మినీ కవితల పుస్తకం. 'జన్మభూమి' మీద రాసిన కవిత నన్ను విపరీతంగా ఆకట్టుకుంది. పైకిచదివా **" జన్మ భూమి / వీడిది ! రామజన్మభూమి / వాడిది ! మాతృభూమి / అప్పులోడిది !"** చంద్రబాబు నాయుడు మీద జనానికి ఉన్న అక్కసంతా నాలుగు పంక్తుల్లో ఒదిగించడం బాగా నచ్చిందినాకు. అలాగే మతో న్మాదం మీద రాసిన కవిత **"మతరాజకీయాల/ మహాయజ్ఞంలో/ సమిధలైపోయిన వాళ్లని/ హిందు వులా, ముస్లింలా అని / పోస్టుమార్టం చేస్తే / మను షులని రిపోర్టువచ్చింది.'** ఆ మాటే పైకి అన్నా. అశోక్ కుమార్ నవ్వి ఇంకో రెండు మూడు పుస్తకాలు తీసి నాచేతికిచ్చి 'చదవండి' అన్నాడు. అప్పుడు తెలిసింది 'అశోక్‌కుమార్ కవి' అని.

నాకు మా చెడ్డఅలవాటు ఒకటుంది. యూని యన్ కరపత్రాలో, ప్రత్యేక సంచికలో తీసుకు రావల్సినప్పుడల్లా, ఏ అనువాదమో చేయాల్సినపుడల్లా అశోక్‌కుమార్ కవితా సంపుటులు తిరగేసి విషయాను కూలంగా వున్నవాటిని ఎత్తి వాటిల్లో చాలా 'నాక్‌గా'

చొప్పించేసేవాడిని. 'మావాళ్లు' కరపత్రంలో 'పంచ్' ఉండాలని నన్ను ఆదేశించినప్పుడల్లా కావల్సినంత 'పంచ్' ఆ రకంగా అశోక్ కుమార్ మినీకవితా సృష్టి సారాంశాన్నించి ఉపయోగపెట్టుకుంటూ వచ్చా. (దీన్నే 'స్కూపింగ్'అంటారా?ఏమో!) అంతకు ముందు కూడా దాము, వంశీకృష్ణ, వసీరా,దెంచనాల, కోడూరి విజయకుమార్, ప్రభు, కొండేపూడి నిర్మల, మాణిక్యం, సీతారాం, నామాడి శ్రీధర్, పైడి తెరేష్ బాబు, నున్నా నరేష్, పులిపాటి, అరుణ్‌సాగర్ ఇలా చాలామంది కవితలను, కరపత్రాల మధ్యన ప్రచారం చేసా. కానీ ఎక్కడో ఓ జంకు/ ఏం లడాయి వచ్చి పడతదో అని. కానీ అశోక్‌కుమార్‌తో అలాంటి ఇబ్బంది ఎదురవుతుందనే ఊహ కూడా తట్టలా నాకు ఇప్పటిదాకా. 'ఫ్రీ ఫర్ ఆల్' అనే ఫీలింగో లేక దబాయించొచ్చులే అనే ధైర్యమో తెలీదు.

అశోక్ కుమార్‌తో నా పరిచయం పెరిగే క్రమం లోనే మహాకవి శ్రీశ్రీ సాహిత్యాన్ని మరోసారి చదివే అవసరం, అవకాశం కలిగాయి.

సాహిత్యం అంటే నే చూపించే ఆసక్తి గమనించో, ఏమో తెలకపల్లి రవిగారు నన్ను 'సాహితీ స్రవంతి' విజయ వాడ నగర బాధ్యతలు చూడమని ప్రోత్సహించారు. బొత్తిగా నాకు పరిచయం లేనిపని. కార్మిక సంఘంలో పనిచేసి కామ్రేడ్ అనడం, సంఘం జిందాబాద్, యాజమాన్యం నశించాలి అని నినాదాలు ఇవ్వడానికి అలవాటుపడిపడి సాహిత్య కార్యకర్తగా నన్ను నేను సంభాళించుకోవడానికి చాలా కాలం పట్టింది. ఇందుకు 'మార్క్సిస్ట్ సిద్ధాంతపత్రిక ఎడిటర్ వెంకట్రావుగారు, రావెళ్ల, 'చినుకు' రాజగోపాల్, కేశవరెడ్డిగారు, నారాయణ ఇచ్చిన తోడ్పాటు ఒక ఎత్తయితే అశోక్‌కుమార్ అందించిన తోడ్పాటు మరోఎత్తు.

కార్యక్రమాలు నిర్వహించడానికి కరపత్రాలు తియ్యడం, శ్రీశ్రీ విశ్వేశ్వరరావు దగ్గర అచ్చు వేయిం చడం, సమాచారం పదిమందికీ అందించడం, మైకు సెట్టింగ్‌ల ఏర్పాట్లువంటివి 'వీజీగా' చేసెయ్యడం వచ్చు (యూనియన్‌లో పనిచేస్తున్న అనుభవం పనికొ చ్చింది) కానీ సభ జనరంజకంగా విషయస్ఫూర్తితో నడిపించాలంటే వక్తలుగా ఎవరిని ఆహ్వా నించాలి, ఎలా సంప్రదించాలి అనేవి నిర్ణయించు కోవాల్సి వచ్చేసరికి నాకు గొంతులో పచ్చి వెలక్కాయ పడేది. వెళ్లి అశోక్ కుమార్ దగ్గర కూర్చునేవాడ్ని. నాలుగైదు పేర్లు ప్రతిపాదించేవాడు. నేను ఆలోచించి (మనకి ఏం తెలిసి చచ్చుగనుక) లాటరీ పద్ధతిలో వీరిలో ఒకరిని అనుకుని 'ఈయన్ని పిలుద్దామా' అనడిగేవాడ్ని, ఎంచుకున్న విషయాన్ని బట్టి చివరకి తనే ఒక పేరు ఖాయం చేసేవాడు. వక్త రెడీ, కార్య క్రమం సాహితీస్రవంతిది. పిలుపులు మాత్రం అశోక్‌కుమార్‌వే. సింగమనేనిని పిలి పించినా, కడియాల వారితో సభ జరిపినా – వక్తల వరకూ తిప్పలు అశోక్‌కుమార్ పడేవాడు. అలా విజయవాడ 'సాహితీస్రవంతి' యూనిట్‌కు 'శ్రీశ్రీ సాహిత్య నిధి'కి అవినాభావ సంబంధం ఏర్పడిపోయింది.

'శ్రీశ్రీ బులిటెన్' విజయవాడలో ఆవిష్కరిం చడం, దానికి నాలుగు అభ్యుదయ సాహిత్య సంఘా లనూ ఒక వేదిక మీదకు ఆహ్వానించడం చక్కటి సభ నడపడం అశోక్‌కుమార్ చొరవ, కృషి వల్లనే సాధ్యమైందని చెప్పవచ్చు.

ప్రపంచీకరణ నేపథ్యంలో సాంస్కృతిక రంగం మీద పెనుదాడి జరుపుతూ పాలకవర్గాల భావజా లమే ప్రజల భావజాలంగా చలామణీ అవుతున్న ఈ రోజుల్లో 'మానవాభ్యుదయాన్ని' సమసమాజాన్ని' కాంక్షించే సాంస్కృతిక సంఘాలు ఏమేరకు వీలయితే ఆమేరకు కలిసి పనిచెయ్యాలనే ఆలోచనను ఆచరణకు తీసుకురావాలన్నది అశోక్‌కుమార్ తపన, ఆర్తి. ఈ ఆలోచనపట్ల సాహితీస్రవంతికి సమాదరభావం వుంది.

ఫలితంగానే సాహితీస్రవంతి – శ్రీశ్రీ సాహిత్య నిధి ఈ మధ్య కాలంలో సంయుక్తంగా అనేక కార్య క్రమాలు నిర్వహించగలిగాయి. అందులో భాగంగానే నెలనెలా సామాజిక అంశంమీద ఒక పుస్తకం, సాహిత్య పరమైన అంశంమీద ఒక పుస్తకం పరిచయ కార్యక్రమాలు జమిలిగా నిర్వహిస్తున్నాయి.

సాహిత్యంఅంటే శ్రీశ్రీయేనా. ఆ పుస్తకాలు తప్ప మరో కవిపరిచయం చెయ్యకూడదా అని కొంత మంది మమ్మల్ని అడుగుతుంటారు. సాహిత్యం అంటే శ్రీశ్రీయేనో కాదో గానీ శ్రీశ్రీలేని తెలుగు సాహిత్యాన్ని ఊహించలేం కదా.

మరుపు మానవసహజం. చరిత్ర నైజం. మహా మహా గొప్ప రచనలే కాలం చెల్లిపోతున్నాయి. కానీ దోపిడీదారీ, పెట్టుబడిదారీ వ్యవస్థ ఉన్నంత వరకూ 'శ్రీశ్రీ రచనలు' ముఖ్యంగా 'మహాప్రస్థానం'కు కాలం చెల్లే ప్రసక్తేలేదు.అలాంటి శ్రీశ్రీసాహిత్యాన్ని నిరంతరా యంగా ప్రజలకు అందించాలన్న సంకల్పంతో పని చేస్తున్న అశోక్‌కుమార్ కృషిని అభినందించడం అంటే ఒక్కడుగా తను మోస్తున్న బాధ్యతల మీద మరింత భారంమోపడమే. అశోక్ అంత శక్తిమంతుడు కనుకే నేనీ భారంమోపుతున్నా.

అన్నట్టు అశోక్‌కుమార్‌కు ఈనెల–6వ తేదీతో అరవయ్యోఏటలోకి అడుగిడుతున్నాడట.అప్పుడే 'షష్టి పూర్తా!' పోదు బడాయి అంటారు మీరు అశోక్‌ను చూస్తే. 'శ్రీశ్రీసాహిత్యనిధి'ని తను సాగుచేస్తున్న తీరు చూస్తే అరవై ఏళ్ల అశోక్‌కుమార్ అని చెప్పినందుకు నాకేసి జనాలు ఎగాదిగా చూడడం ఖాయం. ఎవరే మనుకున్నాగానీ కాలం చేసిన ఈ మాయాజాలం తన సంకల్పానికి అడ్డంకి కాదని, కాబోదని బలంగా విశ్వసించే వాళ్లలో నేనొకణ్ని. అందుకే అశోక్ అందుకో నా అభినందనలు.

'త్రీ ఛీర్స్'
ఒకటి శ్రీశ్రీకి,
రెండవది శ్రీశ్రీసాహిత్యనిధికి,
మూడవది నీకు. ■



**కాళీపట్నం రామారావు**

( 1924 )

కథానిలయం
ద్వారా
కథకు
జరుగుతున్న
కృషిలాంటిది,

శ్రీశ్రీ సాహిత్యనిధి
ద్వారా
శ్రీశ్రీపై
జరుగుతున్న కృషి.

( జనవరి,2009 )

## పుట్టలోని చెదలు

నేడు / పుస్తకాలకి / పురుగులు
రేపు / విదేశాలకు / పరుగులు





# మనిషి ముఖ్యం

కె. శివారెడ్డి

'కమ్మో రెడ్డో, కాపో / అంటాడు గాని /
మనిషినని చెప్పడేం ?
హిందువో, ముస్లిమో, క్రిస్టియనో / అంటాడు గాని /
మనిషినని చెప్పడేం ?
ఇండియనో, అమెరికనో, రష్యనో / అంటాడు గాని /
మనిషినని చెప్పడేం ?
అసలిక్కడ / మనుషులే లేరా ? /
వీళ్లు మనుషులు కారా ??'

ఓ నెల రోజుల కిందట, అశోక్‌కుమార్, 'పొద్దుపూసింది' కవితల జిరాక్స్ కాపీ యిచ్చి, ముందుమాట రాయమన్నాడు. 'సరే' అని పట్టుకొచ్చా. అన్నీ కలిపి యాభై మూడు చిన్న కవితలు. ఒక పది నిమిషాల్లో అయిపోతాయి చదివితే. నెల నుంచి తిరగేస్తున్నా. 'ఏం రాయాలి'. ముందుమాటకైనా 'ఓపెనింగ్' ముఖ్యం. అక్కడ్నుంచి తతిమ్మాది 'అన్‌ఫోల్డ్' అవుతూ వెళ్తుంది. కవితకిగాని, కథకిగానీ, నవలకిగానీ, సినిమాకిగానీ, 'ఓపెనింగ్' చాలా కీలకం అనుకుంటా. జీవితం ఎంత పెద్దది. ఎంత విశాలమైంది. ప్రపంచమంత – ప్రపంచమంత జీవితాన్ని చిన్న కథలోనో, కవితలోనో, ఇరికించే నేర్పునే కళ అందామా? ఇన్నాళ్ల నుండీ కొట్టుకుంటున్నా నాకేం తెలిసింది? తెలుసుకొనేకొద్దీ తెలియంది అనల్పమైపోతుంది.

చాలా విషయాలు చాలా ఆలస్యంగా తెలుస్తాయి. జీవితం అప్పటికే చాలా అయిపోతుంది. ఐపోయిన జీవితాన్ని అవలోకించి ఆనందించవచ్చు. ఆవేదన చెందవచ్చు, విశ్లేషణ చేసుకోనూవచ్చు - ఇది ఎవరి వ్యక్తిగత అవగాహనసుబట్టీ, అధ్యయనాన్నిబట్టీ, ఆచరణనుబట్టీ ఉంటుంది. నువ్వు ఎక్కడ నుంచుని ఈ 'దారపుండను' వలుస్తావు అనే దాన్ని బట్టీ వుంటుంది. నీ కోణం నీ ప్రాపంచిక దృక్పథమే; ముడి సరుక్కి ఒక ఆకారాన్నీ, అందాన్నీ, ప్రసాదించేది బహుశ ఈ దృష్టేనేమో!

పైన నేనుదహరించిన అశోక్‌కుమార్ కవితని చూడండి-చాలా సరళంగా, హాయిగావుంది; అయితే కవి ఆర్తి ఎక్కడుంది? ఆత్మ ఎక్కడుంది? కవి ఏం ఆశిస్తున్నాడు? ఈ వర్గ, వర్ణ, కుల, ప్రాంతీయ, సమాజంలో కవి ఏం క్షోభిస్తున్నాడు? ఆరాట పడుతున్నాడు? - 'మనిషి కోసమే'!

'మనిషి మనిషగుట / ఎంత దుష్కరమ్ము సుమ్ము! - అన్నాడు దాశరథి.

'దేశమంటే మట్టికాదోయ్ / దేశమంటే మనుషులోయ్ ! - అన్నాడు గురజాడ. ఈ మట్టికి ఒక ఉనికిని, అందాన్నీ ఇచ్చేవాడు మనిషే ! మనిషి వినా ఏముంది ఇక్కడ ? ఇన్నాళ్ల చరిత్ర, నాగరికత, సంస్కృతి, అంతా మనిషి ప్రమాణమే; మనిషిగా మారే ప్రయాణమే.

అశోక్‌కుమార్ కవిత్వానికి మూల ధాతువు మనిషి; మనిషి కోసం మనిషి తపన. తనచుట్టూ తిరుగుతున్న ప్రపంచాన్ని అనుభవిస్తూ, కవిత్వంలో వడ కడుతున్నాడు. జీవితం సులభంగా కనబడే సంక్లిష్ట, సంకీర్ణ ప్రాణి. దాన్ని అనుభవించడం, ఆనువదించడం - కళ, కవిత్వం.

**'రెండూ తుపాకులే**
**ధనం తరపున ఒకటి**
**జనం తరపున ఒకటి'**

బహుశా వ్యాఖ్యానమక్కరలేని కవిత -

**'ఎర్రబడిన ఇనుము**
**తగులుతున్న దెబ్బలకు**
**ఆయుధాలుగా మారుతోంది'**

మూడు వాక్యాల్లో చాలా చెప్పాడు. దీన్ని గురించి చాలా వివరణ యివ్వొచ్చు. కవిత్వం అనుభవించమన్నారుకదా?

అశోక్‌కుమార్ వామపక్ష భావాభిమాని. అతనిది మార్క్సియన్ దృక్పథం. నువ్వు ఈ ప్రపంచాన్ని ఎలా అర్థం చేసుకుంటావు, ఏ పరికరంతో విశ్లేషిస్తావు, అనే దాన్నిబట్టి అతని కవిత్వం ఉంటుంది. అంతిమంగా దృక్పథమేదయినా కవిత అనుభూతమవ్వాలి. అది కళ కాకపోతే దాన్ని అనుభవించలేవు. దృక్పథమేదైనా, భావజాలమేదైనా - అందుకని, 'స్ట్రగుల్' అంతా 'పోయమ్' చేయడం ఎలా? పాఠకుడిలోనికి పంపడం ఎలా? ఇన్నాళ్ల అతని సాధన. అనుభవం, అధ్యయనం, ఆచరణ, అన్నీ అతనికొక దోవ చూపించాయి.

అశోక్‌కుమార్ నాతో అన్నాడు; 'ఈ తరహా ప్రక్రియలో ఇప్పుడు చుట్టూ వస్తున్న కేవలం సౌందర్యానుభూతి కవిత్వానికి ప్రయోజనం లేదు. కవిత్వం ఏ ప్రక్రియలో ఉన్నా దానికి ఒక సామాజిక కోణం, ఒక సామాజిక ప్రయోజనం, ఒక దిశా నిర్దేశనం ఉండాలి -

**'నేటి కవితకు**
**అల్లిక నేర్పే కాదు**
**అల్లిక తీర్పూ కావాలి' -**

అందుకోసం ఇవి మొదలు పెట్టినట్టు. ఏ మాత్రం కృతకృత్యుడయ్యాడు అనేది పాఠకులు నిర్ణయించాలి. నా మట్టుకు నాకు విజయవంతమయ్యాడనే.

**'సగటు జీవితం**
**ఐతుకంతా గాడిద**
**చచ్చాక బూడిద'**

ఎవరు? ఎందుకు? దాన్నదే వ్యాఖ్యానించుకుంటుంది. ఇలా నిర్వచించుకుంటూ ఈ ప్రక్రియ వెడుతుంది. ఈ నిర్వచన కవితలన్నిటికీ బహుశ వేమనను ఆద్యుడిగా గుర్తించారేమో. వెనక్కి వెడితే దీని మూలాలూ దేశీయమైనవే.

**'జన పోరాటంలో ప్రజలు**
**ఆయుధాలు పట్టుకోరు**
**ఆయుధాలుగా మారతారు'**

హి సమ్స్ అప్ ఎవ్విరి థింగ్. ఎన్నని ఉదహరించను. ప్రతి కవితా ఉదహరించాలనిపిస్తోంది. బహుశ గుర్తుపెట్టుకోడానికీ, తరచు ఉదహరించడానికీ ఈ కవిత బాగా ఉపయోగపడుతుంది. వినగానే గుర్తుండిపోయే లక్షణం దీనికి ప్రాణం.

అశోక్‌కుమార్ కవిత్వానికి కొత్తవాడేం కాదు. గత మూడు దశాబ్దాలుగా ఈ రంగంలో మునిగి తేలుతున్నాడు. ఏది ఏమిటనేది ఆయనకు తెలుసు. ఈ తాంత్రిక విద్యలో మునిగే కొలదీ మునగడం తప్ప తేలడం ఉండదు. మునగడమే ఆనందం.

**'పుడమి వీరుల గాయాలతో**
**తడిసిన అంబరం కింద**
**సరిహద్దులు చెరిగిపోతున్నై'**

సరిహద్దులు లేని ఒక శ్రమ సౌందర్య ఆనంద పరిపూర్ణ జీవితాన్ని ఆవాహన చేస్తున్న అశోక్ కుమార్‌కి మన:పూర్వక అభినందనలు. ■



**డా॥ సి.నారాయణరెడ్డి**
**( 1933 )**

**"సిరిసిరి పాపకు**
**అరవై యేళ్ళట**
**జ్వాలా శిశువుకు**
**షష్టిపూర్తియట"**

అనే పంక్తులు
శ్రీశ్రీని
తలచుకున్నప్పుడల్లా
నా కళ్ళముందు నిలుస్తాయి.

"శ్రీశ్రీ సాహిత్యనిధి"కి
రూపకల్పనచేసి
అతనికి సంబంధించిన
సమాచార సర్వస్వాన్ని
పాఠకులకు అందిస్తున్న
శ్రీ అశోక్‌కుమార్ సంకల్పం
ప్రశంసనీయం.

( ఏప్రిల్, 2009 )

## కొబ్బరికాయ

తనని రాయికేసి / కొట్టినందుకు / కన్నీరు కురిసినా
రాతిబొమ్మలను తలచి కొలిచే/నీ మూఢత్వానికి/తెల్లగా పగలబడినవ్వుతోంది





# షష్టిపూర్తికి

విశ్వేశ్వరరావు

వేంకటరమణా...గోయిందా! గోయింద !! అని అనాలనిపిస్తోంది నాకు !
1979లోనో, '80లోనో మిత్రుడు పాంచజన్య మద్రాసు వెళ్లి శ్రీశ్రీని కలిసి ఇంటర్వ్యూ చేసే నెపంతో కొన్ని ఫొటోలు తీశాడు.
ఒంటిమీద చొక్కా లేకుండా, సగం చొక్కా వేసుకుని...
ముఖ్యంగా ఇంటి డోర్ కర్టెన్ శ్రీ వేంకటేశ్వరస్వామి వారి నిలువెత్తు బొమ్మతో ఉండి, దాని ముందు కుర్చీలో చిద్విలాసంగా నవ్వుతూ శ్రీశ్రీ
ఏం నాయనా ఇలాంటి ఫొటోలు తెచ్చావు అంటే
గురువుగారూ..గురువుగారి ఫొటో ఇది బాగా పేల్తుంది అన్నాడు.
శ్రీశ్రీ గారిని అడిగావా అంటే,
సరోజగారికి ఇష్టం. అందుకు డోర్ కర్టెన్‌గా ఆవిడ వెంకటేశ్వరస్వామిని ఎంచుకుంది
దీనికి మన ప్రమేయం ఏమీ లేదు నాయనా అని శ్రీశ్రీ సమాధానం...

\- \- \-

సైన్సున్నమ్మి శ్రీశ్రీ తన పార్థివదేహాన్ని విశాఖ మెడికల్ కాలేజీకిమ్మంటే
వెంకటరమణ శాస్త్రీయంగా దహన సంస్కారాలు చేశాడు.
శ్రీశ్రీ గారు పుస్తకాల మీద ప్రచురణ హక్కులు జూనియర్ శ్రీశ్రీవి అని కొడుకు వెంకటరమణకి తన రచనలన్నీ ధారపోశాడు.
శతజయంతి నాటికి వెంకటరమణ కనపడలా !

\- \- \-

పరమనాస్తికుడు, అమ్మల్ని, బాబాల్ని దుమ్మెత్తిపోసి పుస్తకాలు రాసి శ్రీశ్రీతో సర్టిఫికెట్ పొందిన
మన అశోక్ కుమార్ షష్టిపూర్తికి ఏం రాయాలో తెలియటం లేదు.
శ్రీశ్రీ ప్రింటర్స్ విశ్వేశ్వరరావుని చూస్తే జలసీ అన్న అశోక్
విశ్వేశ్వరరావుపై ప్రేమపెంచుకుని నూరేళ్ల శ్రీశ్రీ పనుల్ని అప్పగించి
నన్నధిగమించి పోసి నేనే ఈర్ష్య పడేలా నన్ను మరుగుజ్జుని చేశాడు.
మహాప్రస్థానం షష్టిపూర్తి అశోక్ షష్టిపూర్తిగా చేసుకోవడం
నాకెంతో ఆనందంగా వుంది.
అశోక్‌కి మన:పూర్వక అభినందనలు.... ■

## సారాంశం

విస్కీ, బ్రాందీ, జిన్ను, రమ్ములు, / మందేదయినా / మత్తు ఒక్కటే !
హిందూ, ముస్లిం, క్రిస్తవమ్ములు, / మతమేదయినా / కిక్కు ఒక్కటే !





# మినీ కవిత్వంలో బిగ్ 'ఎ' అరవై వసంతాల అక్షరహాలికుడు

కె.వి.యస్.వర్మ

**మినీ కవితా ప్రక్రియ ప్రారంభమైన రోజుల్లో అశోక్‌కుమార్ కొద్ది రోజుల్లో అశోక్‌కుమార్ కొందరిలో ఒకడు. అప్పట్లో కొందరు మాత్రమే మంచి మినీ కవితలు రాశారు...**
**'కన్ను తెరిస్తే జననం, కన్నుమూస్తే మరణం, రెప్పపాటే కదా జీవితకాలం' వంటి గొప్ప మినీ కవితలు కూడా వచ్చాయి. ఎక్కువ మంది నినాదాలనే మినీ కవిత్వమంటూ రాశారు. అలిశెట్టి ప్రభాకర్ తను బతికున్నంతకాలం మినీ కవితను వదలలేదు. ఓ పత్రికలో మినీ కవిత్వంలో రోజువారీ కాలమ్ కూడా నిర్వహించాడు. అతని తర్వాత మినీ కవిత్వాన్ని ఆయుధంగా చేసుకున్నవాడు అశోక్‌కుమార్.**

ఆ మధ్య కొంతకాలం మినీ కవిత్వం కనిపించలేదు.. వినిపించలేదు ... అలాంటి సమయంలో అశోక్‌కుమార్ మళ్లీ కలంపట్టాడు. తన మినీ కవితా యుధానికి పదును పెట్టాడు. అదును ఎరిగినవాడు కనుకే తను మాత్రమే రాస్తూ కూర్చోక 'చినుకై' ఎందరికో స్ఫూర్తినిచ్చి రాసేలా చేశాడు. 'చినుకు' పత్రికలో అతను నిర్వహిస్తున్న 'అణువు' బ్రహ్మాండంగా విజయవంతమైంది. అందుకు ముఖ్యకారణం ఆ శీర్షికలలో కూడా తను రాస్తూ ఇతరులతో రాయించడమే. 'కాదేదీ కవితకనర్హం' అని నమ్మడమే...

అశోక్‌తో నా పరిచయం దాదాపు ముప్ఫయ్యేళ్ల నాటిది.మా పరిచయమయ్యే నాటికి అతను కవిత్వం రాస్తున్నట్టు గుర్తులేదు. కానీ, హేతువాదం,మార్క్సిజం మమ్మల్ని దగ్గరచేశాయి.అప్పట్లోఅయితే,అశోక్ రాయడంమొదలెట్టాక ఒక్క సారిగా విజృం భించాడు.'తల్లీ! ఎవరునువ్వు?','శ్రీబాబామహత్యం','బాలయోగీశ్వర సందర్శనం','మతప్రస్థానం'పుస్తకాలు వెలువరించాడు.ఇవన్నీ దీర్ఘ కవితలు కావడం గమనార్హం.ఆ తర్వాతి కాలంలో-మినీకవితా ఉద్యమం కాలం లోనే మినీకవిత్వం ప్రారంభించాడు.మార్క్సిస్ట్ కావడంవల్ల అతని మినీకవితకు జవం, జీవం అబ్బాయి. 'మనిషికై, సరుకులు పుట్టడం, సివిలైజేషన్ / మనిషినే సరుకుగా పెట్టడం గ్లోబలైజేషన్' అని ఎంతో సులువగా అనగలిగాడు. అయితే, అది రాయడానికి ముందు ఎంతో తపన,ఆలోచన తప్పకవుంటాయి.ఆ కష్టం పాఠకునికి కనిపించకుండా చూపడమే కవి గొప్పతనం.అందుకు భాషమీద పట్టు కూడా అవసరమే.అది తనలో పుష్కలంగావుందని ఎన్నో కవితలు చెప్పక చెబుతున్నాయి.

కొంతమంది కవులూ, రచయితల్లాగే అశోక్ రచనా వ్యాసంగంలో కొన్నేళ్ల విరామం వుంది. తిరిగి కలం పట్టాక 'శుభాకాంక్షలు', 'తంత్రం', 'పొద్దుపూసింది', 'ఆధ్యాత్మిక ర'హ'స్యాలు', 'వ్యూహం', 'గ్లోబలి' పుస్తకాలు తీసు కొచ్చాడు.

'శుభాకాంక్షలు' దీర్ఘ కవితలో సంప్రదాయంగా నూతన సంవత్సర శుభా కాంక్షల్ని చెప్పుకునే వారికి కనువిప్పు కలిగించాడు.'వాసన వాసన!అంతా వాసన! వెలుతురు మలిగిన వాసన! ఇంత వరకూ ఏ కవి అయినా రాయగలడు. ఆ తర్వాత, 'చీకటి వెలిగినవాసన' అన్నాడు. అందులో ఉంది చక్కని చిక్కని కవిత్వం.

'తంత్రం' కవితాసంపుటి దాదాపు ఎన్నికలూ రాజకీయ నాయకుల కుతం త్రాలగురించే.'ఛలోక్తి'లో గంటకాలం, సెక్యూరిటీలేకుండా తనని రక్షించు కోలేని **నేతలు!'జీవితకాలంప్రజలనురక్షిస్తామంటూకోతలు'**అంటూ వెటకరిం చాడు.'ప్రపంచబ్యాంకు రుణం'లో 'ఇంటిని తాకట్టుపెట్టి-,'గోడలకు రంగులు

# అక్షర హాలికులు

అశోక్‌కుమార్



## కె.ఎన్.వై. పతంజలి

**(1952 - 2009)**



## ఓన్లీ పంతంజలి

అక్షర ఆయుధం ఆట
వ్యంగ్య రాజకీయ వేట
యోగ పతంజలి భాష్యం
ముందు చూపున్న పాట

వేసుకోవడం' అంటూ' అమెరికాకు అంటుపెడతాడు.

'ఆధ్యాత్మికర'హా'స్యాలులో **"తనని రాయికేసి, కొట్టినందుకు, కన్నీరు కురిసిన రాతిబొమ్మలను తలచి కొలిచే, నీ మూఢత్వానికి తెల్లగా పగలబడి నవ్వు తోంది'** అంటాడు కవి. ఆ మినీకవిత శీర్షిక కొబ్బరి కాయ.ఇలా అతని కవితా శక్తినీ హేతువాద స్ఫూర్తికీ అద్దంపట్టే అనేక కవితల్ని ప్రస్తావించవచ్చు.

ఇంతవరకూ అశోక్ గురించి ఎక్కువగా కవి గానే చెప్పాను. ఇకముందూ ఏం చెప్పినా కవిగానే చెప్పక తప్పదు. అయితే, అతను గొప్ప క్రమశిక్షణ ఉన్నసైనికుడు.అందుకు ఎన్నో ఉదాహరణ లున్నాయి.

నా అభిమానరచయితల్లో ప్రముఖుడైన రావి శాస్త్రి మీద అభిమానంతో ఆయన రచనల్లోని ఆరు వాక్యాలు తీసుకుని (ఆరు ఆయనకిష్టం) ఆరు కథలు రాసి, 'నేను నేనే' పేరుతో రావిశాస్త్రికి ఆరుకథల నివాళి ఇచ్చాను. అందుకు నేనెంతో ఆనందించాను. అది పెద్దగా చెప్పుకోతగ్గది కాదని, తర్వాత చాలా కాలానికి అశోక్ శ్రీశ్రీమీద చూపిన,చూపుతున్న అభి మానం చూశాక నాకర్థమయింది.

మహాకవి శ్రీశ్రీని అభిమానించే వాళ్లు ఎందరో ఉన్నారు నాతో సహా అయితే, అశోక్‌లా శ్రీశ్రీ వీరాభి మానులు నాకు తెలిసి కొందరే ఉన్నారు.టి.ఎల్. కాంతారావు, చలసాని ప్రసాద్ ప్రథములు. శ్రీశ్రీ సాహిత్యసర్వస్వం తీసుకురావడంలో చలసానికి విరసం అండ ఉంది. విశ్రాంతీ ఉంది. వీరి తర్వాత అశోక్ ఒకే ఒక్కడు. శ్రీశ్రీ బులిటెన్లు ప్రారంభించి కొనసాగిస్తున్నాడు. శ్రీశ్రీ క్విజ్‌ను మొదలుకుని, ఆయన గురించి ఎవరెవరు ఎప్పుడెప్పుడు ఏమన్నారు వరకూ ఎన్నోవిషయాలను సేకరించి మనకు అందిం చాడు. ఓపక్క మినీకవిత్వాన్ని రాసుకుంటూ,మరోపక్క ఉద్యో గం చేసుకుంటూ శ్రీశ్రీ గురించిన అశోక్ విషయాలను తెలుసుకోవడానికి ఎంత శ్రమ, ఎంత గాలింపు, మరెంత తలంపు అవసరమో అశోక్‌కూ, చలసాని ప్రసాద్‌కీ మాత్రమే తెలుసు. మన పుస్తకాల్ని మనమే వెలువరిం చడం ఎంతో కష్టమైన రోజుల్లో ఒకటి కాదు, రెండు కాదు ఇరవైకి పైగా శ్రీశ్రీ రాసినవే కాకుండా, ఆయన రచనల గురించి ప్రముఖులు రాసిన పుస్తకాలను ప్రచురించడం అశోక్ వీరాభి మానానికీ కార్య దీక్షతకూ నిదర్శనం. ఇక తను రాసిన శ్రీశ్రీ సంస్మరణ సరేసరి.

నవంబర్ 6వతేదీ నాటికి అశోక్‌కి అరవై వసం తాలునిండుతున్నాయి.కవిగా నాకంటే మూడేళ్ల జూనియర్ (నా మొదటికథ 1968లో అచ్చయింది. అతని తొలికవిత 1971లో వచ్చింది).ఏదైనా అను కుంటే దాన్ని ఏరేయడంలో(ముఖ్యంగా శ్రీశ్రీ విష యంలో) నాకంటే సీనియర్.

ఇక మినీకవిత్వంలో అతను బిగ్ 'ఎ'. అలాగే కొన సాగాలనీ, శ్రీశ్రీని చిరంజీవిగా నిలిపే మహత్తర లక్ష్యాన్ని పూర్తిగా నెరవేర్చాలనీ ఆకాంక్షిస్తూ, ఇరవై రోజులపెద్దవాడిగా ఆశీర్వదిస్తున్నాను. ■



## తాడిగిరి పోతరాజు

(1937 )

## శ్రీశ్రీ క్విజ్

శ్రీశ్రీ–ఇరవైవశతాబ్ది రెండు, మూడు దశకాలలో ప్రపంచాన్ని ఒక్క కుదుపు కుదిపిన మార్క్సిస్ట్ భావజాలాన్నీ, బోల్షివిక్ విప్లవ విజయాన్నీ కవితారూపంలో గానం చేసి లక్షలాది పాఠకులను, అభిమానులను, వీరాభిమానులను సృష్టించుకున్న మహాకవి.ఆ నవయుగ కవితావైతాళికుని స్మృతులను నేటి తరం పాఠకులకు స్ఫురింపచెయ్యటం ఈ క్విజ్ యొక్క ప్రయోజనం. గతసంచికలో పొందు పరిచిన క్విజ్ సమాధానాలు నేటి పాఠకులకు వారిపై విస్తృత అధ్యయనం చేయటానికి ప్రేరణగా ఉపయోగపడతాయి. శ్రీశ్రీ కవిత్వం లోని ప్రత్యేకతలను గూర్చి దాని వెనుక వున్న చారిత్ర్యాత్మక సంఘటనలు సామాజిక ఆర్థిక సమస్య లనుగూర్చి ఎన్నో వాల్యూమ్స్ వచ్చాయి. ఎన్నో పరిశోధనలు జరిగాయి.

His interpretation of the contemporary life of his times has no parallel in the modern poetry. Had he tried his hand in English it would have won the world applause.

అందువలన సింగంపల్లి అశోక్ కుమార్ నిర్వహిస్తున్న ఈ 'క్విజ్' పరిశోధనాత్మకమైనది. ప్రయోజనకరమైనది. ముందుముందు దీని నొక సాహితీ ప్రక్రియగా ఇతర పత్రికలలో అనుకరించే అవకాశం ఉంది. ■

## వెర్రితలలు

బడులలో / రాళ్లతో ఆడుకొనేది / 'కేజీ'ల బాల్యం !
గుడులలో / ఆ రాళ్లనే వేడుకొనేది / 'పీజీ'ల ప్రాయం !



# 'అశోక'వనంలో అద్దేపల్లి ఆరుపదుల సింగంపల్లి... ఎదురుగా ఒక సముద్రమూ

డా॥ అద్దేపల్లి రామమోహనరావు

యథాకాష్ఠంచ కాష్ఠంచ / సరుయేతాం మహోదధే
సమత్వ చవ్యపేయేతాం / తద్యద్భూత సమాగమమ్.

'సముద్రంలో కొట్టుకొస్తున్న రెండు కట్టెలు తడిసి, ఒకదానికొకటి అంటుకుపోతాయి. అల్లా కొంత దూరం జంటగా వెళ్లాక, అలలమోదుకో, విపరీతపు గాలివల్లనో, అవి మళ్లీ విడిపోతాయి. ఒకటికొకటి దూరమైపోయి మళ్లీ కలుసుకోవు !

ఇది వాల్మీకి రామాయణంలోని శ్లోకం. సంయోగవియోగాల్ని గూర్చి మానవ జీవన తత్వానికి అద్భుతమైన నిర్వచనం. ఈ శ్లోకాన్ని యింకా విస్తృతార్థంలోకి ఆలోచిస్తే, గొప్ప సమీకరణాలు చేయవచ్చు. జీవితంలో ఎందరెందరో మనకి దగ్గరౌతారు. కొందరు ఇంకా దగ్గిరౌతారు. దీనికి కాలపరిధి కారణం కాదు. కొందరు కొన్నాళ్లు బాగా దగ్గరౌతారు. మళ్లీ విడిపోతారు. ఎక్కడో కలుస్తారు. మళ్లీ దగ్గరౌతారు. కొందరు చివరిదాకా కలుస్తారు. కొందరు ఒకసారి కలిసి మళ్లీ కలవరు. ఇలా ఎన్నెన్ని విభిన్న దశలనైనా మనం జీవితానుభవంనించి ఊహించుకోవచ్చు. ఈ శ్లోకంతో ఎందుకు ఈ వ్యాసాన్ని మొదలుపెట్టానో, వ్యాసం చదువుతుంటే స్పష్టంగా అవగతమవుతుంది.

2

'సింగంపల్లి అశోక్‌కుమార్', 'అద్దేపల్లి'కి కాకినాడలో స్నేహితుడు. నేను నందిగామలో తెలుగు లెక్చరర్‌గా చేస్తూ, 1971లో కాకినాడ ఎం.ఎస్.ఎన్ డిగ్రీ కాలేజీలో లెక్చరర్‌గా వచ్చాను. 1972లో పరిచయమయ్యాడో 73లోనో నాకు గుర్తులేదుగాని, అశోక్‌కుమార్ నాకు దగ్గరయ్యాడు. జగన్నాథపురం వంతెన కింద ఒక సైకిల్ స్టోర్స్. కొత్త సైకిళ్లతో, పైన వేలాడే సైకిల్ చక్రాలతో, అతని సైకిల్ స్టోర్స్ కనిపిస్తూ ఉండేది. నేను అప్పటికే, కవిగా, విమర్శకుడిగా, వామ పక్షాభిమానిగా ప్రసిద్ధుణ్ని కాబట్టి, ఊళ్లో ప్రతి సాహిత్యసభలోనూ పాల్గొనేవాణ్ని. ఈ నేపథ్యంలో చాలా మంది కవులు, సాహితీపరులు మిత్రులయ్యారు. వామ పక్షభావాలు కలిగి వుండడంవల్ల, సహజంగానే ఆ భావాలతో చాలామంది సన్నిహితులయ్యారు. అలా అశోక్‌కుమార్ నాకు మంచి స్నేహితుడయ్యాడు.

1970లలో విప్లవ కవిత్వపు ప్రభంజనం వీస్తోంది. దేశ పరిస్థితులమీద తీవ్రమైన అసంతృప్తిగల 'మధ్యతరగతి' రచయితలందరికీ తమ భావాల్ని ఆగ్రహపూర్వకంగా వెలువరించేందుకు అది ఒక నేపథ్యమైంది. మధ్యతరగతి -అని ఎందుకన్నానంటే, కవి, విమర్శకుల సంఖ్య ఆనాడా మధ్యతరగతిలో ఎక్కువ. అట్టడుగువర్గాలనుండి కూడా గొప్ప కవులు, గేయరచయితలు, మేధావులు రూపొందుతున్న సమయం అది. ఇప్పుడైతే పరిస్థితులు మారినై. అన్ని వర్గాలనుండి ప్రతిభావంతులైన రచయితలు అసంఖ్యాకంగా వస్తున్నారు. ఆ రోజుల్లో తీవ్ర ఆవేదనగలవారిలో ఎంతోమంది విప్లవరచనల్ని ఆదరించారు. కాకినాడలో ఇలాంటి వారం కొంతమంది ఒక గుంపుగా ఏర్పడ్డాం. కాకినాడలోగాని చుట్టు

# అక్షర హాలికులు

**అశోక్‌కుమార్**



## ఆరుద్ర

**(1925- 1998)**



## 'త్వమేవాహం'

కొన్ని అక్షరాలు సత్యం
కొన్ని అక్షరాలు నిత్యం
కవి ఆరుద్ర అక్షరాలు
సమగ్ర ఆంధ్రసాహిత్యం

పక్కలగాని ఎక్కడ కవిసమ్మేళనాలు జరిగినా, ఈ గుంపు గొంతు తీవ్రంగా వినబడేది. ఈ గుంపులో కొందరు ముఖ్యులపేర్లు చెప్తాను. అశోక్‌కుమార్, రారాసి, జి.సుబ్బారావు, ఈశ్వర్,విక్రాంత్,కదలి సత్యనారాయణ, నందనోదయ, చంద్రశేఖర్. మా అందరికీ తరచుగా కూర్చునే ఆశ్రయమందిరం ఒక బార్బర్ షాపు. టెంపుల్ స్ట్రీట్‌లో ఒక సెంటర్లో ఒక చిన్న, ఒక పేద బార్బర్ షాపు అది.దాని యజమాని నారాయణ అనే ఒక మహోన్నత వ్యక్తి. వామపక్ష అభిమాని. లోకంలోని అన్ని విషయాలమీదా ఎంతో వివరంగా ప్రసంగించగల విజ్ఞాని. అన్నిటికీ మించి అత్యంత స్నేహశీలి. ఈ మధ్య నే ఆయన కీర్తిశేషు డయ్యాడు. ఆయన షాపులో దాదాపు ప్రతి రోజూ మాలో కొంతమంది కూర్చోవడం, ఎన్నో విషయాలపై చర్చించడం జరుగుతుండేది.ఆ వ్యక్తుల్నే శబ్దవైచిత్రీపూర్వక, కవితాత్మకంగా, నా 'మెరుపు పువ్వు' దీర్ఘకవితలో సూచించాను.

**'నారాయణ బార్బరు షాపులో అరగారగా**
**టీ గ్లాసుల్లో ప్రపంచాన్ని నంచుకుతినేశాం**
**అప్పటికి వన్‌వే ట్రాఫిక్ లేదు**
**కవిత్వం రోడ్డు మీద మాదే వన్‌వే ట్రాఫిక్**
**పగళ్లూ రాత్రిళ్లు రోడ్లనిండా**
**తూర్పును పిండి ఎర్రగీతలు గీస్తూ రేగిపోయాం**
**సిద్ధాంతం పదును పెట్టిన**
**అక్షరాలు కూర్చిన బాంబులు పేల్చి**
**వేదికలన్నీ దద్దరిల్లజేశాం**
**'హిందూసుందరి' అందానికి**
**పట్టిన బూజు దులిపి**
**అరుణారుణ 'నందనోదయా'లు ముద్రించాం**
**'నదిలో పడున్న మేధావుల్ని' వీధిలో నిలదీశాం**
**జేబుల్లో'వెలుతురుజలపాతా'ల్ని**
**మడిచి పెట్టుకున్నాం**
**ప్రజలకు దూరమైన తల్లిని కూడా**
**'ఎవరు నువ్వని' ప్రశ్నించాం**
**చంద్రుణ్ని 'కదలి' తరంగాల మీద**
**ఊరేగించాం**
**'విశ్వేశ్వర విక్రాంతుల్ని' సంధ్యాకాశం**
**నుండి కోసితెచ్చాం**
**అంధకారనాభిలో అసిధా'రారాసు'లు**
**కుమ్మరించాం**
**ఒక్క కవితలో ప్రపంచాన్ని**
**మారిపొమ్మని శాసిస్తూ**
**మారిపోతోందని ఆశిస్తూ .......'**

పైపాదాల్లో మా మిత్రమండలి పేర్లన్నీ స్ఫురిస్తై.

తీవ్రమైన రోజులు గడిచిన తర్వాతి రోజుల్లో ఒక మిత్రుడు నాతో అన్నాడు.

'బాబోయ్' ఆ రోజుల్లో మిమ్మల్ని చూస్తే భయంగా వుండేది. దూరంగా కనిపిస్తే, పక్క సందు లోంచి వెళ్లిపోయేవాణ్ని!

ఈ మాటలు అతిశయంగా చెప్పడంలేదు గాని, ఒక ముద్ర పడడంగురించి అవి తెలియజేస్తై.

కవితాప్రియులు అన్నివిధాలైన కవిత్వాన్నీ ఆహ్వానిస్తారు కాబట్టి, అన్ని కవిసమ్మేళనాల్లో మేము ఉండేవాళ్లం.

3

అశోక్‌కుమార్‌కి అప్పుడు ఇరవైరెండో, ఇరవై మూడో ఏళ్లుంటై. మంచికొలతలుగల శరీర నిర్మాణంతో, షర్ట్ టకప్ చేసి, చిరునవ్వుతో నిలబడితే, ఎంతో దూరంగావుండేవాడె, అశోక్‌కుమార్‌ని చూపించి, ఆరోజుల్లో ఒక విప్లవాభిలాషియైన మిత్రుడు నాతో నవ్వుతూ అన్నాడు.

'ఈ కవులందరూ షో కేసులో బొమ్మల్లా కనిపిస్తున్నారు. ఏం ప్రతిఘటన చేస్తారు?'

నేనన్నాను 'నిబద్ధతతో కవిత్వంరాసి, భావ ప్రచారం చేస్తున్నారు. అంతకంటే ఏం చెయ్యాలి?'

అతను 'నిజమే లెండి' అన్నాడు.

అశోక్ కుమార్ చాలా మితభాషి, ప్రతి మాట వెనుకా, అతనిలో ఖచ్చితమైన ఆలోచన ఉంటుంది. తన పరిమితీ, తన ఆచరణా, ఇప్పుడు చేసే పని తర్వాత ఇచ్చే ఫలితమూ, అతనిలో నిర్దిష్ట స్వరూపంలో నిలిచివుంటై. అటువంటివారు ఏం చేసినా, ఏదో ఒక ఒక స్థాయిలో విజయమే ఉంటుంది గాని, అపజయం ఉండదు. కాళిదాసు రఘువంశరాజుల్ని గూర్చి చెప్తూ 'ఫలానుమేయా: ప్రారంభా:' అంటే ఫలితం వచ్చిన తర్వాతనే, వారి ప్రారంభాల్లోని ప్రాముఖ్యం తెలుస్తుంది. అటువంటి గంభీరతత్వం అశోక్‌కుమార్‌ది. అతనెప్పుదూకూడ ఒళ్లు తెలియని ఆవేశంతో మాట్లాడడం నేను చూడలేదు.

ప్రజలకు దూరమైన తల్లిని కూడా
'ఎవరు నువ్వ'ని ప్రశ్నించాం

అన్న మాటల్లో కనిపించేది అశోక్‌కుమారే. ఆ రోజుల్లో అతడు 'తల్లీ ఎవరునువ్వ?' అనే దీర్ఘ కవిత రాశాడు.

4

ఆనాడు సంపూర్ణ విప్లవ భావాల్ని అభిమానించిన వారిలో, సంప్రదాయాన్ని ప్రతిఘటించే ఉద్దేశంగల,అనేక భావధారలు గలవారు సమష్టిగా ఉండేవారు. ఎందుకంటే, విప్లవం విజయవంతం కాగానే, అందరి ప్రగతిశీలభావాలూ సమాజంలో స్థిరపడతై అని విశ్వసించారు కనుక. అందుకే సమాజంలో ప్రచురితమైన అస్తిత్వవాదాలు,హేతువాదం మొదలైన వన్నీ విప్లవవాదంలో అంతర్భూతంగా కనిపించేవి. ఇప్పటి అస్తిత్వవాదులు చాలామంది ఆనాడు విప్లవభావనతో ఉండడానికి కారణం అదే. తమతమ ప్రేరణలు తమకు బలంగా వున్నా విప్లవ భావాం తర్గతంగానే తమ సిద్ధాంతాల్ని ప్రచారం చేసేవారు. అశోక్‌కుమార్‌లో ఉన్న స్థిరమైన ప్రేరణ హేతువాదం.

అలాగే కదలి సత్యనారాయణ క్రమంగా దళితోద్యమంతో ఏకీభావనపొంది, 'గోదావరి కెరటాలు' అనే గొప్ప దళితవాద పత్రికను కూడా నడిపాడు. జి.సుబ్బారావు ప్రగతిశీలకవిగా, విమర్శ కుడిగా పరిణమించాడు.

అశోక్‌కుమార్, ఒక రోజున తాను రాసిన 'తల్లీ ఎవరునువ్వు?' అనే దీర్ఘకవిత నాకిచ్చి ముందుమాట రాయమన్నాడు. 'జిల్లెళ్లమూడి అమ్మ'ను చాలా మంది ఆరాధిస్తున్న రోజులవి. నాకు గుర్తున్నంతవరకు, నేను ముందుమాట రాయడం అదే మొదలు. లోపల అగ్నిపర్వతాలు లావా చిమ్ముతున్న నేపథ్యం. పెద్ద ముందుమాట రాయమన్నాడు. రాశాను. నాకే ఆశ్చర్యం కలిగింది. మొదటిసారి ముందుమాట రాస్తూనే అంత చైతన్యవంతంగా రాసినందుకు, ఆ ముందుమాటకు చాలా ప్రశంసలు వచ్చినై –తెలుగు లోంచి,ఉత్తమమైన ముందుమాటలు పదో, పదిహేనో ఎంపికచేస్తే, తప్పక 'తల్లీ ఎవరు నువ్వు?' ముందు మాట, వాటిల్లో వుంటుందని ఒకాయన అన్నాడు. అశోక్‌కుమార్, తాను కోరినంత బలంగా వచ్చినందుకు చాలా ఆనందించాడు.

ఇదిలావుండగా, ఆ ముందుమాట ఊళ్లో చాలామందికి కోపం తెప్పించింది. దాన్తో కొంతమంది మీటింగుపెట్టుకొని, ఖండన వాక్యాలు రాసుకుని, ఇలాటివి రాసేవాడు, ఎండోమెంట్స్‌వారి యాజమాన్యం కింద ఉన్న కాలేజీలో పనిచెయ్యకూడదనీ, ఉద్యోగం నుండి తొలగించాలని ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌కి ఒక విజ్ఞాపన పత్రం రాశారు. తర్వాత ఏదో జరిగింది. ఏదో జరిగింది. ఉద్యోగానికి భంగంరాలేదు.

ఏది ఏమైనా, అశోక్‌కుమార్ దీర్ఘకవితకీ, నా ముందుమాటకీ ప్రగతివాదుల్లో బాగా పేరువచ్చింది.

5

సుమారు 1976-77 ప్రాంతాల్లో కావచ్చు. హఠాత్తుగా అశోక్‌కుమార్ కాకినాడ నుండి ఎక్కడికో వెళ్లిపోయాడు. ఎన్నిసార్లు అజ కనుక్కుందామని ప్రయత్నించినా సరిగ్గా తెలియలేదు.

ఇక్కడ మళ్లీ 'యథాకాష్ఠంచ కాష్ఠంచ' శ్లోకం ఒకసారి గుర్తుచేసుకుందాం. రెండు కట్టెలూ కొంతదూరం కలిసి అతుక్కుని ప్రయాణం చేసినై, నీటి ప్రవాహపు ఒడిదుడుకుల్లో మళ్లీ దూరమైనై. అలా కాలం గడిచిపోతా ఉంది.

చాలా కాలం తర్వాత విజయవాడ నుండి ఒక ఫోన్ వచ్చింది. చేసిన వ్యక్తి అశోక్‌కుమారే. బహుశా 2000 తర్వాత కావచ్చు. విజయవాడలో ఉన్నాననీ, అక్కడికి వచ్చినపుడు కలుద్దామనీ, తాను ఫలానా చోట ఉంటాననీ చెప్పాడు. ముందు, నేనడిగిన ప్రశ్న. 'కవిత్వం విషయంఏమిటి?' అని. చాలా మందిని గమనించి ఉండడంవల్ల, ఇంత సుదీర్ఘమైన ఎడం వచ్చినందువల్ల, ఇక అతను సాహిత్యంతో అనుబంధం తెగిపోయి వుంటుందని నా ఆలోచన. నేను ఆశ్చర్యపోయే సమాధానం చెప్పాడు. తాను సాహిత్యాన్ని వదిలేదిలేదనీ, మళ్లీ రంగంలో దిగుతున్నాననీ. ఇలా కూడా చాలామంది చెప్తారు కానీ, అనుకున్న ప్రకారం చెయ్యలేరు. ఏదో కొంత కొంత చేస్తాడేమోలే అనుకున్నాను. ఆనందించాను.

విజయవాడలో ఒక వ్యాపారంలో స్థిరపడి ముందు జీవితాన్ని బాగుచేసుకొని, తర్వాత తన మౌలిక ప్రేరణలోకి దిగే నిర్ణయం చేసుకున్నాడన్న మాట. ఇది అతని జీవితాన్ని ప్రణాళికాబద్ధంగా తీర్చుకోగలనేర్పు.

2003 ప్రాంతాల్లో 'శుభాకాంక్షలు' అనే దీర్ఘ కవిత రాశాడు. దానికి ముందు మాట రాశాను. ఇక వరుసగా చాలా పుస్తకాలు రాశాడు. సుమారు 4 పుస్తకాలకి ముందుమాటలు రాయించాడు.

2005లో నండూరిరాజగోపాల్ 'చినుకు' పత్రిక ప్రారంభించారు. మొదట్లో ఈ సాహిత్య పత్రిక ఏమాత్రం జనాదరణ పొందగలదని నా లోలోపల అనుమానం వుందిగాని, 'ఇంతింతై వటుడింతయై' అన్నట్లు ఈనాడు ప్రథమశ్రేణీ పత్రికగా అందరి అభిమానమూ పొందింది. 'చినుకు'లో అశోక్‌కుమార్ ఒక శీర్షిక ప్రారంభించాడు. అది సెంటర్‌స్ప్రెడ్‌లో 'అణువు' అనేది. కేవలంమినీ కవితల కోసం ఉద్దేశింపబడింది. మినీకవిత 1975 నుండి తెలుగు కవిత్వంలో ఒక అత్యంత చైతన్యవంతమైన పాత్ర వహించింది. అప్పట్లోనే కాకినాడలో అశోక్‌కుమార్ మినీ కవితలు రాసేవాడు. ఇప్పుడు దాన్ని ఒక శీర్షిక నై మ్యదంతో మినీకవితకు మళ్లీ ఒక మహోజ్వలమైనస్థితి వచ్చినట్లయింది. అది, అశోక్‌కుమార్ నిర్వహణలోని గొప్పతనం.

ఒక్కొక్కరిలో కొన్ని కొన్ని శక్తులు, వయస్సుతో నిమిత్తం లేకుండా వికసిస్తూ ఉంటై. అలాగే అశోక్ కుమార్‌ని చూస్తే నాకు ఆశ్చర్యమనిపించింది. తాను, స్వయంగా మళ్లీ మినీ కవితలు రాయడం ప్రారంభించి, పుస్తకాలుగా తీసుకువచ్చాడు. మినీ కవితా రూపానికే కొత్త సొబగులు తేవడం మొదలుపెట్టాడు. ఎక్కువగా నాలుగుపాదాలు రాయడం, ప్రతి పాదం అత్యంత క్లుప్తంగాఉండడం, రెండు, నాలుగు పాదాల్లో అంత్యప్రాసవేసి, దాన్ని ఎంతో అర్థవంతం చెయ్యడం, వస్తువుగా, ప్రగతిశీలతనే గ్రహించడం – ఇలాటి వాటిలో మినీ కవితకి కొత్త శక్తి వచ్చింది. చాలామంది అతని రీతిని అనుకరించేటంతగా జనాదరణ కలిగింది.

ఈ శీర్షియేగాక, చినుకు చివరి పేజీల్లో 'శ్రీశ్రీపై క్విజ్' నడిపాడు. అదీ ఎంతగానో పాఠకాదరణ పొందింది. విచిత్రమేమిటంటే ఆ క్విజ్ కోసం అతను చేసిన అధ్యయనం అపూర్వం. ఎక్కడెక్కడి విషయాల్నో

## అక్షర హాలికులు

**అశోక్‌కుమార్**



## దేవరకొండ బాలగంగాధర తిలక్

**(1921-1966)**



**'సాహితీ భిషక్'**

అగ్ని అమృతాల మైత్రి
అభ్యుదయ కవితా ధాత్రి
బాలగంగాధర తిలకం
అమృతం కురిసిన రాత్రి

# అక్షర హాలికులు

**అశోక్‌కుమార్**



# సురవరం ప్రతాపరెడ్డి

**(1896-1953)**



## సాంఘిక చరిత్ర కారుడు

వైతాళిక సురవర ప్రతాపం
సమాజ చైతన్య విశ్వరూపం
తెలంగాణా అజ్ఞాత కవులను
వెలిగించిన గోలకొండ దీపం !

పుస్తకాల్లోంచి తవ్వితీశాడు. ఇంతటి పుస్తక పఠన శక్తికూడా అశోక్‌కుమార్‌లో అప్పుడు ఆవిర్భవించిందే.

70–80ల మధ్య కాలానికీ, 2000 అనంతర కాలానికీ చాలా భేదంవుంది. సామాజిక పరిణామమూ, కొత్తగా మొలకెత్తే సమస్యలూ, కవి స్వీకరించవలసిన వస్తువూ, అభివ్యక్తిలో వస్తున్న మార్పులు, అన్నీ సమకాలంలో మేలుకున్నవారిలో కొత్త ఆవిష్కరణలు పొందినై. అలా మేల్కొనలేక పోయిన వారిలో, అలనాటి మొండితనమే మిగిలి పోయింది. అశోక్‌కుమార్‌లోనూ బాగా భావ విస్తృతి వచ్చింది. కాలం, సమాజం సహజంగానే మార్పు పొందుతుంది. ముఖ్యంగా సాహిత్యం విషయంలో, ఆ మార్పుని హృదయంలోకి తీసుకుంటే, విస్తృతిని పొందుతాడు. లేకపోతే వెనకబడిపోతాడు. అశోక్ కుమార్ 'పదండి ముందుకు' అనే మనిషి. ఈ అంశాన్నే 'మెరుపువ్వు'లో ఒక చోట చెప్పాడు.

**"జలపాతంలోని జీవశక్తికి**
**తనమీద నుండి తాను**
**జారిపోవడమే తెలుసుగాని**
**తనలో తాను విశ్రమించడం తెలియదు"**

ఇది ఒక దశ. పురోగమనం సమకాలికమైనపుడు ఇలా ఉంటుంది.

**"రోజూ సిద్ధాంతాలు వల్లించడమే**
**పని పెట్టుకున్నవాడు**
**సిద్ధాంత ఉద్ఘాటనలు ఆచరణలో మరిచిపోతే**
**ఎదిగినట్లు**
**వ్యతిరేక వాదాల్ని నరికి ముక్కలు చెయ్యడమే**
**పనిపెట్టుకున్నవాడు**
**వాదాల ఉప్పెనలవెనుక నముద్రమై**
**పోయినప్పుడు**
**ఎదిగినట్లు...."**

పరిణామంలో ఇది ముందడుగు. సాహిత్య వికాసాన్ని గమనించినపుడు ఈ కింది మాటలు గమనించ దగినవి.

**'వ్యక్తి తన అనుభూతులతో**
**సన్నివేశాల్ని చెరిపెయ్యాలనడం వ్యక్తి వాదం**
**సమాజం మాత్రమే ఉన్నదనడం అవివేకం**
**వ్యక్తిమాత్రమే ఉన్నాడనడం దుర్మార్గం**
**సమాజం వ్యక్తిలో ప్రతిబింబించేచోట**
**వ్యక్తి సమాజంలో పరిణమించేచోట**
**వేలాడుతున్న సంధ్యాపుష్పంలోనే**
**ఉదయ మకరందం తొణికిసలాడుతుంది.'**

ఇలాంటి మంచి పరిణామం అశోక్‌కుమార్‌లో జరిగింది. మరీ ముఖ్యంగా 1990ల నించి విజృంభిస్తున్న ప్రపంచీకరణ దుర్మార్గాన్ని గూర్చిన అవగాహన లేకపోతే, కవి బాధ్యతలేనివాడని అర్థం. ఇలా అశోక్ కుమార్, మౌలిక ప్రేరణలు కోల్పోకుండా, ప్రగతిశీల విస్తృతితో రాయడం కాలంతోపాటు ఎదగడం.

మన గురించి, మనతో ఉన్న స్నేహితుడు ఎలాటి అభిమానం కలిగివున్నాడో, కలిసి ఉన్నప్పుడు తెలియదు. కొంతకాలం వేరుగా ఉన్నతర్వాత, మళ్లీ కలిసినపుడు, అతని ఆచరణ ద్వారానే అది వ్యక్తమవుతుంది. అశోక్‌కుమార్‌లో అటువంటి ఒక అచంచల ముద్రను చూసి, అది నాకు లభించిన గొప్ప అదృష్ట మనుకున్నాను. 'చినుకు'లో ధారావాహికగా అనేకానేక పరిణత, వర్ధిష్ణుకవులమీద నాచేత వ్యాసాలు రాయించిన ఘనత అశోక్‌కుమార్‌దే. పైగా శీర్షికలు పెట్టడంలో చాలా ప్రావీణ్యం సంపాదించాడు. అతనిలో ఉన్న జర్నలిస్ట్ కూడా 2000 తర్వాత మేలుకున్నాడు.

'వార్త', 'చినుకు', 'ప్రజాసాహితి' పత్రికల్లోనూ, ఇతర చోట్లనూ ఆధునిక కవులందరి గురించీ ధారావాహికగా జీవితసాహిత్య వివరాలందించాడు. వీటిలో కొండని అద్దంలో చూపించే వైఖరి ఉంది. ఈ రచనల కోసం, ఎన్నెన్ని పుస్తకాలు, పాత పత్రికల అధ్యయనం మొదలుపెట్టాడో ఊహించలేము. మరీ ముఖ్యంగా ఒక్కొక్క కవిని గూర్చి నాలుగు పాదాల కవిత రాస్తారు. దీనిలో గొప్ప శబ్ద చమత్కృతితో ఆయాకవుల ఆత్మపట్టుకుని చెప్తాడు. దాదాపుగా రుబాయిలోని వైఖరి వీటిలో ఉంటుంది. ఉదాహరణకి 'గిరాంమూర్తి' అని శ్రీశ్రీ అన్న గిడుగురామ్మూర్తి గురించి యిలా రాస్తాడు.

**'సవరభాషా సంస్కరణశీలి**
**గిడుగుజాడ తెలుపు వ్యాసావళి**
**వాడుక భాషోద్యమ యోధుడికి**
**మహాకవి అభినందన నివాళి'**

నా గురించి రాసిన ఒక రుబాయీ ఛాయగల ఒక మినీ కవిత బాగా ప్రచారమైంది.

**సంచార సాహితీయోధుడు (శీర్షిక)**
**'కొందరిది ఈ ఊరు**
**కొందరిది ఆ ఊరు**
**అద్దేపల్లి చిరునామా**
**తెలుగునేల ఊరూరు'**

1970లలో నేను ప్రజాగేయాలు రాశాను. పాడాను. నేను మరిచిపోయినవన్నీ అశోక్‌కుమార్‌కి గుర్తున్నై. అప్పట్లో నా ముద్ర అతనిమీద ఇంత గాఢంగా వుందని తెలియదు. చాలా కాలం తర్వాత మళ్లీ కలిసి, ఎన్నెన్నో సంఘటనలు జరుగుతున్నపుడు, నాకివన్నీ కొత్త సంతోషాన్ని కలిగించి, ఆత్మీయతను మరింత పెంచినై. 'శ్రీశ్రీ కవితాప్రస్థానం' మీద శ్రీశ్రీ, త్రిపురనేని, చలసాని ప్రసాదరావు యింకా ఎందరెందరో సానుకూల ప్రశంసాపూర్వక స్పందలన్నీ పోగుచేసి, నేను గమనించని అంశాల్ని నాకే చెప్పడం, నాకు చాలా ఆనందంకలిగించింది.

6

సుమారు 50 ఏళ్ల వయసు నుండి, ఇన్ని కొత్త శక్తుల్ని సమకూర్చుకున్న అశోక్‌కుమార్, 'శ్రీశ్రీ శత జయంతి' సందర్భంగా తన విశ్వరూపాన్ని చూపించి నట్లయింది. శ్రీశ్రీశతజయంతికి మూడుసంవత్సరాల



## డా॥ ఎన్.గోపి..

మీ 'తంత్రం' అందింది
. మీ మినీలు ఎంతో అర్థాన్నీ,
వ్యంగ్యాన్నీ గర్భీకరించుకున్న కవితలు.
మీకున్న సామాజిక అనుభవమంతా
వీటిలో ఉంది. 'తంత్రం' అన్న
పేరులోనే బోలెడంత వైశాల్యముంది.

'మీడియా' అనే కవితలో
**'నిలువెత్తు**
**ప్రజాసమస్యల్ని**
**చిన్న గీతలుగా మార్చేస్తోంది!'**
అన్నారు.
అదీ తంత్రమే.

ఉదహరిస్తే చాలా వాటిని
ఉదహరించాలి.
జాగా సరిపోదు.
అన్నిటినీ హాయిగా చదివేశాను.
గుండెకు గుచ్చుకుంటున్నా
ఆ పదునులో మీ చిత్త శుద్ధీ,
నిజాయితీ, హృదయకాంతీ ఉన్నాయి.
మీకు నా హృదయపూర్వక
అభినందనలు.

ముందునించే 'శ్రీశ్రీ సాహిత్య నిధి' స్థాపించి ఎన్నో ప్రచురణలు చేస్తూ, సర్వజనా మోదాన్ని సాధిం చాడు. శ్రీశ్రీ గురించి ఎవరు ఎప్పుడు ఏమి రాసినా, అలాగే శ్రీశ్రీ ఎవరి గురించి ఎప్పుడు రాసినా, ఏదీ తన దృష్టి నుండి తప్పించుకు పోలేనంత అధ్యయనం చేశాడు. అన్నీ చిన్నచిన్న పుస్తకాలుగా తీసుకొస్తున్నాడు. శ్రీశ్రీ గురించిన ఏ చిన్న సమాచారమూ మిగిలి పోకుండా, ఎంతో శ్రమ పడి, పాత, యింకా పాత పత్రికలన్నీ ఏదో విధంగా సంపాదించడం, వాటిని జనానికి అందించడం, ఎంతో లోతైన గనుల్ని తవ్వడ మంత మహాకృషి. శ్రీశ్రీమీద ఎవరు ఇంతక్రితం పుస్తకం రాసినా దాన్ని ముద్రించడం, వ్యాసాల్నీ, కవితల్నీ సంకలనం చెయ్య డం, అదిగూడా ఎవరిమీదా ఏ వ్యతిరేక అభిప్రాయం లేకుండా చెయ్యడం, శ్రీశ్రీపై కృషికి అంకితమై పోవడమే. ఇలాటి కృషి గొప్ప కవులందరి మీదా జరిగితే, సాహిత్యం ఎంత సుసంపన్నమవుతుందో అని అందరినీ ఊరించేటంతటి మహత్కార్యక్రమం ఇది.

నేనింకా ఆశ్చర్యపడిన విషయం మరొకటుంది. అది అశోక్‌కుమార్‌కి ఉన్న సినిమా పాటల పరిజ్ఞానం. ఒక్క శ్రీశ్రీవే కాదు, ఏ రచయితవైనా సరే, వాటి వివరాలన్నీ తెలును. హేమాహేమీల్లా ప్రసిద్ధులైన సినిమా గీతవేత్తలు రాసిన వాటిల్లో కూడా ఎన్నో దోషాలు చూపించగలిగాడు 'శ్రీశ్రీ సాహిత్య నిధి' తాను స్థాపించిన సంస్థ పేరైనా, తాను కూడా 'శ్రీశ్రీ సాహిత్యనిధి'గా నిలిచిపోయాడు.

కాకినాడలో ఉన్న మొదటి దశకీ-విజయవాడలో సాధించిన రెండో దశకీ, ఎంతగానో పరిణామం చెందాడు అశోక్‌కుమార్. ఇంకో చిన్న విషయమేమిటంటే, వేదికపై మాట్లాడడానికి ఏమాత్రం తగననుకున్న అశోక్‌కుమార్ ఈ దశలో వేదికకెక్కి ప్రసంగం చెయ్యగల శక్తిని గూడా సాధించుకున్నాడు.

ఇప్పుడు అరుపదుల్లో ప్రవేశిస్తున్నాడు. నిజానికి అరవైఏళ్లంటే, అద్భుతమైన పరిణతి ప్రదర్శించే చైతన్యవంతమైన సమయం. ఈ చైతన్యం ఇలాగే కొనసాగుతూ, ఇంకా యింకా గొప్ప సాహిత్య సేవ చేయాలని ఆకాంక్షిస్తున్నాను.

7

ఇప్పుడు మళ్లీ మొదటిశ్లోకాన్ని మరోసారి గుర్తు చేసుకుందాం. కొంతకాలం విడిపోయి, మళ్లీ కలిసి కొంతదూరం ప్రయాణం చేసినప్పుడు, ఇద్దరూ మళ్లీ కారణాంతరాలచేత దూరం కావచ్చు. లేదా కలిసే ఎప్పటికీ ప్రయాణించవచ్చు. కానీ, నాకూ, అశోక్ కుమార్‌కీ గల అనుబంధం అలా కలిసి కొనసాగుతూనే ఉంటుంది.నా నిరంతరసాహితీ యాత్రలో సహచరులుగా లభించిన వారిలో అశోక్ కుమార్ ఒక అపురూప వ్యక్తి. ఆరుపదులనుండి పదిపదుల దాకా, శారీరక మానసిక సంపూర్ణా రోగ్యంతో, సమగ్ర చైతన్యంతో, జీవనయాత్ర సాగించాలని ఆశిస్తున్నాను. ■

## అక్షర హాలికులు

**అశోక్‌కుమార్**



## కె.వి.రమణారెడ్డి

**( 1927 -1998 )**



## ఎఱ్ఱ పిడికిలి

అభ్యుదయవాద వేద్యుడు
విరసం చిరకాల బాధ్యుడు
సాహిత్య తిరోగాలకు
మార్క్సిస్టు మహావైద్యుడు

## స్వామియే శరణం

దీక్షలు / ముగిసిన / స్వాములు -
కుబుసం / విడిచిన / పాములు !





# అలుపెరగని యోధుడు అశోక్‌కుమార్

సిహెచ్.వి. బృందావనరావు

**శ్రీశ్రీ , 'మహాప్రస్థాన' గీతాలను 1930-40లలోనే వ్రాసినా, నళినీకుమార్ పుణ్యమా అని, ఆ గేయాలు పుస్తక రూపంలో రావడం 1950లో గాని జరగలేదు. అలా 'మహాప్రస్థాన' జన్మ సంవత్సరం 1950 అయితే శ్రీశ్రీ వీరాభిమానీ 'మహాప్రస్థాన'పు మహాభిమానీ ఒకాయన అదే 1950వ సంవత్సరంలో జన్మించడం కేవలం కాకతాళీయం మాత్రమే. అది కాకతాళీయం కాదు, ఆ 1950కీ 'మహాప్రస్థానా'నికీ ఆ వీరాభిమాని జన్మానికీ ఏదో అవినాభావపు, అదృశ్యమానపు సంబంధం వుండేవుండాలని ఎవరైనా అంటే - అలాంటి హేతువాద విపరీతమైన ట్రాష్ అని ఆయనే అందరికన్నా ముందు ఖండిస్తాడు. 'మహాప్రస్థానం' షష్టిపూర్తీ, షష్టిస్ఫూర్తీ జరుపుకుంటుంటే దానితోపాటే షష్టిపూర్తిని జరుపుకుంటున్న ఆయన ఆ మనస్వి పేరు సింగంపల్లి అశోక్‌కుమార్. అది శ్రీశ్రీ అభిమానులకు చిరపరిచితమైన పేరు. మినీ కవితా ప్రవర్తకులకు బాగా ఇష్టమైన పేరు. ముఖ్యంగా విజయవాడ సాహితీమిత్రులకు ఎంతో ఆప్తమైన పేరు.**

క్రీస్తు పూర్వం ఎప్పుడో మౌర్యచక్రవర్తి అశోకుడు రహదార్లకు ఇరువైపులా చెట్లు నాటించెను అని హిస్టరీ పాఠాల్లో ఇష్టంగా చదువుకున్నాం. అది Past Tense గత నాలుగుదశాబ్దాలనుంచీ తెలుగు సాహిత్యపు రహదారికి రెండు వైపులా మినీ కవితల మొక్కల్ని నాటుతూనే వున్నాడు ఈ అశోకుడు. ఇది Present Continuous Tense.

అంతేకాదు ఆయన కన్ను తెరిచింది 'మహాప్రస్థానం' పుట్టిన ఏడాదిలో అయితే పెన్ను తెరిచింది 'శ్రీశ్రీ షష్టిపూర్తి' సంవత్సరంలో (1970) అని గర్వంగా ప్రకటించుకుంటాడు. పెన్ను తెరవడం అంటే శ్రీకారం చుట్టడంకాదట. 'శ్రీశ్రీ కారం' చుట్టడమట. ఇలా శ్రీశ్రీతోనూ, 'మహాప్రస్థానం' తోనూ మమేకమై పోయిన కవితాశీలి అశోక్‌కుమార్.

ఇటీవలి శతజయంతి సందర్భంగా శ్రీశ్రీకి ఆంధ్రదేశమంతటా నీరాజనాలు పట్టినా, అక్కడక్కడా కొన్ని కొక్కిరాయి కలాలు నిక్కిచూడడం మానలేదు. ఎవరెన్ని పిల్లిమొగ్గలు వేసినా ఇరవయ్యో శతాబ్దం అధికభాగం శ్రీశ్రీ మహాప్రభావపు నీడలోనే పురోగమించిందనీ, ఈనాడు కవిత్వం వ్రాస్తున్న కవులు బాగా లబ్ధప్రతిష్ఠులైనవారు గూడా ఆ ప్రభావాన్ని గౌరవంగా సంభావిస్తూనే, ఆత్మీయంగా అంగీకరిస్తూనే తమ సొంత వ్యక్తిత్వాన్ని ప్రస్ఫుట పరచుకుంటున్నారనీ మహాప్రస్థానపు సానమీద తమ సొంత కత్తులను పదునెక్కించుకుంటున్నారనీ చెప్పడం అతిశయోక్తి కాబోదు. శ్రీశ్రీ ప్రభావం వివిధ రకాలుగా సమకాలీన సాహిత్యంపై తన ప్రకాశాన్ని ప్రసరించింది. కొందరు కవులు శ్రీశ్రీ 'పరాపితా ప్రయోగించిన పటుకరోర కుఠారాల' విచిత్ర శాబ్దిక శక్తిని ఆవాహనకావిస్తే ఆయన కవితల్లోని శబ్ద చిత్రాల సౌందర్యాన్ని అందిపుచ్చుకున్నారు మరికొందరు. శ్రీ అశోక్‌కుమార్ వ్రాసినవి అధిక భాగం మూడు, నాలుగు, ఐదు పదాలతో మినీ కవితలే కాబట్టి అంతస్ఫుటంగా కన్పించకపోవచ్చునేమోకాని శ్రీశ్రీ చిత్ర శబ్దాలనూ, శబ్దచిత్రాలనూ వీటితోపాటు, ఏ అరమరలూ లేని సామాజిక వాస్తవికతల దృష్టినీ, హేతువాద శాస్త్రీయతల పుష్టినీ, చైతన్యమూ నిబద్ధతల మృష్టినీ - అక్షరమక్షరానా ఆవిష్కరింప చేసుకున్నాడు అశోక్‌కుమార్.

అశోక్‌కుమార్ సాహిత్యజీవితం పరిశీలిస్తే-దాన్ని స్థూలంగా రెండు భాగాలుగా వింగడించవచ్చు.ఒకటి 'శ్రీశ్రీ సాహిత్యనిధి' రెండోది 'మినీ కవితా సృష్టి'.

'వెన్నెలపేరెత్తితే చాలు వెర్రెక్కిపోతుంది మనస్సు'అని 'శరశ్చంద్రిక' అనే కవితలో అంటాడు శ్రీశ్రీ. అశోక్‌కుమార్ శ్రీశ్రీ పేరెత్తితే చాలు చిర్రెత్తిపోతాడు.

శ్రీశ్రీసాహిత్యనిధి అనే ప్రయత్నం అనిదంపూర్వమూ, అనితరస్పృష్టమూను. శ్రీశ్రీ వ్రాసిన ప్రతిఅక్షరాన్నీ, అది కవితో,కథో,నవలో,వ్యాసమో,ఉపన్యాసమో, పేరడీయో, ప్రాసక్రీడో, ఉత్తరమో ఇలా ఏదైనా సరే దాన్ని సేకరించి,నిధిగా నిక్షేపించడం–అలాగే శ్రీశ్రీని గురించిన ప్రతి అక్షరాన్నీ అది సమీక్షో, విమర్శో, పొగడ్తో, తిట్లో ఏదైనా సరే వాటినీ సేకరించి పదిల పర్చడం–ఈ నిధి లక్ష్యాలు.అది ముద్రణ రూపంలోనే కాక,కంప్యూటర్‌లో, ఇంటర్నెట్ లోనూ(అంతర్జాలం), వెబ్‌సైట్ (లూతా నికేతనం?) లోనూ కూడా పాఠ కులకు లభ్యం చేయడం ఈ నిధి ఆశయాల్లో ముఖ్య మైంది. ఈ దిశగా ఇప్పటికే చాలా కృషి జరిగింది. ఇంకా జరుగు తూనే వున్నది. శ్రీశ్రీ వ్రాసే అక్షరాలు ఆయన నిధనంతో ఆగిపోవచ్చునేమో గాని, ఆయన గురించిన అక్షరాలు అనంతంగా వస్తూవుండేవే గదా. కాబట్టి ఈ సాహిత్యనిధికి, వుంటే గింటే కామాలుంటాయేమో గాని ఫుల్‌స్టాపుండే అవకాశమే లేదు. శ్రీశ్రీ గురించిన క్విజ్‌లను 'చినుకు' పత్రికలో పుంఖానుపుంఖంగా నిర్వహించి కొత్త పాఠకులకు శ్రీశ్రీ సమగ్రస్వరూపాన్ని అవగతం కావించే ప్రయత్నం చేయడం ఈ శ్రీశ్రీ సాహిత్యనిధి విస్తరణలో భాగమే. ప్రతిమూడు నెలలకూ శ్రీశ్రీని గురించిన సమా చారంతో ఒక బులెటిన్‌ను విడుదల చేయడం అది కోరినవారందరికీ ఉచితంగా అందజేయడం ఇది అనుస్యూతంగా సాగే ప్రవాహధార. ఇప్పటికే 14 బులెటిన్లు విడుదలయ్యా యంటే అశోక్ కుమార్ కార్యదీక్షను అభినందించక కుండా వుండలేము.

ఇక రెండో పార్శ్వం 'మినీ కవితల' ప్రవర్త కమూ ప్రవర్ధనమూను. మినీ కవితకు క్లుప్తత ప్రాణం అనేది అందరూ అంగీకరించేదే.కానీ క్లుప్తంగా చెప్పిన ప్రతిదీ మినీ కవిత కాబోదు. అల్పాక్షరాలతో అనల్ప మైన భావాన్ని విస్ఫోటింప జేయాలి. శబ్దమూ, శక్తీ ఏకకాలంలో వెవువడాలి. శబ్దంఉండిశక్తిలేక పోయినా, శక్తి వుండి శబ్దంలేకపోయినా మినీ కవిత పేలకుండా పేలవంగా పేలపిండైపోతుంది.అంత్య ప్రాసలతోపాటు అత్యంతంగా సముచితత (Apt-ness) ముఖ్యం మినీకవితకు. అశోక్‌కుమార్ రాసిన మినీకవితలన్నీ అణుబాంబుల్లా పేలేవి.ముఖ్యంగా సాహితీవేత్తలపై ఆయన పలికిన లఘుకవితలు ఎంతో సముచితంగావుండి ఎక్స్‌రేఛాయాచిత్రాల్లా నగ్నంగా వుంటాయి.

ఉదాహరణకు అలిశెట్టి ప్రభాకర్ గురించి ఇది వినండి. '**అలిశెట్టి ప్రభాకరం/ నిబద్ధ కవితా స్వరం/ రణచిత్రాలై రగిలిన / మినీ కవన భాస్వరం**'

ఇప్పటికే ఆరేడు మినీకవితా సంకలనాలు తెచ్చాడు అశోక్‌కుమార్. వాటిల్లోని ప్రతి కవితా ఆయన సామాజికదృక్పథాన్ని స్పష్టంగా దృశ్యమానం కావించేదే.

అధ్యాత్మికత అంటే పరమ ఒళ్లుమంట అశోక్ కుమార్‌కు. దాని ముసుగులోని మూఢాచారాలు ఈకకు ఈకగా పీకకు పీకగా పీకిపారేశాడు.

'ఆధ్యాత్మిక రహస్యాలు' అనే సంకలనంలో మచ్చుకు రెండు.**"మనిషి వెతలకు వాస్తు అంటూ/ ఇల్లు డొల్లను / చేసుకొనడం–! /తీటతీరని ఒంటి దురదకు / గోళ్లు పెరిగే మందు తినటం"** 'కీలు ఎరుగనివాత' ఈ కవిత పేరు. అలాగే '**ధనం మిథ్య జనం మిథ్య / ఆలుబిడ్డలు పరమ మిథ్య / ప్రబోధించే స్వామి వారికి / మధువు మగువలు మధ్య మధ్య**' ! విశ్లేషణ అక్కర్లేని ఈ కవిత పేరు 'మిథ్యాత్మకత'.

ఇక సమాజ వాస్తవికతలను గమనించి ప్రయో గించిన మతాబాలు 'వ్యూహం' సంకలనంలోని కవితలు. అందులోంచి రెండు.

'సేద్యం' : **"రైతు స్వేదం / అందిన నేల / విత్తులు గెలుస్తై! / రైతు రుధిరం/ చిందిన నేల/ కత్తులు మొలుస్తై."**

'ఘన' స్వామ్యం : **"ధూమ పానాలూ/ మద్య పానాలూ / తప్పువి! / అవే ఆదాయాలై / బ్రతుకు తున్న ప్రభుత్వాలు / గొప్పవి"**.

అలాగే 'గ్లోబలి', 'పొద్దుపూసింది', 'తంత్రం' –కవితాసంపుటల్లోని లఘు కవితలు వ్యంగ్య ప్రధా నంగా సమాజ రుగ్మతల మీదా, ప్రపంచీకరణ మీదా, అగ్రరాజ్యాల పెద్దరికమ్మీదా,పేదరాజ్యాల మొద్దరికం మీదా గురిపెట్టిన శరపరంపరలు.

'అణువు' పేరుతో 'చినుకు' పత్రికలో చాలా కాలం అశోక్‌కుమార్ సాగించిన మినీ కవితా శీర్షిక ఎన్నో మంచి కవితా శకలాలను అందించింది.

ఒక చిరు కవితలో **"శ్రమజీవి / పరిశ్రమల రెక్క / ఆహారపు మొక్క"** అంటాడు. పరిశ్రమల రెక్క అనడంలో కార్మికుణ్నీ, ఆహారపు మొక్క అనడంలో కర్షకుణ్నీ సూచిస్తూ వారి శ్రమనూ కష్టాన్నీ ఉల్లేఖిస్తూ సామ్యవాదపు మేనిఫెస్టోను 'కట్టె, కొట్టె, తెచ్చె'లాగా నిర్వచించాడు.

'వ్యసనం'అనే పేరుతో వ్రాసిన ఈనాటి సమాజ జీవనపు ఛాయాచిత్రం చూడండి. '**ఇంట్లోకి, వంట్లోకి / ప్రవహిస్తున్న / బహుళ జాతుల మీడియా వరద ! / కుటుంబ పరిమళానికి / వస్తుమోహాన్ని/ వ్యసన పరుస్తున్న రంకు బురద**' ఈ కవితకు వ్యాఖ్యానం కావాలా 'కుటుంబ పరిమళం' ఎంత చక్కని మాట.

అర్థం పర్థంలేని మూఢ పోకడలపట్ల ఎంతో అసహనం చూపే అశోక్ కుమార్ మంచి హాస్యానికీ మనసారా నవ్వే మనస్వి. అశోక్‌కుమార్ ఆహార్యం గానీ, ఉత్సాహంగానీ చూస్తే ఆయనకు అప్పుడే 60 ఏండ్లు నిండాయంటే నమ్మడం కష్టమే.

శ్రీశ్రీ భావాల వ్యాప్తికీ, అభ్యుదయ ధోరణుల దీప్తికీ అలుపు లేకుండా శ్రమించే సన్మిత్రుడు అశోక్‌కుమార్‌కు మరో అరవై వసంతాల మధుర జీవనాన్ని మనసారా ఆకాంక్షిస్తున్నాను. ■

## అక్షర హాలికులు

అశోక్‌కుమార్



### శ్రీ పాద సుబ్రమణ్య శాస్త్రి

(1891 - 1961)



### 'వడ్లగింజ'

శ్రీపాద కథల పలుకుబళ్లు
జన నుడికారాల పరవళ్లు
తెలుగు కందువా మందువాల
జీవితపు చదరంగం గళ్లు








The Vijayawada Chronicle

August 9, 2002


# The power of Ashok's Pen

Kalyani Krishna

## WAR ON MYTHS : SINGAMPALLI ASHOKKUMAR

In today's world, despite their high education and awareness, many people fall prey to the persuasive powers of glib-talking self-styled godmen and women, who cheat gullible people under the guise of religion. Thankfully, there are a few fare people who vehemently rise up in arms against these fake do-gooders. Like Singampalli Ashok Kumar, a businessman by profession and a poet by passion, who with the power of his pen is trying to eliminate superstition from society.

'I was greatly inspired by the well- known Telugu poet Mahakavi Sri Sri. My friends and renowned writers Varma and Adrusta Deepak encouraged me to put my thoughts down on paper,' recollects this poet with a Marxst outlook. His books like 'Thallee Evaru Nuvvu?', 'Sri Baba Mahatyam', 'Bala Yogeeswara Sandarsanam and 'Matha Prasthanam' have received wide publicity. The books are satirical in content, commenting scathingly on the so-called babas and matajis who take suspecting people for a ride, playing on their emotions.

In his personal life too, Asok had to face a lot of opposition from his parents when he married Kumari, who belonged to another caste. Those early days of marriage were far from rosy in terms of a job, as he had to tutor children to make ends meet. But undeterred, he worked hard and today is sucecssful businessman in the field of clearing and forwarding merchandise for Unitech Chemicals Pvt Ltd, Bangalore . He is planning to publish two more books titled 'Adhyatmika Ra'ha'syaalu', and 'Subhakan kshalu'. ■

## పంపకం

జన్మభూమి / వీడిది ! / రామజన్మభూమి / వాడిది !
మాతృభూమి / అప్పులోడిది !



# శ్రీశ్రీ - అశోక్ కుమార్ - శ్రీశ్రీ

డా॥ కడియాల రామమోహనరాయ్

**అచ్చమైన స్నేహానికి మరొక పేరు అశోక్ కుమార్.**
**శ్రీశ్రీ శతజయంతి శుభవేళ శ్రీశ్రీకి కుడి ఎడమా, వెనకాముందూ**
**అన్నివేళలా అందుబాటులో వుండి**
**శ్రీశ్రీ అభిమానుల మన్ననలందుకున్నారు అశోక్ కుమార్.**

**మహాకవి శ్రీశ్రీకి అభిమానులు లక్షలాదిగావున్నారు. శ్రీశ్రీ శతజయంతి సన్నాహాలను మూడేళ్లముందుగా ప్రారంభించి ఎలుగెత్తి కూసిన కవికోకిల అశోక్ కుమార్, శ్రీశ్రీ సన్నిహితులను, అభిమానులను పలుకరించి వాళ్లలో ఉత్సాహాన్ని రేకెత్తించి, ఇంతకుముందు ఏ తెలుగు కవికీ జరుగని రీతిలో ఊరూరా జయంతి వేడుకలను జరపటానికి తోడ్పడ్డారు. 'ఈ జైత్రయాత్ర సాగాల్సిందే' నంటూ చలసాని ప్రసాద్ అశోక్‌కుమార్‌ను భుజంతట్టి ప్రోత్సహించారు.**

శ్రీశ్రీకి నివాళి సమర్పించటమంటే ఆయన రచనలను తెలుగుజాతి నిరంతరం అధ్యయనం చేయటమే. అందుకువీలుగా శ్రీశ్రీ రచనల సర్వస్వాన్ని - 20 సంపుటాలలో శ్రీ ప్రసాద్ అందుబాటులోకి తెచ్చారు. శ్రీశ్రీ రచనలపై పరిశోధనా గ్రంథాలు చెప్పుకోదగినన్ని శతజయంతికి ముందే వచ్చాయి. ఇంక 'శ్రీశ్రీ సాహిత్య నిధి' అవసరమేమిటి?

'శ్రీశ్రీ సాహిత్యం,శ్రీశ్రీపై సాహిత్యం, శ్రీశ్రీ ఛాయాచిత్రాలూ, రేఖా చిత్రాలూ,శ్రీశ్రీ విషయాలూ-విశేషాలు సమగ్రంగా సేకరించి, స్కానింగ్ ద్వారా భద్రపరిచి, శ్రీశ్రీసమాచారం, శ్రీశ్రీ సాహిత్యం ఎప్పుడు ఎవరికి ఎందుకుకావలసివచ్చినా తక్షణంఅందించాలనీ,భావితరాలకు ప్రతిక్షణం అందుబాటులో ఉంచాలనీ శ్రీశ్రీ అభిమానుల ప్రయత్నమే 'శ్రీశ్రీసాహిత్య నిధి', మూడు నెలలకోసారి శ్రీశ్రీ సమాచారాన్ని తెలిపే బులిటెన్ వెలువరించటం-శ్రీశ్రీ సాహిత్యనిధి సంకల్పాలలో మొదటిది - ఇప్పటికి 14 బులిటెన్లు క్రమం తప్పకుండా వచ్చాయి. వీటిని శ్రీశ్రీ అభిమానులకు ఉచితంగా పంచిపెట్టి అశోక్ కుమార్ శ్రీశ్రీపై తన అభిమానాన్ని చాటుకున్నారు.

మొదటి బులిటెన్ ఏప్రిల్-2007లో వెలు వడింది. అంతకు ముందే అశోక్ కుమార్ 'చినుకు' సాహిత్య మాసపత్రికలో శ్రీశ్రీపై 'క్విజ్' నిర్వహిం చారు. 'రాబోవు యుగం దూతలు, పావననవజీవన బృందావన నిర్మాతల'కు యీ క్విజ్ చాలా అవసరమే. 'క్విజ్' సమాధానాలలో అశోక్‌కుమార్ ఇచ్చిన అదనపు సమాచారం విలువైనది.

## అక్షర హాలికులు

అశోక్‌కుమార్



## త్రిపురనేని గోపీచంద్

**(1910-1962)**



## సమర్థుడి అజీవయాత్ర

జాతికిపట్టిన కురుపులఎరుకలు
చీకటి గదిలో మెరుపుల మరకలు
మాకూవున్నాయ్ స్వగతాలన్నాయ్
గోపీచిందుల మెరికల చురకలు

ఈ బులిటెన్లలో శ్రీశ్రీ రచనలు కొన్ని, శ్రీశ్రీ రచనలపై ప్రముఖ సాహిత్యవేత్తల అభిప్రాయాలు అందించారు. 'శ్రీశ్రీ'పై శివసాగర్ గీతంలో 'శ్రీశ్రీ చని పోయాడని అనకండి మన మధ్య జీవించాడని చెప్పండి' అనేది మరొకసారి తలచుకోదగిన మంచిమాట.

'శ్రీశ్రీ ప్రియశిష్యుడివో...' శీర్షిక కింద 'శ్రీశ్రీ ప్రింటర్స్ విశ్వేశ్వరరావు'ను పరిచయం చేసిన తీరు చాలా బావుంది. 'శ్రీ విశ్వేశ్వరరావుకు' శ్రీశ్రీ నిరంతరం ఒక జ్ఞాపకం.

శ్రీశ్రీ రచనలకు సంబంధించి వివిధ వ్యాసాలలో/ రచనలలో దొరిలిన తప్పుల్ని సవరించటం కూడా శ్రీశ్రీ సాహిత్యనిధి చేసిన / చేస్తున్న మంచిపని.

శ్రీశ్రీ బులిటెన్లతో పాటు అశోక్‌కుమార్ 'శ్రీశ్రీ సంస్మరణ' (జూన్-2008) పేరిట చెలం, కొడవటిగంటి కుటుంబరావు, రావిశాస్త్రి, , పురిపండా అప్పలస్వామి, ముద్దుకృష్ణ, ఇంద్రగంటి, కాళోజీ, తుమ్మల వెంకటరామయ్య, ఆరుద్ర, కె.వి.యార్, దాశరథి, అజంతా మొదలైన సాహిత్య వేత్తలు వివిధ సందర్భాలలో శ్రీశ్రీపై వెలువరించిన విలువైన అభిప్రాయాలను సంకలనంగా రూపొందించారు. ఇది శ్రీశ్రీ అభిమానులకు శ్రీశ్రీ సాహిత్య నిధి అందించిన విలువైన కానుక.

వీరు ప్రచురించిన శ్రీశ్రీ ఖడ్గసృష్టికావ్య పరామర్శ (సివి), కల్లోలకాలానికి కవితా దర్పణం, శ్రీశ్రీ మరో ప్రస్థానం (వరవరరావు) పునర్ముద్రణలే అయినా శ్రీశ్రీ శతజయంతి సందర్భంగా సహృదయులు పునర్మూల్యాంకనం చేయవలసినవి.

శ్రీశ్రీ రచనల్లోంచి 'గిరాంమూర్తి', కొంపెల్ల జనార్ధనరావు, మన కొడవటిగంటికి సంబంధించిన విశేషాలను శతజయంతి వేడుకలలో కన్నుల పండువుగా అందించటం అభినందించదగిన అంశం.

అశోక్‌కుమార్ కవి.ఎందుచేతనో తన కవితను వ్యక్తుల పదచిత్రాలకు మినీ కవితకే పరిమితం చేసుకున్నారు. వీటిలో కొన్నిటిని సాహిత్యాభిమానులు మళ్లీతలచుకుంటారు.

మహాకవిశ్రీశ్రీశతజయంతిఉత్సవాల ముగింపు సందర్భంగా (30-4-2010) శ్రీశ్రీ సాహిత్యనిధి ప్రచురించిన 21 పుస్తకాలను సేకరించి జాగ్రత్త చేయటం ఏ స్వంత గ్రంథాలయానికైనా గర్వకారణం.

శ్రీశ్రీ శతజయంతితో శ్రీశ్రీ సాహిత్యనిధి కార్యక్రమాలకు, ప్రచురణలకు స్వస్తిచెప్పకుండ 'శ్రీశ్రీని నిరంతరం తెలుగుజాతి కాంతిపతాకగా ఎగురవేస్తున్న' ఆత్మీయుడు అశోక్ కుమార్‌కి త్రీ ఛీర్స్ ■



## అశోకవనం

యం.బి.జనార్దన్

ఆర్థిక బాధలతో
ఆర్తనాదాలు చేసేవారికి
ఆర్ద్రత అశోకుని ఎర్రకవిత !

మూఢనమ్మకాలపై చర్చకు వస్తే
సింగమై పులియై గర్జించి గాండ్రించే
సహేతుక వాది !

అమ్మలూ బాబాలూ
డాబులను ఉఫ్‌న ఊదే
నిజమే తన ఇజమైన వాడు !

విజయ సోపానాలపై
వాణిజ్య సవారి రౌతు !

శిరమున రాకుమారి
కుడి ఎడమల
జ్వలితప్రజ్వలిత
జ్వాలా విక్రాంతులు ! ■

## బ్లడ్ గ్రూపు

మానవ రక్తాన్ని / కులాల గ్రూపులు చేశారు !
అంతే / ఎవడి గ్రూపు కోసం / వాడు !





# హేతువాదమూ...కవితావేదమూ అశోకూ - నేనూ

- సశ్రీ

**తెలుగు సాహిత్యం మహామహుల్ని లోకానికందించింది. చిన్ని కొండలూ, వెండికొండలూ, బంగారు కొండలూ అనేకం ఉన్నాయి. ముడి వజ్రాలు దొరికే చోట్లున్నాయి. రంగురాళ్ల గుట్టలుగానూ ఉన్నాయి. కుందుర్తి (ఫ్రీవర్స్‌ఫ్రంట్ గుండెకాయ) ఎప్పుడూ ఓ మాట అంటుండేవాడు. ఆంధ్రదేశానికి కావ్యకర్తల కన్నా కార్యకర్తల అవసరం చాలా ఎక్కువని కుందుర్తి అభిప్రాయపడేవాడు. అందరూ నాయకులైతే ఆ పరిస్థితి కొంచెం కష్టంగానే అనిపిస్తుంది. పల్లకి ఎక్కే కవులుండాలి...కవిపండితుల్ని కాచే అభిమానజనం అంతే అవసరమని చెప్పుకోవాలి... నిజం ఒప్పుకోవాలి. అశోక్ కవిగా కన్నా కార్యకర్తగా శక్తిమంతుడని 'శ్రీశ్రీ సాహిత్యనిధి' అక్షరయాగం నిర్ధారించింది.**

అశోక్‌తో నా పరిచయానికి ఏడేళ్లుంటాయేమో... ఆ స్వల్ప వ్యవధిని అధిగమించిన గాఢత భావసారూప్యం ఇద్దరిమధ్యా ఉంది. దానికేం దాన్నలా ఉంచండి. ఆంధ్రప్రదేశ్ సాంస్కృతిక సమాఖ్య పక్షాన శిరీష్‌కుమార్ బెజవాడలో తరచూ సభలూ, సమావేశాలూ మీదేసుకొని కొన్ని లోపాలుంటే ఉన్నాయికానీ ఓ సహృద్భావ వాతావరణం తెచ్చాడు. ఉన్నపళంగా శిరీష్‌కుమార్ పలచబడ్డాడు. సాహితీ స్తబ్ధత నగరంలో నోరుతెరిచింది. మళ్లా సాహిత్య వాతావరణం చిగురించే గట్టి ప్రయత్నం కవితాభిమానుల పత్రిక 'ఎక్స్‌రే' పక్షాన కవి, సంపాదకులు కొల్లూరి భుజానికెత్తుకున్నారు. అప్పటికే అమలాపురంలో మొదలై ఆంధ్రదేశంలో మినీకవితా ప్రేమికుల గుండెల్లో గూడుకట్టుకున్న ఎక్స్‌రే పత్రికను కాస్తా దాన్నలా అడపాదడపా కొనసాగిస్తూనే సాహిత్య సాంస్కృతిక సంస్థగా 'ఎక్స్‌రే'ను కొల్లూరి (అంజలి వారపత్రిక కొంతకాలం చెన్నై, ఆపై విజయవాడల నించే నడిపినపుడు కొల్లూరి దగ్గర నేను సబ్ ఎడిటర్‌గా పనిచేశా - బహుశా అది 1993-94 అనుకుంటా) బలోపేతం చేశాడు. నెలనెలా వెన్నెల (ఇదే పేరుతో హైదరాబాద్‌లోని వివేకనగర్‌లోని సంస్థ కార్యక్రమాలు అంత అద్భుతంగా కాకపోయినా ఏదో పదోపరకో జనంతో జరిగేవి. మా గురువర్యులు డాక్టర్ బూదరాజు రాధాకృష్ణగారితో ఓసారి ఆ సాహితీ సమావేశంలో పాల్గొనడం పాల్గోవటంతోనే అలాటి యత్నం విజయవాడలో చేయాలనిపించినా నేను గొప్ప కార్యకర్తను కాకపోవటాన నే స్థాపించిన 'అద్భుత' సంస్థ ఏదో మొక్కుబడిగానే తగలడింది) నెలనెలా వెన్నెల పేరుతో ఎక్స్‌రే కవితాగానం ఏర్పాటు చేసేది. నెలకొకసారి ఇంట్లో కవులు సమావేశమయ్యేవారు. కవిత్వం పాలెంత అన్నది అట్టే పెడితే ఈ నెలనెలావెన్నెల నిజంగా నగరవాకిట సాహితీ పండువెన్నెలను పిండారబోయించింది.

అలా ఎక్స్‌రే కవితాగోష్ఠి ఓ సందర్భంలో రేడియో ఆనంద్ (ఉషశ్రీ మధుర కంఠానికి తనగానం జతకలిపి మరింత మధురిమ లొలికించిన ఏబీ ఆనంద్ - ఆదర్శ వివాహం చేసికొని స్త్రీని ఆదరించిన నిజమైన అభ్యుదయవాది, తేలప్రోలు చరిత్ర, అల్లూరి సీతారామరాజు పద్యకావ్యం వగైరా అచ్చొత్తిన



## జయ గోపాల్

### ఆధ్యాత్మిక ర'హ'స్యాలు
( మినీ కవితలు)

నాస్తిక హేతువాద వచన కవులలో
సాంస్కృతిక విప్లవ మహాకవి సి.వి.
తరువాత మతమౌఢ్యాన్ని
చీల్చి చెండాడటంలో
తెలుగు పలుకులను ములుకుల్లావాడి
పాఠకులను చైతన్య పరిచే శక్తి
ఒక్క అశోక్ కుమార్‌కే ఉంది.

ఉద్యమకారులకు వివేకవంతులైనప్రజలకు
అశోక్‌కుమార్ అందించిన
హేతువాద మినీకవితల సంకలనం ఇది.
వేమన పద్యాల్లా
అశోక్‌కుమార్ మినీ కవితలను
ప్రతిహేతువాదీ కంఠతా పట్టాలి.
మన సంభాషణల మధ్య,
ఉపన్యాసాల మధ్య
ఈ కవితలను వినిపిస్తే
మనం చెప్పాలనుకున్న భావం
బలపడుతుందనడంలో సందేహంలేదు.
ప్రతి గ్రంథాలయం
ప్రతి ఇంటా ఉండాల్సిన పుస్తకం ఇది.
(2004)

అక్షరాభిమాని ఆనంద్) ఇంట్లో మాచవరంలో ఓ సాయంత్రంపూట జరిగినపుడు ఇదిగో ఈ అశోక్ మెరుపువేగంతో నక్షత్రంలా అందరిమధ్యా పడ్డాడు. తనను తాను పరిచయం చేసుకున్నాడు. ఉద్యోగరీత్యా ముంబై వగైరా తిరిగితిరిగి చాన్నాళ్ల విరామం తరువాత సాహిత్య లోకంలోకొచ్చానని నా పక్కనే కూచొని వివరాలందించాడు. శ్రీశ్రీ తనఅభిమాన కవి అనీ, గురుతుల్యుడనీ, తానెపుడో కవితా వ్యవసాయం చేసినా, కుటుంబ పరిస్థితులవల్ల కలంపట్టి చాన్నాళ్ల యిందనీ, తన హేతువాద భావధారకి అక్షరాకృతిగా, కృతిగా 'తల్లీ ఎవరు నువ్వు?' చిరుపొత్తం (దీర్ఘకవిత) తెచ్చాననీ చెప్పుకొచ్చాడు. చాలా స్మార్ట్‌గా కనబడ్డాడు. యాభైనాలుగువయసు కూడా ఇన్‌స్టర్ట్ కారణంగా యాభైలోపునకు పడిపోయింది. అది మొదలు ఉభయులం తరచూ కలిసేవాళ్లం. భావాలు సాగు చేసుకునేవాళ్లం.

అశోక్ స్నేహపాత్రుడు. ఎవరినైనా చదవ గలడు. అవసరం మేరకు కలుపుకుపోతాడు. ఓ రకంగా తెలివైనవాడు కూడా. నేనెందరినో తెలివి తక్కువ కవుల్ని ఎరుగుదును. అశోక్‌లక్ష్యం ఒకటుంది. దానిపై గురి ఉంది. వయసు అడ్డురాని తపన ఉంది. అక్షరం – ఆలోచన అతని ఆస్తిపాస్తులు. గొప్ప ఓర్మి కలవాడుకనకే విజయదుందుభిమోగిస్తున్నాడు. ప్రేమించిన యువతితో కన్నవారిని కాదనుకున్నాడు. ఎక్కడెక్కడో తిరిగాడు. ఎక్కడాబాధ్యతలు మరిచి పోలేదు. కుటుంబయజమానిగా సభ్యుల ప్రేమాభి మానాలకు పాత్రుడయ్యాడు. అమ్మాయి జ్వలితను వైద్యురాలిగా నిలబెట్టాడు. ఆమె కోరుకున్న వ్యక్తితో వివాహతంతు ముగించి మంచినాన్నగా మిగిలి పోయాడు. కొడుకు విక్రాంత్ ఐర్లాండ్‌లో ఉంటు న్నాడు. ఏరికోరి కట్నాలకతీతంగా కోడలిని తెచ్చుకొని కూతురిలా చూసుకుంటున్న ఔదార్యం అశోక్ కుటుం బశైలి! మనవళ్లూ, మనవరాళ్లూ..చీకూ చింతా లేనిది అశోక్ కుటుంబం. అన్నీ అనుకున్నట్టుగానే జరిగాయి. అమరాయి అసలు కోణం తెలీని వాళ్లు అదృష్టం అంటారు. అన్నీ తెలిసినవాళ్లు 'కష్టేఫలి' అంటారు.

అన్నట్టు చెప్పటం మరచా – ఆనంద్ ఇంట్లో అశోక్ పరిచయం కావటానికి కొంచెం ముందు దక్కన్‌క్రానికల్ పత్రికలో అశోక్ అక్షరయానం గురించి చదివి ఎవరబ్బా అనుకునేవాణ్ని. అశోక్ కాదంటే అశోక్‌కుమార్‌గానే నాకు పరిచయమైన వ్యక్తికి క్లుప్తత అంటే చచ్చేంత ఇష్టం. 'తల్లీ! ఎవరునువ్వు?' 'శుభా కాంక్షలు' దీర్ఘకావ్యాల్ని మినహాయిస్తే తక్కిన ఎనిమిది కవితా సంపుటాలూ క్లుప్త కవితారూపాలే. అలాటి అశోక్‌ని తలచుకోగానే డెబ్భయ్యో దశ కంలో ఉవ్వెత్తున లేచివడ్డ కవితాకెరటం 'అశోక్ (పదునైనవిప్లవకవి)మదిలో మెదలుతాడు. ఎందుకనో

ఏమో ఆరేళ్లు గడిచేసరికి అశోక్‌కి ఇంటిపేరు గుర్తొచ్చి సింగంపల్లి అశోక్‌కుమార్‌గా నలుగురి నోళ్లలో నానాడు. శ్రీశ్రీకవిత్వంపై ఏకపక్షంగా 'ఆంధ్రజ్యోతి'లో జరిగిన పనికిమాలిన మూల్యాంకనం నేపథ్యంలో శ్రీశ్రీని, మార్క్సిజాన్నీ డిఫెండ్ చేస్తూ నేను వెలువ రించిన 'అగ్నిసంతకం' దీర్ఘకవితను మిత్రుడు అశోక్ కుమార్ 2004 జూన్ -15న విజయవాడ-చంద్ర రాజేశ్వరరావు గ్రంథాలయంలో ఆవిష్కరించిన సంగతులు, మా గాఢానుబంధం గుర్తొస్తున్నాయి.

కార్యకర్తగా అశోక్‌ని నేనివాళ కొత్తగా ఫోకస్ చేయనక్కర్లేదు. 'శ్రీశ్రీ సాహిత్య నిధి' పేరుతో వస్తున్న బులెటిన్లూ, చిన్నిచిన్న పుస్తకాలూ, సమాచార గుళికలూ,దాదాపు వందపొత్తాలుతేవాలన్న మహా సంకల్పమూ, ఇప్పటికే నాలుగోవంతు పూర్తయిన లక్ష్యమూ అశోక్ ఏంటో పట్టిస్తాయి. అతని పనితనం, చురుకుతనం ఏ పాటిదో రుచిచూపుతాయి.

కవిగా అశోక్ గురించి రెండు ముక్కలు. కవిత్వం అశోక్‌కి ఓ శబ్దక్రీడ. లోతైన ఆలోచనలు లేవని కాదు. ఆ తీవ్రభావోద్వేగం మరింతగా కవిత్వమై పరిమళించాలంటే కొద్దోగొప్పో నిడివి వుండి తీరాలి. ఎటొచ్చీ క్లుప్త కవితారూపాలకి కొన్ని పరిమితు లున్నాయి. కవిగా అశోక్ పది సంపుటాలై పొద్దెక్కాడు. పొత్తాలన్నీ అందంగా తెచ్చాడు. సాహితీ మిత్రుల్ని ఆకర్షించాడు. మిత్రుడి కలంనించీ జాలువారిన 'తంత్రం' అశోక్‌ని బలీయమైన కవిగా నిలబెట్టింది. గొప్ప ఆశ్చర్యమల్లా అప్పటికే అశోక్ 'తంత్రం' నా 'నడిచేశవాలు' అచ్చయ్యాయి... అవి మళ్లా 'ఈనాడు' దినపత్రిక విజయవాడ సిటీఎడిషన్‌లో ఎన్నికల వేళ రోజుకొకటీరెండూ చొప్పున ప్రచురితమై ఈనాడు విజయవాడ కార్యాలయం నించే మేనేజరు రామ్మో హనరావు ఫోన్‌చేసి 'మీ రాజకీయ హైకుల గురించి విన్నా ఓ సారి ఆఫీస్‌కొస్తే మాటాడదాం' అన్నారు. వెళుతూ వెళుతూ అశోక్‌ని వెంటబెట్టుకుని పోయా. ఇద్దరమూ రామ్మోహనరావు గారితో ముచ్చటించాం. అలా ఓ రెండు నెలలపాటు ధారావాహికంగా మా కవితలు ఈనాడులో వచ్చాయి. రామ్మోహనరావు మరో అడుగు ముందుకేసి నాలోని వ్యాసుణ్ని గుర్తిం చారు. వీలైతే రోజుకో రాజకీయవ్యాసం రాయ మన్నారు. వీలైంది. 'రాజకీయగీత' శీర్షికన వంట వండి వర్చా. ప్రజాచైతన్యానికే కవిత్వం అన్న మా ఆశయం అత్యధిక పాఠకాదరణ (ఏబీసీ గుర్తించింది) కలిగిన ఈనాడు దినపత్రిక ద్వారా నెరవేరింది.

'తంత్రం'ఓరకంగా పంచతంత్రంకాదు రాజ కీయతంత్రం. 'జన్మభూమి వీడిది – రామజన్మభూమి వాడిది–మాతృభూమి అప్పులోడిది' అని కుండబద్దలు కొట్టినట్టు నిజాలపై కవాతుచేసిన కవి అశోక్. 'నేల మీద పోరాడినపుడు కాదు – నేలకోసం పోరాడినపుడే' పుడమితల్లికి పుత్రోత్సాహం అని విశ్వసించిన కలం

అశోక్. సామ్రాజ్యవాదాన్ని అశోక్ ఆవిష్కరించిన తీరు ధ్వన్యాత్మకంగా సాగింది. 'పెట్టినంతకాలం గుడ్డు స్వాహా - పెట్టకుంటే కోడి స్వాహా' అంటూ అమెరికీ యాన్ని అక్షరీకరించినవాడు అశోక్.

నేను హైకు కవిత్వంపై డాక్టరేట్ డిగ్రీ కోసం కుస్తీ పడుతున్నప్పుడు అశోక్ నాదగ్గరి హైకు సంపుటాలు ఓసారి తిరగేసి కొద్ది రోజులకే 'పొద్దు పూసింది' రాయటం నాకు అమితానందం కలిగించింది. ఎందుకనో ఆ మూడు పాదాల కవితల్ని హైకు అనకుండా అశోక్ జాగ్రత్తపడటం ఆశ్చర్యం కలిగించినా పీఠికాకర్తలు కె.శివారెడ్డి, అద్దేపల్లి రామమోహనరావు మాత్రం హైకు నేపథ్యంలోనే పుస్తకపరిచయం చేసి ఆశీస్సులందించారు. పీఠికలు రాయించటంలో అశోక్ దిట్ట. అతని ఎంపికే ఎంపిక (ఎందుకనో రంగనాయకమ్మ గారికీ, నాకూ ముందు మాటలపై అట్టే విశ్వాసం కుదురుకోదు) 'నూరడమే నైజమైతే - కత్తి మాయమై - పిడి మిగులుతుంది' అంటూ అశోక్ కక్షలూ, కార్పణ్యాలపై తనదైన లోతైన తాత్విక అభివ్యక్తి కనబరచాడు. 'తంత్రం'కు పెద్దిభొట్ల సుబ్బరామయ్య, జ్వాలాముఖి పీఠికలందించారు. 'ఆధ్యాత్మిక రహస్యాలు' సంపుటికి-ద్వానా, జి.సుబ్బారావు ముందుమాటలు రాశారు. 'శుభాకాంక్షలు' దీర్ఘకవితకి అదృష్టదీపక్ (సినీగేయరచయిత), జర్నలిస్ట్ కేవీయస్ వర్మ (వార్త ఫేం) మున్నుడులు రాశారు. శ్రీశ్రీ మహాప్రస్థానం కొంపెల్లజనార్దనరావు (ఉదయిని వ్యవస్థాపకులు)కి అంకితమిచ్చినట్టు అశోక్ కూడా గ్రంథాంకితంతో తన నిబద్ధత, ఇష్టత చాటుకున్నాడు. 'గ్లోబలి'ని అలిశెట్టి ప్రభాకర్‌కీ, 'వ్యూహం' కవితా సంపుటిని చెరబండరాజుకీ, ఆధ్యాత్మిక రహస్యాలను ప్రజాకవి వేమనకీ, 'తల్లీ ఎవరు నువ్వు' దీర్ఘకవితను కార్మికకర్షకులకీ, 'తంత్రం'ను తనకి కవిగా జన్మనిచ్చిన మహాప్రస్థానం కావ్యానికీ, 'పొద్దు పూసింది' హైకుసంపుటిని అక్షరహాలికులకి అంకితం చేశాడు అశోక్.

అశోక్ అక్షరమంత్రదండం ఊపితే తరచూ శబ్దాలంకారాలు ప్రత్యక్షమవుతుంటాయి. మాటను విరిచి సంకేతార్థం, రూఢ్యర్థంలకు భిన్నమైన విశేషార్థాన్ని ధ్వనింపచేయటం అశోక్ శైలి. మాటల గారడిలో అశోక్ ఎక్కడికో వెళ్లి కూచున్నాడు. **'తెల్లవాడిని వెడలగొట్టింది వందేమాతరం - తెల్లమేడని పగలగొడుతుంది మందేమాతరం'** అని హెచ్చరిస్తాడు అశోక్ (గ్లోబలి) **'సమస్యే నిన్ను చంపితే చావు - సమస్యను నువ్వు చంపితే బతుకు'** అని సందేశమిస్తాడు అశోక్. **'స్వాతంత్ర్యమంటే జెండాలు ఎగరెయ్యడం కాదు - ప్రజలు జెండాల్లా ఎగరడం'** అంటూ పాడవోయి భారతీయుడా అని పిలుస్తాడు (వ్యూహం) **'పొద్దుకుముందే పూసే పొద్దు - దున్నేటప్పుడు మూడో ఎద్దు'**గా రైతును అభివర్ణించిన గాఢ కవి అశోక్. కోర్టులో భగవద్గీత గురించి రాస్తూ **'ఇన్ని అబద్ధ ప్రమాణాలకు ఇది ఎప్పుడో చచ్చి ఉంటుందని'** హేళనచేస్తాడు. (ఆధ్యాత్మిక రహస్యాలు) **'ఈశ్వర్ అల్లా 'వేరే' నామ్'** అంటూ ఈ దేశంలో లౌకికరాజ్యాంగాన్ని ఎద్దేవా చేస్తాడు. 'చంద్రగోళంమీద - నరుడు వేసిన - అడుగులు - పుక్కిట పురాణాల ఓటికుండలమీద పిడుగులు' అంటూ సురుడి నెత్తిన నరుణ్ని చూపెడతాడు అశోక్. నిజానికి నాసా చంద్రమండలయాత్ర బూటకమనే వాదన ఉంది. ఆ ఆరోపణల్ని తిప్పికొట్టేందుకైనా మళ్లా నాసా మానవసహిత చంద్రయాత్రను ప్రారంభించకుండా తాత్సారం చేస్తోంది.

దీర్ఘకవితలు అల్లే సందర్భాల్లోనూ అశోక్‌ని క్లుప్తత వీడిపోదు. 'శుభాకాంక్షలు, తల్లీ ఎవరు నువ్వు' దీర్ఘ కావ్యాలు పరికిస్తే నాలుగో ఆరో పాదాల వరస కనబడుతుంది. భావం మజిలీచేస్తూ పోతుంటుంది. **'ఆమె కను రెప్పలు - బిగువున ఉప్పెన - నేలమీదికి ఉరికింది చప్పున'** అంటాడు అశోక్. (శుభాకాంక్షలు) 'తల్లీ ఎవరు నువ్వు'లో ఓ చోట అశోక్ నిజాల నిలువుటద్దం ఉంచుతాడు. ప్రజల ఆధ్యాత్మిక పైత్యాన్ని రంగరిస్తాడు. భక్తిరసం రసి కారుతున్న- కుష్టురోగపు సెంటిమెంట్ల జాతి' అంటూ చురక తగిలిస్తాడు అశోక్. అశోక్‌లోను,నాలోని ఉమ్మడి ఆలోచన హేతువాద దృక్పథం. నేను ఆంధ్రవిశ్వకళాపరిషత్ ఎం.ఎ. (తెలుగు) విద్యార్థిగా ద్వితీయ సంవత్సరంలో ఓ పక్క పత్రికా రచనకు, మరోవంక ఐదో పేపర్‌గా హేతువాద సాహిత్యాన్ని అభ్యసించా. బౌద్ధం, చార్వాకం, నిరీశ్వరమతాల గురించి తెలిసొచ్చింది. ఎం.ఎన్.రాయ్ మానవవాదం, ఇంకా సామ్యవాదం అక్కరకొచ్చాయి. శతక సాహిత్యంలో, ప్రాచీన సాహిత్యంలో హేతువాదం ప్రస్తావనకొచ్చింది. హేతువాద సిద్ధాంత ప్రచారానికి తెలుగు నాటక సాహిత్యం భూమిక వహించిన నిజం మరువలేనిది. త్రిపురనేని వారి శంబుకవధ, ఖూనీ రూపకాలూ, జీవీ కృష్ణారావు నాటిక 'భిక్షాపాత్ర', నార్లవారి నాటకాలు జాబాలి, సీత జోస్యం, నరకంలో హరిశ్చంద్రుడు, చలం నాటిక 'సీతఅగ్ని ప్రవేశం' ముద్దుకృష్ణ 'అశోకం', ఆమంచర్ల గోపాలరావు 'హిరణ్యకశిపుడు' బోయి భీమన్న 'ధర్మవ్యాధుడు', బి.రామకృష్ణ 'చార్వాకుడు' నాటకం ఇలా నే చదివిన హేతువాద రూపకాల్ని అశోక్‌తో చర్చించి ఆనందించేవాణ్ణి.

అశోక్ నిజంగానే అశోకుడు (శోకం లేనివాడు). నన్ను గిల్లి నమ్మించినా నేను నమ్మలేనిదల్లా స్మార్ట్‌గా, ఆర్ట్‌గా, హార్ట్‌గా కనబడే అశోక్‌కుమార్‌కి అపుడే షష్టిపూర్తికి చేరువయ్యాడని బంధుమిత్రులు ఒకటే హడావుడి చేయడం. ■

## అక్షర హాలికులు

అశోక్‌కుమార్



## చాగంటి సోమయాజులు

**(1915-1994)**



## కుంకుడాకు చాగంటి

సోమయాజులు
పొగచుట్ట నోటిపోజులు
సమానవీయ గంధాలు
గుప్పించిన పెన్నజాజులు



## అన్నదాతల ఆత్మహత్యలు

తమకు / దేశం / తిండి పెట్టనందుకు కాదు !

తాము / దేశానికి / తిండిపెట్టలేకపోతున్నందుకు !



# స్నేహశీలి

తాటి శ్రీకృష్ణ

శ్రీ సింగంపల్లి అశోక్ కుమార్ మంచి స్నేహశీలి.

కవిగా ఇప్పటికే ప్రసిద్ధిగాంచిన మిత్రులు. రెండు సంవత్సరాలు ప్రతి ఆదివారం 'విశాలాంధ్ర'లో అశోక్ కుమార్ ప్రత్యేక కవితలు నిరంత రాయంగా వచ్చినప్పుడు, శ్రీ ముత్యాల ప్రసాద్‌తో కలిసి, మా స్నేహం ఆరంభమైంది. అప్పటి నుండి ఆ ఆప్యాయత కొనసాగుతూనే వుంది.

సూటిదనం, చరుపు, కత్తికి మందురాసి గాయానికేసి కొట్టే ఘాటుదనం, అద్భుత విశ్లేషణ, చురుక్కుమనే లోతైన ఆలోచన, వామపక్ష ధోరణి, రియాలిటీ – ఇవీ అశోక్ కుమార్ కవితా లక్షణాలు. బ్రివిటి, ప్రాసలులేని ఆయన కవిత్వాన్ని ఊహించుకోలేం.

'శ్రమజీవి / పరిశ్రమల రెక్క / ఆహారపు మొక్క ...
చెమట చుక్కలు / నేలచిందిన / సిరిమొక్కలు' ...

వ్యాఖ్యానం అవసరంలేని ఇలాంటికవితల్లో ప్రజాకవి వేమన వ్యక్తీకరణ పొడగడుతూ, పాఠకుల మనస్సుల్లోకి చెప్పదలచుకున్న విషయం సూటిగా పోతుంది. ఈ లక్షణమే నన్ను అశోక్ కుమార్ కవిత్వాన్ని ప్రేమించేలా జేస్తున్నది.

సామ్రాజ్యవాదం రోజురోజుకీ నాటుకు పోతు న్నకాలంలో, ఎల్‌పిజిసిస్టమ్ విస్తృతమవుతూ, సామా న్యుడినడ్డి విరుస్తూ, తీవ్రఅణచివేత, ఏకధృవ ప్రపంచ ఆలోచనలు విశ్వవ్యాప్తమవుతూ, మనిషినిజూసి మనిషి భయపడే అమానవీయ సంస్కృతి విస్తృత మవు తున్న రోజుల్లో అసలు మనిషి చిరునామా ఎక్కడఅనే ఆవేదన అశోక్‌కుమార్‌లో కలగడం గూడా సహజమే. అందుకు ఆయన ప్రాపంచిక దృష్టి, వామ పక్ష భావజాలం బాగా దోహదపడింది.ఆయన వృత్తి ఏదైనా ప్రవృత్తిమాత్రం సమాజం, దానిపోకడలు.



## డా॥ అవసరాల రామకృష్ణారావు

**( 1931 )**

నగటుజీవి బతుకు గురించి ఆలోచించే సుగుణం అశోక్‌కుమార్‌కు వుంది. ఆ దృక్పథమే ఆయన సాహి త్యంలో ప్రతిఫలించింది. అందుకు సాక్షీ భూతాలే ఆయన రచనలు-తంత్రం,పొద్దు పూసింది, వ్యూహం, గ్లోబలి మొదలుగునవి.

మనకొడవటిగంటి, కొంపెల్ల జనార్దనరావు జ్ఞాపకాల పేర్లతో శ్రీశ్రీవ్యాసాలు, కామెంట్స్, కాంప్లి మెంట్లను శ్రమతో సేకరించి ప్రచురించిన ఆయన పరిశ్రమను సాహితీ జగత్తు తప్పకుండా ప్రశంసి స్తుంది. అలానే 'గిడుగు'పై (గిరాంమూర్తి) ఆయన సేకరించిన సమాచారం కూడా విలువైనది.

ఆయన కవిత్వం ఒకఎత్తు అయితే శ్రీశ్రీ సాహిత్యనిధి పేరుతో ఆయన చేసిన, చేస్తున్న కృషి వర్తమాన, భావి తరాలకు ప్రయోజనకారి, అభినంద నీయమైనది. శ్రీశ్రీ పేరుతో అశోక్‌కుమార్ చేస్తున్న ఈ కృషి ఆంధ్ర సాహిత్యంలో అద్భుతమైంది. ఆదర్శ మైంది. శ్రీశ్రీ శతజయంతికి ముందు నుంచే శ్రీశ్రీ బులెటిన్స్‌ను ప్రారంభించి, శ్రీశ్రీ సాహిత్యాన్ని వివిధ కోణాల్లో వ్యాపింపచేస్తున్నారు. ఇవి ఇంకా కొనసాగు తూనే వున్నాయి. ఇదొక పెద్ద అధ్యాయం. ఆంధ్ర సాహిత్యంలో శ్రీశ్రీ పేరుతో అశోక్‌కుమార్ చిర స్థాయిగా నిలిచిపోతారు. శ్రీశ్రీకి సంబంధించిన ఏ సమాచారమైనా చిటికెలో ఇవ్వగలిగేలా ఆయన అన్ని సమాచా రాలను సేకరించి కంప్యూటర్‌లో భద్ర పరుస్తున్నారు. సీడీలరూపంలో శ్రీశ్రీ సాహి త్యాన్ని, సమాచారాన్ని ముందు, ముందు అందిస్తారేమో చూద్దాం.

ఇంతటి విశిష్టమైన ఈ సాహితీ మిత్రులు తనషష్టిపూర్తిని జరుపుకోబోతున్నారంటే ఆనందంగా ఉంది.ఇలాంటివేడుకలు ఏ వాతా వరణానికి చెందినవైనా, ఈ పేరుతో అశోక్ కుమార్ జీవితానికి చెందిన వివిధ రూపాలు, అంతస్తులు, ఆలోచనలు, ఆయన సాహితీకృషి, ముఖ్యంగా శ్రీశ్రీకి చెందినది - ఆవిష్కృతమ వుతున్నందుకు సంతోషంగా వుంది.

ఈ సందర్భంగా అశోక్ కుమార్‌కు, ఆయన కుటుంబ సభ్యులకు నా శుభాభి నందనలు - ఒక సంస్థ చెయ్యాల్సిన శ్రీశ్రీ సాహిత్యనిధి సేవను, మిత్రులు అశోక్ కుమార్ ఒక్కరే నిర్వహిస్తున్నందుకు, ఆయనను ప్రశం సిస్తూ, నిండునూరేళ్లూ ఆయురారో గ్యాలతో సుఖసంతోషాలతో శ్రీఅశోక్‌కుమార్ జీవితం అలరారాలని మనస్ఫూర్తిగా కోరుకుంటున్నాను.

మిత్రులు 'చినుకు' సంపాదకులు రాజగోపాల్ తెరవెనుకలేకపోతే.. ఈ అక్షరాలు తెరపై కెక్కేవి కావనేది అక్షరసత్యం. ■

## శ్రీశ్రీ బులెటిన్స్

బులెటిన్స్<br>
టన్ను అయినా<br>
కలవారి కాళ్లుపట్టు<br>
కథనాలె కదా!

నలిగిన ప్రజ<br>
మనుగడ వ్యథ<br>
వెలిగ్రక్కిన ఎద బులెట్టు<br>
శ్రీశ్రీ బులెటిన్స్!

## అక్షర హాలికులు

**అశోక్ కుమార్**



## ఉన్నవ లక్ష్మీనారాయణ

**( 18997 - 1958)**



## సంగ విజయం

ఉన్నవలాపురి మాలపల్లి<br>
దళితోద్యమం విత్తులుజల్లి<br>
సమతాజనతా సమరానికి<br>
కత్తులు పూసిన నేలతల్లి



## ప్రపంచీకరణం

తను శ్రమిస్తూ / శ్రమచుట్టూ పరిశ్రమించడం/ వసుధీకరణ !
తను శ్రమించకుండా / శ్రమనంతా పరిగ్రహించడం / ప్రపంచీకరణ !



# వెన్నుదన్నుగా వుండే స్ఫూర్తి

డి. నటరాజ్

**నా పదిహేనేళ్ల ప్రాయంలో పెదబ్రహ్మదేవం కాకినాడ కాలువవద్దున మిత్రులందరూ కూర్చుని మాట్లాడుకుంటుంటే అప్పుడప్పుడూ నేనూ వెళ్తూండేవాడ్ని. కట్టాకృష్ణారావు, నారాయణరావు, కరసూదుల అప్పారావు, హెచ్‌వీ గణపతి... యింకెవరో కూర్చుని వివిధ విషయాలమీద మాట్లాడుతుంటే యింట్రెస్ట్‌గా వినేవాడ్ని. వాళ్లందరికీ నా మాటలు అమాయకంగా యిష్టంగా అనిపించేవి. నేపూ ఒకోసారి వాదించేవాడ్ని.**

నన్ను ఎంతో యిష్టపడిన కట్టా కృష్ణారావు తుట్టా నాగేశ్వరరావు దగ్గరకు తీసుకువెళ్లేవాడు. వాళ్లిద్దరూ నన్ను అహ్మద్ అనే ఆయన దగ్గరకు తీసుకెళ్లారు. అహమ్మద్ గారికి నేను చాలా నచ్చేశాను. ఆయన నన్ను ఏ సినిమాలు, ఏ పుస్త కాలు నీకు యిష్టం అని అడిగారు. నాకు 'అన్ని సినిమాలు, అన్ని పుస్తకాలు యిష్టమే' అన్నాను.ఎందుకని?అన్నారు. అన్నీ మంచివే అందుకని అన్నాను. 'అన్నీ మంచివేనా'అని అడిగారు 'అన్నీమంచివే' మంచివి కాకపోతే సినిమాలు చేయరు కదా, మంచివి కాకపోతే పుస్తకాలుగా రావుకదా' నాజ్ఞానాన్ని అమాయికంగా వెల్లడించాను. ఆయన ప్రేమతో నా భుజంతట్టారు. తదుతూనే అన్నారు.'అన్నీ మంచివి వుండవు,చెడ్డసినిమాలూ, చెడ్డపుస్తకాలూ, చెడ్డమనుషులూకూడా వుంటారు'.ఆయన నాకు యిచ్చిన మొదటి పుస్తకం, వియత్నాం వీరుడు, ఎన్‌గుయన్ వాన్‌ట్రాయ్ గురించిన చిన్నపుస్తకం. ఇరవైఏండ్ల వయసులో దేశ స్వాతంత్ర్యం కోసం ప్రాణాలు బలిపెట్టిన వీరుని కథ అది. ఆ పుస్తకం నన్ను చాలా ప్రభావితం చేసింది.మరోప్రపంచపు ద్వారాలు తెరిచింది. ఆయన నాకు యిచ్చిన రెండవ, మూడవ పుస్తకాలు, అశోక్‌కుమార్ రాసిన 'తల్లీ ఎవరు నువ్వు?', 'బాబామహాత్యం' యీ రెండుపుస్తకాలూ నన్ను ప్రభావితం చేయడమే కాదు, నన్ను కార్యశూరుడ్ని చేశాయి.నాలో హేతువాదపుజ్వాలలు రేకెత్తించాయి. ఇంటికి వెళ్తూ వెళ్తూనే 'అమ్మా యీ పుస్తకం చదువమ్మా!' అంటూ తల్లీ ఎవరు నువు? ఇచ్చి, రెండోది కూడా నేనే చదివి వినిపించి, అమ్మ ఎదురుగానే ఆ జిల్లేళ్లమూడి అమ్మ కాలెండ రును చించివేశాను. వీళ్లందరూ దొంగలు, దేవుడనే వాడు ఎవడూలేడని చెప్పాను. అది లగాయితూ నేను చదవని పుస్తకం లేదు. భారత రామా యణాలు చదివి అవతల పారేశాను. పెదబ్రహ్మదేవంలో గ్రామగ్రంథాలయం వుండేది.నా సొంత డబ్బుల్తో నేను మెంబరునయ్యాను.ఎన్ని పుస్తకాలు చదివానంటే, చెప్పలేను.నాకు బాగా బాగా బాగా నచ్చిన పుస్తకాలు శరత్‌బాబు బడదీది కాళింది, శ్రీకాంత్, ప్రేమ్‌చంద్ గోదాన్, కరుణకుమార సన్నజీవాలు, పురిపండ అప్పలస్వామి అమృత సంతానం, సాక్షి వ్యాసాలు, కొడవటిగంటి సైన్సు పుస్తకాలు, మాక్జిమ్ గోర్కీ అమ్మ మరెన్ని పుస్తకాలో చెప్పలేను. అన్నీ చదివి చదివీ ఏదో చెప్పుకోవాలన్న తపన.ఉత్తరాలు రాయడం మొదలు పెట్టాను. నేను రాసిన మొదటి లేఖ అశోక్ కుమార్ గారికే. మేమిద్దరం చాలా వుత్తరాలు రాసుకున్నాం.అశోక్‌కుమార్ గారితో ఉత్తరాలు రాసుకుంటున్నందుకు ఎంతో గర్వపడేవాడ్ని. నన్ను చాలా ప్రోత్సహించే వారు. తరువాత తరువాత నేను గట్టి హేతువాదిగా, నాస్తికోద్యమ కారునిగా అయ్యేందుకు, హేతువాద రచనలు చేసేందుకు అశోక్‌కుమార్ గారి పుస్తకాలూ, ఆయనతో వుత్తరాలూ నాకు చాలా కారణం అయ్యాయి. నేను రెబల్‌గావున్నానూ అంటే కారణం-ఆయనే. కేవలం ఉత్తరాలూ, రచనలు ద్వారానే నేను ఆయనకు అనుంగు శిష్యుడ్ని అయ్యాను. అయితే ఆయనని చూసింది, ఆయనతో స్నేహంచేసిన ముప్ఫయ్యేళ్ల తరువాత మాస్నేహం ఎంతదోరగా వుండిందంటే, 'నటరాజ్ నువ్విప్ప టికీ ఆనాటి నటరాజ్‌లాగానే ఆ ఉత్తరాల్లో ఉన్నట్టేవున్నావు అన్నారుతను. 'నమ్మితే ప్రాణం. నమ్మకపోతే ద్వేషం' అన్నట్టుండే వాడ్ని. 1996 వరకూ బుద్ధ భగవానుడు నా జీవితంలో ప్రవేశించాక,ద్వేషభావాలుపోయి,నిర్మాణయుతమైన ప్రేమ మాత్రమే మిగిలింది నాలో.అయితే ఆ ఎర్రనికళ్లతో చూసినా,యీ చల్లని కళ్లతో చూసినా అశోక్‌కుమార్ నా జీవితంలోనూ, తెలుగుసాహిత్యంలో కూడా కళ్లకు మిరుమిట్లు గొలిపేతోకచుక్కే ఇరవైయేళ్లప్పుడు అరవయ్యేళ్ల పరిణతిచూపాడు. ఈ అరవైయేళ్ల పుడు అతడు ఇరవైయేళ్లకుర్రాడయ్యాడు.అప్పటికీ, ఇప్పటికీ అతడలా స్ఫూర్తేకదా!



## అక్షరాభ్యాసం

A అంటే America / అని రుద్దుతున్నది / వాడి సామ్రాజ్యవాద దాహం !
అ అంటే అమెరికా / అని దిద్దుతున్నది / వీడి వలసవాద వ్యామోహం !



# సింగంపల్లి శ్రీశ్రీ

ద్వా.నా. శాస్త్రి

**అతను శ్రీశ్రీ భావాల్ని పోగుచేస్తాడు. కాదు - శ్రీశ్రీ భావాల్ని సాగుచేస్తాడు**
**శ్రీశ్రీ అంటే అతనికి ఒక పూనకం !**
**అందుకే 'శ్రీశ్రీ సాహిత్యనిధి'ని స్థాపించాడు.**
**అతని పేరు సింగంపల్లి అశోక్ కుమార్ ! కానీ అతనిని తెలిసినవారు 'సింగంపల్లి శ్రీశ్రీ' అంటారు.**

సినీనటులకు వీరాభిమానులుంటారు కానీ కవులకి ఉండరు.
శ్రీశ్రీ అంటే చలసాని ప్రసాద్‌కి, కీర్తిశేషులైన టి.ఎల్.కాంతారావుకి, వరవరరావుకీ,
రావి శాస్త్రికీ...మరికొంతమందికి అభిమానమే!
కానీ సింగంపల్లి శ్రీశ్రీ వీరాభిమాని!

శ్రీశ్రీ గురించి ఏ సమాచారమైనా అందివ్వగలడు.
శ్రీశ్రీ రచనలు, కరపత్రాలూ, చమత్కారాలూ, శ్రీశ్రీపై వచ్చిన రచనలూ...ఇలా ఎన్నెన్ని సేకరించాడో !
సేకరించడమే కాదు శ్రీశ్రీ రచనల నేపథ్యం, సినిమా పాటల నేపథ్యం... ఏదైనా సాధికారికంగా చెప్పగలడు.
శ్రీశ్రీ శత జయంతి సందర్భంగా 2007 నుండి 'శ్రీశ్రీ బులెటిన్'ను నెలనెలా ప్రచురిస్తున్నాడు.
ఈ బులెటిన్లు అన్నీ కలిపితే 'శ్రీశ్రీ సర్వస్వం' అవుతుంది.
వీటిల్లో ఎక్కడెక్కడి, ఎప్పటెప్పటి విషయాలనో తవ్వితవ్వి అందించాడు.
ఇటువంటి అపూర్వమైన ఆసక్తికరమైన విషయాలెన్నో ఈ బులెటిన్‌ల ద్వారా అందించాడు.
ఒక తెలుగువాడు మరొక తెలుగువాడి గురించి అంతగా పట్టించుకోడని జోకులేసుకునే సమయంలో
శ్రీశ్రీని గురించి నరనరాన వంటబట్టించుకున్న శ్రీశ్రీ భక్తుడు సింగంపల్లికి అభినందనలు...!

## అక్షర హాలికులు

**అశోక్‌కుమార్**



## పానుగంటి లక్ష్మీనరసింహారావు

**(1865-1940)**



### 'గంటాభరణం'

అధిక్షేప వ్యాసాల సాక్షి
దృష్టిలో వైనతేయ పక్షి
సమాజ రుగ్మతలపై
పానుగంటి నిటలాక్షి

---

### 'సాహిత్యంలో అరుదైన వ్యక్తి'

1974-75ప్రాంతంలో'తల్లీ!ఎవరు నువ్వు?' అనే పుస్తకం చదివాను.అప్పట్లో నాస్తిక భావాలు, హేతువాదభావాలు నాలో చాలా తీవ్రంగా వుండేవి.

**'భక్తిరసం రసికారుతున్న / కుష్ఠురోగపు సెంటిమెంట్ల జాతి' / నీ కారుకూతలకు ఊపిరిపోసి/ నీ నంగనాచి విన్యాసాలకు / రంగులు వేస్తున్న పోరంబోకుమంది జనానికి'** అంటూ ఆ దీర్ఘ కవిత సాగుతుంది. శీలా వీర్రాజు గారు తొలి దీర్ఘ కవిత రాశానని అంటున్నారు-అంతకుముందే అశోక్ కుమార్ రాశాడేమో పరిశీలిం చాల్సివుంది. అద్దేపల్లి రామమోహన రావుపై ఆదరణ కలగటానికి కూడా ఈ కావ్యానికి రాసిన ముందుమాట కారణం. ఇప్పటికీ నాకు ఈ బాబాలూ, అమ్మలూ,స్వాములూ అంటే వళ్లు మంటే! హిందూమతానికి వీళ్లు మేలు చేయకపోగా కీడుచేస్తున్నారు. అసలైన సనాతన ధర్మాన్ని వీరు చెప్పరు - పాటించరు!

ఆ తర్వాత ఎన్నో సంవత్సరాలకి అశోక్‌కుమార్‌ని కలవటం-ఆయన పుస్తకావిష్కరణ సభలో పాల్గొనటం నాకు అమితానందాన్ని కలిగించింది. ఓ సారి అద్దేపల్లి నేను ఆయన ఆతిథ్యాన్ని స్వీకరించాం.ఎంత ఆదరణో చెప్పలేను.అశోక్‌కుమార్ ఆలోచనా పరుడు.వాక్శూరుడు కాదు-క్రియా శీలుడు! ఏం చెప్తాడో అది చేస్తాడు. ఏది చెప్పినా సాధికారికంగా, సోదాహరణంగా చెప్తాడు. తెలీక పోతే తెలీదని చెప్పే అక్షరనిజాయితీపరుడు. అంతే కాదు-ఇతరుల్ని అడిగి తెలుసుకునే తెలివి గలవాడు!

అద్దేపల్లి అంటే అశోక్‌కి అమితాభిమానం. అందుకేనేమో మినీకవితను చేపట్టాడు.మూడు పాదాల్లో భావ తీవ్రను సాధిస్తూ రాయటం అతనికే చెల్లింది.

**'తిరుగుబాటు / కంటి జలపాతానికి / పుట్టిన విద్యుత్తు'** అనడం అతనికే సాధ్యం.

ఇతనిలోకజ్ఞత ఎంత గొప్పదో **'ప్రజలూ / పోలీసులూ / రైలు పట్టాలు'** అనడంతో తెలుస్తుంది.

అశోక్‌కుమార్‌ని కలిస్తే పరమశాంతి స్వభావుడిగా కనిపిస్తాడు. ఆ తర్వాత తెలుస్తుంది ఇతను 'మెత్తనిపులి' అని. కలంపట్టాడో ఆగ్రహోదగ్రు డవుతాడు. ఆ ఆగ్రహం సూదిపోటువంటిదేతప్ప నిందాపరంగావుండదు.మాటల్లో కూడా నిశ్శబ్ద విప్లవాన్ని సృష్టించగలవాడు. సామాజిక దృక్పథం లేని రచన చెయ్యనే చెయ్యడు.

**'చెరబండరాజుగానం**
**సమరశీల తెలంగాణం**
**అసమాన 'తలలు' తీసే**
**శ్రమవాదమార్పు బాణం'**

అనడం అశోక్ కుమార్‌కే చెల్లింది. చెరబండరాజు నూటికి నూరుపాళ్లు నిబద్ధ కవి. ఉద్యమ కవి. ప్రాణంకన్న ఆశయం మిన్న అని చాటిన కవి. అతన్ని ప్రస్తుతించడంవల్ల అశోక్ కుమార్ నాకు మరింత ఇష్టుడయ్యాడు. చెరబండరాజు పాటల్ని క్లాసులో పాడివినిపించి విద్యార్థుల అభిమానం పొందినవాడ్ని!

నేను అశోక్ కుమార్ చాలా భావాలను సమర్ధిస్తాను. సమాజంలో కుళ్లునుకడిగే అతని చిన్న ప్రయత్నాన్ని అభినందిస్తాను. **'రాయిరాయినీ / కళ్లకద్దే / భక్తోన్మాదపు మొద్దు కుప్ప కుప్పకీ / ఆగినిలిచే / మునిసిపాలిటీ ఎద్దు'** ఎంత నిజం ఇది!

ఓసారి అమెరికన్ టీమ్ వచ్చి నపుడు అమలాపురంలో ఒకాయనభారతదేశ పర్యటనపై మీ పరిశీలనను ఒక్కవాక్యంలో చెప్ప మన్నాడు. వెంటనే ఒక అమెరికన్ ఇలా చెప్పాడు 'ఎక్కడికెళ్లినా నేను బెంగాలీని, నేను ఒరియావాడ్ని,నేను తమిళుడ్ని అని తప్ప నేను భారతీయుడ్ని అని ఎవరూ చెప్పటంలేదు' ఇంతకంటె దారుణం ఏముంటుంది. మన అశోక్ కుమార్‌కూడా'మనిషిలేడా?'అనే గొప్పకవిత రాశాడు.

**'కమ్మో రెడ్డో కాపో/ అంటాడు గాని/ మనిషినని చెప్పడేం'**అంటూ ప్రారంభమయ్యే కవితను చదివితే అశోక్‌కుమార్ అభిమానులమై పోతాం.

'శ్రీ బాబామహాత్యం' అనే తొలి హేతువాద దీర్ఘ కవిత రాసింది కూడా అశోక్ కుమారే!

'బాబాగారి/ వేషవేషానికీ అత్తరు!
బాబా గారి / కేశ కేశానికీ అత్తరు!
అది ప్రజల నరనరాల నుండీ
పిండుకున్న నెత్తురు' అంటాడు.

ఈ బాబాలూ, స్వాములూ అట్టడుగు వర్గాల వారిని ఎప్పుడైనా అక్కున చేర్చు కున్నారా? జాషువా అన్నట్టు వీరంతా 'శ్రీగలవాని యాజ్ఞలో పెదవి కదల్పజాలరు'. అందుకే అశోక్ కుమార్‌కి వీళ్లంటే మంట! యువకుడిగా ఉన్నప్పటి భావజాలం వయసు మీదపడిన తర్వాత మారిన మహానుభావుల్ని చాలా మందిని చూశాం. దానికి మినహాయింపు అశోక్ కుమార్! అప్పటికీ ఇప్పటికీ అదే హేతు వాదం-అదే నిబద్ధత-అదే విశ్వబద్ధ చైతన్యం-అదే నిర్భయత్వం! ఇది సామాన్య విషయమేమీ కాదు.

ఇవన్నీ ఒక ఎత్తు-శ్రీశ్రీశతజయంతి సందర్భంగా అశోక్ కుమార్ చేసినకృషి ఒక ఎత్తు. అందరి కంటె ముందుమేల్కొని అందర్నీ మేల్కొల్పాడు. 'శ్రీశ్రీ పిచ్చోడు' అనటం ఒక ప్రశంసే అవుతుంది.

ఇవాళ శ్రీశ్రీపై సాధికారికంగా చెప్పగల ఒకరిద్దరిలో ఒకడు అశోక్ కుమార్ - రెండోవాడు చలసానిప్రసాద్! అతని నిరాడంబరత్వం, నిజాయితీ, నిబద్ధత, సాహిత్యతపన, ప్రగతి భావాలు-ఇవే నన్ను కట్టిపడేశాయ్! సాహితీ ప్రపంచంలో అరుదైన వ్యక్తి సింగంపల్లి అశోక్‌కుమార్! విమర్శకుడిగా నిబద్ధతను వ్యతిరేకించే నేను నిబద్ధ కవిగా అశోక్‌ను మనసారా మెచ్చుకుంటాను. సింగంపల్లి అశోక్‌కుమార్ నావాడు అని చెప్పు కోవటానికి గర్విస్తాను!!! ■



**విశ్వ'నాదం'**

గ్లోబుని / తిప్పుకోవడం / శ్రమరాజ్యవాదం
జేబున / కుక్కుకోవడం / సామ్రాజ్యవాదం



# అశోక్ కుమార్ హేతువాద కవితలు - పరిశీలన

బి. సాంబశివరావు

**హేతువాద ప్రచారానికై ఉద్దేశించబడిన కవిత్వం తెలుగులో చాలా తక్కువే వచ్చింది. అందుక్కారణం, ఆ ఉద్యమ వ్యాప్తికున్న పరిమితి కూడా అయి వుండవచ్చు. ఆధునిక కాలంలోనేకాదు, ప్రాచీన కాలం నుంచి చూసినా హేతువాద ధోరణిలో వచ్చిన సాహిత్యంకంటే, ఆస్తిక సాహిత్యమే ఎక్కువ.**

**ప్రాచీన తెలుగు సాహిత్యంలో హేతువాదం ఎక్కడైనా వుందా అని వెతికితే నిరాశే మిగుల్తుంది. ఆది కావ్యమని చెప్పుకునే 'ఆంధ్రమహాభారతం' నుంచి ఆధునిక యుగందాకా హేతువాదుల్ని వారి ఆలోచనల్ని తిడుతూ, ఖండిస్తూ రాసిన కొన్ని పదాలు ఆయా కవుల కాలాల్లో కన్పిస్తాయి. 12వ శతాబ్దంలో జీవించాదని చెప్పబడే శరభాంకుని కొన్ని పదాల్లో తప్పితే 16వ శతాబ్దందాకా, అంటే వేమన తెలుగు సాహిత్య వేదికపై అవతరించిందాకా, హేతువాదానికి సానుకూలమైన కవిత్వమేదీ కన్పించదు.**

హేతువాద దృక్పథంతో తొలిసారిగా కావ్యరచన చేపట్టిన ఘనత కవిరాజు త్రిపురనేని రామస్వామికే దక్కుతుంది. నాస్తికునిగా, ఆయన రాసిన సూతపురాణం, భగవద్గీత, ధూర్త మానవ, కుప్పుస్వామి శతకాలు సాహిత్య విలువల్లో వాటికవేసాటి. హేతువాద భావాలను ప్రాచీన ప్రక్రియలైన, కావ్య, నాటక, శతకాదుల్లోనే కాక ఆధునిక మాత్రాఛందస్సుల్లో కూడా అందంగా చెప్పవచ్చని కవిరాజు నిరూపించాడు.

సామ్యవాద సిద్ధాంతాన్ని ఒంటబట్టించుకుని హేతువాద ధోరణితో కవిత్వం రాయటం 1940లో మొదలయినా, ఆధారాలతో మహా కావ్య రచన చేసిన తొలికవిమాత్రం సి.వి.(సి.వరహాలరావు).వారు రాసిన 'సత్యకామ జాబాలి' ఆధునిక వచన కవితామహాకావ్యం. 1955 నుంచి శ్రీశ్రీకి ఏకలవ్య శిష్యునిగా ఎంచుకొని సి.వి.మోగించిన కవితాకదన కాహళంతో తెలుగు నాట పలువురు యువకులు ఉత్తేజితులయ్యారు. అదే ధోరణితో కలంపట్టి సాహిత్య వ్యవసాయం సాగించారు. అలాంటి వారిలో ఒకరు అశోక్ కుమార్.

1970 తర్వాత తెలుగునాట ఉద్యమం బలంగా సాగింది. అంతకుముందే విజయవాడ కేంద్రంగా గోరాగారి నాస్తిక ప్రచారం,తెనాలి కేంద్రంగా హేతువాద, రాడికల్ కమ్యూనిస్ట్ ఉద్యమప్రచారం నడిచినా, వాటి ప్రభావంతో కవిత ప్రక్రియలో వచ్చిన గ్రంథాలేవీ కన్పించవు. కొండవీటి వెంకటకవి, బి.రామకృష్ణ

## అక్షర హాలికులు

**అశోక్‌కుమార్**



# కొమర్రాజు వేంకటలక్ష్మణరావు

**(1876-1923)**



# భాషావిద్యుత్తు వేత్త

'విజ్ఞాన చంద్రికా పరిషత్తు'
సాంస్కృతిక వికాసవిద్వత్తు
తెలుగులో విజ్ఞాన సర్వస్వం
కొమర్రాజు చేసిన కసరత్తు

వంటివారు ఒకరిద్దరు రాసినా వాటిలో ఉద్యమ స్ఫూర్తిగల కవిత్వం అంతగా కన్పించదు.

1970లో విప్లవ రచయితల సంఘం, 1972లో విశాఖలో భారత నాస్తిక సమాజం లాంటి సాంస్కృతిక విప్లవప్రజా సంఘాలు ఏర్పడ్డాక, హేతువాద ప్రచారంలో విప్లవ ధోరణి తలెత్తింది. అంతకుముందే సి.వి.గారి 'విషాదభారతం', 'కారుచీకట్లో కాంతిరేఖ', 'ఊళ్లోకి స్వాములు వారు వేంచేశారు'. 'ఏడుకొండలవాడా గోవిందా', 'నరబలి'వంటి కావ్యాలు పాఠకుల్లో చైతన్యం రగిలించాయి. ఉత్సాహ వంతులయిన యువపాఠకులు వచనకవిత్వంలో హేతువాదాన్ని బలంగా రాయటం మొదలుపెట్టారు. ఆ యువకుల్లో ఒకరు అశోక్‌కుమార్. ఆ తర్వాతనే కత్తివర్మారావువంటి కవులు ముందుకొచ్చారు.

అశోక్ కుమార్ తన అరవైఏళ్ల జీవన కాలం లో రాసిన హేతువాద కృతులు ఆరు అవి –

1. 'తల్లీ ఎవరు నువ్వు' – 1973
2. 'శ్రీ బాబామహాత్యం'. – 1975
3. 'బాలయోగీశ్వర సందర్శనం' – 1976
4. 'మతప్రస్థానం' – 1976
5. 'ఆధ్యాత్మిక రహస్యాలు' – 2004
6. 'జ్ఞానగుళికలు' – 2005

వీటిల్లో మొదటిది దైవాంశసంభూతురాలిగా చెప్పుకుంటూ 'అమ్మ'గా పిలిపించుకుంటూ అవ తారమూర్తుల్లో ఆడవారికి కూడా అవకాశం వుందని చాటుతూ వెలసిన ఒక 'దేవత'గురించి. ఆ పుస్తకం మీదున్న బొమ్మను బట్టి ఆ 'తల్లి' గుంటూరు జిల్లా బాపట్ల తాలూకాలోని జిల్లెళ్లమూడిలో వెలసిన దేవత అయివుండాలి. 1970 తర్వాతనే ఆమెకు ప్రచారం పెరుగుతూ వచ్చింది. దాంతో పాటే ఆమె దేవతా త్వంపై హేతువాదుల, సామ్యవాదుల ప్రశ్నలుకూడా గట్టిగాలేచాయి. అశోక్ కుమార్ కూడా తన కలమెత్తి 'తల్లీ! ఎవరునువ్వు?' అంటూ ప్రశ్నించాడు.

**'ఎందుకీ అవతరణ?**
**ఏ ఆశయసాధన కోసం ఈ వేషం?'**

అంటూ నిలదీశాడు. నువ్వే నిజంగా మహుత్తుగల దేవతవైతే, నీ కళ్లముందే అతివలఆర్తనాదాలు, అన్నా ర్తుల హాహాకారాలు ఎందుకున్నాయంటూ గద్దించి అడుగుతాడు.

**'నగ్నంగా నీ నిజరూపం బయటకు తీసి**
**జనంతో తిరుగుబాటు చేస్తాం!**
**నీ భావి హర్మ్యాలు.....**
**పునాదులతో పెల్లగించివేస్తాం'**

అంటూ ఆమెను హెచ్చరించి ముగిస్తాడు.

ఈ కావ్యం 1973 నాటిది. అప్పటికే అశోక్ కుమార్ విరసం సభ్యుడు. 1973–77 మధ్య కాలం లో విరసం, కాకినాడయూనిట్‌కి ఆయన కన్వీనర్ కూడా.ఆ కాలంలోనే ఆయన రాసిన మొదటి నాలుగు హేతువాద వచనకావ్యాలు రావటం గమనార్హం.

ఇక రెండోకావ్యం 'శ్రీ బాబామహాత్యం' 1975 మే నెల్లో ప్రథమ ముద్రణ పొందిన ఈ కావ్యం అట్ట మీద బొమ్మను చూడగానే అది 'పుట్టపర్తి బాబాపై వచ్చినరచన' అని ఎవరైనా తేలిగ్గా గ్రహిస్తారు. ఈ పుస్తకాన్ని "బాబాల హస్తలాఘవాలకు బోరున మస్తిష్కాలు స్ఖలిస్తున్నటువంటి సుప్రసిద్ధ సైంటిస్ట్ సున్నాసులకు' అంకితమిచ్చారు రచయిత.

'తల్లీ ఎవరునువ్వు'లో కంటే, ఇందులో అశోక్ కుమార్ కవితాప్రవాహం వేగమందుకుంది. విమ ర్శలో ఘాటు, నూటిదనంహెచ్చాయి.సి.వి. కావ్యాల పఠన ప్రభావం, ప్రేరణ, అనుసరణ ఇందులో స్పష్టంగా కన్పిస్తాయి.

**'కిలాడి నాగలి పట్టి**
**అమాయక వారసత్వం ఎద్దుల్ని పెట్టి**
**జడిపించి –**
**ప్రవచనాల కొరడా ఝుళిపించి**
**ఆధ్యాత్మిక క్షేత్రాన్ని**
**వ్యవసయిస్తోన్నవారు**
**సంపూర్ణ కాషాయాంబరధారులైన వారు**
**శ్రీశ్రీశ్రీ బుట్టతల భగవాన్ బాబాగారు**
**వారు సాక్షాత్తూ**
**యిలపైచెదరిపడిన భగవదాంశసంభూతులు'**

ఇది చదువుతుంటే సి.వి.గారి 'ఊళ్లోకి స్వాముల వారు వేంచేసారు' మనసులో మెదులు తుంది.

బాబాలుచెప్పే మెట్టవేదాంతాలు, అనుభవించే భోగాలు,విలాసాలు,చేసేమోసాలు,దోచే ఐశ్వర్యాలు, ఆడవాళ్ల శీలాలు, అన్నింటినీ తూర్పార బట్టారు. ఇందులో రచయిత అమాయక జనాన్ని ఆధ్యాత్మిక మత్తులో ముంచుతూ, వారినైరస్యాన్ని నిర్వీర్యం గావిస్తున్న బాబాల, స్వాముల, మాతల దోపిడీ వ్యవ స్థపై తిరగబడే 'ఎర్రర్రని హేతువాదాన్ని' రూపు కట్టిస్తారు అశోక్‌కుమార్.

1974,1975,1976 సంవత్సరాలలో డా.ఏ.టి. కోవూర్ మన రాష్ట్రాన్ని పర్యటించాక, హేతువాదుల్లో నూతనోత్తేజం వెల్లివిరిసింది. కోవూర్, బాబాలపైన, యోగులపైన విసిరినసవాళ్లు హేతు వాదుల్లో కొండంత ధైర్యాన్ని నింపాయి. ఆయన సంధించిన 'లక్షరూపాయల'ను అందు కోవటానికి ఏ ఒక్క అవతారమూర్తీ ప్రయత్నించక పోవటం, వారి ఓటమికి చిహ్నంగా రుజువైంది.కోవూర్ హేతు వాద దృష్టిలో తిరుగులేని హీరోగా తోచాడు– అశోక్ కుమార్ కూడా ఆ సమయంలో తాను రాసిన 'బాల యోగీశ్వర సందర్శనం' అనే కావ్యాన్ని కోవూర్‌కి

అంకిత మిచ్చి తన అభిమానాన్ని చాటుకున్నారు.

'డాక్టర్ ఏ.టీ. కోవూర్
శాస్త్రజ్ఞానానికి మరోపేరు
'అతీతశక్తి' గుండెలు
చెండుతున్న కైజారు!'

అనే మినీ కవితను కూడా 'అంకితం'లో ప్రకటించారు.కోవూర్‌విసిరిన 'లక్షరూపాయల సవాల్' వివరాలను పుస్తకానికి ముందుమాటగా ప్రచురించారు.

'బాలయోగీశ్వరసందర్శనం' (1976) ఆ రోజుల్లో విస్తృత ప్రచారంలో వున్న ముమ్మిడివరం బాలయోగినుద్దేశించి రాసింది. ఏళ్ల తరబడి ఆహారం లేకుండా, నీరుకూడా తాగకుండా నిరంతరం ధ్యానంలో వుంటున్నాడని చెప్పబడే ఆ బాల యోగిని చూడటానికి జనం గుంపులు గుంపులుగా వచ్చేవారు. శివరాత్రి నాడు దర్శనం. ప్రభుత్వాధి కారులు కూడా బాలయోగి ప్రాభవానికి సహకార మందించేవారు. ఒక లౌకిక ప్రభుత్వం, మతంతో చెట్టపట్టాలేసు కోవడంవల్ల రాజ్యాంగస్ఫూర్తికి, సమాజ ప్రగతికి కలిగే ప్రమాదం ఎంతటిదో నేటికీ మనపాలకులు గుర్తించడంలేదు.

ఈ కావ్యాన్ని చర్చా రూపంలో నడిపించి అశోక్‌కుమార్ మరోసారి సి.వి.గారి సత్యకామ జాబాలిని పాఠకుల స్మరింపచేశారు. ఆ చర్చల్లో 'శోకుడు, అశోకుడు' అనే రెండు పాత్రలుంటాయి. శోకుడు ఆస్తికుల ప్రతినిధి, అశోకుడు నాస్తికుల ప్రతినిధి అయిన రచయిత. శోకుని సందేహాలకు, అశోకుడిచ్చే వివరణాత్మక జవాబులు పాఠకులకు కనువిప్పు కల్గిస్తుంటాయి.

'ముక్కూ కళ్లూ మూసుకొని
తిండీ తిప్పలు మానుకొని
మోక్షం కోసం చేస్తున్నయోగం
ఏ దోపిడీలోని భాగం?'

అని శోకుడు ప్రశ్నిస్తే దానికి సవివరంగా జవాబిస్తాడు అశోకుడు.

'ఆహారం లేకుండా బతికెయ్యడాన్ని
మానవ స్వభావాన్ని జయించెయ్యడాన్ని
ఆవహించిన దైవత్వం
జుట్టుగోళ్ల విషయంలో
ఏ ఏవగించుట ఏ తత్వం'

ఆహారం లేకుడా బతుకుతున్నామని చెప్పి, జనాన్ని మభ్యపరచి ఆధ్యాత్మికంగా ప్రయోజనాలు పొందుతున్న ఒకజాతి నేటికీ వుంది. ఈ ఏడాది ఏప్రిల్‌లో 'ప్రహ్లాద్‌జానీ' అనే గుజరాతీయుడు 70 ఏళ్ల నుంచీ తిండీతిప్పలు లేకుండా బతికేస్తున్నాడని ప్రచారం జరిగినపుడు, ఢిల్లీలోని సనాల్ ఎడమరకు లాంటి హేతువాదనాయకులు పరీక్షించటానికి ముందు కొచ్చారు. కానీ వారికి అవకాశం యివ్వలేదు. దీన్ని బట్టి అర్థమయ్యేది ఒక్కటే-బాలయోగుల్లాంటి వారిని తయారుచేసి,వారిద్వారా మతపరమైన భావ జాలాన్ని ప్రచారంచేస్తూ, స్వప్రయోజనాలను సాధించు కోవటం ఆ జాతిఉద్దేశ్యం.

ఈ వచనకవితలో అశోక్‌కుమార్ ఈ విషయాన్ని బలంగానే వ్యక్తీకరించారు. బాలయోగికి 'మెలంకొలియా' అనే వ్యాధి వుందని చెపుతూ, ఆ వ్యాధి లక్షణాలను, తీవ్రతను సమగ్రంగా వివరించారు. సైన్సు చదువుకున్న వారు కూడా ఎందుకు బాలయోగిని ఆసక్తితో సందర్శిస్తున్నారో కూడా కరెక్టుగా చెప్పాడు. అందుకు ముందు రాసిన రెండు కవితలకంటే 'బాలయోగీశ్వర సందర్శనం' రాశిలోనూ, వాసిలోనూ ఎక్కువే.

'మతప్రస్థానం' (1976) కూడా 'బాల యోగీశ్వర సందర్శనం'తోపాటే అచ్చయింది. అందుకే రెండింటిలో కవితాధార ఒకేరకంగా సాగింది. రెండూ 60-70 పేజీల కృతులుగా అచ్చయినాయి. 'నా కలం వేగానికి, నాగళం రాగానికి గురువైన శ్రీశ్రీకి' అంకితం అన్నారు రచయిత. మతప్రస్థానం, పైన మనం చెప్పుకున్న రచనల కంటే ఇతివృత్తంలో భిన్నమైంది. జిల్లెళ్లమూఢమ్మ, సాయిబాబా, బాల యోగి, వంటి అవతారమూర్తులిందులో కన్పించరు. జనాన్ని ఆర్థికంగా దోపిడీ చేస్తున్న ఒక భూస్వామి - 'పాపారావు' - అతని దోపిడీకి అండగా నిలిచే వివిధ మతాల నైజాన్ని బట్టబయలు చేయటమే ఇందులోని ప్రధానాంశం. మతం దోపిడీకి ఎలా సాధనమవుతుందో చెపుతారు. బలమైన పామును చీమలన్ని కలసిచంపినట్లుగా, గడ్డిపరకలన్నీ కలిసి ఏనుగును చంపినట్టుగా ప్రజలంతా చైతన్యవంతులై పాపారావు వంటి దోపిడీదారుల ఆటకట్టించాలన్న సందేశం ఈ రచనలో లభిస్తుంది.

'స్వార్థ గరళం కక్కుతున్న
విషసర్పాల్లాంటి పాపారావుల
అహంకారపు బుసలశ్వాస
తీసెయ్యలంటే
పుట్టలోంచి తరమబడ్డ
చలిచీమలన్నీ
గుట్టలు గుట్టలుగా పోగవ్వాలి
గడ్డి పోచలు గర్జించాలి
గజరాజుల్ని బంధించాలి'

పైన చెప్పుకున్న నాలుగు హేతువాద కృతుల తర్వాత అశోక్ కుమార్ కలం 28 ఏళ్లపాటు హేతువాదం వైపు చూడలేదు. రచయిత వృత్తిపరమైన వత్తిడివల్లనో వేరే వ్యాపకాలకు సమయాన్ని కేటాయించటం వల్లనో, అంత విరామంవచ్చి వుంటుంది.

2004లో మళ్లీ ఒక కొత్తఅశోక్ కుమార్ 'ఆధ్యాత్మికరహాస్యాలు'విప్పుతూ హేతువాద పాఠకుల

## అక్షర హాలికులు

అశోక్‌కుమార్



## త్రిపురనేని రామస్వామి

(1887-1943)



'కవిరాజు'

రామస్వామి త్రిపురనేని
మనుమాయ లెరిగిన జ్ఞాని
తెలుగునాట మారుమోగిన
భౌతికవాద మహావాణి

# అక్షర హాలికులు

**అశోక్‌కుమార్**



# రోణంకి అప్పలస్వామి

**(1909- 1987)**



## బహుభాషల సిరికంకి

సాహిత్య పిపాసి రోణంకి
అనువాదపు సేద్య వరికంకి
యూరోపియను బాషల
రసస్వాదనా రణపెంకి

ముందు ప్రత్యక్షమయ్యారు.

అంతకు ముందటి కృతుల్లోవుండే సుదీర్ఘ వాదనలు, ఆవేశం, విప్లవాత్మక ధోరణికి ఈ అశోక్ కుమార్‌లో మనకు కన్పించవు. కాలంతో పాటు సమాజంలో వచ్చిన మార్పులు, రచయితలోనూ ప్రతి ఫలిస్తుంటాయిగదా! అశోక్‌కుమార్ ఇప్పుడు 'మినీ కవిత'లతో హేతువాదాన్ని ఇమిడ్చే కవితా టెక్నిక్ చాలా పాతదే. తెలుగులో చాలామంది ఈ టెక్నిక్‌ను ప్రదర్శించారు. అయితే సామాన్యులను సైతం ఈ టెక్నిక్‌తో అలరించిన కవి 'వేమన'. అందుకే 'ప్రజాకవి వేమన, ఈ కవితలకు ప్రేరణ, అందుకే ఇది ఆయనకే అంకితం' అన్నాడు అశోక్‌కుమార్. డా॥అద్దేపల్లి రామమోహనరావు, డా॥ద్వా.నా. శాస్త్రి,జి.సుబ్బారావుల ముందు మాటలతో వెలువడిన ఈ మినీకవితా సంపుటి రచయిత కీర్తిపతాకను సము న్నతం చేసింది.

'మనిషే లేడా?'అనే కవితలో రచయిత హ్యూమ నిస్ట్‌గా కన్పిస్తాడు. కులంపేర, మతంపేర, జాతి లేదా దేశం పేర తన ఉనికిని చాటుకుంటున్న వాళ్ల చెంపను చెల్లుమనిపిస్తూ 'అసలిక్కడ మనుషులే లేరా?'అంటాడు రచయిత. హ్యూమనిజం (మానవ వాదం) కులం, మతం, ప్రాంతం, జాతి పరమైన అసమానతను ఆమోదించారు. మానవుడే దాని సంగీతం, మానవుడే దాని సందేశం.

'ఆధ్యాత్మికర'హా'స్యాలు' అనే శీర్షికలో 'హా'ను దీర్ఘంగా చూపటంద్వారా రచయిత ఏ ప్రయోజ నాన్ని ఉద్దేశించారో గానీ, అందులోని కవితలు మాత్రం అన్నీ సీరియస్‌గా ఆలోచించదగినవిగా వుం టాయి. ప్రతికవితా ఒక గొప్పసందేశాన్ని అందిస్తుంది.

**'విస్కీ బ్రాందీ, జిన్ను, రమ్ములు**
**మందేదయినా మత్తు ఒక్కటే**
**హిందూ ముస్లిం క్రైస్తవమ్ములు**
**మతమేదైనా కిక్కు ఒక్కటే'**

'సారాంశం' అనే శీర్షిక వచ్చిన ఈ కవిత మత స్వభావాన్ని చాటింది. అలాగే 'స్వామియేశరణం' అనే కవిత

**'దీక్షలు ముగిసిన స్వాములు**
**కుబుసం విడిచిన పాములు'**

అనే, రెండే వాక్యాలతో ముగుస్తుంది. భవానీ, అయ్యప్పవంటి దేవుళ్ల కోసం దీక్షలు చేపట్టే భక్తుల నైజాన్ని, చాలా బలంగా చూపిందీ కవిత. 'అసలు - వడ్డీ' అనే కవితలో

**'మతాలన్నీ**
**'అసలు' దోపిడీకి**
**పుట్టిన వడ్డీలే!**
**వడ్డీ మాఫీ కావాలంటే**
**అసలు**
**అంతరించాల్సిందే!**

అని దోపిడీకి-మతానికి వున్న 'అసలు-వడ్డీ' సంబం ధాన్ని వెల్లడించారు. ఇలాంటి 50 మినీ కవితల్ని హేతువాదంతోదట్టించికొని వచ్చిన ఫిరంగి 'ఆధ్యాత్మిక ర'హా'స్యాలు' రచయిత భావాల్లో తొణుకులేదు, కవితాధారలో బెణుకూ వుండదు.హేతువాద సాహితీ లోకంలో ఇలాంటి మినీ కవితాసంపుటి అంతకు ముందు ఏదీ వచ్చినట్టు లేదు. ఆ రచన విడుదల యిన కొద్ది రోజుల్లోనే విశేష పాఠకాదరణ పొంద గలిగింది. సాహితీ ప్రముఖులప్రశంసలందు కుంది. రచయితకు అంత కన్నా సంతోష మేముంటుంది?

ఆ సంతోషం కల్గించిన ప్రేరణతో వచ్చిన హేతువాద చెణుకులు 'జ్ఞానగుళికలు'. 2005లో అశోక్‌కుమార్ రాసిన ఈ 60 గుళికలు మానవ వికాసవేదిక అనే మానవవాద (హ్యూమనిస్ట్) సంస్థ వారి పత్రిక 'మానవవికాసం'లో 2005 జులై నుంచి 2006 జులై వరకు అచ్చయ్యాయి. ఆనాడు పాఠకులు పలువురు ఆ గుళికలను ప్రశంసిస్తూ పత్రికకు ఉత్తరాలు కూడా రాశారు. హేతువాద ప్రచారానికి ఒక ఆధునిక కవితా రీతిని మేళవించి చెప్పటం కూడా ప్రతిస్పందనకు కారణం కావచ్చు.

'గుళికలు' అనే పదాన్ని వాడటంలోనే ఔచిత్యం వుంది. పొలాల్లో పైరులకు అంటిన చీడపీడలను తొలగించేందుకు వాడే రసాయనాలను కూడా రైతులు 'గుళికలు' అంటుంటారు. ఆయుర్వేద వైద్యంలో వుండే గుండ్రని మాత్రలను కూడా 'గుళిక' అనటం వుంది. ఆ పదాలన్నీ ఎవరు వాడినా,దానిపరమార్థం చెడును తొలగించటమే.పాఠకులమదిలో తిష్టవేసిన మౌఢ్యాన్ని తొలగించాలన్నవుద్దేశంతోనే 'జ్ఞానగుళికలు' తయారై వుంటాయి.

**'అష్టాదశ పురాణాలు**
**కట్టిన కథల కారణాలు**
**ఒక చంద్రలోకయాత్రలో**
**తెగిదించిన**
**తోరణాలు'**

'చంద్రుడు' అనే శీర్షికతో వచ్చిన ఈ కవిత చంద్రునిపై మనిషి కాలుపెట్టిన తర్వాత, అప్పటి వరకు చంద్రునిపై పురాణాలు అల్లిన కట్టుకథలన్నీ ఎలా పుటుక్కుమని తెగాయో చక్కగా వివరించింది. అలాగే 'అవాస్తవం' శీర్షికతో వచ్చిన -

**'ఈశాన్యాన నుయ్యి**
**ఆగ్నేయాన పొయ్యి**
**నడినెత్తిన**
**వాస్తు పేరున గొయ్యి'**

అనే కవిత వాస్తు నెత్తిమీద బలమైన వేటు వేసింది.

అలాగే 'తుమ్ము అపశకునం' అనే మూఢనమ్మకాన్ని ఎద్దేవా చేస్తూ రాసిన 'లాలాజలాభిషేకం'లో-

**'జలుబూ రొంపల తుమ్ము**
**సుస్తీకి నిదర్శనమ్ము**
**అపశకునం**
**అన్నవాడి**
**మొహాన ఉమ్ము'**

అంటాడు రచయిత. ఆ మాత్రం ఘాటుగా చెప్పక పోతే ఆ మూఢత్వం అంతంకాదు. అలాగే జ్యోతిష్యం ఒక 'ఎండమావి' అని చాటుతూ -

**'గ్రహబలాలు**
**రాశి ఫలాలు**
**బతుకు**
**దాహానికి**
**ఉప్పుజలాలు'**

అన్న నిజాన్ని సూటిగా చెపుతారు. బతుకులోని కష్ట-నష్టాలకు గ్రహాలు, నక్షత్రరాశులు కారణమని చెప్పి మంది సొమ్ముని అప్పనంగా గుంజుతున్న దగాకోర్ల మోసాలను గుర్తించమని రచయిత పరోక్షంగా హెచ్చరిస్తాడు. అలాగే 'హస్తసాముద్రికం' అనే కవితలో -

**'అరచేతిన గీతలు**
**నరబతుకుల రాతలు**
**అనే సాముద్రిక**
**చాదస్తుల**
**మూతికి వేయి వాతలు'**

అంటారు ఆగ్రహంగా. ఇది మతస్తులు చెప్పే 'ధర్మాగ్రహం' లాంటిదే. కళ్లెదుటగా జరిగే ఒక దగాను ప్రశ్నించాల్సినపుడు ఆ ఆగ్రహం ఎవరికైనా వస్తుంది.

'జ్ఞానగుళికలు' అముద్రితంగా వున్న రచన. వెలుగుచూస్తే, ఆ వెలుగులో ఎందరికో నడవాల్సిన దారి కన్పిస్తుంది.

అశోక్ కుమార్ రాసిన మొత్తం ఆరు హేతు వాద కృతుల్లో ఎక్కడా అతని నిబద్ధత సడలిన జాడ కన్పించదు. వయసుతోపాటు బుద్ధిలో పెరిగిన పరి పక్వత మాత్రమే ద్యోతకమవుతుంది. వారు 'వయసు మాయ' అనే మినీ కవితలో -

**'పడి**
**వయసులో**
**నాస్తికత్వం!**
**నడి**
**వయసులో**
**ఊగిసత్వం!**
**కడ**
**వయసులో**
**ఆస్తికత్వం!'**

అంటాడు. 'ఆధ్యాత్మికర'హా'స్యాలు'లో. ఆయన పడి వయసులో నాటుకున్న నాస్తికత్వం, ఈ 60వ ఏట, కడవయసులో కూడా అప్పటిలాగే స్థిరంగా, మరింత బలంగా వుందనటానికి ఆయన రచనలే సాక్ష్యం. వయసు మాయలోపడి ఆశయాల్ని, ఆదర్శాలను గాలికి వదిలి, దారిమళ్లే ప్రబుద్ధులు వేరేవుంటారు. వారికి ఆశయాల వల్లింపే, ఆచరణ వుండదు. ఆచరణలో కనపడని ఆశయాలు ఎన్నటికీ చెల్లని నాణాలు. అలాంటి వారి గురించే ఆ కవిత. అశోక్ కుమార్ ఆచరణశీలి. తన భావజాలాన్ని నిత్య జీవనంలో ఒక భాగంగా చేసుకున్నారు. తన ఆశయాల ప్రకారమే పెళ్లిచేసుకున్నారు. తన ఆశయా లకు తగ్గట్టే పిల్లల్ని పెంచి, వారి పెళ్లిళ్లను కూడా అలాగే జరిపించారు. ఆస్తికమార్గంలోకి మళ్లకుండా జీవన యానాన్ని సాగించటం నేటి సమాజంలో కత్తిమీద సాము. అందరూ ఆ సాము చేయలేరు. కుటుంబ సభ్యుల్లో తన భావజాలానికి సమ్మతిని పొందగల్గటం గొప్ప అవార్డు లాంటిది. దాన్ని ఎలా పొందాలో తప్పటడుగులు వేస్తూ, నెపాన్ని భార్యాబిడ్డల 'స్వేచ్ఛ'పైకి నెడుతుంటారు.

నాసిక్తవాదం సృష్టికర్త భావనను, పరలోకాల ఉనికిని అంగీకరించదు. హేతువాదంతో వాటి అవాస్తవికతను నిరూపిస్తుంది. ఈ రెండు వాదాల్ని తనలో మిళితం చేనుకున్న మానవవాదం (మానవతావాదంకాదు) ఆస్తికి జీవితానికి ప్రత్యామ్నాయమైన జీవన విధానాన్ని ఏర్పరుస్తుంది. మతంతో సంబంధంలేకుండా, మానవీయ విలువలు ప్రధానంగావుండే సామాజిక నీతిని మానవవాదం (హ్యూమనిజం) ప్రబోధిస్తుంది. సైన్సు, ప్రజాస్వామ్యం, మానవహక్కులు ఆ వాదానికి ఆధారభూమికలు. ఇపుడు పాశ్చాత్య దేశాల్లో వీస్తున్నగాలి మానవవాదమే. అవోక్ కుమార్ రచనల్లో అక్కడక్కడా మానవవాదపు ఛాయలు కనబడతాయి. మినీ కవితల్లో అవి చాలాచోట్ల వెల్లడయ్యాయి.

ఒకప్పుడు పుస్తకాల కొట్టుకెళితే, ఎర్ర సాహిత్యం మెండుగావుండేది. ఇపుడు ఎర్రసాహిత్య దుకాణాల్లోనూ కాషాయమే నిండిపోయి కన్పిస్తున్నది. పాత కాలపు మూఢత్వం, చాదస్తం కొత్తరూపు దిద్దుకొని వగలుపోతున్నది. పాఠకుల్ని తన అజ్ఞానపు మాదకంతో లోబర్చుకుంటున్నది. ఈ పరిస్థితి సమాజ అభ్యుదయానికి ప్రమాద సంకేతం. దీన్ని మార్చకపోతే కలిగే అనర్థం కొన్ని తరాల వరకూ పోదు. ఆ మార్పు కోసమే అశోక్‌కుమార్ తపించారు, రచిస్తున్నారు. వారి రచనల్లోంచి ఇపుడు వారసులు పుట్టుకొస్తున్నారు.

60వసంతాలు నిండిన అశోక్‌కుమార్ జీవన యానం ముమ్ముందు ఇతోధికహేతువాద, మానవ వాద కవితాపరిమళాలను తెలుగునాట వెదజల్లగలదని ఆశిద్దాం. ■

## అక్షర హాలికులు

**అశోక్‌కుమార్**



## డా॥ ఏ.టి. కోవూర్



## రేషనలిస్ట్ అంబాసిడర్

డాక్టరు ఏ.టి కోవూరు
తర్కానికి మరోపేరు
బాబాల తోలుఒలిచిన
హేతువాదం కైజారు

## గ్లోబల్ రహస్యం

అమెరికా/ కోర్టులో /భూమి లేదు !
భూమి / కోర్టులోనే / అమెరికా ఉంది !





# ఎవరతను !

అరసవిల్లి కృష్ణ

ఉన్నది ఉన్నట్టు అంగీకరిస్తున్నామా ! ఎక్కడో ఓ చోట ప్రశ్నించాల్సిన చోట ప్రశ్నగా నిలబడ్డామా ! కాలం అనంతంగా గడిచిపోతుంది. కాలం సాగిన దగ్గర నీడలా వున్నామా వెలుతురులా ఉన్నామా ! చీకటిలో నిలబడిదారుల్ని వెదుకుతున్నామా!

నిశ్శబ్దాన్ని ఛేదించుటకు !

అరవై ఏళ్లు గడిచాయి...ఎలాగోలా గడిచాయి.

చైతన్యంతో నడిచాయా జీవితం ఓ రాజీ సూత్రాన్ని ప్రతిపాదించిందా ఏదోలా అరవై ఏళ్ల కాలం గడిచింది. అరవైవ ఒడిలో నిలబడి మొదటి మెట్టువైపు చూస్తే ఏమయినా కనబడుతున్నదా! పసిపిల్లవాని ఏడుపు వినబడుతున్నదా!

బహుశా వినబడవచ్చు

వినబడక పోవచ్చు !

వినిపించిన ఏదో ఓ దు:ఖ గోడ ఉండవచ్చు. ఎక్కడి నుంచి వచ్చాడతను ఏదారిని వెదుక్కుంటూ వచ్చాడతను అతనికి దారిదొరికిందా! ఏదయినా దారి కోసం వెదుకుతున్నాడా ! దొరికిన దారి సరిఅయినదే అనుకున్నాడా !

దారుల్ని వెదికేటప్పటికా కాలం గడిచిందా! ఇక వెదికిన దారుల దగ్గర నిలబడి విశ్రాంతి పొందుతున్నాడా ! విశ్రాంతి దొరికిందా !

సింగంపల్లి అశోక్ కుమార్‌కు అరవై ఏళ్లు - వసంత మేఘ గర్జనలను అతను విని నలభైఏళ్లు. అశోక్ కుమార్‌లోని ఇరవై ఏళ్లు తొలగిస్తే లేదా తీసివేస్తే ఏది మిగులుతుంది నలభైఏళ్ల విప్లవ చైతన్యం మిగలాలికదా! ఆ చైతన్యం అశోక్‌కుమార్ అనే వ్యక్తిని ధీరుడిగా బుద్ధిజీవిగా మార్చాలికదా! ఆ చైతన్యపు దిశగా అతని అడుగులు వుండాలి కదా! లేదా ప్రారంభంలో ఆ చైతన్యం దగ్గర నిలబడి ఆ చైతన్యపు వెలుగులో మిగతా జీవితాన్ని కొనసాగించాడా!

అశోక్ కుమార్ సాహిత్య చైతన్యాన్ని లేదా మానవీయ కోణాన్ని విశ్లేషిస్తున్నప్పుడు రెండు దశల మధ్య సారూప్యత ఉన్నదా! ఘర్షణఉన్నదా! వైరుధ్య మున్నదా, అరవై ఏళ్లు కొనసాగిన అశోక్ కుమార్ అనే వ్యక్తి నిజానికి ఓ ఇరవైఏడేళ్లు వర్తమాన సాహిత్య ప్రవంతికి దూరంగా ఉన్నాడు ఇంకా ముందుకు వెళితే అజ్ఞాతంగా ఉన్నాడు. మౌనంగా ఉన్నాడు, నిశ్శబ్దంగా ఉన్నాడు. అయితే జీవితమున్నది, జీవితం అలలాఉన్నది. ఆ సముద్రపు అలని దాటడానికి మనుషులు రాజీ పడతారు. రాజీసూత్రం కూడా సమాజమే ప్రతిపాదిస్తుంది 'రాజీ' ఓ జీవన సూత్రంలో ఒదిగిపోతారు. ఒదిగిపోయాక ఇక ఎలాంటి అవరణవైపు చూడరు,చూడలేరు. చూచేందుకు అవస రమైన లోపలి నేత్రం జీవితంవైపుచూస్తుంది. సాహిత్య ఆచరణవైపు చూడాలన్నా ఆ కన్ను తెరుచుకోదు. జీవితం అలాంటింది.

బహుశా 2003లో 'శుభాకాంక్షలు' చెబుతున్న కవిని చూశాను. మినీ కవితను బతికిద్దామనే ఆశతో నడుస్తున్న కవిని చూశాను. ఒక ఆవరణను తయారు చేసుకుంటున్న వ్యక్తిని చూశాను. ఏడేళ్లు గడిచాయి. మినీ కవిత్వం, పలు- సంస్థలలో బాధ్యతలు - చివరకు 'శ్రీశ్రీ సాహిత్య నిధి' నూరేళ్ల శ్రీశ్రీకి ఓ చీమలా సహకారం.

అశోక్‌కుమార్ ఎక్కడ ఉన్నాడు?

అశోక్ కుమార్ తాత్విక దృక్పథమేమిటి?

అశోక్ కుమార్ అంతస్సంఘర్షణ ఏమిటి?

అశోక్ కుమార్‌లోని నిబద్ధతాస్వరమేమిటి?

శ్రీశ్రీని వదిలివెళతాడా! లేదా శ్రీశ్రీ హృద యంలోని ప్రేయసిని ఆరాధిస్తాడా ఎక్కడో ఓ చోట నిలబడతాడా!

ఒకే మనిషి

ఒక్క ఆలోచనల ప్రవంతి. ఓ ఏడేళ్లకాల సూచికలో అశోక్‌కుమార్ సాహిత్య కృషిని తక్కువ అంచనా వేయలేం, నిర్విరామ కృషి ఉన్నది, తపన ఉన్నది, అలుపెరగని సాహిత్య బాటసారిలా పని చేశాడు. ఆ పనిని లేదా ఆ సాహిత్యకృషిని విశ్లేషించి నపుడు అశోక్ కుమార్ ఎలా మిగలాడు అరవై ఏళ్ల కాలసూచిక దగ్గర నిలబడ్డాడు. ఇప్పుడు ఎలా చూద్దాం ఆ రూపాన్ని లేదా ఆసాహిత్య రూపాన్ని నిజానికి సింగంపల్లి అశోక్‌కుమార్ అనే సాహిత్య జీవి ప్రమాణాన్ని అరవై ఏళ్ల స్తంభం దగ్గర నిలబడి అంచనావేయడం ఓ సాహిత్య అవసరం. ఆ అవస రానికి అరవై ఏళ్లు ఓ కొలమానం -

అతనితోపాటే ప్రపంచంప్రయాణం చేసింది. ప్రపంచంతోపాటు అతనూ ప్రయాణం చేశాడు. ఈ ప్రయాణంలో ఎలా మిగిలాడు! అతని చుట్టూ ఉన్న మనుషుల సాహిత్య వాతావరణం అతనిని ఎలా మలిచింది. ఆ మలచడాన్ని అతనెలా స్వీకరించాడు. అశోక్‌కుమార్‌లోని సాహిత్య వ్యక్తిత్వం లోకి తొంగిచూస్తే చాలా ప్రశ్నలు రేగుతాయి. ప్రతి ప్రశ్నకు సమాధానం అతని ఆచరణలోనే ఉన్నది. అయితే అతని ఆచరణకు నిజాయితీగా చూస్తున్నామా! ఏమ యినా ముసుగులతో చూస్తున్నామా! అన్నదే ప్రశ్న.

ఎరుపంటే అతనికిష్టంగావచ్చు. ఓ జీవిత కాలం ఎరుపును చూస్తూ ఉండవచ్చు. జీవితంలోని అన్నిటికీ ఎరుపు ఓ నమూనా కావొచ్చు. ఆ ఎరుపుకి చిహ్నంగావున్న 'శ్రీశ్రీ'ని ఆరాధించవచ్చు. అనుసరిం చవచ్చు-ప్రచారం చేయవచ్చు.

ఇప్పుడతనికి అరవైఏళ్లు - కాకినాడ సముద్రపు నీళ్లలోనే జీవనది కృష్ణా కలుస్తుంది. సముద్రపు తీరం దగ్గర కనులు తెరుచుకొనివుంటాడు. ఓ జీవనది దగ్గర జీవితపు చైతన్యాన్ని విశాలంచేసుకున్నాడు. అతనికో సముద్రపు లయ ఉన్నది. జీవనది దు:ఖపుపొర కూడా ఉండాలి.

అశోక్ కుమార్‌కి అరవైఏళ్లు...

అరవై ఏళ్ల తర్వాత సప్తతికూడా ఎంతో దూరం లేదు. కాలం మనుషుల కోసం ఎదురు చూస్తుంది. జెండాఊపి పుష్పగుచ్ఛాన్ని యిచ్చి స్వాగతి స్తుంది. ఆ కాలాన్ని ఎట్లా లొంగదీసుకుంటా మన్నదే ఇవ్వాల్టి ప్రశ్న-కాలానికి దూరం జరగడము కంటే కాళనాళి కలో నిలబడగలగాలి-ఆ నిలబడటం చేతిలో సిరాని పోసుకొని అక్షరంలా ప్రవహించడానికి సిద్ధంగా నిల బడాలి.దానికి ప్రేరణ అరవైఏళ్లు కాగడా కావాలి. గడిచినజీవితం-ఏం నేర్పిందో గడిచినజీవితం నుండి ఏది నేర్చుకున్నామో మిగతా జీవితమంతా విస్తరిం చాలి. అరవైఏళ్ల తర్వాత అశోక్ కుమార్ ఎలా వుంటాడు, ఎలావుండాలి అన్నది కాదుగాని బహుశా అలుపెరగని సాహిత్య జీవిగా ఉండాలని కోరు కుంటాం. బహుశా తను చెప్పేదానికి -ఆచరణకి మధ్య అంతరంఉంటే సవరించు కోవాల్సి వుంటుంది. తన ఆవరణలోకి ప్రవేశిస్తున్న వ్యక్తులు సమూహాలు ఏఏ నిబద్ధతలను కొనసాగిస్తున్నాయో అంచనా వేయగలగాలి.తామూ ఏవైపుకు మొగ్గాలో నిర్ధారించు కోవాలి. ఈ నిర్ధారణ నిజాయితీగా లేకపోతే...

అశోక్ కుమార్‌కి అరవై ఏళ్లా ఎక్కడ ఉన్నా డతను! ఎలా ఉన్నాడతను! అనుకునే అవకాశం కొన్ని శిబిరాలకు ఉంటాయి. ■

## అక్షర హాలికులు

అశోక్‌కుమార్



## మాధవపెద్ది గోపాలకృష్ణ గోఖలే

(1917 - 1981)



## మాగోఖలే

ఆకలి నలుపు కేకలే
రేపును తెలుపు రేకలే
సాహిత్య, చిత్రకారుడు
మాధవపెద్ది గోఖలే !



**విశ్వరహస్యం**

నాదీ నీదీ / ఏదీ లేదిక
విశ్వమంతా / అమెరికా వేదిక



# అక్షరాన్ని అగ్నిగా రగల్చి శబ్దాన్ని శతఘ్నిగా పేల్చే అశోక్

గుమ్మా సాంబశివరావు

**' కవిత్వానికి ఎరుపైనా ఉండాలి .. మెరుపైనా ఉండాలి '**
**అని విప్లవ, అభ్యుదయ దృక్పథాలతో కవిత్వాన్ని నిబద్ధతతో రచిస్తున్న మినీ కవితోద్యమ సారధి శ్రీ సింగంపల్లి అశోక్‌కుమార్.**
**శ్రీశ్రీ మహాప్రస్థానం వెలుగుచూసిన సంవత్సరం (1950)లో పుట్టి,**
**శ్రీశ్రీ షష్టిపూర్తి సంవత్సరంలో (1970) కలంపట్టిన కవి అశోక్ కుమార్.**
**శ్రీశ్రీని అణువణువునా ఇమిడించుకొని శ్రీశ్రీనే సర్వస్వంగా భావిస్తూ శ్రీశ్రీ**
**సాహిత్య సర్వస్వాన్ని లోకానికందించే విశ్వప్రయత్నం చేస్తున్న శ్రీశ్రీ వీరాభిమాని అశోక్ కుమార్. అందుకే -**
**' అందమైన - కవిత ఆకారానికి / మధురోహల ప్రాకారంతో/ శ్రీకారం - చుడదామనుకున్నప్పుడు**
**నువ్వు నాలో ప్రవేశిస్తావు / నా సర్వేంద్రియాలను - ఆవహిస్తావు !**
**అంతే - అక్కడ నుండి / కవితకు - శ్రీకారం మాని / శ్రీశ్రీకారం చుడతాను !!' -**
**అంటూ తన మీద ఉన్న శ్రీశ్రీ ప్రభావాన్ని తెలియజేస్తున్నారు.**

రంగనాయకమ్మ తర్కం అంటే ఇష్టపడి శ్రీశ్రీ కవిత్వంపట్ల అభిమానాన్ని పెంచుకొని, నమ్మిన సిద్ధాంతాలను ఆచరణలో పెట్టిన అభ్యుదయ భావ విప్లవ కారుడు శ్రీ సింగంపల్లి అశోక్‌కుమార్. ప్రారంభంలో దీర్ఘకవితలు వెలయించిన అశోక్ కుమార్ మినీ కవితా మార్గంలో ప్రవేశించి మినీ కవిత్వపు పిడుగుల్ని కురిపించాడు. మినీ కవిత్వాన్ని తనదైన ధోరణిలో నిర్వచించాడు. **'అక్షరాలు లెక్క పెట్టడం కాదు-అక్షరాల్ని ఎక్కుపెట్టడం'** మినీ కవిత అనటంతో అల్పాక్షరాల్లో అనల్పార్థాన్ని సూచించటమే కాకుండా కవులకు సందేశం అందించారు. సామాజిక బాధ్యతను గుర్తుచేశారు. **'గుప్పెడు అక్షరాలు సిద్ధం-తప్పుడు అక్షరాలపై యుద్ధం'** మినీ కవితగా చెప్పారు. అక్షరాలు పేర్చితే కవిత్వం కాదని, సామాజిక అన్యాయాలపై, అక్రమాలపై యుద్ధం సాగించాలని హితవుపలికారు. తప్పుగా రాస్తున్న వాళ్లకు బుద్ధి చెప్పాలని కూడా సూచించారు. ఇంకా **'అక్షరాల దీపం వచన కవిత-అక్షరమే దీపం మినీ కవిత'** అని రచించారు. **'అక్షరాలు - విడిగా అగ్ని- కలిస్తే శతఘ్ని'**-అని అక్షరశక్తిని చాటి చెప్పారు.

కాలానికి అనుగుణంగా సాహిత్యంలో వస్తున్న మార్పుల్లో మినీ కవితా ధోరణికూడా ఒకటి. ప్రజలజీవితం యాంత్రికమై క్షణం తీరిక లేకుండా జీవనాన్ని సాగిస్తున్న ఆధునిక సమాజానికి పెద్దపెద్ద కావ్యాలు చదివే ఓపిక లేక పోవటంతో,చిన్న కవితల్ని చదవటానికి ఆసక్తిని ప్రదర్శిస్తోంది. కవులు కూడా కాలానుగుణంగా కవితాస్వరూపాల్ని మార్చుకొని తమ భావాలను ప్రకటిస్తున్నారు. ఆధునిక కవుల ఆలోచనలకనుగుణంగా వెలువడ్డ మినీకవితలో ఒక మెరుపు, ఒక చురక, ఒక వ్యంగ్యం,ఒక విమర్శలాంటి గుణాలు ఉండటంతో కవిత్వాభిమానులకు దగ్గరైంది. చదివేవాళ్లు ఆనందించేవాళ్లు పెరిగారు. అందుకే అది ఒక ఉద్యమ రూపాల్ని ధరించింది. విశేష ప్రచారాన్ని పొందింది. డా॥ అద్దేపల్లి

రామమోహనరావు,డా॥రావి రంగారావు, డా॥ జి.వి. పూర్ణచంద్ మొ॥వారు 1970ల తర్వాత మినీ కవిత్వాన్ని సచిత్రంగా ప్రదర్శిస్తూ,ఉపన్యాసాలనిస్తూ ప్రచారం చేశారు.ఆ తర్వాత అప్పుడప్పుడూ కొన్ని సంపుటాలు వెలవడ్డాయి. మళ్లీ ఇటీవల మినీ కవిత ప్రచార భారాన్ని భుజానికెత్తుకొన్నకవి అశోక్ కుమార్. మినీ కవిత్వంపట్ల తనకున్న అభిమానాన్ని అశోక్ కుమార్ తాను రచించిన 'గ్లోబలి'పుస్తకంలో ఈ విధంగా చెప్పారు.

'సాహిత్య ప్రక్రియలన్నింటా నాకు కవిత్వమంటే ఇష్టం. అందులో మినీ కవిత్వమంటే మరీ ఇష్టం. అలా ఇష్టపడిన మినీకవిత్వం 37 ఏళ్ల నుండీ రాస్తున్నాను. అంటే మినీ కవిత్వోద్యమానికి ముందునుండీ రాస్తున్నాను. చిరుకవితలు మినీ కవితలుగా నామకరణం పొందక ముందునుండీ రాస్తున్నాను. ఈ మినీకవితాభిమానమే 'అక్షరం'శీర్షికతో రెండు సంవత్సరాలకాలం 'విశాలాంధ్ర' దినపత్రికలోనూ, 'జ్ఞాన గుళికలు' శీర్షికతో సంవత్సరకాలం 'మానవవికాసం' మాసపత్రికలోనూ మినీ కవితల్ని రాయించింది. ఈ మినీ కవితాభిమానమే సంవత్సరం నుండి నెలనెలా 'ప్రజాసాహితి' మాసపత్రికలో 'అక్షరణం' చేయిస్తోంది. ఈ మినీ కవితాభిమానమే మహాకవి శ్రీశ్రీకి అంకితం చేస్తూ 'శతఘ్ని' పేరున శ్రీశ్రీ శతజయంతికి తీసుకురాబోతున్న వేయికవుల మినీ కవితా సంకలనానికి ప్రేరణ. ఈ మినీ కవితాభిమానమే 'చినుకు' మాసపత్రికలో నేను రాయడంతోపాటు నలుగురితో రాయించే మినీ కవితల వేదిక-అక్షరాల అణుసంధానం.'అణువు'శీర్షికానిర్వహణ'అని మినీ కవిత్వం పట్ల తనకున్న మమకారాన్ని నిబద్ధతను తెలిపారు. వీరి ప్రభావంతో మినీ కవితల్ని రాసిన వాళ్లలో ఈ వ్యాసకర్త కూడా ఒకడు.

అశోక్‌కుమార్ కలం నుంచి ఇప్పటి వరకు ఐదు మినీ కవితా సంపుటులు వెలువడ్డాయి. ముందుగా 2004లో 'తంత్రం' పేరుతో ప్రకటించారు. ఆ తర్వాత 'పొద్దుపూసింది' 'ఆధ్మాత్మిక రహాస్యాలు', 'వ్యూహం', 'గ్లోబలి' కవితా సంపుటాల్ని ప్రచురించారు.'సమీక్షల్లో-రచన రేంకు లను 'మార్క్స్'తోనే కొలవాలని-'చెప్పిన అశోక్‌కు మార్ కవిత్వాన్నికూడా సమతాదృక్పథంతో విప్లవ, అభ్యుదయ భావజాలంతో వెలువరించారు. వీరి మినీ కవితా సంపుటాల్లో ఒకొక్కటి ప్రధానంగా ఒక్కో దృక్పథానికి ప్రతీకగా వెలువడటం గమనార్హం.

జాతీయ,అంతర్జాతీయ సంఘటనలపట్ల, సమస్యలపట్ల, పరిస్థితులపట్ల సరైన అవగాహన ఉన్నకవి అశోక్ కుమార్. అందుకే ప్రపంచవ్యాప్తంగా వస్తున్న మార్పుల్ని గమనిస్తూ,ఆ మార్పులవల్ల సమాజం ప్రభావితమవుతున్న తీరును అంచనావేస్తూ కవితల బాణాల్ని సంధించారు. అశోక్‌కుమార్ రచించిన మొదటి మినీ కవిత 'ప్రారంభం' శీర్షికతో ఉంది. అయితే ఇది ఏకవితా సంపుటిలోనూ అచ్చుకాక పోవటం విచిత్రం.ఆయన ముఖత: వెలువడిన 'ప్రారంభం' కవిత ఇలా ఉంది.

'చన్నులో పాలు చేరితే
శిశువు ప్రాణోదయం / ప్రారంభం
కాయితం మీద
సిరా పారితే / కవిత ప్రారంభం
పుడమి మీద / వర్గశత్రువు నెత్తురు పారితే
పోరాటం ప్రారంభం'-

సృష్టినీ, కవితా సృష్టిని, సమసమాజ సృష్టినీ కవితలో పొందుపరిచిన తీరు కవి విశిష్ట ప్రతిభకు తార్కాణంగా నిలుస్తుందని చెప్పటంలో అతిశయోక్తిలేదు.

మినీ కవిత్వం ఉద్యమ రూపాన్ని ధరించక ముందే మినీ కవిత్వాన్ని రచించటం ప్రారంభించిన అశోక్ కుమార్ కవితల నిండా సమాజమే నిండి ఉంటుంది. సమాజంలోని వాస్తవికత పరిస్థితులకు అద్దం పట్టే రీతిలో అశోక్ కుమార్ కవితలుంటాయి. సమాజం వీపు మీద చరిచిన దెబ్బల్లా అశోక్ కవితలుంటాయనటం సముచితం.

అశోక్ కుమార్ మినీ కవితాసంపుటాల్లో ముందుగా ముద్రితమైన సంపుటి 'తంత్రం'. ఇది 2004 జనవరిలో ప్రచురితమైంది. దీన్ని 'కవిగా నాకు జన్మనిచ్చిన మహాప్రస్థానం మహాకావ్యానికి' అంటూ మహాప్రస్థానం కావ్యానికి అంకితం చేశారు. ఒక కావ్యాన్ని మరో కావ్యానికి అంకితం చెయ్యటం అరుదైన అంశం. బహుశా ఈ ప్రయత్నం మొట్ట మొదటి సారి చేసింది. అశోక్ కుమారేనేమో! మహాప్రస్థానం అచ్చయిన సంవత్సరం పుట్టడం మహాప్రస్థాన కవితల్ని నరనరాన జీర్ణింప చేసు కోవటం, శ్రీశ్రీ సాహిత్యాన్ని విపరీతంగా అభిమానించటం ఈ అంకితానికి కారణాలై ఉంటాయి.

'తంత్రం'అంటే ఉభయార్థ సాధకమైన ఉపాయం అనే అర్థంతో పాటు సిద్ధాంతం అనే అర్థమూ, హేతువు అనే అర్థమూ ఇలా చెయ్యదగింది అనటం అనే అర్థాలున్నాయి. అశోక్‌కుమార్ కవితల్లో ఈ అర్థాలన్నీ నిక్షిప్తమైఉన్నాయి. కవి రాజకీయ దృక్కోణం ఈ కవితల్లో సాక్షాత్కరిస్తున్నది. ఓటు, ఓటు వ్యాపారం, రాజకీయ నాయకులు, వారి స్వభావాలు, ప్రజాస్వామ్యం, హైటెక్ అభివృద్ధి, ప్రపంచ బ్యాంక్ రుణాలప్రభావం,టీవీల ప్రభావం,మానవతా దృక్పథం, సామాజిక ప్రబోధం మొదలైన అంశాలు 'తంత్రం'లో ఉన్నాయి.

'తంత్రం' అనే శబ్దాన్ని కవి ప్రత్యేక అర్థంలో వాడుతూ 'మాఅభివృద్ధి అంతా-అప్పుచేసిన-పప్పుకూడే!' అనే కవితను 'తంత్రం' శీర్షికతో రచించారు. నాయకులు అప్పులు చేసి దేశాన్ని అభివృద్ధి చేశామని చెప్పుకోవటంలో నిజం లేదని, వారి మాటలు వట్టి మాటలేనని వారు మాత్రమే బాగుపడుతున్నారు గాని ప్రజలకు సుఖం లేదని,

## అక్షర హాలికులు

అశోక్‌కుమార్



## బుచ్చిబాబు

(1916-1967)



## చివరకు మిగిలేది

కవనరస ఝరులు
తాత్వికత విరులు
బుచ్చిబాబు వచన
సాహిత్య సిరులు

# అక్షర హాలికులు

అశోక్‌కుమార్



రాచకొండ విశ్వనాథ శాస్త్రి
( 1922-1993 )



అ(న)ల్ప జీవి

రావిశాస్త్రి పెన్ను
నరుడి మూడో కన్ను
వర్గ దోపిడిపై
గురి పెట్టిన గన్ను

తరతరాల ప్రజలు కష్టపడాల్సి వస్తున్నదని రాజకీయ నాయకుల కుతంత్రాన్ని బట్టయలు చేశారు. అభివృద్ధి చేశామని చెబుతున్న స్వార్థరాజకీయాల 'తంత్రాన్ని' బట్టబయలు చేశారు కవి.

కవి ఈ సంపుటిలో ఓటుకు-ఎన్నికలకు ప్రత్యేక నిర్వచనాలిచ్చారు. అశోక్‌కుమార్ మినీ కవితల్లో 'శీర్షిక' కూడా కవితలో భాగం కావటం గమనించ దగిన అంశం.'ఎన్నికలు' శీర్షికతో వెలువడ్డ కవితలో 'నోట్లు-చల్లి-ఓట్లు-పండించుకోవడం' అని రాయ టంలో ఎన్నికలు వ్యాపారమైన తీరుమీద వేసిన చురక తెలుస్తుంది. ఎన్నికల్లో ప్రతి ఒక్కడూ స్వార్థపరుడూ, దోపిడీచేసే వాడేనని చెబుతూ 'ఎన్నిక' కవితలో 'ఎన్నికల బరిలో-పులీ, తోడేలూ-డేగా రాబందూ-మనకున్నఛాయిస్-ఎవరికాహారం కావడమో తేల్చుకో వడం!' అని చెప్పటం ద్వారా ఏ విధంగా చూసినా సామాన్య ప్రజలు ఎన్నికల బరిలో బలిపశువులవు తున్నారని తెల్పారు.

ఇంకో కవితలో 'బెగ్గింగ్-అయినా-రిగ్గింగ్-అయినా' గెల్చినోడే నేత అని చెప్పటంద్వారా ఎన్నికల స్వరూపాన్ని బట్టబయలు చేశారు. బ్యాలెట్ బాక్సులో పడే పేపర్లు 'దేశాన్ని-అమ్ముకు తినే నేతలకి -పవర్ ఆఫ్ అటార్నీ కాగితాలు' అని చెప్పటం ద్వారా రాజకీయ నాయకుల దోపిడీ తత్వాన్ని వెల్లడించారు.

మద్యపానం జోరుని వర్ణిస్తూ 'సురలు పొంగే జీవగడ్డ' కవితను రచిస్తూ 'మా దేశంలో-కొన్ని కాలాల్లోనే - పారేనదులు! అన్ని-వేళల్లోనూ సారా సుధలు' అనే కవిత్వపు బాణాన్ని సంధించారు. సారాయిమూలంగానే ప్రభుత్వఆదాయం గణ నీయంగా ఉంటుందని, కాని దానివల్ల ప్రజల జీవి తాలు నాశనమవుతున్నాయని చెబుతూ- 'పేదోళ్లని -చంపినా-ప్రభుత్వాలను-బతికిస్తోంది'-'సారాయి' అని పలికారు. అభివృద్ధి పేరుతో రహదారులు నిర్మిస్తూ పేద ప్రజల ఇళ్లను కూలగొడుతున్న తీరును నిరసిస్తూ 'ఈ రహదారులెక్కడికో' - శీర్షికతో 'గుడిసెల-మీద-నుండీ-మడుసుల- మీద-నుండీ' అనే కవితను రచించారు. రహదార్ల నిర్మాణంవల్ల గుడిసెలు, మడుసులూ కనుమరుగవుతున్నారనే ఆవేదనను కవి ప్రకటించారు.

'ప్రపంచబ్యాంకు రుణం' అనే కవితను రచిస్తూ దాని పరిస్థితి ఎలా ఉందో వివరించారు.

'ఇంటిని-తాకట్టు పెట్టి-గోడలకు-రంగులు-వేసుకోవడం!'-ఇందులో ప్రజల దయనీయస్థితి అంతర్గతమై ఉంది. ఈ రుణాన్ని క్రమ వినాశ నానికి సూచకంగా కవిత్వీకరించారు.

లోకమంతా ధన ప్రభావంతో నిండిపోయిం దనటానికి నిదర్శనంగా 'డాలరు' కవితను రచిం చారు. 'భూమిని తనచుట్టూ-తిప్పుకోడానికి-తను-భూమిచుట్టూ-తిరుగుతోంది' అని చెప్పారు. అంటే అగ్రరాజ్యం తన పెత్తనాన్ని, ఆర్థికబలాన్ని సాగించ టానికి ప్రపంచ పర్యటన చేస్తున్నదని గ్రహించాలి. తాను భూమి చుట్టూ తిరగటంవల్ల భూమి తన అధీనమవుతుందని 'డాలరు' ఆలోచన. అమెరికా ఇతర దేశాలమీద పెత్తనం సాగిస్తున్న తీరును బట్టబయలు చేస్తూ దాని స్వార్థాన్ని 'అమెరికీయం' అనే శీర్షికతో పెట్టినంతకాలం-గుడ్డు-స్వాహా పెట్టకుంటే-కోడి-స్వాహా' అనే కవితను రచించారు. తన చెప్పుచేతల్లో వున్న దేశాల మీద అమెరికా ఆధిపత్యాన్ని చెలాయించే తీరును కవి ఈ కవితలో స్పష్టం చేశారు. ఒకవేళ ఏదేశమైనా తన అధికారాన్ని ప్రశ్నిస్తే, అంగీకరించకపోతే ఆదేశం మీద బలవం తంగా దాడి చేసి ఆక్రమించుకొనే అమెరికా రాక్షస మనస్తత్వాన్ని కవి ఈ కవితలో ప్రదర్శించారు. 'కేబుల్ టీవీ' అనే కవితలో ప్రేక్షకుల-మైండ్‌సెట్- 'విషా'ల మైంది - అమెరికాలో - వెర్రితలలు - ఆంధ్రాలో మొలుస్తున్నై అని చెప్పారు. విశాల శబ్దాన్ని 'విషాల'గా మార్చటంలో కవి ప్రత్యేకతను సాధించారు. 'పోస్ట్‌మార్టం రిపోర్టు' కవిత మానవత్వానికి చిరునామాగా ఉంది. 'మత రాజకీయాల - మహాయజ్ఞంలో - సమిధలై పోయినవాళ్లని - హిందువులా ముస్లింలా అని - పోస్ట్‌మార్టం చేస్తే - మనుషులని రిపోర్ట్ వచ్చింది' అనటం ద్వారా కవి తన విశిష్ట ప్రతిభను ప్రదర్శించారు. ఇలా ఎన్నో వైవిధ్యభరితమైన కవితలు ఈ సంపుటిలో ఉన్నాయి.

సింగంపల్లి అశోక్ కుమార్ రచించిన మరో మినీ కవితా సంపుటి పొద్దుపూసింది. ఇది అక్టోబరు 2004లో ప్రచురితమైంది. దీన్ని 'కలాల హలాలతో - ఎరుపుపంటలు పండిస్తున్నారు - అక్షరహాలికులు' అని ఎరుపు పంటలు పండించే అక్షరహాలికులకు అంకితం చేశారు. ప్రకృతిని దర్శించటంలో ఒకొక్కరిది ఒక్కో దృష్టి. సూర్యుడినీ, చంద్రుడినీ, ప్రకృతినీ ప్రాచీన, ఆధునిక కవులెంతో మంది ఎన్నెన్నో దృక్కోణాలలో వర్ణించారు. అలాగే అశోక్‌కుమార్ ఈ కవితా సంపుటిలో మూడు పాదాల నియమంతో కవితలు రచించారు. వీటిని 'హైకూ'లుగా డా॥ అద్దేపల్లి రామమోహనరావుభావించారు. ఇతర కవుల హైకూలకు హైకూ లక్షణాలకు భిన్నంగా ఉన్నాయని చెప్పారు. వీటిని హైకూలని అనాల్సిన అవసరం ఏముంది? మినీ కవితలంటేనే బాగుంటుంది!

సూర్యోదయాన్ని కవులు పలువిధాలుగా ఊహించారు. వర్ణించారు. అశోక్‌కుమార్ పొద్దు పొడు పును 'పొద్దుపూసింది-జగతి నిండా-ఎరుపు పరిమళం'అని చెప్పారు ఇవి శీర్షికలు లేని మినీ కవి తలు. పొద్దుపూసింది అనటమే ఒక గొప్ప ఉక్తి చమ త్కృతి.'పొద్దు'కు ఎరుపురంగు ఉండటం సహజం. కానీ ఆ రంగుకు పరిమళాన్ని జోడించిన కవి ఊహా శక్తి అద్భుతమనిపిస్తుంది. 'ఎరుపు' శబ్దంలో విప్లవ ప్రతీక స్ఫురిస్తుంది. మదిలో విప్లవభావాల్ని నింపుకొన్న కవికి 'ఉదయించే సూరీడు - నింగినిండా

ఎగిరే-ఎర్రనిజండా'గా కనిపించటంలో ఆశ్చర్యం లేదు. సూర్యుడికి అనేక విశేషణాలున్నాయి. భాస్కరుడు, అహస్కరుడు, భానుడు సహస్రకిరణుడు- వేయి వెలుగులదొర, సప్తాశ్వుడు, చిత్రరథస్వామి-ఇలాంటి ఎన్నోవిశేషణాలుండగా ఈ కవి సూర్యుణ్ని 'కిరణాయుధుడొచ్చాడు-ధాత్రివెనుక-రాత్రి దాక్కుంది' అని వర్ణించాడు. సూర్యుణ్ని 'కిరణాయుధుడని' విప్లవ ప్రతీకను చెప్పటంద్వారా కవి తన భావజాలాన్ని ప్రదర్శించారు.

అశోక్ కుమార్ మరో కవితలో 'పొద్దు-చీకటికి -చితి మంట'అని చెప్పటం ద్వారా చీకటిని తగల బెట్టి వెలుగు వస్తున్నదని తెలిపారు. రాత్రింబవళ్లు పనిచేసి సంపాదించిన కూలి డబ్బులు పేద ప్రజలు ఆకలిని తీర్చలేకపోతున్నాయని చెప్పటానికి చక్కటి రూపకాలంకారంతో 'కూలి డబ్బులు-బతుకు పెనంమీద- నీటి చుక్కలు' అనే కవితను రచించారు. 'బతుకు పెనం'అనటంలో రూపకాలంకారం. పెనం మీద పడిన నీటి చుక్కలు వెంటనే ఆవిరై పోతాయి. అలాగే సంపాదించిన డబ్బులు పేదలకు ఏవిధంగాను సరిపోవటంలేదనే సత్యం ఈ కవితలో దాగి ఉంది. జీవితాంతం కష్టపడ్డా ఫలితం దక్కడం లేదని, సుఖం కలగడంలేదని జీవన వాస్తవికతను తాత్వికతను కవి 'సగటు జీవితం-బతుకంతా గాడిద-చచ్చాక బూడిద' అని చెప్పారు.

గుడిసెల్ని కూల్చి స్టార్ హోటళ్లు కట్టే తీరును కళ్లకు గడుతూ కవి 'పూరి గుడిసెలు - నక్షత్ర సత్రాల -విత్తనాలు' అని చెప్పారు. కష్టాలు పడేవాళ్లు కన్నీళ్లు కార్చుతారు. అయితే కష్టాలను తట్టుకోలేనప్పుడు తిరుగు బాటు చేస్తారు. ఈ వాస్తవాన్నే కవి 'తిరుగు బాటు- కంటిజలపాతానికి- పుట్టిన విద్యుత్తు' అని ప్రతిభా వంతంగా కవిత్వీకరించారు. జలపాతానికి విద్యుత్తును పుట్టించేశక్తి ఉంటుంది. అలాగే ధారా పాతంగా కురుస్తున్న పేద ప్రజల కన్నీళ్లకు కూడా విద్యుత్తును పుట్టించే గుణం ఉందని కవి భావం. మేధావుల వలసను నిర్వచిస్తూ 'ఖరీదైన దేశాలకు- కారు చౌక కూలీలు-వలస మేధావులు' అని చెప్పారు. వృద్ధాశ్రమాల్ని గూర్చి చెబుతూ 'సన్‌స్ట్రోక్ బాధితుల -శరణాలయాలు-ఓల్డ్ ఏజ్ హోమ్స్' అని చెప్పారు. 'సన్‌స్ట్రోక్'కు ఉన్న ఎండదెబ్బ అనే సామాన్యార్థాన్ని పక్కనబెట్టి కొడుకులచేత బాధితులైన వారు అనే అర్థాన్ని చెప్పారు. 'జనపోరాటంలో ప్రజలు-ఆయుధాలు పట్టుకోరు-ఆయుధాలుగా మారుతారు' అని పోరాటాన్ని కొత్త కోణంలో నిర్వచించారు. ఇంకా వినూత్న భావాలతో కూడిన కవితలెన్నో ఈ సంపుటిలో ఉన్నాయి.

అశోక్‌కుమార్ 1973 నుంచి 2003 వరకూ రాసిన మినీ కవితల్ని 2004 అక్టోబర్‌లో 'ఆధ్యాత్మిక ర'హ'స్యాలు' పేరుతో ప్రచురించారు. రహస్యాలు అనకుండార'హ'స్యాలుఅనటంలో చమత్కారం ప్రదర్శించారు. హేతువాదదృక్పథంతో రచించ బడిన మినీ కవితలు ఈ సంపుటిలో ఉన్నాయి. ఈ సంపుటిని ప్రజాకవి వేమనకు అంకితం చేశారు.

మతంమత్తు మందు అన్న మార్క్స్ మాటల్ని మనసులో పెట్టుకొని 'సారా'ంశం పేరుతో ఒక కవితను రచించారు.

'విస్కీ బ్రాందీ, జిన్నురమ్ములు-మందే దయినా -మత్తు ఒక్కటే'

హిందూ, ముస్లిం, క్రైస్తవమ్ములు - మతమే దయినా-కిక్కు ఒక్కటే'

మద్యపానం ఏరూపంలో ఉన్నా మత్తు ఒకే రకంగా ఉన్నట్లు, మతం ఏదైనా 'కిక్కు' ఒక్కటే అని చెప్పటంలో భిన్నార్థాల్ని స్ఫురింపచేశారు. 'కిక్కు' అంటే పరిసరాల్ని మర్చిపోయి మత్తులో ఉండటం. 'కిక్'అంటే తన్ను ఇక్కడ ఈ 'కిక్'శబ్దం ద్వారా మత కలహాలను ధ్వనింపచేశారు.

ఈశ్వర్ అల్లా'తేరే'నామ్ అనే పలుకుల్లో 'తేరే' బదులు 'వేరే' అనే శబ్దాన్ని ప్రయోగించి 'ఈశ్వర అల్లా 'వేరే' నామ్ అనే శీర్షికతో 'అయోధ్య- ఆస్తి - కోసం-వీళ్లు- కోర్టుకెక్కినపుడే-తెలిసింది!' అనే కవితను రచించారు. రెండు మతాల వారు అయోధ్యలోని స్థలం కోసం కోర్టుకెక్కటం ద్వారా ఈశ్వరుడు, అల్లా వేర్వేరుదేవతలని తెలిసింది అని మతాల మత్తులో ఉన్నవారికి చురకను అంటించారు.

కొబ్బరికాయను కొత్త కోణంలో ఊహిస్తూ 'తనను రాయికేసి-కొట్టినందుకు-కన్నీరు కురిసినా రాతిబొమ్మలను తలచి, కొలిచే-నీమూఢత్వానికి- తెల్లగా పగలబడినవ్వుతోంది' అని కొబ్బరికాయ లోని తెల్లదనాన్ని నవ్వుగా భావించారు. ఒక కొత్త ఆలోచనను, భావనను ప్రకటించారు.

మూఢవిశ్వాసాల మీద చరిచిన కొరడా దెబ్బ లాంటి కవిత 'శకునం' 'పులుల్నీ-సింహాల్నీ- మనిషి వేటాడుతున్నప్పుడు-గర్వంతో ఎత్తినతల- పిల్లుల్నీ -పుల్లల్నీ చూసి-భయపడుతున్నప్పుడు-సిగ్గుతో తాకుతోంది నేల!' మానవుడు ఎంత ఎదిగినా మూఢ విశ్వాసాల ముసుగులోంచి బయటకు రాలేక పోతున్నా డనే విమర్శ ఈ కవితలో ఉంది. ఇప్పటికీ ప్రయాణం సాగిస్తున్నప్పుడు పిల్లి అడ్డంగా వచ్చిందనో, కట్టెలమోపు ఎదురైందనో ప్రయాణాన్ని వాయిదా వేసుకొనే వాళ్లున్నారు. అలాంటి వారికి కనువిప్పు కలిగించటానికే ఈ కవిత. ఇలాంటి భావంతోనే 'పిండాకూడు' రచించారు. 'పట్టుకుంటే పదివేలు' కవిత కూడా మూఢవిశ్వాసాన్ని నిరసించేదే.

దళితుల ఆత్మగౌరవానికి ప్రతీకగా 'అంటలేని వాళ్లు' కవితను రచించారు. 'సమాజంలో మా ఉనికి -తప్పుకాదు-రగిలేనిప్పు-అందుకే మేమిప్పుడు -అంటరానివాళ్లం కాదు - మీరు అంటలేనివాళ్లం'



## డా॥ అడిగోపుల వెంకటరత్నమ్

పుస్తకం పేరులోనే ఉంది నూతనత్వం.
మినీ కవితల్లో ప్రత్యక్షంగా సాక్షాత్కరించినవి కొన్ని.
వ్యంగ్యంగా ఆవిష్కరించినవి కొన్ని.
రాజకీయ సామాజిక స్థితిగతుల్ని
ఆకళించుకుని రాసిన మినీ కవితలు.
ఆలోచింపజేసే చురకలు.
ఒకచోట అభివ్యక్తి అద్భుతం.
ఒకచోట శిల్పం సుందరం.
ఒకచోట చిత్రం అర్థవంతం.

**' మా ఊళ్లో ఓ రౌడీ వెలిశాడు-ఐతే మాకేం భయం !**
**వచ్చే ఎన్నికల్లో ఓటు అచ్చోసి**
**-దేశం మీదకు వదిలేస్తాం !'**

- నేటి రాజకీయ వ్యవస్థ దర్పణం.

**'సారాయి పేదోళ్లని చంపినా**
**ప్రభుత్వాలని బతికిస్తోంది!'**

బతికి బట్టగట్టిన ప్రభుత్వం
మన ముందేఉంది.

**'ఇంటిని తాకట్టు పెట్టి-**
**గోడలకు రంగులు వేసుకోవడం!'**

ప్రపంచ బ్యాంకు ముందు
మోకరిల్లిన మన దుస్థితి.
మంచి మినీ కవితలు
చదివాననే అనుభూతి.
మెదడు అప్పుడప్పుడూ
నేమరేస్తుందనే అభిప్రాయం.

# అక్షర హాలికులు

**అశోక్‌కుమార్**



## రాయప్రోలు సుబ్బారావు

**(1892 - 1984)**



## ఏ దేశమేగినా...

భావకవిత ఆదిమ్రాలు
తృణకంకణ లలితరవాలు
భారతికి మించి లేదన్న
దేశభక్తి రాయప్రోలు

'రాని' పదం స్థానంలో 'లేని' పదాన్నిచేర్చి ఒక గొప్ప అర్థాన్ని స్ఫురింపచేశారు.

మన ఆధ్యాత్మిక విశ్వాసాలు హేతువుకు నిలవని వని వాటిలో వైరుధ్యాలున్నాయని చెబుతూ 'చిరాయువు' పేరుతో ఒక కవితను 'దీర్ఘాయుష్మాన్ భవ అంటూ - చిరకాలం-బతకమనేదీ నువ్వే అటు తిరిగి అదే నోటితో-పాపీచిరాయువు- అంటున్నదీ నువ్వే!'- అని రచించారు. మొదటి మూడు పాదాల్లో చెప్ప బడిన భావానికి విరుద్ధంగా తర్వాతి మూడు పాదాల భావాన్ని చెప్పటం ఈ కవితలోని ప్రత్యేకత. 'మనిషే లేడా?'శీర్షికతో అట్టమీద ముద్రించినకవిత మానవ త్వాన్ని ప్రబోధిస్తున్నది. 'కమ్మో, రెడ్డో, కాపో అంటాడు గాని-మనిషినని చెప్పడేం-హిందువో ముస్లిమో క్రిస్టియనో-అంటాడుగాని-మనిషినని చెప్పడేం - ఇండియనో, అమెరికనో, రష్యనో -అంటాడుగాని- మనిషినని చెప్పడేం- అసలిక్కడ- మనుషులులేరా?- వీళ్లు మనుషులు కారా?' - అని ప్రశ్నించారు.

మూఢ విశ్వాసాలను నిరసిస్తూ, మానవత్వాన్ని ప్రబోధించే కవితలు ఈ సంపుటి నిండా ఉన్నాయి.

ఆధిపత్యం కోసం అమెరికా సాగిస్తున్న కుట్ర, ఎన్నికలు, ప్రజాస్వామ్యం, రైతు జీవితం, ప్రపంచీకరణ, రాజకీయం వస్తువులుగా రచించబడిన కవితలతో అశోక్‌కుమార్ 2006 జులైలో వెలువరిం చిన మినీ కవితా సంపుటి 'వ్యూహం'. ఈ సంపుటిని 'అగ్నిపుత్రుడు' చెరబండ రాజుకి అంకితం చేశారు. 'సోమరిపోతు'ను చక్కటి పదజాలంతో నిర్వచిస్తూ 'కాలుతీసి - కాలు వేసేది- దున్నేపోతు - కాలుమీద - కాలువేసేది-దున్నపోతు' అని చెప్పారు.

అక్షరాభ్యాసం రోజే అమెరికా వ్యామోహం పెరిగిపోతున్న తీరును నిరసిస్తూ ' A అంటే America అని రుద్దుతున్నది-వాడి సామ్రాజ్యదాహం-'అ' అంటే అమెరికా-అని దిద్దుతున్నది-వీడి వలసవాద వ్యామో హం'అని చెప్పారు. అమెరికావాడిది సామ్రాజ్య దాహంకాగా మనది వలసవాద వ్యామోహమని తెలపటంలో ఈ వ్యామోహాన్ని తొలగించు కొమ్మనే సందేశం దాగి ఉంది. స్వదేశాభిమానం పెంచుకోండనే సలహా ఉంది.

'బుష్‌ను బుషాసురుడు' అని కవి చెబుతూ అతని సామ్రాజ్యవాద దాహాన్ని ధిక్కరిస్తూ 'భూగోళం' కవితను రచించారు. 'తెల్లమేడలో కూర్చొని - కత్తుల తోనూ - ఫోర్కుల తోనూ తినెయ్యడానికి-ఇది వేణ్నీ ళ్లతో ఉడికిన-అండం కాదు!-కన్నీళ్లతో ఉడికి పోతున్న బ్రహ్మాండం!' అంటే ఇది నీకు కొరుకుడు పడని వదార్థం జాగ్రత్త అని హెచ్చరించారు. ప్రపంచీకరణను నిర్వచిస్తూ 'తను శ్రమిస్తూ - శ్రమ చుట్టూ పరిభ్రమించడం-వసుధీకరణ తను శ్రమించ కుండా-శ్రమనంతా పరిగ్రహించడం - ప్రపంచీ కరణ'అని చెప్పారు. మన స్వాతంత్ర్యం ఎప్పుడో హరించబడిందనే విషయాన్ని వ్యంగ్యంగా 'స్వాతం త్ర్యం' కవితలో చెబుతూ 'ఈ 'కల' - రంగులు - ఆహా! - ఈ కోడి - ఎప్పుడో స్వాహా!' అని పలికారు 'స్వాతంత్ర్యమంటే - జెండాలు - ఎగరెయ్యడంకాదు - ప్రజలు - జెండాల్లా ఎగరడం' అని సముచితమైన నిర్వచనం ఇచ్చి ప్రజల బాధ్యతను గుర్తుచేశారు.

రైతును గూర్చి కొన్ని కవితలు ఈ సంపుటిలో అద్భుత భావనాబలంతో మెరుస్తున్నాయి. 'రైతు - పొద్దుకు ముందే-పూసే పొద్దు- దున్నేటప్పుడు- మూడో-ఎద్దు'అని చెప్పిన కవి ప్రతిభ ఔరా! అనిపి స్తుంది. తెల్లవారకముందే రైతు పొలానికి వెళతాడనే సత్యాన్ని మొదటి మూడు పాదాల్లో చెప్పి ఆ తర్వాత పొలాన్ని దున్నేటప్పుడు అతడు కూడా 'ఎద్దు'లా శ్రమిస్తాడని చెప్పటానికి రైతును మూడో ఎద్దుగా భావించటం ఒక వినూత్నభావానికి ప్రతీక. 'రైతన్నల విద్య' శీర్షికతో 'పుడమిని - పైరుగా మొలవడం - ఆకలిని - వైరిగా గెలవడం - బ్రహ్మ విద్యేంకాదు - బ్రహ్మకు రాని విద్య!' అని రచించారు.

తెలుగునాట రైతుల ఆత్మహత్యలు ఒక సంచల నం కలిగించాయి. చేసిన చాకిరికి గిట్టుబాటు లభిం చక రైతులు ఆత్మహత్యలు చేసుకొంటున్నారని అందరూ భావిస్తుంటే కవి తనదైన దృష్టితో 'అన్న దాతల ఆత్మహత్యల్ని' నిర్వచించారు.'తమకు- దేశం -తిండిపెట్టనందుకు కాదు- తాము-దేశానికి తిండి పెట్టలేకపోతున్నందుకు' ఈ కవితలో కవి ఎంతో గొప్పభావాన్ని పొందుపరిచారు. రైతుల పరోపకార గుణాన్ని ధ్వనింపచేశారు. ఇతరులకు ఉపయోగపడని శరీరంవ్యర్థమని వారు తనువులు చాలిస్తు న్నట్లు ఊహించటంలో కవి ఉన్నతశిఖరానికి చేరుకొన్నారు.

సూర్యుడు ఒక ప్రాంతంలో కనిపిస్తే మరో ప్రాంతంలో కనిపించడు. కానీ, రైతుమాత్రం జగ మంతా ఉంటాడని చెబుతూ కవి 'రైతుకూలీ' కవితను 'సగం జగాన్నే-వెలిగించేది-సూర్యుడు - సకలజగాన్నీ -బతికించేది-రైతు వీరుడు' అని రచించటం ప్రశంస నీయం. నిజం 'చెప్పు' కవితను 'నీ-కాలికింద - చెప్పుకాదు నిను - కాలనివ్వని - చెప్పువాడు' అని దళితుని, శ్రమజీవి గొప్పతనాన్ని చాటిచెప్పారు. ఈ కవితను చదివినపుడు జాషువా గబ్బిలంలోని 'భరత వీరుని పాదము కందకుండగా-చెప్పులు కుట్టిన జీవ నము సేయునుగాని నిరాకరింపలేదెప్పుడు' అనే పద్యం గుర్తుకురాకమానదు. విశ్వరహస్యాన్ని విశ్వ శ్రామి కుల్ని గూర్చిన కవితలు కూడా ఇందులో ఉన్నాయి.

అశోక్ కుమార్ 2007 నవంబర్‌లో ప్రచురిం చిన మినీకవితల సంపుటి 'గ్లోబలి' ప్రపంచీకరణ ప్రభావంతో 'గ్లోబ్‌బలి' అవుతున్నదనే ఆవేదనతో కూడిన కవితలిందులో ఉన్నాయి. గ్లోబలైజేషన్‌కు ప్రజలు బలిఅవుతున్న తీరును కూడా ఇందులో గమనించ వచ్చు. ప్రపంచీకరణ, కార్పొరేట్‌కల్చర్, ప్రజా స్వామ్యం, వెర్రితలలు వేస్తున్న నాగరికత, ఎన్నికలు, ఓట్లు, రాజకీయాలు, కబ్జాలు, రైతు, ఆధునిక

ఆసుపత్రులు ఈ సంపుటిలో కవితా వస్తువుల య్యాయి. ఈ సంపుటిని కవి 'నిబద్ధ మినీ కవితా ప్రభంజనం' అలిశెట్టి ప్రభాకర్‌కి అంకితం చేశారు.

ఈ సంపుటిలో మొదటి కవిత గ్లోబలి.

**'మనిషికై - సరుకులు పుట్టడం - సివిలైజేషన్**
**మనిషినే - సరుకుగా పెట్టడం - గ్లోబలైజేషన్'**
- ఒక నిశితమైన నిర్వచనం. ఒకనిజమైన నిర్వచనం. ప్రపంచీకరణ ప్రభావంతో ప్రతిదీ వ్యాపారవస్తువై పోతున్నతీరు ఈ కవితలో స్ఫురిస్తున్నది. మనిషిని అంగడి సరకుగా పెట్టడం అంటే హార్దిక దృక్పథాన్ని వదిలి ఆర్థిక దృక్కోణంతో చూడటమని గ్రహించాలి.

సమస్త విశ్వాన్ని తన గుప్పిటలో పెట్టుకోవాలని చూస్తున్న అమెరికా సామ్రాజ్యవాద విషపుటా లోచ నల్ని కవి కనిపెట్టి 'విశ్వప్రయత్నం' కవిత రచించారు. 'దిక్కులను-పోల్చాలని-లైట్‌హౌస్- దిక్కులను-కూల్చాలని-వైట్‌హౌస్'-అని చెప్పటం ద్వారా అమెరికా ఎంత నీచమైన ఆలోచనల్ని చేస్తు న్నదో, ఎంత దుష్టప్రయత్నంగావిస్తున్నదో అర్థం చేసుకోవచ్చు.

'మురిపాలన' శీర్షిక ఆలోచనాత్మకంగా ఉంది. విదేశీ-హస్తగతమైన-చెరపాలన నాడు- హస్తమే-విదేశీయమైన-పరిపాలన నేడు' ఇందులో విదేశీ, హస్తం శబ్దాలతో కవి చమత్కారాన్ని సృష్టిచాడు. ఆనాడు విదేశీ హస్తగతమైంది భారతదేశం అని చెప్పి ఈనాడు కాంగ్రెస్ విదేశం నుంచి వచ్చిన సోనియా గాంధీ హస్తగతమైందని ధ్వనింపచెయ్య టంలో కవి ప్రతిభతొంగిచూస్తున్నది.

స్వాతంత్ర్యం వచ్చినా ఇంకా మనల్ని మనం పాలించుకోలేనిస్థితిలో వ్యంగ్యంగా విమర్శస్తూ 'పర తంత్రం' కవితను రాశారు.'ఎగురుతున్న-జెండా-ఇక్కడ-ఎగరేస్తున్న-తాడు-అక్కడ'అని మన జెండాను మనం ఎగరేసుకోలేకపోతున్నామని, మన నిర్ణయాలను మనం చేసుకోలేకపోతున్నామని విమర్శించారు.

అమెరికా, ప్రపంచాన్నే కబ్జా చేస్తున్నదని, అమెరికా పాలకుడు అంతర్జాతీయ గూండా అని భావిస్తూ -

**'తారల చారల-నిక్కుతున్న-జెండా జేబున గ్లోబును- కుక్కుతున్న- గూండా'**- అని రచించారు. అమెరికా జెండాలో నక్షత్రాలు, చారలు ఉంటాయి. ఈ విషయాన్ని మొదటిమూడు పాదాల్లో కవి తెలిపి, ఆదేశాధినేత జేబులో గ్లోబును కుక్కుతున్న గూండా అని చెప్పటంద్వారా అమెరికా దుష్టత్వాన్ని బట్ట బయలు చేశారు.

చచ్చి పోతున్నా గవర్నమెంట్ ఆసుపత్రులు వైద్యం చెయ్యటంలేదని, చచ్చిపోయిన తర్వాత కూడా కార్పొరేట్ ఆసుపత్రులు వైద్యం చేస్తున్నాయని సామా జిక వాస్తవికతను ప్రదర్శించారు. తన పిల్లల కోసం రైతు ఆత్మహత్య చేసుకుంటున్నాడనే కఠోరవాస్తవాన్ని 'కృ'శీ'వలుడు కవితలో **'తన దేశం-ఎల్లల ఆకలికి-తనచేవే ఆహారం తనదేహం-పిల్లల ఆకలికి-తన చావే పరిహారం'** అని చెప్పారు. అందాల పోటీలను 'విలువలు, నాగరికత' కవితల్లో దుయ్యబట్టారు. ఎన్నికల ఆటలో సామాన్యుడు బాధితుడవుతున్న తీరును కవి- **'ఎన్నికలముందు-వాడికీ వీడికీ-నువ్వే గెలుపి ఎన్నికల పిదప-వీడికీవాడికీ- నువ్వే బాలుపి'** - అని చెప్పారు.

ఇందిరమ్మ రాజ్యాన్ని అపహసిస్తూ 'ఇందియా రాజ్యం'గా శీర్షికపెట్టి- **'మనకు-గుడిసెలులేని-రాజ్యంరాబోతున్నదా-మనది-గుడిసెలు కూడా లేని-రాజ్యంకాబోతున్నదా?'**అని ఒకచురకను అంటించారు.

**'ఎరుపు' రంగు 'కొందరికి - భయం - ఎంద రికో అభయం'** అని ఈ సంపుటిని ముగించారు.

అశోక్‌కుమార్ మినీకవితలు అక్షర చిత్రాలు. తన కవితాసంపుటాల్లో మూడు సంపుటాలకు చిత్రాలనుకూడా జోడించి కవితల్ని మరింత శక్తిమం తం చేశారు. అశోక్ కుమార్‌కు శబ్దంమీద మమకా రమే కాదు, అధికారమూ ఉంది. అంత్యప్రాస అశోక్ కుమార్ మినీ కవితలకు అదనపు ఆకర్షణ. భావం, భావానికి తగిన శబ్దాన్ని పేర్చటం అశోక్‌కు మార్‌కు 'పెన్ను'తో పెట్టిన విద్య. మినీ కవితల్లో తనదైన ఆలోచన, తనదైన నిర్వచనం, తనదైన ఊహ ప్రదర్శిం చటం అశోక్‌కుమార్ ప్రత్యేకత. అశోక్‌కుమార్ మినీ కవితలు ఛందోబద్ధమైన పద్యాల్లాగా ధారణా యోగ్యంగా ఉంటాయనటం సహజోక్తి.

అశోక్ కుమార్ మినీకవితలకు అంత్య ప్రాసలే బలం. ఒక్కోసారి అవే బలహీనమవుతాయి. శబ్ద సామ్యం కోసం ప్రయత్నించినపుడు భావం పల్చ బడటం, కొత్త కొత్త శబ్దాలు పురుడు పోసుకోవటం జరుగుతుంది. ఈ కొత్త శబ్దాలు కొన్ని సందర్భాల్లో ఆహ్వానించదగినవై ఉంటాయి. వీరికవితల్లో అగ్ర వాదం, ఖర్చుబడి, కృ'శీ'వలుడు, వి'షా'లమైంది, అమెరికీయం,ర'హా'స్యాలు 'మధ్య'ప్రదేష్, అమెరి'కాకి' వాలింది, బుషాసురుడు, గూండా ఉంచా రహే హమారా, బొక్కలచుక్క, మిధ్యాత్మికత, వస్త్రసన్యాసం మొదలైన ప్రయోగాలున్నాయి.

అశోక్‌కుమార్ మినీ కవితల రచనలోనే కాదు వాటిని ధారణచెయ్యటంలోనూ అందరికంటే ముం దుంటారు. ఎన్నో, ఎన్నెన్నో మినీ కవితలు ఆయన నోటివెంట జాలువారుతూఉంటాయి. శ్రీశ్రీ సాహి త్యం, మినీకవిత్వం ఆయనకు ఉచ్ఛ్వాస నిశ్వాసాలు. మినీ కవిత్వంలో తనదైన ముద్రను ప్రకటించిన అశోక్‌కుమార్ 'మినీ కవితా సమ్రాట్' అని చెప్పటం సముచితం.

**'అక్షరాన్ని అగ్నిగా రగల్చటం**
**శబ్దాన్ని శతఘ్నిగా పేల్చటం**
**అశోక్ కుమార్ కవిత '**

■

# అక్షర హాలికులు

**అశోక్‌కుమార్**



## గరిమెళ్ల సత్యనారాయణ

**(1893 - 1952)**



## సమర పాళి

మాకొద్దీ తెల్ల దొరతనం
స్వాతంత్ర్యోద్యమ మహారణం
నిషేధం కత్తికి కళతెగని
గరిమెళ్ల గళ ప్రభంజనం

## రైతన్నల విద్య

పుడమిని / పైరుగా మొలవడం - ఆకలిని / వైరిగా గెలవడం -

బ్రహ్మ విద్యేం కాదు / బ్రహ్మకు రాని విద్య !





# 'తల'లేని కవిత - 'వెల'లేని కవిత్వం

డా॥ జి.వి. పూర్ణచందు

**పాలపొడి డబ్బా లేబుల్‌మీద ఆ పాలపొడిలో దొరికే బలకరాల వివరాలన్నీ రాసిఉన్నట్లు, కవిత్వానికి పెట్టే పేరు కూడా ఆ కవిత్వంలో ఉన్నదంతా చెప్పేదిగా (లేబెలింగ్) ఉండాలని చాలామంది కవులకు నిండానమ్మకం.**

**మంచి కవిత రాస్తున్నానుగానీ, మంచిపేరు పెట్టలేకపోతున్నానని బాధ పడడం అంటే, శీర్షికా వ్యామోహం (పేరు మోజు) జాస్తిగా ఉన్నట్టే లెక్క!**

**నేములోనేమున్న?దన్నట్లు కవితకు ఏ పేరూ పెట్టనవసరంలేదనీ, అందులో కవిత్వం ఉంటే అదే మంచి పేరుతెస్తుందనీ, పేరునిబట్టి పేరొస్తుందనుకోవటం పొరబాటనీ భావించే కవులు కొద్దిమంది ఉన్నారు. శ్రీ సింగంపల్లి అశోక్ కుమార్ పేరు అవసరంలేని కవితలు రాసిన మంచి పేరున్న కవి. ఆయన కవితా సంకలనాలు 'గ్లోబలి', 'వ్యూహం', 'తంత్రం', 'పొద్దుపూసింది', 'ఆధ్యాత్మిక ర'హ'స్యాలు', 'శుభాకాంక్షలు'- వీటిని మళ్లీ ఇప్పుడు కూర్చుని ఏకబిగిన చదివాక 'కవిత'కు శీర్షిక కల్గించే ప్రయోజనం ఏమిటన్నదానిమీద లోతైన చర్చ జరగాల్సిన అవసరం ఉన్నదనిపించింది.**

ఒక అన్నమయ్య పదాన్ని గుర్తుపెట్టుకునేందుకు దానికి పేరు పెట్టాలా? ఒక నారాయణరెడ్డి పాటనో, ఒక వేటూరి గీతాన్నో తలచుకునేందుకు దానికి 'పేరు' (శీర్షిక) ఉండాలా? ఒక శ్రీశ్రీ, ఒకబైరాగి, ఒక తిలక్, ఒక శేషేంద్రల కవితల్ని గుర్తుచేసుకునేందుకు పేరు తప్పనిసరా? పేరునిబట్టే గుర్తిస్తున్నామా?

'పదహారేండ్ల పసుపుచీర పమిటచెంగుమీద / ప్రశ్నల దారాలు లాగుతున్నాడు పోలీసు అధికారి'-అనే పాదాలను కుందుర్తి తెలంగాణా కావ్యంలో ఉదహరిం చడానికి ఈ పాదాలకు ఏ శీర్షిక ఉందని...?

చాలామంది కవులు కవితని రాయడం, దానికి శీర్షిక పెట్టడం రెండింటినీ వేర్వేరు అంశాలుగా చూడటంవలన మంచి కవిత రాయడం కన్నా మంచి పేరు పెట్టడం మీద దృష్టి ఎక్కువౌతోంది.

1. రాసిన కవితలో మొదటిపాదాన్నో, చివరిపాదాన్నో లేదా మధ్యలో ప్రముఖంగా కన్పించిన పాదాన్నో శీర్షికగా పెట్టడం. 2. రాసిన కవితలో బాగా పేల్తుందని అనిపించిన పదాన్ని లేదా పాదాన్ని ఎంచుకొని పేరు పెట్టడం. 3. నిఘంటువులు వెదికి, లేదా ఇంకోభాషలోంచి అరువుతెచ్చిన పదాన్ని పేరుగా పెట్టి తన ఆధిక్యతని ప్రదర్శించాలనుకోవటం. 4. మొదటి శీర్షికనే నిర్ణయించుకొని తర్వాత దానికి తగిన కవితని కష్టపడి తయారుచేయటం. (ఇలా కవితని వండటాన్ని Cooking అంటారు). 5.'ఎ కొస్టిక్ పొయిట్రీ' అని ఒక ప్రక్రియ వుంది. సన్మానపత్రాలురాసే మహాకవులు ఈ ప్రక్రియని అనుసరిస్తుంటారు. కవితలోని మొదటి అక్షరాలన్నీ కలిపితే సన్మానితుడు పేరు లేదా బిరుదు నామం లాంటివి వస్తాయి. దాన్ని పదప్రహేళిక కవిత్వం అనవచ్చు. ఇలాంటి వెయ్యి సన్మాన పత్రాలు రాసి సన్మానానికి సరయిన కవులు చాలామంది ఉన్నారు. 6. మంచి పదం పడితేనే మంచి కవిత్వం అనే నమ్మకంతో డబ్బాలో రాళ్లుపోసి గలగల లాడించినట్లు బీకాధ్వని కవిత్వం రాసినందువలన విషయప్రాధాన్యత తగ్గిపోయి, శీర్షికని నిర్ణయించటానికి ఇబ్బందవుతుంది. 7. ఇంగ్లీషు సాహిత్యంలో ఇప్పుడు TMI(Toomuch information)అనే అంశంమీద విస్తృతంగా చర్చ జరుగుతోంది. ఒకేసారి అనేక విషయాలను ప్రస్తావించినందువలన కవిత్వంపాలు

పలచ నౌతోం దని పేరు పెట్టే విషయంలో TMI గందరగోళ పరు స్తుందనే ఇంగ్లీష్‌వాళ్లు కూడా భావిస్తున్నారు.

శీర్షికపెట్టే విషయంలో ఇన్ని అవస్థలుంటాయి. ప్రతికవికీ తనదైన ఎడిటింగ్ విధానంవుండాలి. కలం పట్టుకుని రాయాలనిపించినదంతారాసిన తరువాత, కత్తెర పుచ్చుకుని అనవసర విషయాలను కత్తిరించి, అసలు విషయానికే ప్రాధాన్యత నిచ్చివుంచి నందు వలన కవితలో వేగం పెరుగుతోంది. సూటి దనం వస్తుంది. స్పష్టత ఏర్పడుతుంది. ఒకటికి పది సార్లు వడపోస్తేనే చిక్కటి కవిత దిగుతోంది. అప్పుడు పేరు పెట్టడం సులభం అవుతోంది.

అశోక్‌కుమార్‌రాసిన 'పొద్దుపూసింది'అనే కవితా సంపుటి'**అక్షరాలు / విడిగాఅగ్ని / కలిస్తే శతఘ్ని**' ...ఇలా మూడు లైన్ల కవితలే అన్నీ వున్నాయి. దేనికీ విడివిడిగా శీర్షిక లేదు. అన్నీ 'పొద్దుపూసింది'లో భాగమే! ఈ కవితలో మొదటి పాదం 'అక్షరాలు'ని శీర్షికగా భావిస్తే, ఈ శీర్షిక కవితలో ఒక భాగంఅయి పోయింది. విషయంసుబోధకాల అయినప్పుడు దానికి శీర్షిక దేనికి?అందుకే అశోక్ కుమార్ శీర్షిక పెట్టే ప్రయత్నం చేయలేదు.

**'సన్'స్ట్రోక్ బాధితుల / శరణాలయాలు / ఓల్డు ఏజ్ హోమ్స్'**

**'అందంగా కన్పించాలని / అద్దాన్ని తుడవడం / సంస్కరణ'**

**'ప్రజలూ / పోలీసులూ / రైలు పట్టాలు'**

**'జన పోరాటంలో ప్రజలు / ఆయుధాలు పట్టుకోరు / ఆయుధాలుగా మారుతారు'**

సాధారణంగా పెద్ద కవితల్లోని, దీర్ఘకవితల్లోని ఇలా మెరుపులా తళుక్కుమనే కొన్ని పాదాలను ఏరి ఉదహరిస్తుంటారు విమర్శకులు. అశోక్‌కుమార్ విమర్శకులకు ఈ 'ఏరుడుపని' పెట్టదలచుకోలేదు. త్రుళ్లిపడజేసే పాదాలనే కవితగా చెప్పాడు. మూడులైన్లలో ముగిసిన కవితలే ఈ పుస్తకం అంతా ఉన్నాయి. వాటిలో ఇంగ్లీషు వాళ్లు భయపడే TMI (Toomuch information) TMTS (Too many Thoughts) ఉన్నాయి. కవిత సాధించే ప్రయోజనం, సాధించవలసిన ప్రయోజనం ఇదే. ఇందుకు శీర్షిక ఒక సాధనముకాదు, ఒక అవరోధమూ కాదు అదొక అప్రస్తుతం అవుతుంది.

హేతువాద, సామాజిక, రాజకీయ చైతన్యంతో కూడిన కవిత్వం యొక్క పరమప్రయోజనం పాఠకుడి పరిజ్ఞానాన్ని పెంచేదిగా వుండాలి. కవిత్వాన్ని ఆస్వాదించేది మనస్సు. మనస్సును పరిపరివిధాలుగా వెంటాడే లక్షణం ఆ కవితకు వున్నప్పుడు అది పాఠకుడిలో పరిజ్ఞాన చైతన్యాన్ని కల్గించదని అర్థం.

మనసుకు పరిజ్ఞానాన్ని కల్గించేవి పంచజ్ఞానేంద్రాయాలు.ఆ ఐదింటిని శబ్ద,స్పర్శ,రూప, రసగంధాలుగా చెప్పారు. కవితలోని ఈ ఐదుజ్ఞానాంశలే ఆ కవితని పాఠకుడి మనసుకు పట్టిస్తాయి.

1.కవిత్వంలో శబ్దం-ధ్వని అనేది ప్రధానంగా ఉంటుంది. ధ్వని గురించి ప్రత్యేకంగా విడమరచనవసరంలేదు. 2.కవిత్వానికి స్పర్శకూడా వుంటుంది. కళ్లుమూసుకొని చేతికి తగిలిన వస్తువును మనం గుర్తించగలుగుతాం. స్పర్శవలన! అటువంటి స్పర్శ జ్ఞానాన్ని కవిత కల్గించగలిగినపుడు 'గుండెల్ని తాకింది' అనగలుగుతాం. కవితలో ఆ 'TOUCH' ఉండాలి. 3. రూపం : కంటికి సంబంధించి పరిజ్ఞానం ఇది. రూపాన్ని బట్టే కవిత ఎత్తుగడ, ముగింపు, నడక, శైలి ఇవన్నీ ఆధారపడి ఉంటాయి.ఏ రూపంలో కవిత ఉండాలో ముందే నిర్ణయించుకొని రాయడం ప్రారంభించాలి. నాలుగులైన్లకే భావం అయిపోయింది-కాబట్టి 'మినీ కవిత' పదిలైన్లు దాటింది. కాబట్టి 'పెద్దకవిత' అనడం సరికాదు. చెప్పే విషయానికి 'రూపం' తగినది ఏదో నిర్ణయించు కోవడంలోనే కవిప్రతిభ ఆధారపడివుంటుంది. దానికి శీర్షిక పెట్టాలో అవసరంలేదో కూడా నిర్ణయం జరిగితేనే ఆ కవితారూపం స్పష్టం అవుతుంది. 4. రసం : ఇది నాలుకకు సంబంధించినజ్ఞానం.ఇక్కడ శృంగార, బీభత్స, భయానక రసాల గురించి నేను మాట్లాడడం లేదు. కవి యొక్క Taste, కవితలోని Taste ఏమిటనేది ముఖ్యం. పాఠకుడి మనసు కవితలోని 'రుచి'ని పసిగడుతుంది. రసజ్ఞానం అంటే ఇది. పాఠకుడి రుచికి కవితలోని రుచి అనుగుణంగా వున్నప్పుడు తీపిలో తీపి, చేదులో చేదు కలిసి పోతాయి. లేకపోతే పాలలో ఉప్పు పడినట్లు విరిగి పోతాయి. పాఠకుడి మనసు కచ్చి తంగా ఈ రుచి పరిజ్ఞానం కలిగివుంటుంది. 5.ఇక ఐదవది గంధపరిజ్ఞానం.ఇది ముక్కుకు సంబంధించిన జ్ఞానం. కవితకి సువాసన, దుర్వాసన లుంటాయి. వాటిని పాఠకుడిమనసు గుర్తించ గలుగుతుంది.'ఆ విషయా న్ని నేనెప్పుడో పసిగట్ట గలిగాను' అంటాం మనం-'I have alredy smelled it' అని! ఆ పసి గట్టగలిగే అంశాన్నే 'గంధం' అనే జ్ఞానం ఇస్తోంది.'లోకజగరణం'చేసే గుణంలేని కవితలో సుగంధం లేదనిఅర్థం.

పాఠకుడి హృదయాన్ని (మనసును) జయించడమే కవిత పరమలక్ష్యంకదా! అలాంటప్పుడు కవిత అందించే జ్ఞానాన్ని మనసు సంపూర్ణంగా స్వీకరించినపుడే ఇది సాధ్యం అవుతుందని ఇక్కడర మనం గుర్తించాలి.కవిదృష్టిలోపెట్టుకోవాల్సిన అంశాలుఇవి.

ఈ ఐదు జ్ఞానాంశాలతో నిండిన కవిత పూర్తయ్యాక శీర్షిక ఏదైనా బాగానే వుంటుంది. శ్రీ అశోక్ కుమార్ 'తంత్రం'అనే కవితాసంకలనంలో '**ప్రపంచ బ్యాంకు / ప్రజలను / తాకట్టు / పెట్టుకొని -/ ప్రభుత్వాలకు/అప్పులిచ్చే / హైటెక్ రక్త బంధువు!**' అని ఆరుపాదాల కవితలు ఈపుస్తకం నిండా కన్పిస్తాయి. ప్రపంచబ్యాంకు అనేది దీని శీర్షిక. కానీ శీర్షికతో కలిపి చదివితేనే కవిత పూర్తవుతుంది. అంటే శీర్షిక అప్రధానం అయినట్లే!

మినీ కవితా ఉద్యమం నడుస్తున్న కాలంలో

## అక్షర హాలికులు

**అశోక్‌కుమార్**



## పఠాభి

**( 1919 - 2006 )**



## పన్‌చాంగమ్

ఫిడేలు రాగాలు డజన్
వెలుగు అక్షరాల రజన్
కయిత నాదయిత పఠాభి
పన్‌డితుల పవరు విజన్

# అక్షర హాలికులు

**అశోక్‌కుమార్**



## కుందుర్తి ఆంజనేయులు

**( 1922 -1982 )**



## 'నయాగరా'

కుందుర్తివారి ఆంజనేయులు
ఫ్రీవర్సుఫ్రంటు ఇంజనాయిలు
తెలుగునేల పరుగుతీసిన
వచన కవితా జలపాయలు !

ఆ రాజేంద్ర రాసిన మినీ కవిత 'నాగరికత'ని గుర్తు చేసుకోండి...'బట్టకట్టి / బజారుకెళ్లింది / బజారుకెళ్లి బట్టవిప్పింది/ ' ఈ కవితకు శీర్షికే ప్రాణం. శీర్షికని 'నాగరికత' అని వదిలి చదివితే కవిత పూర్తికాదు. కాని, శీర్షిక కవితలో కలిసిపోదు. విడిగా దాని ప్రాధాన్యత అది కలిగి వుంటుంది.అటువంటి పరమ ప్రయోజనాన్ని కల్గినప్పుడే కవితకు శీర్షిక గురించి ఆలోచించాలి. అంతేగాని అందమైన పదాలతో పెట్టిన ప్రతిదీ శీర్షిక అనిపించుకోదు. 'ఆ:' కవితలో శ్రీశ్రీ ఇదే ప్రమాణాన్ని సాధించాడు.

'పుడమితల్లికి పుత్రోత్సాహం' అనే కవితలో అశోక్‌కుమార్ **'నేల / మీద /పోరాడినపుడు కాదు!/నేల / కోసం పోరాడినప్పుడు!'** అంటాడు.పుడమితల్లి పుత్రోత్సాహాన్ని మొదటిపాదంగాపెట్టినా,చివరి పాదంగా పెట్టినా, మధ్యలో ఎక్కడ వుంచినా కూడా అది కవితలో కలిసిపోతుంది. కానీ అశోక్‌కుమార్ చేసింది, కవితలోంచి ఆ పాదాన్ని వేరుచేసి శీర్షికగా పెట్టడం.

శబ్ద,స్పర్శ,రూప,రస,గంధాలన్నీ వున్న కవిత అది!ఏవర్గానికిచెందినపాఠకుడినైనా కదిలిస్తుంది. 'శీర్షికని కవిఉపయోగించినతీరు ఇక్కడ ముఖ్యమైంది.

ఇటీవల 'వెలుగురాగాలు' పేరుతో ఒక కవితా సంకలనాన్ని నేను కూడా వెలువరించాను. ఇందులో దాదాపు 75 కవితలున్నాయి. వీటికి 'శీర్షిక' పెట్టలేదు. శీర్షిక పెట్టాల్సిన అవసరం ఆ కవితల విషయంలో నాకు అన్పించలేదు.

'ప్రొద్దున్నే / మెడపట్టి /
శిరచ్ఛేదనం చేస్తావు !
మధ్యాహ్నం/కొనవూపిరి/
ఆగిపోయి మరణిస్తుంది ...
సాయంత్రానికి / దిక్కుమాలిన శవాన్ని /
రోడ్డుమీద పారేస్తావు...
అయినా.../ పువ్వు పూస్తూనే వుంటుంది /
నవ్వు రువ్వుతూనే వుంటుంది...'

వ్యక్తిగా షష్టిపూర్తిని చేసుకుంటున్న కవి మిత్రుడు అశోక్ కుమార్ కవిగా సహస్రాబ్ది పరిణతిని పొందినవాడు. తిప్పిచెప్పడం, విప్పి చెప్పడం చెవినిమెలి తిప్పి చెప్పడం ఆయన ప్రత్యేకత.

**" విశ్వమంతా / ఎగురుతున్న / ఎరుపుగుడ్డ / విశ్వమై / ఎదుగుతున్న / పురిటిబిడ్డ "**-అనే ఆరు పాదాల ఈ కవితలో ఆయన 'శ్రమచేతన' అని పేరుపెట్టాడు. గానీ 'శీర్షిక' లేకపోయినా కవిత శబ్ద, స్పర్శ, రూప,రస,గంధాలను కల్గించింది. ఈ ఐదు జ్ఞానాంశాలలో ఏదైనా ఒకటి లేదనుకున్నప్పుడు, అప్పుడడు శీర్షికతో దాన్ని భర్తీ చేసుకోవచ్చు.

కేవలం పత్రికలలో ప్రచురించేందుకు తప్ప చాలా కవితల్లో శీర్షికలు నెరవేరుస్తున్న ప్రయోజనం ఏమీ కన్పించడంలేదు. దాన్ని గుర్తించడానికి ఏదో ఒక పేరు పెట్టాలి కాబట్టి పెట్టండి. అంతే! కవితలో జ్ఞానాంశంమీద కవిదృష్టి లగ్నం కావాలి.

'తల'లేని కవితలో'వెల'లేని కవిత్వాన్ని అందించాడని అశోక్‌కుమార్‌ను ఈ సందర్భంగా అభినందిస్తూ, నా కన్నా పెద్దాయన కాబట్టి నమ స్కారాలు.■



## భమిడిపాటి సుబ్రమణ్యం

సాధారణంగా పిట్ట కొంచెం.
కూత ఘనం అంటారు.
అశోక్‌కుమార్
పిట్టా ఘనమే (సైజులో),
కూతా ఘనమే (రాతలో).

కవిత్వంగా
పుస్తకాన్ని ఓ సారి చదివితే,
కవిత్వంలోని అద్భుతం
మరో రెండు సార్లు చదివించింది.
ఇంకెన్ని సార్లు చదివిస్తుందో?
అభ్యుదయం అనండి,
విప్లవం అనండి
నిజాల్ని నిర్భయంగా చిత్రించడం
సత్యరచన.
ఆ కోవలోనిదే 'తంత్రం' పుస్తకం.
అన్నీ నచ్చినా,
నాకు బాగా నచ్చినవి
అమెరికీయం,
ప్రపంచ బ్యాంకు రుణం,
ప్రజా స్వామ్యం, రేపటినాయకుడు,
సంపద, తలసరి, పొత్తు పాలన,
అనే శీర్షికలతో ఉన్న కవితలు.
ఇటువంటి మరిన్ని సత్యరచనలు
మీ నుంచి ఆశిస్తున్నాను.

# స్వాతంత్ర్యం

ఈ 'కల' / రంగులు / ఆహా !
ఈ కోడి / ఎప్పుడో / స్వాహా !





# నిబద్ధత అతడి ఊపిరి

సర్వజిత్

**బహుశా అరవయ్యో దశకం చివరిలో అనుకుంటాను. నా ఆప్తమిత్రుడు నందనోదయ (భమిడిమర్రి వెంకట్రామయ్య) కాకినాడలో అశోక్ కుమార్‌ని నాకు పరిచయం చేశాడు. 'ఇతడూ మన జాతి పక్షే' అని – అంటే సాహిత్యాభిమాని అని.**

కాకినాడలో భానుగుడిసెంటర్‌లో అశోక్ కుమార్ నాన్నగారికి సైకిల్‌స్పేర్స్ అమ్మే షాపు వుండేది. అప్పటికి నేనికా రాతగాడిని కాలేదు. దొరికిన పుస్తకమల్లా చదవడంలోనే ఉన్నాను. ఏ ఇజాలు నాకింకా వంటబట్టలేదు. దేవులపల్లిని, శ్రీశ్రీని, ఆరుద్రనీ, బాలగంగాధర్ తిలక్‌నీ ఎక్కువగా చదివేవాళ్లం. ఇంకా కథలూ, నవలలూను. ఆ తరువాత నేను సామర్లకోట నుంచి కాకినాడ వచ్చినప్పుడల్లా నందనోదయ రూములో ఉండటం, వీలైనప్పుడల్లా అశోక్ కుమార్‌ని కలవటం, సరదా కబుర్లు సాహిత్య కబుర్లు చెప్పుకోవడం అలవాటయింది. అప్పటికే అశోక్ కుమార్‌లో అభ్యుదయభావాలు, హేతువాద దృక్పథం నాకు కనిపించాయి. తర్వాత నేను ఉద్యోగరీత్యా 71లో విజయవాడ వచ్చేశాక దాదాపుగా అశోక్‌కుమార్‌తో సంబంధాలు లేవనే చెప్పాలి. బహుశా దశాబ్దన్నర పైనే అనుకుంటాను మిత్రుడు నందనోదయ విజయవాడ వచ్చినపుడు అశోక్ ఇక్కడే ఉన్నాడని చెప్పడం, ఆ సాయంత్రం వెతుక్కుంటూ అశోక్ ఇంటికి ఇద్దరమూ వెళ్లడమూ జరిగింది. అతడూ ఉద్యోగరీత్యా ఇక్కడకొచ్చాడు. మళ్లీ ఓసారి పాత జ్ఞాపకాలు నెమరు వేసుకున్నాం. అయితే ఆ తర్వాత మేం తరచూ కలుసుకొనడానికి ఎవరిపనుల్లో వాళ్ల కున్న ఇబ్బందులవల్ల వీలుకాలేదు. కానీ 76కి ముందు అశోక్ 'తల్లీ ఎవరు నువ్వు?'–జిల్లెళ్లమూడి అమ్మమీద, 'శ్రీబాబామహాత్యం', 'బాలయోగీశ్వర సందర్శనం' తదితర పుస్తకాల్లో హేతువాద, ఏ అభ్యుదయ దృక్పథాన్నయితే అతడు ప్రదర్శించాడో, ఆ తరువాత 2000 సంవత్సరం అనంతరం అతడు ప్రచురించిన 'శుభాకాంక్షలు' 'వ్యూహం' 'తంత్రం' తదితరపుస్తకాల్లోనూ మరింత పరిణతి చెందిన అదే దృక్పథం ప్రదర్శించాడు. ప్రదర్శిస్తూనే ఉన్నాడు. అతడిలో ఈ హేతు వాద, అభ్యుదయ, విప్లవకర దృక్పథాల నేపథ్యం ఏమిటన్నది నాకు స్పష్టంగా తెలియదు గానీ అశోక్ అప్పటికీ, ఇప్పటికీ అదే నిబద్ధతతని ప్రదర్శిస్తున్నాడన్నది మాత్రం అక్షరాలా నిజం.

అంతేకాదు, ఎక్కడెక్కడో వున్న సాహిత్యకారుల్ని పరిచయం చేసుకొనడం, వారితో ఉత్తరప్రత్యుత్తరాలు సాగించడం కూడా అతడిలో వున్న మరో మంచి గుణం. సాహిత్య సంస్థలను ఉత్తేజపరుస్తూ ఉత్సాహపరుస్తూ, వాటితో తనూ మమేకమవుతూ, తరచూ ఏదో ఒకసాహిత్య కార్యక్రమం నిర్వహించమని హింసించే గుణమూ అతడిలో వుంది. కారణాలు ఏవైనా గానీ, నేను ఏ రచన చేయకుండా దశాబ్దన్నరపైగా నిద్రావస్థలో వున్నట్లే, అతడూ దాదాపు రెండు దశాబ్దాలపాటు నిద్రావస్థలో ఉన్నా... అతని భావజాలంలో మాత్రం మార్పురాలేదు. రచయితకు కావల్సింది ప్రధానంగా స్థిర చిత్తమైన ఈ నిబద్ధత. ఆ నిబద్ధతతోనే అతడు 'మినీ కవితల'పై ప్రధానంగా దృష్టి సారించాడు. పదుగురి ప్రశంసలందుకుంటూ ఫలితమూ సాధించాడు. చూడ్డానికి గీత పద్యంలా అనిపించే నాలుగు పాదాల అతడి మినీ కవితలో కచ్చితంగా ఒక మెరుపు కనిపిస్తుంది. వ్యంగ్యం చురుక్కున గుచ్చుకుంటుంది. అశోక్ నిరంతరం, ఆ ధ్యానంలో, భావనలో ఉంటాడనుకుంటాను – అందుకే ఆ పదును!

మాటలెన్నయినా చెప్పొచ్చు– రాతలెన్నయినా రాయొచ్చు. కానీ వాటిని ఆచరణలో పెట్టడం మాత్రం అంత తేలిగ్గా సాధ్యమయ్యే పనికాదు. కానీ, అశోక్ కుమార్ తను ఏ భావజాలాన్నయితే నమ్ముకున్నాడో, అదే భావజాలాన్ని తన జీవితంలోనూ ఆచరించి చూపుతున్న నిఖార్సయిన వ్యక్తి! అభ్యుదయ, విప్లవపథ భావజాలాన్ని ప్రతికవిలోనూ, రచయితలోనూ పాదుకొల్పాలన్న అతడి నిరంతర తపనకి అభినందనలు తెలుపుతూ, అతడి ఈ షష్టిపూర్తి శుభ సందర్భాన నా ఆశీఃపూర్వక శుభాకాంక్షలు అందిస్తున్నాను. ■

**రైతు**

పొద్దుకు / ముందే / పూసే పొద్దు

దున్నేటప్పుడు/ మూడో / ఎద్దు





# నేనెరిగిన అశోక్ కుమార్

చలపాక ప్రకాష్

'రెండూ తుపాకులే !

ధనం తరపు నొకటి

జనం తరపునొకటి!!

అశోక్‌కుమార్ రచన 'పొద్దుపూసింది' మినీ కవితా సంపుటిలోని పదునైన, భావనాత్మకమైన ఈ మినీ కవిత నేను మర్చిపోలేనిది, బాగా నచ్చినది, వివిధ సందర్భాలలో వేదికలపై ప్రజల చెవులకు విన్పించి చప్పట్లు కొట్టించుకున్నదీనూ.

బహుశా 2002 సం॥ ఒక సంవత్సరం అటూ, ఇటుగా ననుకుంటా అశోక్‌కుమార్ గారితో తొలి పరిచయం. ఆయన వివిధ ప్రక్రియలలో ఉత్తమ సంపుటాలకు ప్రతినెలా అవార్డులిచ్చి ప్రోత్సహిస్తామని 'ఆలోచన' సంస్థ పేరుతో దిన పత్రికలో చూసి నా 'హైౖ!లో' (కవితా సంపుటి) పంపించాను. ఆ తర్వాత ఆయన మా షాపుకి ప్రత్యేకించి వచ్చి కల్సుకోవడం, ఆ తర్వాత 'ఎక్స్‌రే' సంస్థ నెలనెలా వెన్నెల ద్వారా ఆయన్ని పరిచయం చేసే భాగ్యం నాకే దక్కిందని బహిరంగంగా చెప్పుకోడానికి నేనేమాత్రం నిర్మొహమాటపడను, ఇలా ఎందుకంటున్నానంటే -

ఆయనతో నాకు పరిచయం కలగక ముందు, ఇరవై ఏళ్ల క్రితం తూర్పుగోదావరి జిల్లా కాకినాడ ప్రాంతంలో సాహిత్య రంగంలో నిష్ణాతులైన అశోక్ కుమార్, అమిత కృషిచేసిన అశోక్‌కుమార్, హేతువాద ధోరణిలో బాబాలకు, అమ్మలకు.. మూఢభక్తికి వ్యతిరేక ధోరణిలో కవిత్వంరాసి ప్రజలను చైతన్య వంతం చేసేదిశలో కృషిసల్పిన అశోక్‌కుమార్, కొన్ని వ్యక్తిగత కారణాల వలన సాహిత్యరంగానికి దూరమై ఇరవైఅయిదేళ్ల పాటు అజ్ఞాతవాసంలో ఒక సాధారణ వ్యక్తిగా గడపడం విచిత్రం.

ఆ తర్వాత-ఇదిగో-ఇలా విజయవాడలో 'ఆలోచన' పేరుతో సంస్థను స్థాపించి మళ్లీ సాహిత్య రంగానికి కొత్తరూపంలో దర్శనమిచ్చారు. ఎక్స్‌రేతో విజయవాడకు పరిచయమైన అశోక్ కుమార్, ఆ తర్వాత ఎక్స్‌రే ఉపాధ్యక్షులుగా, 'నెలనెలా వెన్నెల' కార్యక్రమంలో ఆ వేదికపై దివంగత సాహిత్య కారుడ్ని ఒకోనెల ఒకో వ్యక్తిని పరిచయం చేస్తూ కొత్తతరానికి సాహిత్యవేత్తలను పరిచయం చేసే బృహత్తర కార్యక్రమాన్ని తన భుజంమీద వేసుకొని సక్రమంగా నెరవేరుస్తూ వస్తున్న విషయం అందరికీ తెల్సినదే.

ఆ తర్వాత ఎన్నికల సమయంలో 'ఈనాడు' దినపత్రిక జిల్లా అనుబంధంలో చురుకైన, పదునైన మినీ కవిత బాణాలతో పాఠకుల హృదయాలలో ఆలోచనా ద్వారాలు తెరిపించారు. సాధారణ పాఠకున్ని సైతం అతి తక్కువ నిడివిగల మూడు, నాలుగు పాదాల మినీ కవితలతో కవిగా ఒక ప్రత్యేక స్థానం విజయవాడ నగర పౌరులలో సంపాదించు కున్నారు అశోక్‌కుమార్.

ఆ తర్వాత 'పొద్దు పూసింది', రాజకీయ 'తంత్రం' 'వ్యూహం', 'గ్లోబలి' తదితర మినీ కవితతో సంపుటాలు వెలువరించి కొత్తతరం పాఠకులను 'మినీ కవిత' వైపు నడిచేలా ప్రవేశించగలిగారు.

'చినుకు' మాస పత్రిక స్థాపనతో 'మినీ కవిత' స్థాయిని నగరం నుంచి రాష్ట్ర వ్యాపితంగా తెలుగు సాహిత్య రంగం నుంచి మినీ కవితలు తెరమరుగవు తున్న దశలో ( రావి రంగారావు అప్పటికి కృషి చేస్తున్నారు) మళ్లీ పునరుజ్జీవదశకు తీసుకొచ్చి విజృంభించేలా తీవ్ర కృషిసల్పారు.

'చినుకు' మాసపత్రికలో (సెంటర్ స్ప్రెడ్‌లో) మధ్య పుటల్లో ప్రత్యేకంగా రెండు పుటలు కేటాయించి అనేక మంది పాత, కొత్త రచయితలు, కవులకు వేదికగా ఆయన నిర్వహించిన తీరు అతి ప్రశంస నీయమైనది.

ఆ తర్వాత 'ప్రజాసాహితి' మాసపత్రికలో 'చినుకు' చివరి పుటలో ( ఒక రచయితని పరిచయం చేస్తూ) క్రింది మినీ కవితలో ఆ కవిని ఆ రచయితని నింపుకున్న అక్షరాలు చాలా వరకు తూటాల్లా పేలినవే.

అశోక్ కుమార్ సాహిత్య జీవితంలో 'చినుకు' ప్రవేశం ఒక టర్నింగ్ పాయింట్‌గా, పాఠకుల మనసులో 'మినీ కవితా సారధి'గా ప్రత్యేకించి గుర్తింపును తెచ్చుకోగా, మరో పెద్ద టర్నింగ్ పాయింట్ ఆయనే స్వయంగా మూడు నెలలకి ఒకటి చొప్పున 'శ్రీశ్రీ బులెటిన్ + శ్రీశ్రీ సాహిత్యాన్ని తీసుకురావటం మరో అతి పెద్ద టర్నింగ్‌పాయింట్. శ్రీశ్రీ అభిమానులందర్నీ ఒక వేదిక మీదకు తీసుకువచ్చి, శ్రీశ్రీ శతజయంతిని అత్యంత ఘనంగా నిర్వహించటంతో కీలకమైన పాత్రను పోషించిన అశోక్ కుమార్ ప్రథమ వరసలో నిలబడతాడనడంలో ఏమాత్రం అసత్యం లేదు. చివరికి 'సాక్షి' దినపత్రిక 'నది' మాసపత్రిక తదితర అనేక పత్రికలు సైతం శ్రీశ్రీ గురించి సమాచారం కోసం అశోక్‌కుమార్ సహాయాన్ని ఆశ్రయించడం ఇక్కడ చెప్పుకోతగ్గ విశేషం. ఈ విధంగా ఆయన స్వంత రచనలను పక్కకునెట్టి సాహిత్య సేవలో మినీ కవితా సౌరభం వెదజల్లడంలో శ్రీశ్రీ సాహిత్యాన్ని భావితరాలకు అందించడంలోనే ఎక్కువ శ్రమని కేటాయిస్తూ నిరంతరం ఆదిశవైపే పరుగులందు కుంటున్న అశోక్ కుమార్ గారికి అప్పుడే షష్టిపూర్తి వయసొచ్చిదంటే ఒకింతఆశ్చర్యం, ఈ వయస్సులో కూడా ఇంత ఉత్సాహంగా ఉరకలు వేస్తూ బృహత్తర మైన సాహిత్య కృషి సల్పుతున్నారంటే ఒకవిధమైన స్ఫూర్తిని కలిగించే ఆనందం కలగకమానదు.

ఈ సందర్భంగా ఒక కవి మిత్రుడు నన్ను ఉద్దేశించి గతంలో నాతో అన్నమాట ఇప్పుడు గుర్తొస్తున్నది - 'సంస్థ ద్వారా ఇంత కృషి చేస్తూ నీ సమ యాన్ని వృధా చేసుకునే కంటే - ఆ కృషి ఏదో నువ్వు రాసే రచనల్లో చేస్తే నీకెంతో పేరొస్తుంది. వాళ్లవి వాళ్లవి నీ భుజానికెందుకు ఎత్తుకుంటావ్ అని' ఆ మాటలు అశోక్‌కుమార్‌కీ వర్తిస్తాయి.. కానీ -

**'స్వంత లాభం కొంత మానుకొని**
**పొరుగువాడికి సాయపడవోయ్' -**

అనే గురజాడవారి కవితాపదాల్లోని మాటల్ని నిజంచేసే.. ఇలాంటి 'కొంతమంది స్వార్థాన్ని వదలి, పతనమవుతున్న నేటి సాహితీత విలువల్ని పరిరక్షించవలసిన అరుదైన వ్యక్తులుగా ముందు నిలుచుండాల్సిందే. ■

## అక్షర హాలికులు

అశోక్‌కుమార్



## పురాణం సుబ్రహ్మణ్య శర్మ

(1924-1996)



## పురాణం ముచ్చట్లు

సుబ్రమణ్యం పురాణం
సారస్వత మాగాణం
కొత్తకొత్త ప్రయోగాల
సంపాదక జయగానం



## అస్తమించే సూర్యుడు

చీకటి ఎన్‌కౌంటర్లో
గాయపడ్డ వీరుడు



# సింగంపల్లి అశోక్ కుమార్ షష్టిపూర్తి

**నిర్మలానంద**

అశోక్ కుమార్ తన సాహిత్య జీవితంలో రెండు కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు. ఒకటి 'చినుకు' పత్రికకి ఫీచర్ ఎడిటర్‌గా వుంటూ,ఆ పత్రికని బరువుగా నిండుగా తీసుకురావడానికి అహర్నిశలూ కృషి సల్పడం.'చినుకు'లో ప్రత్యేకం 'కవిత'కి ఒక పూర్తిపేజీ కేటాయించి, నాలుగు పాదాల కవితల్ని ప్రచురిస్తూ వుండటం.అందులో నెలనెలా విధిగా తన కవిత కూడా వుండటం విశేషం. ఇది చినుకు' పత్రిక విషయం.

ఇదే కాకుండా మహాకవిశ్రీశ్రీ(1910-2010)గురించి బులెటిన్స్ ప్రచురిస్తూ రావటం ఒక ప్రత్యేక కార్యక్రమం. ఇప్పటికి 11 బులెటిన్లతోపాటుగా 'శ్రీశ్రీ-100 (1910-2010)' 'శ్రీశ్రీ శతజయంతి విశేషసంచిక' (ఏప్రిల్- 2010)ని 100 మంది వివిధ రచయితల రచనలతో, పేజీల అడుగు భాగంలో తెలుగు అతి ప్రాచీన / తనతరం సాహిత్యవేత్తలు శ్రీశ్రీపై చెప్పిన అభిప్రాయాల్ని ఉటంకిస్తూ శ్రీశ్రీ శతజయంతి/ఇచ్ఛిరుల /ప్రత్యేక సంచికలో నేనిలా రాయబోయేది అప్రస్తుతం కాదనుకుంటే, నావీ నాలుగు మాటలు. అనకాపల్లి మునిసిపాలిటీ ఉద్యోగానికి రాజీనామా (1957 ఫిబ్రవరి-16) చేసేసి, ఝూర్సుగూడా వెళ్లి, రైల్వే ఉద్యోగంలో చేరాను. తెలుగు సాహిత్యాన్ని హిందీలోకి తర్జుమాచేసి, హిందీవారిని పరిచయం చేయాలన్న తపనతో అనువాదాలు ప్రారంభించాను. దానికి నా రైల్వేమిత్రుడు, భోజపురి కథకుడు కామతాప్రసాద్ ఓఝా 'దివ్యసహకారంఅందించాడు. హైదరా బాద్ నుంచి డా॥భీమ్‌సేన్ 'నిర్మల్' సాహిత్య సూచనల్ని తరచూ ఇస్తూ వుండేవారు. 1970 విశాఖపట్నంలో మహాకవి శ్రీశ్రీ షష్టి పూర్తిగా జరుగనుంది. దానికోసం శ్రీశ్రీ కవితలు ఐదు ఎంపికచేసి, హిందీ లోకి తర్జుమాచేయాలనే ఆలోచన నాకు డా॥ నిర్మల్‌కీ కల్గింది. ఫలితంగాహిందీల్లో 'ఆగ్ ఉగల్‌తా హువా/ స్మాన్‌కీ ఓర్ ఖఢ్‌తా హువా' పుస్తకం పూర్తి అయింది. శీలావీర్రాజుగారు వేసిన ముఖచిత్రం+ అక్షరాలం కరణతో పుస్తకం అచ్చయింది. నేను ఆ పుస్తకాన్ని విశాఖపట్నంకి తీసుకెళ్లాను. దాన్ని సభలో మహాకవి శ్రీశ్రీకి సమర్పించాలి. ముప్పయ్ ఐదేళ్లవాణ్ని. వణుకు పుట్టుకుంది. చాలా కాలం నుంచి కాళోజీ నారా యణరావుగారు నాకు తెలుసు. కాళన్నయ్యకి చెప్పాను. 'ఆ హిందీ పుస్తకం గురించీ, నా గురించీ నాలుగగు ముక్కలు చెప్పమని. ఆయన సరేనన్నారు. మహాకవి శ్రీశ్రీకి సభలో ఒక శాలువాకప్పి, హిందీ పుస్తకాన్ని సమర్పించేను. కాళన్నయ్య ఆ హిందీ పుస్తకం గురించి, నాగురించీ చెప్పారు శ్రీశ్రీకి. అలా ముగిసింది నా పుస్తక సమర్పణ మహాకవికి.

ఈ విషయం తెలిసిన తర్వాత సింగంపల్లి అశోక్ కుమార్‌కి నాపై గౌరవం పెరిగింది. ఆయనకి పుస్తకం ఇచ్చేను కూడా. అశోక్ కుమార్ నా షష్టిపూర్తికి 'వార్త'లో తెలుగులో వ్యాసం రాసి, ప్రకటించేశారు.

ఆ వ్యాసానికి శీర్షిక 'అనువాద సుగంధం/అది నిర్మలానందం' అని పెట్టారు.

ఇహప్రస్తుతానికి వస్తాను. 'శ్రీశ్రీ సాహిత్య నిధి' కన్వీనర్‌గా అశోక్ కుమార్ ఈ ప్రత్యేక సంచిక (శ్రీశ్రీ శతజయంతి విశేష సంచిక)ను అపూర్వంగా, పదికాలాలపాటు దాచుకొనే విధంగా రూపొందించారు. ఇది అశోక్‌కుమార్ తెలుగు'వాడి'కి ఇచ్చిన కానుక.

సింగంపల్లి అశోక్ కుమార్‌కి 'షష్టిపూర్తి'అని 'చినుకు'సంపాదకులు రాజ గోపాల్‌గారు నాకు టెలిఫోన్‌లో చెప్పారు. అశోక్‌కుమార్ 'షష్టిపూర్తే' కాదు నిండు నూరేళ్లపాటు ఆరోగ్యంగా వుంటూ శక్తివంచనలేకుండా సాహిత్య సేవ చేస్తూ వుండాలని మనసారా ఆకాంక్షిస్తున్నాను. సాహిత్యాభినందనలతో......■



**ఎర్రజెండా**

దేశంమీద మెరిస్తే / ఆ పోరు గడ్డకు / చావు లేదని !
దేహంమీద పరిస్తే / ఆ వీర బిడ్డడు / చావలేదని



# 'శ్రీశ్రీ నిధి అశోక్ కుమార్'

వరవరరావు

**'శ్రీశ్రీ విగ్రహాన్ని మనం యారాడకొండమీద పెట్టాలి. మన ప్రభుత్వం వచ్చాక మనం ఆ పనిచేద్దాంగానీ, ఆయన మన శిబిరంలోనే కన్ను మూయాలి. ఆయనభౌతిక కాయాన్ని ఎర్రజెండాతో 'మహాప్రస్థానం'తో కప్పాలి, అన్నాడు శివసాగర్ మాచర్ల విరసం మహాసభల (1982)కు ముందు 81లో గుంటూరులో నేను, చలసాని ప్రసాద్ కలిసినపుడు. ఇరవై సూత్రాలను బలపరిచినందుకు, ఎమర్జెన్సీని లెఫ్ట్ డిక్టేటర్‌షిప్ అన్నందుకు విరసం శ్రీశ్రీని అధ్యక్ష పదవి నుంచి సస్పెండ్ చేసింది. ఎమర్జెన్సీ ఎత్తివేసిన తర్వాత బెజవాడలో జరిగిన సర్వసభ్య సమావేశంలో ఆయన 'తనకు భారత రాష్ట్రపతి పదవి కన్నా విరసం సాధారణ సభ్యత్వమైనా గర్వకారణమని' క్షమాపణలు చెప్తూ సాధారణ సభ్యునిగా విరసంలోకి తీసుకోవాలని అభ్యర్థించాడు. అంతదాక బయటమెట్లమీద నిరీక్షింపచేసి విరసం ఆయన పశ్చాత్తాపాన్ని గ్రహించి మళ్లీ సభ్యత్వాన్ని ఇచ్చింది. 'విరసం నా శాశ్వత చిరునామా' అంటూ ఆయన 1983 జూన్15 దాకా విరసంలో కొనసాగి మద్రాసులో కన్నుమూశాడు. విరసం ఆయనపై ఎర్రజెండా, 'మహాప్రస్థానం' పుస్తకాలు పరచి, 'మహాప్రస్థానం' గీతాలు చదువుతూ సాగనంపింది.**

ఇటీవల పాబ్లో నెరూడా శతజయంతిని ప్రపంచమంతా జరుపుకుంది. నక్షత్రాలకు ఆయన పేరుపెట్టారు. కొండశిఖరాలకు ఆయన పేరుపెట్టారు. ఆయన సాహిత్యం, ఆయనపై పునర్మూల్యాంకన సాహిత్యం సరేసరి– పుష్కలంగా ప్రపంచవ్యాప్తంగా వచ్చింది. పునర్మూల్యాంకనంలో ఆయనలోని బలహీనతలు, ఆయనలోని లోపాల చర్చకూడా జరిగింది.

# అక్షర హాలికులు

**అశోక్‌కుమార్**



## చెరబండరాజు

**(1944-1982)**



## 'అగ్ని పుత్రుడు'

చెరబండరాజు గానం
సమరశీల తెలంగాణం
అసమాన 'తలలు' తీసే
శ్రమవాద మార్క్సు బాణం

ఇటీవల శ్రీశ్రీశతజయంతికూడా ప్రపంచ మంతా తెలుగుప్రజలుజరుపుకున్నారు. స్వీడన్‌లో జాన్ మిర్డాల్‌వంటివాళ్లు, ఇండియాలో అన్ని భార తీయభాషలవాళ్లు జరుపుకున్నారు. హిందీలో పాట్నానుంచి నూరుపేజీల శ్రీశ్రీ కవితాసంకల నాన్ని రాణాప్రతాప్ నిర్మలానంద సహాయంతో వెలువరిస్తున్నాడువిరసంఎక్కడా ఆయనవిగ్రహాలు పెట్టలేదు. ఖమ్మంలో, విజయవాడలో ఆయన సాహిత్యాభిమానులు విగ్రహాలు పెట్టారు.

విరసంతో సహా ఆయన సాహిత్యాభిమానులు ఆయనను పునర్మూల్యాంకనం చేశారు. సాహిత్యాన్నే కాదు, వ్యక్తిత్వాన్ని కూడా. తెలంగాణా రైతాంగ సాయుధపోరాటాన్ని బలపరుస్తూ ఆయన రాయ లేదన్నది అర్ధసత్యమన్నారు. హరీంద్రనాథ చటో పాధ్యాయ తెలంగాణపై దీర్ఘ కవితను మొదట స్వతంత్రంగా సంక్షిప్తంగా అనువదించింది ఆయనే. 'త్వమేవాహమ్' చదివి ఆరుద్రతోనే కాదు, ఆ కావ్యంలోని వస్తువు 'తెలంగాణ'తో కూడా అంతగా 'త్వమేవాహమ్' అని నేనింక కవిత్వం రాయనక్కర్లేదన్నది కూడా ఆయనే.

1953 అలంపురం తెలంగాణ రచయితల సంఘం మహాసభల్లో కాళోజీ 'నాగొడవ' ఆవిష్కరించి కాళోజీని 'అఖిలాంధ్ర కవి' అంటూ కాళోజీ లూయీ ఆరగాన్ వంటివాడు, యుద్ధ రంగంనుంచి కవులం దరూ పారిపోయినపుడు నిలిచిపోరాడిన యోధు డన్నాడు. 1969లో, 72లో ప్రత్యేక తెలంగాణను వ్యతిరేకించింది ఆయనే. అపుడు దాశరథి, నారా యణరెడ్డిలు కూడా వ్యతిరేకించారు.

తానా అభిప్రాయం ఉంచుకుంటూనే 1973 తెనాలి విరసం సర్వసభ్య సమావేశం తర్వాత ఆయన విరసంలో మెజారిటీ తీర్మానించిన ప్రత్యేక తెలంగాణ – ఆంధ్ర ఉద్యమ సమర్ధనతో కొనసాగాడు..

ఇపుడు ట్యాంకుబండుమీద శ్రీశ్రీవిగ్రహాన్ని తొల గించాలన్న తెలంగాణసాహిత్యతరం వచ్చింది. శ్రీశ్రీ కవిత్వంతో కళ్లు తెరచిన తరం, శ్రీశ్రీ కవిత్వంతో ముప్పైల నుంచి కమ్యూనిస్టులయినతరం ఒకటయితే డెబ్బైలనుంచి నక్సలైట్లతరం నుంచే ఈ గొంతు వినిపిస్తున్నది.

ఈ గొంతుకు 70లు విగ్రహ విధ్వంసం నేర్పిన మాట నిజమే. 'మహాత్ముడు' అనుకున్న వ్యక్తి విగ్రహం విధ్వంసన చేసిన తరంలోంచి 'మహాకవి' అనుకున్న శక్తి విగ్రహం విధ్వంసం చేయాలన్న తరం రావడాన్ని కూడా అర్థం చేసుకోవాలేమో ...

కాని శ్రీశ్రీ వీరాభిమానులు ఎట్లా స్పందిస్తారో..

చలసాని ప్రసాద్ ఎట్లా స్పందించాడు–శ్రీశ్రీ విగ్రహంతొలగించనక్కర్లేదు. పక్కనే కాళోజీ, దాశరథి, సుద్దాల హనుమంతు విగ్రహాలు పెట్టాలన్నాడు. ఈ వాదవివాదాలు కొమురంభీం విగ్రహం పెట్టడం గురించి వచ్చాయి గనుక అల్లూరి సీతారామరాజు విగ్రహంపక్కనే కొమురంభీం విగ్రహం పెట్టాలన్నాడు.

అసలు విగ్రహాలు పెట్టాలా? విగ్రహారాధన మానేసి విలువలను వాళ్ల పోరాటమార్గాన్ని ఆవిష్కరిం చాలా అనేది వేరే చర్చ. ఈ సందర్భంలో అశోక్‌కుమార్ ఎట్లా స్పందించి ఉంటాడన్నది నాకు ప్రస్తుతమైన ఆసక్తిదాయకమైన, కుతూహలాన్ని కలిగించే విషయం.

నిధి చాలసుఖమా, రాముడి సన్నిధి చాల సుఖమా అని త్యాగరాజును అడగక్కర్లేదు. ఆయన జవాబు మనకు తెలుసు. అశోక్‌కుమార్‌కు శ్రీశ్రీ నిధి, పెన్నిధి కూడా.

2008 విరసం మహాసభలకు అశోక్‌కుమార్ బెజవాడ నుంచి గుంటూరుకు చాలా ఉత్సాహంగా వచ్చాడు. సభలింకా ప్రారంభం కాకముందే ఆవరణ అంతా కలియతిరిగాం. సభలు జరిగే హాలులో రాసి పెట్టిన కవితాచరణాలు అన్నీ ఆయన ఆసక్తిగా శ్రద్ధగా చదివాడు.

ఎంత ఉల్లాసంగా, ఉత్సాహంగా కలుసు కున్నామో అంతలోనే ఉగ్రుడయ్యాడు. అసలే వెడల్పాటి మొహం..కళ్లు. మరింత ఎర్రగా కలసి పోయి కళ్ల జ్వాలాశ్రువులు రాలుస్తున్నవి. సభాప్రాంగణంలో శ్రీశ్రీ కవితాచరణం ఒక్కటీలేదు. విరసంకు, అందులోనూ గుంటూరు విరసం యూనిట్‌కు, ఆలూరి భుజంగరావు మొదలు, సివిఆర్, రుక్మిణి, సంగ్రామ్‌ల వరకు శ్రీశ్రీపట్ల ఉన్న గౌరవాభిమానాలు, ప్రేమ తెలిసినవారికి ఇది వివరించలేని, సంజాయిషీ చెప్పుకోలేని లోపమే.

అంతే తిరిగిచూసే వరకు అశోక్‌కుమార్ కని పించలేదు. సభలింకా ప్రారంభంకాలేదు. శ్రీశ్రీ కవితా చరణాలు కనిపించనిసభలో, అది ఏ సందర్భం అయినా కావచ్చు(భూమి–సంస్కృతి–నాగరికతపై ఆ రెండురోజుల సభలు కేంద్రీకరించాయి)అశోక్‌కుమార్ కు 'కుచ్ లేనా దేనా నహీ హై'. ఇటు కొట్టిన బంతి అంతే వేగంగా అటుపోయినట్లుగా తిరుగు ప్రయాణం కట్టాడు బెజవాడకు.

ఇంకొక శ్రీశ్రీ విశ్వేశ్వరరావు (శ్రీశ్రీ ప్రింటర్స్) 'సాహితీ మిత్రులు' తరఫున తెస్తున్న 'కవితావార్షిక' ఆవిష్కరించడానికి 2006 మేడే రోజు బ్లేజ్‌వాడకు వెళ్లాను. నా వరకు అక్కడ అశోక్‌కుమార్ పునరా విష్కరణ జరిగింది. నేను పోల్చుకోనేలేదు. సమత కోటేశ్వరరావు కాకినాడ విరసం రోజులు, విరసం అశోక్‌కుమార్‌ను గుర్తుచేశాడు. అప్పటికే అశోక్ కుమార్ శ్రీశ్రీ కస్టోడియన్ అయ్యాడు. అప్పటినుంచీ శ్రీశ్రీ మమ్మల్ని కలుపుతున్నాడు. అది కవితావార్షిక ఆవిష్కరణ సభ కావచ్చు–గ్రీన్‌హంట్ ఆపరేషన్ వ్యతిరేక సభ కావచ్చు –పోలవరం ప్రాజెక్టు వ్యతిరేక సభ కావచ్చు – సమత కోటేశ్వరరావు లేదా ద్రోణవల్లి అనసూయమ్మ ఇంట్లో కావచ్చు– అశోక్‌కుమార్ కలిసేది మాత్రం శ్రీశ్రీ గురించి. కేవలం శ్రీశ్రీగురించి. నాకేమో శ్రీశ్రీ మీద కన్నా

శ్రీశ్రీ కలగన్న విశాల ప్రపంచం మీద ఆసక్తి. శ్రీశ్రీ 'ప్రపంచంబాధ తన బాధగా కలవరించి, పలవరించి జాతిజనుల పెనునిద్దుర వదిలించి కదిలించి మరో ప్రపంచంలోకి నడిపించినవాడు కదా .

అశోక్ కుమార్ అటువంటి ప్రపంచంనుంచి, ప్రపంచంగురించే విరసంలో ప్రవేశించాడు. 1972–73 అద్దేపల్లి రామమోహనరావు నాయకత్వంలో ఏర్పడిన క్రాంతిరచయితల సంఘం నక్సల్బరీ, శ్రీకాకుళ రైతాంగ క్రాంతి కాంతిలో ఏర్పడిన విరసంలోకి కాకినాడను విశాఖపట్నంతో కలిపిన సముద్రంలోకి గోదావరి ప్రవహించినట్లుగా విలీనమైంది. అందులోని ఒక క్రాంతికిరణం అశోక్‌కుమార్.

నేను తెలుగునేలమీద చూసిన ఆఖరి జిల్లా కేంద్రం కాకినాడ. 1992 వరకు కూడా ప్రత్యక్షంగా చూడలేదు. కాని బుద్ధి తెలిసిన దగ్గరనుంచీ 1960ల నుంచీ వింటూనే వున్నాను. ఇంగ్లీషు వాళ్ల కాలంలో ఓడరేవుగా సరేసరి. 'ఎవటికి పోతావీ రాత్రి' కవితా సంకలనం వెలువరించిన వజీర్‌రహ్మాన్ స్నేహంలో. ఆయనప్పటికే కాకినాడ వదిలేసి అరుణా చలానికి, మద్రాసుకీ మధ్యన చలం, చంపకల స్నేహంలో, ప్రేమలోతిరుగుతూ నాకు చలం అభిమానిగా స్నేహితుడయ్యాడు.

ఎచటికి పోతావీ రాత్రి ? ఆవలి తీరానికి–

కాకినాడ సముద్రానికి ఆవలి తీరం ఇక్కడి ప్రజల శ్రమశక్తిని సరకుగా కొల్లగొట్టుకొనిపోయే ఆంగ్లదేశమా, శ్రీశ్రీ విశాఖపట్టణం లైట్‌హౌస్ వలె చూపుతున్న మరో ప్రపంచమా, ఈ రెంటికీ మధ్య యుద్ధమా ?

శ్రీశ్రీ కాకినాడలో తన కళ్లద్దాలు, కెమేరా పోగొట్టుకున్నాడు – రష్యా నుంచి తెచ్చుకున్న కెమెరా. నా చూపు పోగొట్టుకున్నానన్నాడు.

కానీ శ్రీశ్రీకి కాకినాడకు మళ్లీ చూపునిచ్చింది శ్రీకాకుళం. ఈ శ్రీకాకుళోద్యమప్రభావంలో కెరటంగా ఎగిసిన కాకినాడను నాకు మళ్లీ పరిచయం చేసిన వాడు శ్యాంసుందర్.

నాకు పరిచయమయ్యేనాటికే దిగంబర కవులను కాకినాడకు తీసుకుపోయి అపూర్వమైన సభ నిర్వహించి జ్వాలాముఖికి ఆప్తమిత్రుడయ్యాడు. 1966 నుంచే కాకినాడకు 'సృజన' పత్రికలు తెప్పించేవాడు. అద్దేపల్లి రామమోహనరావుకు కూడా సృజనాను బంధమే.

కాకినాడ, రాజమండ్రిలలో దృఢమైన విప్లవ వాతావరణం ఏర్పడడం ఆశ్చర్యంకాదు. అల్లూరి సీతారామరాజు తొలి విప్లవం నిర్మించిన ఆదివాసీ ఏజెన్సీ ప్రాంతమిది. వరంగల్‌లో కాకతీయ వైద్య కళాశాల నుంచి విప్లవ భావజాలాన్ని తీసుకపోయిన డాక్టర్ కాటా నారాయణరావు, శ్రీశ్రీ షష్టిపూర్తి సభల నుంచి విశాఖ విద్యార్థుల సవాల్‌ను స్వీకరించిన స్మైల్ రాజమండ్రి, కాకినాడలలో ఆనాడు కొత్త విప్లవ కెరటాలు. కమ్యూనిస్టుపార్టీ నుంచి నడచివచ్చి, అలసిపోయి కాడి ఎత్తివేసిన వాళ్లనుంచి విడిపోయి శ్రీకాకుళ స్ఫూర్తి పొందిన 'ప్రజాసమస్యలు' ఏలూరి సూర్యారావు రాజమండ్రిలో, ఎన్జీవో శ్యాంసుందర్ కాకినాడలో విప్లవ సాంస్కృతిక వాతావరణాన్ని ప్రోది చేస్తున్నారు.

'తల్లీ ఎవరు నువ్వు?' అని విప్లవహేతువాదం నుంచి గొంతు విప్పాడు అశోక్‌కుమార్. అశోక్ కుమార్ ఎమర్జెన్సీకి ముందు రాసిన కవితలన్నీ మతంపైన దాడులే. హేతువాదం నుంచి, మార్క్సిస్టు హేతువాదంనుంచి, దిగంబరకవితావేశంతో చేసిన దాడులే. సి.విజయలక్ష్మి, దిగంబరకవులు ఏక కాలంలో ఆవహించి అమ్మలను, బాబాలను కడిగేసే కవిత్వమే కనీసం నాకు తెలిసి నాలుగు సంపుటాలు. 'తల్లీ! ఎవరు నువ్వు'?,'శ్రీబాబామహత్యం', 'బాల యోగీశ్వరసందర్శనం', 'మతప్రస్థానం' ఇవన్నీ కాకినాడలో విరసంలో వుండగా అశోక్‌కుమార్ చేసిన ఉద్ధతమైన, ఉధృతమైన కవిత్వదాడులు. ఇవ్వాళ హిందుత్వంమీద మళ్లీ అవసరమైన దాడులు. ఇవ్వాళ జిల్లెళ్లమూడి అమ్మలు, తెలుగుబాబాలు, బాలయోగీశ్వరులు, అయోధ్యరామలల్లా ముందర, రాందేవ్ బాబాముందర, శివసేన ముందర, భజరంగదళ్, విశ్వహిందూ పరిషత్ హిందువాహిని వంటి ఫాసిస్టు హిందూత్వ సంఘ పరివార్ ముందర వెలవెల పోవచ్చు. కాని,ఒక్కసారి 1970లలో రీజినల్ ఇంజనీరింగ్ కాలేజి,కాకతీయ మెడికల్‌కాలేజి, వరంగల్‌లో అటు ఎబివిపి విద్యార్థులకు, ఇటు విప్లవ విద్యార్థులకు (విప్లవ విద్యార్థి సంఘాలు అప్పటింకా ఏమీ ఏర్పడలేదు) జరిగిన కరపత్రాలు, ఉద్యమాలు, భౌతిక ఘర్షణలు కూడా గుర్తుచేసుకుంటే– అది కూడా ఒక వర్గ పోరాటమే. మతవర్గతత్వపోరాటంగా 85 జనవరి విరసం గద్వాల సాహిత్య పాఠశాల నిర్వహించింది దానినే. ఆవిద్యార్థులు ఒకవైపు ఎబివిపిలో మోహరించినవాళ్లు–తెలంగాణా భూస్వామ్య అగ్ర వర్ణ నేపథ్యం నుంచి, వాణిజ్య నేపధ్యంనుంచి వచ్చిన వాళ్లు. ఇటు విప్లవ విద్యార్థుల్లో ఆరంభంలో చైతన్యం నుంచి వచ్చిన వాళ్లు ఎక్కువ. ఎమర్జెన్సీ తర్వాత 80లలోనైతే తెలంగాణ దళిత వ్యవసాయ కూలీ కుటుంబాల నుంచి వచ్చిన వాళ్లు ఎక్కువ.

అశోక్‌కుమార్ 'తల్లీ ఎవరు నువ్వు?' రాసిన రోజుల్లోనే మా వరంగల్‌కు జిల్లెళ్లమూడి అమ్మ వచ్చింది. 'ఎవరీ అమ్మ?' అని మేం కరపత్రాలు వేసి విస్తృతంగా పంచాం. ఆమె ఒక వణిక్ప్రముఖుని ఇంట్లోదిగి ఒక ఉదయం స్నానం చేస్తుంటే ఆ స్నానోదకాలతో శిరస్సులు పవిత్రం చేసుకోవాలని వరంగల్ చౌరస్తాలో క్యూ కట్టిన వాళ్లలో ఉన్నత పోలీస్ అధికారులు, రాజకీయ నాయకులు, వ్యాపారస్తులు వుండడం–వాళ్లు మాపై పోలీసులతో దాడి చేయించి కరపత్రాలు గుంజుకున్న వైనం మళ్లీ ఇవ్వాళ అశోక్ కుమార్ హేతువాద దీర్ఘకవిత చదివితే కళ్లకు కట్టి వీళ్లంతా ఏ వర్గ ప్రయోజనాలను మోస్తున్నారో –

## అక్షర హోలికులు

అశోక్‌కుమార్



## డా॥ జి మిత్రా

(1930 - 2007)



# అక్షర హాలికులు

అశోక్‌కుమార్



# త్రిపురనేని మధుసూదన రావు

(1937 - 2004)



## తిరుపతి మావో

ఆలోచనలు విశిష్టం
చెప్పేది అతిస్పష్టం
సాహిత్య శరామర్శల
సంధానం ఉత్కృష్టం

మాలెగావ్, మక్కా మసీదు పేలుళ్ల దాకా వీళ్లు ఎంత దూరం ప్రయాణంచేసి వచ్చారో తెలిసివచ్చింది.

'మతములన్నియు మాసిపోవును, జ్ఞానమొక్కటె నిలిచిపోవును' అని గురజాడ చెప్పాడు. మతాలకు ఎన్నడయినా అవి పుట్టిననాడయినా ఏవైనా ప్రగతిశీల స్వభావమున్నదా అని ప్రశ్నించుకున్నప్పుడు తన మౌలిక గ్రంథాలలో మూలప్రవక్తలు చెప్పిన దానిలోనే అసమానతను, హింసను చెప్పిన హిందూ మతం మాత్రం ఎన్నడూ హింస విద్వేషాలను ప్రేరే పించిందే గాని జ్ఞానాన్ని, ప్రేమను పంచింది లేదని స్పష్టంగా చెప్పవచ్చు. ఈ విషయంమీద ఈ కాల మంతా అశోక్ కుమార్ దీర్ఘ కవితలు రాశాడు.

ఎమర్జెన్సీ కన్నా ముందు క్రాంతి రచయితల సంఘం విరసంలోచేరి కాకినాడలో, తూర్పు గోదావరి జిల్లాలో చాలా క్రియాశీలంగా పనిచేసింది. చిత్రంగా అద్దేపల్లి రామమోహనరావు తప్ప యువకులంతా విరసంలోకి వచ్చారు. వాళ్లలో రచయితగాను, ఎక్కువ నిర్బంధాలు,చిత్రహింసలు అనుభవించినవాడిగాను, విరసంలో ప్రముఖ వ్యక్తిగాను కాకినాడనుంచి పేర్కొన దగినవాడు రారాసి. అశోక్ కుమార్, హైమ వంటి ఇతర సభ్యులు ఉత్సాహంగా విరసం కార్యకలాపాల్లో పాల్గొనేవారు.

1974 మే 20న విప్లవ రచయితల సంఘం ఆరుగురు సభ్యుల మీద ప్రభుత్వం కుట్రకేసు బనాయించినపుడు కాకినాడ యూనిట్ 6-6-74న అరెస్ట్‌ల నిరసన సంచిక- కుట్ర..కుట్ర... కుట్ర".... వెలువరించింది. 'కదలి తరగలనాపగలవా ఛడవా కాన్యూట్' అన్న శ్రీశ్రీమాటలు పతాక మార్చింగ్ చరణాలుగా ఉన్నాయని వేరే చెప్పక్కర్లేదు. అందులో విప్లవ రచయితల సంఘం శీర్షికతో అశోక్‌కుమార్ సుదీర్ఘమైన సెంటర్ స్ప్రెడ్ కవిత రాశారు. (ఆ కవితను ఈ సంచికలో పునర్ముద్రించాలన్నది నా విన్నపం)

ఈ కాలంలోనే అశోక్ కుమార్ 'సృజన', 'పిలుపు', 'ఎరుపు'లలోకూడా రచనలు చేశాడు. 1977లో ఎమర్జెన్సీ ఎత్తివేసిన తరువాత విజయ వాడలో జరిగిన విరసం సర్వసభ్య సమావేశానికి, శ్రీశ్రీ విరసంలోకి సాధారణ సభ్యుడిగా ప్రవేశించిన అసాధారణ సమావేశానికి, అశోక్‌కుమార్ వచ్చాడట కానీ నాకపు దున్న బెయిలు షరతులవల్ల నేను ఆ చారిత్రక సమా వేశానికి వెళ్లలేక పోయాను. బహుశా అది ఆయన విజయవాడకు మారినకాలం.

ఏమైనా మళ్లీ ముప్పైఏళ్ల తర్వాతనే అశోక్ కుమార్‌తో నిత్యానుబంధం. ఇపుడింకా ఆయన నిధి శ్రీశ్రీ. సామ్రాజ్యవాద వ్యతిరేక భావజాలం ఆవ హించిన కాలం అని చెప్పవచ్చు. 2007లో శ్రీశ్రీనిధి ఏర్పాటుచేసి రెగ్యులర్‌గా శ్రీశ్రీ బులెటిన్లు తెస్తూ, శ్రీశ్రీ వివిధ రచనాప్రక్రియలనే కాదు, వివిధ అంశాలపై రాసిన రచనలను ఒక చోట తెస్తూ, ఆయన కెవి రమణారెడ్డి, చలసాని ప్రసాద్‌లు చేసిన పనినే రిపీట్ చేయడం కాకుండా వైవిధ్యంతో శ్రీశ్రీని ఈతరం పాఠకులకు అందిస్తున్నాడు. కెవి రమణారెడ్డి, చలసాని సంపాదకత్వంలో వచ్చిన సంపుటాలలో వ్యాఖ్యానాలు, వివరణలు, టీకాటిప్పణులు, ఫుట్‌నోట్స్ వలె బరువుగా కాకుండా శ్రీశ్రీవే సులభమైన, సూటియైన పద్ధతిలో మనముందుం చుతున్నాడు. ఉదాహరణకు కొంపెల్ల జనార్దనరావు మీద శ్రీశ్రీ ఎక్కడెక్కడ చెప్పాడు, ఏం చెప్పాడు. పౌరహక్కుల ఉద్యమంలో ఎక్కడెక్కడ పాల్గొన్నాడు, ఏంచేశాడు, ఏం మాట్లాడాడు-ఒకచోట అశోక్ కుమార్ వ్యాఖ్యా నంతో కాకుండా శ్రీశ్రీగానే శ్రీశ్రీ దృక్పథాన్ని చదువుకుంటాం. ఆరంభంలోనో ఆఖర్నో శ్రీశ్రీ పట్ల అశోక్ కుమార్ ఆరాధనా రచన వుంటుందనుకోండి. శ్రీశ్రీనిధిపక్కన, శ్రీశ్రీ సాహిత్యం పక్కన శ్రీశ్రీ గురించి రాసిన వాళ్లను కూడా అంత పెద్దపెద్ద అక్షరాలతో అట్ట నిండా ఫొటోలతో ఇవ్వడం నాకు మాత్రం బాగుండలేదు. వాళ్ల గురించి (నాతో సహా) ఆయన రాసే రాతలు అంచనా స్థాయినే కాదు, ప్రశంసా స్థాయిని కూడా మించి వుంటాయి.

1991 నూతన ఆర్థికవిధానంవల్ల అశోక్ కుమార్ చాలా ఉదారవాది అయ్యాడా అనిపిస్తుంది. ఆ సాహిత్యాన్ని చూస్తుంటే ముఖ్యంగా ప్రశంసలు. కానీ ఆయన ఉదారీకరణ ఆర్థికవిధానాలకు బద్ధ వ్యతిరేకి అనేది ఆయన 'వ్యూహం' (జులై- 2006, 'గ్లోబలి' నవంబర్ 2007) మినీ కవితల్లో ఏ ఒక్క మెతుకుపట్టి చూసినా నిస్సందేహంగా చెప్ప వచ్చు.

ఈ రెండవ దశలో అశోక్‌కుమార్ ప్రధా నంగా మినీ కవితా రూపాన్ని ఎంచుకున్నాడు. బహుశా శ్రీశ్రీనిధి (రచనల) సేకరణలో తీరికలేక ఆయన దీర్ఘ కవితలు రాయడం లేదనుకుంటాను.

రెండుదశల్లోనూ అశోక్‌కుమార్ కార్యనిర్వా హకకవి. తొలిదశలో కాకినాడలో హేతువాద, విప్లవ సాంస్కృతిక కార్యనిర్వాహక కవి. పలుకు, సమర్థత, స్పష్టత, సూటిదనంవున్న కవి. రెండు దశల్లోనూ కాకినాడవంటి అప్పటి స్లీపింగ్ టౌన్‌లో ఆవేశానికి, ఆలోచనకు కావలసినంత వ్యవధి వుండి దీర్ఘకవితలు రాశాడు. హేతువాద విప్లవ ఉద్యమాల బాధ్యతలు మోశాడు. ఇపుడు విజయవాడలో నగర బిజీలో, తన బిజీలో శ్రీశ్రీని రెండు భుజాల మీదా మోస్తూ, శ్రీశ్రీ ఏ 33-45 మధ్య కాలపు ఫాసిజాన్ని ఓడించి, సామ్యవాద శక్తులను గెలిపించిన విప్లవం గురించి రాశాడో, ఆ ప్రమాదం మళ్లీ ముంచుకొచ్చిన తరు ణంలో ఆ ఆర్థికమాంద్యం గురించి, ఆ సామ్రాజ్య వాద ప్రపంచీకరణ గురించి తన బిజీలోనే తీరిక చేసుకొని మినీ కవితలు రాస్తున్నాడు.

శ్రీశ్రీ పనిచేస్తూనే 'ప్రపంచబాధ తనబాధగా పలికించిన' శ్రీశ్రీ బాధను మోస్తూ, పంచుతూ

రాస్తున్న అశోక్‌కుమార్‌కు అభినందనలు...

( ఇది ఈ వ్యాసంలో వరవరరావుగారు కోరిన విరసం కాకినాడ యూనిట్ ప్రచురణ 'కుట్ర' బులెటిన్ (6-6-74)లో అశోక్‌కుమార్ రాసిన కవిత)

## విప్లవ రచయితల సంఘం

పీడిత తాడిత ప్రజారాజకీయాల
కత్తుల శస్త్ర చికిత్సతో
ప్రభుత్వ దళారీ
సాహితీ వ్యవస్థ గర్భంలోంచి
ఎర్రగా పుట్టిన నేను-

నక్సల్‌బరీ, శ్రీకాకుళాలలో పారిన
ప్రజా వీరుల నెత్తుటి వాగుల్లో
పురిటి స్నానం చేసిన నేను-

వెన్నెముకను వింటిగా
నరాలను నారిగాజేసి
ఎముకలను శరాలుగా
ఈ వ్యవస్థ గుండెల్లో గుప్పించి
పోరాటం శిశువు చేత
భూస్వాముల తలకాయల్ని
బంతులాటాడించిన-
పాణిగ్రాహి పాటల్నీ- సత్యంపాతాల్నీ
వల్లె వేసిన నేను-

ఝంఝులోని బలాన్నీ
ఝరిలోని వేగాన్నీ
రగులుతున్న చైతన్యంలో రంగరించి,
నరనరాల్లోనూ
నింపుకున్న నేను-

ప్రతి అంగుళంలో అన్నాన్నీ-
ప్రతి గుండెలో ఆనందాన్నీ-
పండించి,
మరో మహత్తర లోకాన్ని సృష్టించిన
మావోయాంగు మహదాశయాల్ని
పల్లవిగా చేసుకొని
పాటలల్లుతున్న నేను-

మార్క్స్, ఎంగిల్స్, లెనిన్, స్టాలిన్
మహోపాధ్యాయుల మహోపదేశాలతో
ఆకలి కడుపుల పేగుల మీద
అంగార రాగాన్ని ఆలపిస్తున్న నేను-

పొలాల్లో పంటలకు ఎరువుగా
ఫ్యాక్టరీలకు ఇంధనంగా
తమ రక్తాన్ని ధారపోస్తున్న
శ్రామికుల జీవితాల్నీ
భవిష్యత్తునీ
ముక్కలు ముక్కలుగా నరికి-
ఆ ముక్కలను
సామ్రాజ్యవాదం అంగళ్లలో
విక్రయిస్తోన్న
దళారీ వ్యవస్థ కుష్ఠు చేతుల్ని
నరికి పారేయడానికి-

ప్రతి శ్రామికుడూ
ఆయుధం పట్టాల్సిన అవశ్యకతను
అక్షరాలు అక్షరాలుగా
నిప్పులు నిప్పులుగా
గాలిలోకి - నీటిలోకి
నింగిపైకి - నేలపైకి
విడిచి పెడుతున్న నేను-

ఆంధ్ర దేశం నలు మూలలా
విప్లవకవితాగ్ని జ్వాలల్ని రగిలించి
ప్రబంధ, పురాణ, భావకవితా
కుష్ఠురోగాల అవశేషాల్నీ,
కుహనా అభ్యుదయ చీడపురుగుల్నీ,
మండించి మసి చేస్తున్న నేను-

దోపిడి కొండల్ని
మార్క్సిజం, లెనినిజం దట్టించిన
శ్రామిక డైనమైట్లతో కూల్చి
సుందర సామ్యవాద వ్యవస్థకు
రహదార్లు వేస్తున్న
సాయుధ చరిత్ర మహాకావ్యాన్ని
రక్త గానం చేస్తున్న నేను-

పీడిత ప్రజల కలాన్ని !
ప్రజా పోరాట గళాన్ని !!
విప్లవ రచయితల సంఘాన్ని !!!

ప్రజల ఊపిరి ఊపిరిని
నేను !
ప్రజల ఊపిరి ఊపిరి కోసం

నేను !

నువ్వీ నాడు
అరెస్టులు చేసినంత మాత్రాన
కుట్ర చట్టంలో
బంధించినంత మాత్రాన
ఈ ఝంఝు ఆగదు !
ఈ ఝరి నిలవదు !!

ప్రజల చేతిలో
ఎర్ర సిరా పెన్నును నేను !
నీ చేతికి చిక్కినంత మాత్రాన
పచ్చగా ఎప్పుడూ రాయను !

నిర్భయంగా
నీ వర్గాన్నెపుడూ నగ్నంగా చిత్రిస్తాను
నా వర్గం చేత ఖడ్గం పట్టిస్తాను !
సాయుధ విప్లవానికి
సమాయత్తం చేస్తాను !!

నెత్తురు మండిన కరాలు బిగిసిన
ఎర్ర పిడికిళ్లు లేస్తున్నాయవిగో !
తమ కలాన్నీ తమ గళాన్నీ
విడిపించుకుంటాయి చూసుకో !

ప్రజలతో చెలగాటం !
లావాలో జలకాటం !!

■

## అక్షర హాలికులు

అశోక్‌కుమార్



కాళోజి
నారాయణరావు
(1914 - 2002 )



'నిఖిలాంధ్ర కవి'

కాళోజీ కవనం
సమరగుణ జీవనం
తెలంగా'నా గొడవ'
ప్రజల ప్రభంజనం

## పుడమితల్లికి పుత్రోత్సాహం

నేల / మీద/ పొరాడినప్పుడు కాదు !
నేల / కోసం / పోరాడినప్పుడు !





# శోక రహిత సమాజం కోసం... 'అశోకయానం'

విరియాల లక్ష్మీపతి

శ్రీశ్రీ కవిత్వం, చిత్రకూట పర్వతారణ్యం. అందులో ఓషధాల సమాహారం
సాహితీమిత్రుడు అశోక్ కుమార్
ఆ శ్రీశ్రీ కూటంపైకే పర్వతారోహణ చేశాడు. జెండా పాతేడు.
ఆ సాహితీ దుర్గమారణ్యంలోకే ఓషధీ ప్రస్థానం సాగించాడు.

శ్రీశ్రీ చిత్రకూట పర్వతం లాంటివాడు !
శ్రీశ్రీ సాహిత్యం
ఆ పర్వతారణ్యంలోగల ఓషధీసమాహారం.
చిత్రకూటంలో ఎన్నోరకాల ఓషధులుంటాయి
తుప్పలు డొంకలు ఆకులు కొమ్మలు వేళ్ళు
అవిపైకి కన్పిస్తాయి
చిత్రకూట పర్వతంలోనే
ఎన్నో ఖనిజాలుంటాయి
అవిపైకి కన్పించవు
లోయల పొరల లోతుల్లో
బండరాతి గోతుల్లో కొండ గుండె నూతుల్లో
అవి నిక్షిప్తమై వుంటాయి.
చిత్రకూట పర్వతారణ్యంలో ఓషధులు
పత్ర నేత్రాల తళతళల్లోనూ
మందాకుల నవరసాల్లోనూ
మిళితమై వుంటాయి
కొన్ని మందాకుల రసాలు
మనవాళికి పట్టుకున్న
శాశ్వత రుగ్మతలను ఇట్టే నయం చేస్తాయి
కొన్ని ఓషధీ చెట్ల కళ్ళు మెరుస్తూ
దీర్ఘనిద్రలోకి జారిపోయిన
కోమా రోగినీ మూర్ఛరోగినీ
దిగ్గునలేచి నిలుచొనేలా చేస్తాయి
కొన్ని పత్రరసాలు ఫలపుష్పాలు
సంజీవినీ చూర్ణాలు అవంత్ గార్డెలు
మృతకళేబరాన్ని యుద్ధానికి సంసిద్ధుడ్ని చేస్తే
కొన్ని మందాకులు పీడకుల మధించిన శిరస్సుని
నేలవాలేలా చేస్తాయి

కొన్ని మందాకులు
కాముకులకు అంధత్వం ఇస్తే
మరికొన్ని మందాకుల రసాలు
అంధులకు చూపులు ప్రసాదిస్తాయి.
చిత్రకూట పర్వతారణ్యం
చిత్ర విచిత్రాల ఓషధీరస కుటుంబం

శ్రీశ్రీ సమస్త సాహిత్యమూ
ఆకాశమంత ఓషధీ మంజూష
సమాజంలో ఘూర్ణిల్లుతున్న
అన్ని రకాల రుగ్మతలకీ
అందులో మందులు దొరుకుతాయి
రసపత్ర గంధాల
ప్రాణవాయువులు లభిస్తాయి.
కూకటి వేళ్లతో పెకిలించిన తల్లివేళ్ళు
దూపటెల్లిన పిల్ల గొంతులకు
ద్రాక్ష పానీయాలందిస్తాయి...
శ్రీశ్రీ కవిత్వం
చిత్రకూట పర్వతారణ్యం
అందులో ఓషధాల సమాహారం

సాహితీ మిత్రుడు అశోక్ కుమార్
ఆ శ్రీశ్రీ చిత్రకూటంపైకే
పర్వతారోహణ చేశాడు.
జెండా పాతేడు.

ఆ సాహితీ దుర్గమారణ్యంలోకే
ఓషధీ ప్రస్థానం సాగించాడు.
పాఠకులకు వట్టివేళ్ల చిగుళ్ల చల్లదనం
తులసి చిగుళ్ల కమ్మదనం రుచిచూపాడు
పత్రనేత్రాల కాంతి నర్తనాలు
చిగురుటాకుల వెలుగుల పరావర్తనాలు
పాఠకులకు దర్శింపచేశాడు.

శ్రీశ్రీ అరణ్య సాహిత్యంలోంచి
విద్యుత్ తీగెల కాంతి కిరణాలు
విద్వద్గీతాల మధురిమలు
ద్రాక్ష నారికేళాల షడ్రుచులు
బ్రోచర్లో అందించాడు
కవితల్లో గుబాళించిన
సంపెంగి చెంపక పూగపున్నాగాల
రస గంధాల ప్రాణవాయువులు
ఉపమలు ఉత్ప్రేక్షలు సంకేతాలు తర్జుమాలు
వాటి రూపాలు ప్రక్రియాలు ప్రయోగాలు
సామాజికులకు అందించి చూపాడు.
పీడితులందరికీ జీవజీవాలందించాడు
ఉపజ్ఞాదోహద క్రియలతో

శ్రీశ్రీ పాఠకులందరినీ రసజ్ఞుల్ని చేశాడు
శ్రీశ్రీ చిత్రకూట పర్వతారణ్యంలో
ఎత్తుపల్లాలు లోయలు పర్వతసానువులు
అశోక్‌కుమార్ నిశితంగా పరిశీలించాడు
సాహితీవేత్తలందరిచేత
పరిశీలించేలా చేశాడు
కొండల గుండెల గనుల్లోగల
సాహిత్య సంపదను
నిశితంగా పరిశోధించాడు
విమర్శకులచేత
పరిశోధించేలా చేశాడు
యుట్రిక్యులేరియా పీడకుల్ని
స్థాణువుల్నిగా మార్చేడు.

సాహితీ గనుల్లోగల ఖనిజాలను
పేదవర్గాలకి ఇనుము
ఏ శాతం అందివ్వాలో
బడుగు వర్గాలకి భాస్వరం
ఏశాతం అందివ్వాలో
దాహార్తులకు నీరు
ఏ శాతం అందివ్వాలో
పీడకులకు కషాయం
ఏ మోతాదులో అందివ్వాలో...
అవన్నీ శ్రీశ్రీ సాహిత్య గనుల్లో
ఎక్కడెక్కడ ఎంత శాతం
లభ్యమవుతుందో వాటిని
తెలుగు సాహిత్యంలో
విమర్శనారంగ పరుసవేదులు
ఏరకంగా వస్త్రకాళితం చేసేరో...
విశ్లేషకులు ఏ మేరకు పుటంపెట్టి
అందించేరో
అన్నింటినీ అశోక్ కుమార్
శోధన నాళికల్లో పోసి
అవసరం మేరకు
సామాజికులకు అందించాడు.

'శ్రీశ్రీ మహాప్రస్థానానికి
అశోక్ కుమార్ చేసిన ఓషధీ ప్రస్థానం
ఒక ఎర్ర జండా ప్రతిష్ట
సాహిత్య కారులందరికీ అది
ఒక ఎర్ర లిట్మస్ టెస్ట్
ప్ర...గతి..తార్కిక..శీల ...పరీక్ష
శోక రహిత సమాజానికై
అశోక్ చేసినది ఒక జ్యోతిర్యానం
మరో ప్రపంచం కోసం చేసిన
'అశోకయానం'
చారిత్రక అక్షరాభ్యాసం'. ■

## అక్షర హాలికులు

అశోక్‌కుమార్



## పురిపండా అప్పలస్వామి

**(1904-1982)**



**'పులిపంజా'**

అప్పలస్వామి పురిపండా
వ్యవహార భాషా ఎజెండా
శ్రీరంగం శ్రీనివాసరావును
తొలుత ఎగరేసిన జెండా!

## భిన్న సంస్కృతి

ఒంటి చీర/ బతుకులు / కొన్ని
ఒంటి మీద/ చీరేలేని / బతుకులు కొన్ని





# 60లో ఒక అశోకుడి కోసం.. 40లో ఒక మిత్రుడి వాక్యం

చిత్తలూరి సత్యనారాయణ

**మనచుట్టూ మనుషులుంటారు. మనుషుల్లో ఎలాంటి మనుషులుంటారు. మనుషులతో పరిచయాలుంటాయి. మనకంటూ ఒక పరిచయముంటుంది. నా పరిచయంతో నేను, నీ పరిచయంతో నువ్వు, అతని పరిచయంతో అతను, ఆమె పరిచయంతో ఆమె... ఎవరికివాళ్లు ఒక ప్రపంచాన్ని నిర్మించుకుంటారు. ప్రపంచాన్ని దాటుకుంటూ ఒక ప్రయాణముంటుంది. ప్రయాణం నిండా కొన్ని మజిలీలుంటాయి. మజిలీ - మజిలీకి మనల్ని మనం సమీక్షించుకోవటమూ వుంటుంది. కొన్ని మజిలీలు మనల్ని సమీక్షించమంటూ మనతోటి ప్రయాణికులను (మిత్రులను) అడుగుతాయి. అలాంటి ఒక 60వ మజిలీ దగ్గర నిలబడి, తను నడిచొచ్చిన పాదముద్రల్ని లెక్కించుకుంటూ... తన కోసం ఓ నాలుగు మాటలిమ్మన్నాడతను.**

అతని చుట్టూ సీతాకోక చిలుకనై ఎన్నిసార్లు పరిభ్రమించానో...అతని కోసం దాచివుంచిన ఒక పుస్తకాన్ని తెరిచి ఎన్నిసార్లు పేజీల్ని తిరగేసానో... అతన్ని అంచనా కట్టాలి కదా! పుస్తకంలో అతనికో పేజీ కేటాయించగలగాలి కదా!...అందరి పేజీల్లో లాగే అతనిలోనూ కొన్ని బలహీనతలున్నాయి... అదేమిటో అతనిలోని బలహీనతలకంటే అతని బలాలే నన్నాకర్షిస్తాయి... అతనికంటూ ఒక బాటను నిర్మించుకున్నవాడు ఎవర్నీ బలవంతం చేయని ఒక ప్రయాణం అతనిది... అతని చేతులనిండా పూలుంటాయి. పువ్వులకింద ముళ్లూ వుంటాయి. పూలను మాత్రమే బహూకరిస్తాడతను. అతనిలో వున్న ఒక జీవలక్షణమే కారణ మనుకుంటా.. ఆ మాటకొస్తే నన్నతనికీ, బహుశా! నాలాంటి మరెందరినో అతనికీ దగ్గరచేసిందీ అదేననుకుంటా. అతన్ని పలకరిస్తే గుండ్రని అక్షరాలవుతాడు.. కాస్తంత తేనీటితో పాటు కొన్ని మినీ కవితల్ని కూడా ఇచ్చి సత్కరిస్తాడు. రెండక్షరాలు లేకుండా (శ్రీశ్రీ) అతను మాటకాలేడు.సుశిక్షితుడైన సైనికుడిలా అతను జీవితం మీద నడిచి వెళ్తుంటాడు. 'సీతారామపురంలో ఒక సందు వుంటుంది. సందు చివర ఒక చిన్న షట్టర్ వుంటుంది. లోపలికెళితే ఒక చిన్న గది వుంటుంది. గదిలో ఒక చిన్న టేబుల్. దానిమీద ఒక కంప్యూటర్, దానికెదురుగా అతనుంటాడు' బహుశా కవిత్వాన్ని రచిస్తూ, జీవితాన్ని అనువదిస్తూ... శ్రీశ్రీని ప్రేమిస్తూ... ఏదోవొక సభలో 'చినుకు'ల్లాంటి పై మాటలు నా హృదయంపై కురిసినపుడు ...అతని గురించేనా-అతను ఇతనేనా..అన్న ఆనందం వర్షంలా మారినపుడు అతని గురించిన ఒక కవితావాక్యం బహుశా అప్పుడే నాలో మొదలయిందనుకుంటా...ఆ తరువాత అతనితో గడిపిన సమ యాలు, సాయంకాలపు సాహిత్యాలూ, సాహిత్యపు సాయంకాలాలూ-మినీ కవితలుగా, మెనీ సంగతులుగా ...ప్రజాసాహిత్యంగా...అతని ప్రయాణంలో భాగమవుతూనే వుంది. కవిత్వాన్ని ప్రేమించే-అతని స్పర్శలో ఆత్మీయతవుంటుంది. భుజంతట్టి ముందుకు పదమంటాడు కవిత్వాన్ని...పదాల్ని వరుసలో నిలబెట్టి చాలాసార్లు ఖడ్గచాలనం గావించి...అభిప్రాయాల పూలదండలే కాదు... నిర్మొహమాటల చర్నకోలాలూ విసరడం అతనికి చేతనవును. అతను శ్రీశ్రీని గాఢంగా ప్రేమిస్తాడు. శ్రీశ్రీని ప్రేమించే వాళ్లను మరింత అమితంగా ప్రేమిస్తాడు. కవిత్వాన్ని ప్రేమించటం అతని సహజ లక్షణం కదా ! అతనింకా ప్రయాణం చేస్తూనే వున్నాడు. అతని ప్రయాణంలో 60వ మజిలీ దగ్గర... కొంతమంది మిత్రులు సమావేశమయ్యారు. ఆ మిత్రుల్లో నేనూ ఒకడిగా... అతనిపై ప్రేమతో ఇలా ఒక వాక్యంగా....

**అతను : శ్రీ సింగంపల్లి అశోక్‌కుమార్**
**శ్రీశ్రీ మనవడు, మాకు ఆత్మీయుడు** ■



**అక్షరాలు**

విడిగా అగ్ని
కలిస్తే శతఘ్ని



# మా... అశోక్‌కుమార్

పెద్దిభొట్ల సుబ్బరామయ్య

**కొందరితో పరిచయం ఎందుకయిందిరా అని బాధపడతాము చాలా సందర్భాలలో...**
**కొందరితో ఇంత ఆలస్యంగా పరిచయం ఎందుకయిందిరా అని చింతిస్తాము కొన్ని సందర్భాలలో...**
**అశోక్‌కుమార్ దాదాపు రెండు దశాబ్దాలుగా నాకు పరిచితులు.**
**ఒక కవితా సంపుటికి ముందుమాట రాయమని వస్తే 'నేనేమిటి? కవితలకు మున్నుడి రాయడం ఏమిటా'ని ఆశ్చర్యపోయాను.**
**కానీ స్నేహపూర్వక ముఖలక్షణాలతో అశోక్‌కుమార్ నన్ను ఒప్పించాడు.**
(వయసులో పెద్దవాడ్ని కాబట్టి మాత్రమే ఇప్పుడు ఏకవచనం ప్రయోగం చేస్తున్నాను.)

అప్పుడేదో రాశాను. ఆ తరువాత మా పరిచయం ఘనిష్ఠంగా పరిణమించింది. నేను చాలా పర్యాయాలు చాలా క్లోజ్‌గా మూవయినాను. అతనిలో అందర్నీ ముందు ఆకర్షించే లక్షణం చిరునవ్వు నిండిన ఆ మొఖం. ఎన్నడూ ఆ మనిషి ఎవరిమీదా కోపించలేదనీ, కనీసం చిరాకు కూడా ప్రదర్శించలేదని నేను గట్టిగా నమ్మాను. ఇక తర్వాతర్వాత అతను చాలా గట్టి సాహిత్యాభిమాని, పరిశీలకుడని అన్నిటికీ మించి అపారమైన సామాజిక స్పృహ కలవాడనీ, వామపక్ష భావాలు మదినిండా నింపుకున్నవాడని అర్ధమైంది.

దేశమంతా శ్రీశ్రీని అభ్యుదయ కవిగా, తర్వాతి కాలంగా విప్లవకవిగా గుర్తించి అభిమానిస్తే అశోక్‌కుమార్ బహుశా అందరికంటే మించి కరడుగట్టిన శ్రీశ్రీ అభిమానని తెలిసివచ్చింది. బహుశా శ్రీశ్రీని ఇంతకంటే గాఢంగావిశ్వసించేవారెవరూ వుండరని నేను నమ్ముతాను. ఇక వ్యక్తిగతంగా ఆయన గొప్ప స్నేహశీలి.

ఇక మరోకోణం మిగిలివుంది. ఆయన సృజన శీలత – ఆయన కవితలలోనూ, ఇతరులమీద ఆయన వెలువరించిన బుల్లి కవితలలోనూ కొత్త సుగుణం వుంది. ఆ చిట్టి కవితలలో అపూర్వమైన సూటిదనం వుంది. నాలుగు బుల్లి వాక్యాల కవితాచిత్రాలలో అంత్యప్రాసల అందమైన నడక, సూటిదనం వున్నాయి. ఆ పదాలను నేరుగా సూదుల్లాగా, బాకుల్లాగా హృదయాన్ని తాకుతాయి. ఆ క్లుప్తత అంత అందంగా సాధించడం కష్టమనిపిస్తుంది. ప్రతి బుల్లి కవితా ఎంతో పేలటబుల్‌గా వుంటుంది. నేడు దేశంలో చోటు చేసుకుంటున్న దారుణ పరిణామాలు, ప్రపంచీకరణవంటివి ఆయనను ఎంతగానో బాధించాయని,వాటికి వ్యతిరేకంగా కలంశూరుడిలా శ్రమిస్తున్నాడనిపిస్తుంది. ఆయనకు ఆరుపదులు నిండుతున్న ఈ శుభసందర్భంలో ఆయన మరింతగా ఎదిగి సాహిత్య సేవ చేస్తారని ఆశిస్తాను.

అసలు విషయం. ఇది ఒక మనిషి జీవితంలో అత్యుత్తమ దశ. ఈ దశను ఆయన అమితానందంగా, ఫలప్రదంగా గడుపుతాడని ఆశిస్తూ... ఆశీర్వాభినందనలు తెలియజేస్తున్నాను.

## ఆశయ కేతనం

దేశాలను / తెలిపేది / ఎగిరే జెండా !
దేశాలను / కలిపేది / ఎర్రని జెండా !





# ఆరుపదుల అశోక్ గురించి

కొత్తపల్లి రవిబాబు

మూడేళ్ల క్రితం సంఘటన, బెజవాడలోనే బైపాస్ ఆపరేషన్ చేయించుకున్నాను. వారం పదిరోజుల తర్వాత ఇంటికి పంపిస్తానన్నారు. 'జనసాహితి' మిత్రులు నన్ను ఇంటికి వెళ్లనీయలేదు. బంధువులు ఇతర మిత్రులు చూడటానికి రావడంవల్ల రోగి త్వరగా తేరుకోవడం ఆలస్య మవుతుందని, దూరం ఆలోచించి మరో మిత్రుడి ఇంట్లో వుంచారు. సహాయపడటానికి డ్యూటీలు వేసుకొని ఇద్దరు ముగ్గురు నాతోపాటు వున్నారు. ఇలా నెలరోజులు గడచిపోయిన తర్వాత - ఒకరోజు ఈ అజ్ఞాతవాసం వీడి మా 'ప్రజాసాహితి' కార్యాలయానికి వెళ్లాను. ఇలా బయటకు వచ్చిన సంగతి మిత్రుడు అశోక్‌కుమార్ తెలుసుకున్నాడేమో - కుర్చీలో కూర్చున్న నన్ను వెనుక నుంచి వచ్చి ఎంతో ఆప్యాయతతో కౌగిలించుకున్నాడు. నాకు కళ్లంట నీళ్లు తిరిగాయి. అతని కళ్లల్లో కనిపించీ కనిపించని తడి. పెల్లుబికిన భావోద్వేగంతో అశోక్‌కుమార్. తట్టుకోలేని భావోద్వేగంతో నేను. తట్టుకోడానికి ఇద్దరికీ కొంత సమయం పట్టింది.

అందుకే కాబోలు దూరదృష్టితో ఒక నెల అజ్ఞాతవాసం విధించారు అన్పించింది. మానసికంగా, శారీరకంగా ఒక నెల తర్వాత ఇటువంటి భావోద్వేగాలు తట్టుకోగల్గిన శక్తి వచ్చింది. కాని ఈ నెల లోపు బంధువులు, మిత్రులు వచ్చివుంటే నిజంగా ఎంత బాధపడివుండేవాడినో అన్పించింది. చాలా మంది సన్నిహితులు 'మాకు కూడా చెప్పరా- రవిబాబు ఎక్కడున్నాడో' అని మా జనసాహితి వారిని నిష్ఠూరాలాడినా, మొండిగా నెలరోజులు అజ్ఞాతవాసం ఇందుకే చేయించారని అనుకున్నాను.

కొంత రిలాక్సయ్యాక జేబులోంచి ఓ రెండు పేజీల కవిత తీశాడు. ఎవరిదో కవిత అచ్చుకోసం ఇస్తున్నాడనుకున్నాను. కానీ అది అశోక్ రాసిందే. ఆశ్చర్య పోయాను. చదివిన తరువాత ఇంకా ఆశ్చర్య పోయాను. ఎందుకంటే ఆయన ఇటీవల రాస్తున్న వన్నీ మినీ కవితలే.

నా అనారోగ్యం అశోక్‌ను ఎంతగా కదిలిం చిందో అర్థమైంది. ప్రతి అక్షరంలోనూ అతని హృదయస్పందన కనిపించింది. నా గురించిన ఆ కవిత 'ప్రజాసాహితి'లో ప్రచురించడం ఏం బావుం టుంది అనుకున్నాను. కాని తర్వాత మా సంపాదక వర్గం ఆ కవితలోఉన్న ఆర్ద్రతకూ, సందేశానికి, కవితా విలువల ఆధారంగా 'ప్రజాసాహితి'లో ప్రచురిం చింది. ఆ కవిత ఈ సందర్భంగా గుర్తుచేసు కుంటున్నాను.

## కొత్త రవిబాబు

మిత్రమా !
ఆసుపత్రి పాలయ్యావని తెలిసి
నా గుండె ఆగినట్టనిపించింది
నీ గుండెకు జబ్బని తెలిసినప్పుడు
నా గుండె కోసినట్టనిపించింది !

అయినా
నా మనసు పడుతున్న ఈ కలవరం
మన మైత్రీమమకార జ్వరం !!
కాకపోతే-
మనిషికొచ్చే జబ్బు
మనకేసే మబ్బేగాని
మరణంకాదు !
రవిబింబానికి మరణంలేదు !!
తెలుగునేల నలుచెరగులా
నలభై సంవత్సరాలుగా
నెలా నెలా 'సంచి'కదు అక్షరాగ్నికణాలను
సమాజరుగ్మతలపై గుమ్మరిస్తున్న
ప్రజాసాహితీ సాంస్కృతికోద్యమపు
దిటవు గుండెవు నువ్వు -

నీ గుండెను కబళించడానికి
మరణానికెన్ని గుండెలు ?
జనం కోసం బలికేవాడిని
జనమే రక్షించుకుంటుంది !

జనరక్తం పోసుకుని
మరణాన్ని జయించిన మిత్రమా !

ఇప్పుడు నువ్వు
ఉత్త రవిబాబువి కాదు
జనరణాలను
కోటికిరణాలతో వెలిగించబోతున్న
కొత్త రవిబాబువి !

నిన్న
అనారోగ్యంతో
పరుపెక్కిన నిన్నుచూసి
బ్లడ్ ప్లెజరుతో
వీగిపోయిన వాళ్లు-
నేడు
ఆరోగ్యంతో
ఎరుపెక్కిన నిన్ను చూసి
బ్లడ్ ప్లజరుతో
సాగిపోతున్నారు !

ఇంతకీ ఈ అశోక్‌కుమార్‌తో అప్పటికి ప్రత్య క్షంగా రెండేళ్ల క్రితమే పరిచయం. 1973-77 ప్రాంతంలో 'తల్లీ! ఎవరునువ్వు?' 'బాలయోగీశ్వర సందర్శనం' 'శ్రీ బాబా మహత్యం' 'మత ప్రస్థానం' లాంటి దీర్ఘ కవితల రచయితగా మాత్రమే తెలుసు. ప్రత్యక్ష పరిచయం మాత్రం నేను బెజవాడ వచ్చిన తర్వాతే. ఆనాటి దీర్ఘ కవితల అశోక్ కుమార్ కొన్నేళ్ల సాహిత్య అజ్ఞాతవాసం తర్వాత ఈనాడు మినీ కవితల అశోక్ కుమార్‌గా ప్రత్యక్ష మయ్యాడు.

మినీ కవిత,హైకూలు, నానీలు, రెక్కలు, చప్రలు, గాథ మొదలైనవన్నీ రూపానికి సంబంధిం చినవే గాని, ప్రగతిశీల వస్తువుకు సంబంధించినవి కాదు.ఆ మాట కొస్తే వచనకవిత కూడా అంతే. అయితే అశోక్‌కుమార్ రాసిన మినీ కవితలుగాని, వచన కవితలుగానీ అన్నీ ప్రగతిశీలమైనవే కావటం ఆనందదాయకమైన విషయం. గతంలో 'ప్రజా సాహితి'లో 'అక్ష'రణం' శీర్షికను, ప్రస్తుతం 'అక్షర నివాళి' శీర్షికనూ అశోక్ నిర్వహిస్తున్నారు.

నేను బెజవాడ వచ్చిన తర్వాత అనేకానేక సాహిత్యసభల్లో అశోక్‌కుమార్‌ను కలుసుకున్న సందర్భాల్లో, ఆయనే మొదటసారిగా అభ్యుదయ దృక్పథంతో ఒక సంస్థగా మనమూ కార్యక్రమాలను నిర్వహించాలనే ప్రతిపాదన పెట్టాడు. దాని ఫలి తంగానే 'ప్రజాసాహితి' పాఠకులూ, చందా దారులూ, అభి మానులు, 'ప్రజాసాహితి వేదిక'ను ఏర్పరు చుకున్నారు గత 50 నెలలుగా ప్రతి మూడో ఆదివారం సాహిత్య సామాజిక విషయాలపై సభలను ఈ వేదిక విజయవాడలో విజయవంతంగా నిర్వహిస్తోంది.

ప్రజాసాహితి వేదిక సభ్యులు విజయవాడలో జరిగే సాహిత్య,సంగీత, నాటక,సామాజిక సభలన్నిం టిలోనూ శ్రోతలుగానో, నిర్వాహకులుగానో, వక్తలు గానోపాల్గొంటున్నారు.ఆహ్వానం వున్నా లేక పోయినా సభ గురించి తెలిస్తే చాలు హాజరవటమే. అలా హాజరైన ఒక సభలో ఒక వక్త సాహిత్యపరంగా కొన్ని తప్పువిషయాలు చెబుతున్నప్పుడు అశోక్ కుమార్ వాటికి తీవ్ర అభ్యంతరం తెల్పారు. అప్పుడా నిర్వాహకులు 'మీరెవరు? మా సభకు మీరెందుకు వచ్చారు?'అని అడ్డుకున్నారు. దానికి అశోక్ 'మరి మీ ప్రైవేటు సమావేశమైతే 'సభ్యులకు మాత్రమే' అని చెప్పుకోవాలి. దినపత్రికల్లో ఆహ్వానం ఎందుకు వేశారు? అని ప్రశ్నించి వారి నోరు మూయించి, వాస్తవాలు తెలియ జేశారు.

ఇటీవల జరిగిన మరో సమావేశంలో వాగ్దేవు చినరవీభద్రుడు తన ప్రసంగంలో 'కొడవటిగంటి కుటుంబరావు థర్డ్‌రేట్ రైటర్' అని సూత్రీకరించి నపుడు వెంటనే ఆయన సూత్రీకరణను ఖండించక పోవడం ఆనాడు హాజరైన (నాతో సహా) ప్రజా సాహితి వేదిక సభ్యుల గొప్ప వైఫల్యం అని పదేపదే ఆత్మవిమర్శ చేసుకోవడంలో అశోక్‌కుమార్ ప్రథమ స్థానంలో వున్నారు.

రచయితలు, కవులు గొప్ప ఉపన్యాసకులు కాక పోవచ్చు. అలాగే అశోక్‌కుమార్ మూడేళ్ల క్రితమైతే పదినిమిషాల్లో చెప్పాల్సిన విషయాన్ని అరగంటసేపు చెప్పేవాడు. నేనే ఒకసారి ఈ విష యాన్ని ఈ మాట్లోనే ఆయనకు చెప్పాను.ఆ తర్వాత అనేక వేదికలపై మాట్లాడే క్రమంలో ఆయన గొప్ప ఉప న్యాసకుడననుగాని, మంచి ఉపన్యాసకునిగా రూపొం దాడు. ఇప్పుడు పదినిమిషాలలో చెప్పాల్సింది పది నిమిషాల్లోనూ,అరగంటలో చెప్పాల్సింది అరగంట లోనూ చెప్తున్నాడు.మా ప్రజాసాహితి వేదిక కొత్త తరం ఉపన్యాసకులను తయారు చేసుకునే క్రమంలో ఎదిగిన మరో ఉపన్యాసకుడు అశోక్‌కుమార్.

ఈ అశోక్‌కుమార్ విజయవాడకు రాక ముందు కాకినాడలో వున్నప్పుడు, ఆ తర్వాత కొంత కాలం విప్లవరచయితల సంఘ సభ్యుడనీ, విద్యార్థి దశనుంచే మార్క్సిజాన్ని తన ప్రాపంచిక దృక్పథంగా స్వీకరిం చాడనీ, ప్రేమించి వర్ణాంతర వివాహం చేసుకున్నాడని నాకు బెజవాడ వచ్చిన తర్వాతే తెలిసింది. నాకైతే బాబాలు, అమ్మలు, బాలయోగిపై ధ్వజమెత్తిన అశోక్ కుమార్‌తో మాత్రమే గతంలో పరోక్ష పరిచయం. ఈనాడు సాహిత్య సాంస్కృతికో ద్యమంలో విశాల దృక్పథంతో కృషి చేస్తున్న నిరంతర చైతన్యజీవి ఇప్పటి ఆరుపదుల అశోక్‌కుమార్. యువ రచయితలను అన్ని విధాలా ప్రోత్సహిస్తూ, కొత్తతరం వారసత్వాన్ని తయారు చేస్తున్నాడు అశోక్ కుమార్. ■

## ఫ్యాక్షనిజం

మనిషిని చంపడం కాదు
మనిషిగా చావడం





# అరవై అశోక వృక్షానికి...

రామతీర్థ

మహాకవి శ్రీశ్రీ 'సింగం బాకటితో గుహాంతరమున్ జొచ్చి' అన్న మహాభారతంలోని తిక్కన పద్యాన్ని తనకు నచ్చిన మేలి రకం రచనగా పేర్కొంటాడు. తనని శ్రీశ్రీ మానసపాత్రుడిగా పరిచయం చేసుకునే సింగంపల్లి అశోక్‌కుమార్, సరిగ్గా ఈ గుహలో పరాక్రమించిన 'సింగం' లాంటివాడే.

2005లో శ్రీశ్రీ శతజయంతి (2009-10) గురించి ఇంకా తెలుగునాట ఏ ఆలోచనలూ స్పష్టరూపం దాల్చని కాలంలో విజయవాడ నుంచి మొదలయిన చిరు ఆశల వర్షం 'చినుకు'లుగా కురుస్తోంది. అందులో కన్పించే వాడు అశోక్, శ్రీశ్రీ అనే బృహద్విషయ ప్రహేళికా నిర్వాహక ప్రవీణుడిగా. నెలనెలా ఈ శ్రీశ్రీ క్విజ్, కొంచెం మంట, కొంచెం గాలి, కించితో ఆజ్యమై తెలుగునాట అగ్ని సంచారం చేసింది. శ్రీశ్రీ గురించి నిరాసక్తతల గుహలు నిప్పుల వెలుగుతో నిండిపోయాయి. పట్టించుకోకుండా వీల్లేని బృహత్తర సందర్భంగా 2006 నుంచి 2010 వరకూ మరలా తెలుగు సాహిత్యలోకాన్ని శ్రీశ్రీ అనే రెండక్షరాలు డామినేట్ చేశాయి. ఇందులో చెప్పుకోదగ్గ పాత్ర సింగంపల్లి అశోక్‌కుమార్ నిర్వహించాడన్నది అతిశయోక్తి కాదు.

# అక్షర హాలికులు

**అశోక్‌కుమార్**



**కట్టమంచి రామలింగారెడ్డి**

**( 1880 -1951)**



## ముసలమ్మ మరణం

కవిత్వతత్త్వ విచారం
నవ్య సాహిత్య ప్రచారం
పాత విమర్శల మూతి
కుట్టిన సూదీదారం

2006 ఏప్రిల్ 30, విశాఖపట్నం - శ్రీశ్రీ శతజయంతి కౌంట్‌డౌన్ రాష్ట్రంలో మొదటిసారిగా ప్రకటించిన సభలు విశాఖ పౌరగ్రంథాలయంలో, మొజాయిక్ సాహిత్య సంస్థ - ఎస్కే ఫౌండేషన్ ఆధ్వర్యంలో తొలిసారిగా శ్రీశ్రీ పుట్టిన ఊరు విశాఖలో మహాప్రస్థాన గీతాలపై చిత్రప్రదర్శన. చిత్రకారుడు బి.సూర్యారావు. శ్రీశ్రీ జీవితుడై వున్న కాలంలోనే ఒరిస్సాలో ఖుర్దారోడ్, బరంపూరంలో ప్రదర్శితమైనవీ, శ్రీశ్రీ స్వయానా దర్శించినవీ ఈ చిత్రాలు చూశాకే నేను మహాప్రస్థానం గీతాలు రాసానా అన్పిస్తోంది అని LAVISH గా ప్రశంసలు అందించిందీ 79-80 నాటి తెలుగు సాహిత్య చరిత్రలో నమోదయిన వాస్తవమైతే, మళ్లా ఈ చిత్రాలు దర్శనమిచ్చాయి విశాఖలో 2006 ఏప్రిల్‌లో. ఈ చిత్ర ప్రదర్శన ఆవిష్కరించింది సింగంపల్లి అశోక్‌కుమార్. మా శ్రీశ్రీ నూరేళ్ల ఉత్సవాలకు శుభాకాంక్షలందించిన అభ్యుదయ సాహిత్య కార్యకర్త. అప్పట్నుంచీ మా అనుబంధం కొనసాగుతోంది.

మహాకవి శతజయంతి సందర్భంగా 'శ్రీశ్రీ సాహిత్య నిధి' ప్రచురణలుగా విలువయిన సమా చారం తిరిగి చిన్నచిన్న పుస్తకాలుగా తెలుగు ప్రజ లకు అందుబాటులోకి తెచ్చిన ఘనత అశోక్ గారిదే.

**'పెద్ద పుస్తకాలను చిన్నచేసి**
**పఠనాసక్తులను పెద్దచేసి**
**శ్రీశ్రీ సాహిత్య తోటమాలి సింగంపల్లి**
**పాదు చేసినాడు హరివిల్లుల వల్లి'**

ముందు తరాల వారు చదువుకునేలా విషయ విస్మృతిని శ్రీశ్రీ గురించిన చిన్న Module లా తయారుచేసి, త్వరగా ఆకళింపు చేసుకునే అవకాశాలను, శ్రీశ్రీ సాహిత్యనిధిలోని రత్నరాశులు పుష్కలంగా కల్పిస్తాయి. పునర్ముద్రణకు నోచుకోని అనేక ఆలోచనా వీచికలను, శ్రీశ్రీ సాహిత్య విశ్లేషణలను వెలుగులోకి తెస్తూ శ్రీశ్రీ సాహిత్యనిధి ఒక క్విక్ రిఫరెన్స్‌టూల్‌గా సైతం, ఇరవయ్యో శతాబ్దపు సారభూతతత్వాన్ని అర్థంచేసుకోవడానికి ఎంతగానో ఉపకరిస్తుంది. ఇలా చిరుపొత్తాల పొందిక, రూపనిర్మాణం, ప్రజాపక్ష ఉత్తమ సాహిత్య నిబద్ధతకు మంచి ఒరవడిగా అశోక్ తీసుకున్న అక్షరనిధి నిక్షేపాలు ప్రాముఖ్యత సంతరిం చుకున్నాయి.

2010 నాటి సింగంపల్లి అశోకుడి బెజవాడ శాసనం మరో పదేళ్లపాటు మరింత ఉధృతంగా కొనసాగి, శతాబ్దం పూర్తయిన శ్రీశ్రీ స్మృతికి ఒక దశాబ్దాన్ని అంకితకాలంగా ప్రకటిస్తూ వెలువడింది. ఇది జాతికి గర్వకారణం.

అరవైల్లోకి అశోక్ జీవనయానం ఇలా సంఘటనాభరితంగా EVENTFULగా వుండ డం, అబ్బురపాటును కల్గించేదే అయినా ఇది కార్యశూరులకు సహజలక్షణం.సాహిత్య ప్రయోజన భరితంగా, సంతృప్తి కారకంగా, సింగంపల్లి అశోక్‌కుమార్, అన్ని విధాలా సాఫల్య తలు పొందుతూ ఉత్తమాభివృద్ధినీ, ఉన్నతినీ సాధించాలని ఆశించడంలో మా స్వార్థమూ ఉంది. నలుగురితో కలిసి నడిచేవారు దారిలో వేనవేల అడుగుజాడల సంస్కృతి వుంటుంది. May his tribe increase అని నాలుగు మాటల్లో ఆంగ్లంలో ఆకాంక్షించినా, అందులోని కామన ఈ ఉపఖండ సంస్కృతి ఉచ్ఛస్వరంలో పలికే నూతన ఆశాఘోషల జీవభాష, అనధికార శాసనకర్తలుగా ఆంగ్ల మహాకవి షెల్లీ ఆత్మ ప్రకటన సుదూర యూరప్‌లో చేసినా, నిఖిల లోకాలకు నిత్యమంగళం నిర్దేశించే, స్వస్తి వాక్యములు సంరావించే, ప్రపంచవ్యాప్త ప్రభాతాల ప్రగతి వేపు జయపతాకగా, జనపతాకగా వెలుగులీనిన శ్రీశ్రీ కేతనధారిగా, అశోక్‌గారికి స్ఫూర్తివంత షష్టిపూర్తి అభినందనలు సాహిత్య లోకం తరపున. ■



## ...రులు పొంగే జీవగడ్డ

కొన్ని వేళల్లోనే పారే నదులు
అన్ని వేళల్లోనూ సారాసుధలు



# మత వ్యతిరేకత మీదుగా/ సామ్రాజ్య వ్యతిరేక 'వ్యూహం'

డా॥ మానేపల్లి

**జీవితంలో ఏ సంఘటన ఎదురైనా దానికి తగిన వాక్యం 'కన్యాశుల్కం' లో దొరుకుతుంది. అలాగే మన చుట్టూ జరిగే అన్యాయాలకి ధర్మాగ్రహం ప్రకటించాలంటే కాళోజి తోడు ఒస్తాడు. జనాన్ని నలుచఃకుతినే రాజ్యాన్నీ, దాని బలగాన్ని ఎలా ఎదుర్కోవాలో చమత్కారంగా సూచిస్తాడు రావిశాస్త్రి. పతితులూ, భ్రష్టులూ, బాధాసర్పదష్టులు 'చాత్రిబాబు' అండ చూసుకుంటారు. మరి, అలవోకగా అక్షరాలల్లే శ్రీశ్రీ? ప్రతీక్షణం సందర్భోచితంగా మనల్ని పలకరిస్తూనే వుంటాడు.**

నగ్నముని, చెరబండరాజు, జ్వాలాముఖి, నిఖిలేశ్వర్, భైరవయ్య, మహాస్వప్న - వీళ్ళు ఆరుగురు 1965లో దిగంబర కవితా ఉద్యమం ప్రారంభించి- తెలుగు అక్షరలోకంలో సంచలనం సృష్టించారు. 1967,68లలో మరో రెండు సంకలనాలు తెచ్చారు.

1964 మేలో నెహ్రూ మరణించారు. 1966 ప్రారంభంలో లాల్‌బహదూర్ శాస్త్రి - తాష్కెంట్ వివాదాస్పద పరిస్థితులలో మరణించి - ఇందిరమ్మ భారతదేశపు తొలి మహిళా ప్రధాని అయింది. ఇదంతా దేశంలో, మనరాష్ట్రంలో, అటు అంతర్జాతీయంగా కల్లోలకాలం. 1968-69 నక్సల్‌బరీ, 1968-1970 శ్రీకాకుళ పోరాటం. ఈ మధ్య కాలంలో మార్క్సిజం ఎంతగా ముందుకు వచ్చిందో, వివిధ నాస్తిక హేతువాద ఉద్యమాలూ అంతగానూ ముందుకొచ్చాయి. అదుగో ఆ నేపథ్యంలో- 21 సంవత్సరాల వయస్సులో అశోక్‌కుమార్ కలం పట్టారు. 1973లో 'తల్లీ! ఎవరు నువ్వు?' అని జిల్లెళ్ళమూడి(బాపట్ల) అమ్మపై కవితా బాణం ఎక్కు పెట్టారు. ప్రభావం-దిగంబర కవులూ, నాస్తిక హేతువాద ఉద్యమాలు. ఆ చిన్న కవితాసంపుటి (దీర్ఘకవిత) -1975, 1978, 2006లలో పునర్ముద్రణ పొందిందంటే అర్థం చేసుకోవచ్చు- రెండో పుస్తకం శ్రీ బాబా మహత్యం (పుట్టపర్తి సత్యసాయిబాబాపై విసిరిన కత్తి). 1975/1976/2006లలో పునర్ము ద్రణలు పొందింది. అయితే ఎన్నిసార్లు పునర్ముద్రణలు పొందడం కాదు, ఎందర్ని నాస్తికులుగా మార్చిందీ అని పాఠక(దేవుళ్ళు?) మిత్రులు ప్రశ్నించొచ్చు. ఆయన అమ్మలేక - పుస్తకాలు పంచేరు అన్నా గాని, ఆ పుస్తకాలు ఎందరో ఇళ్ళలోనే ఉన్నాయని అర్థం కదా. వారందర్నీ ఎంతో కొంత ప్రభావితం చేశాయన్నమాటే గదా. మూడో పుస్తకం ముమ్మిడివరం బాలయోగి మీద విసిరిన కత్తి "బాల యోగీశ్వర సందర్శనం"1976 / 2006 ముద్రణలు. నాలుగో పుస్తకం "మత ప్రస్థానం" ఇందులో అన్ని రకాల మతాల వారి మీద మొత్తంగా శతఘ్నిలాంటి విమర్శ ఉంటుంది. శ్రీశ్రీ "మహాప్రస్థానం"ని అనుకరిస్తూ 'మతప్రస్థానం' అని పేరు పెట్టారని ఒక ఆరోపణ. నిజమే. మహాప్రస్థానంలో సాంప్రదాయిక అర్థం ఎలాకాదో, ఎలా ఒక విప్లవాత్మక

ప్రయోజనం ఉద్దేశితమైనదో,అలాగే "మతప్రస్థానం" కూడా మత విమర్శ- సామాజిక, ఆర్థిక, సాంస్కృతిక కోణాలలో -ఉన్నది అని నా సమాధానం (అంటే అశోక్‌కుమార్ గారి పుస్తకమే అని నా సమర్థన). ఆ తరువాత వెలువడిన 'శుభాకాంక్షలు' - దీర్ఘకవిత (2003), 'తంత్రం' (2004), 'పొద్దుపూసింది' (2004), 'ఆధ్యాత్మిక ర'హ'స్యాలు' (2004) మినీ కవితా సంపు టాలకు కూడా ఈ సమాధానం, సమర్థన వర్తిస్తాయి.

శ్రీశ్రీ "ఆః" మినీ కవితని-'మినీ కవితా ప్రారంభం' (1970ల చివర, 1980ల్లో) అని తరు వాత అన్నారు. నా అభిప్రాయం ఏమంటే - శ్రీశ్రీ ఆః (1940కి ముందు) రాసే నాటికి 'మినీ కవిత' అనే కాన్సెప్ట్ (భావన) తెలుగు కవితా రంగంలో లేనేలేదు. ఆ తరువాత వచ్చింది.

మరొక విషయం- అశోక్‌కుమార్ గారు ఉద్యోగ రీత్యా ఏదో ఒక దశలో ఉపాధ్యాయులు కాదు. సాహిత్యం, సృజనాత్మకత, సామాజిక విశ్లేషణ- వ్యక్తిగత జీవితంలోంచి కనీసం తన భావజాలాలనుకనుగుణమై ఆచరణలోంచి-నేర్చుకున్నారు. అలా మార్క్సిజం కూడా నేర్చుకున్నారు. శ్రీశ్రీ పై ఎంత అభిమానం పెంచుకున్నా రంటే-'చినుకు' సాహిత్య మాసపత్రికలో 20 నెలలుగా -'శ్రీశ్రీ క్విజ్' నిర్వహిస్తున్నారు. సవివరమైన సమాధా నాలు సమకూరుస్తున్నారు. తాజాగా వెలువరించిన తొమ్మిదో మినీ కవితాసంపుటి పేరు 'వ్యూహం' జూలై 2006లో వెలువడింది.

సాహితీమిత్రుడు చెరబండరాజుకి అంకితం-
**'అగ్నిపుత్రుడు'**
**చెరబండరాజుగానం/**
**సమరశీల తెలంగాణం**
**అసమాన 'తలలు' తీసే**
**శ్రమవాద మార్పు బాణం.'**

కవితాప్రియులు ఎవరికైనా ఈ ప్రారంభం, కవి ఎటు ఉన్నాడో స్పష్టంగానే తెలుస్తుంది. పద్య కవితా వ్యామోహపరులు బహుశాముఖం చిట్లిస్తారు. పద్యకవులకు మినీ కవితలూ, నానీ, హైకూ - ఇవన్నీ ఇష్టమే. బహుశా చెరబండరాజు పేరు కొంచెం ఇబ్బంది. మార్పు శ్రమవాద బాణం మరీ ఇబ్బంది-

ప్రయోగవాదం తప్పనికాదు,దాంట్లో ప్రయో జనవాదం కలగలసి ఉండాలి. ఆ పని సమర్థవం తంగా చేస్తున్న కవి - అశోక్‌కుమార్.

నాస్తిక, హేతువాదులకూ - అభ్యుదయ, విప్లవ, ప్రగతిశీలురకూ ఆయన అందుకే ఆత్మీయుడు.

తొలి కవిత - **'సోమరిపోతు'**
**' కాలు తీసి**
**కాలు వేసేది**
**దున్నేపోతు**
**కాలుమీద**
**కాలు వేసేది**
**దున్నపోతు '**

చమత్కారం, చర్నాకోలాలాంటి నిశిత విమర్శ, కల గలసిపోవడమంటే ఇదే. ఏటాటే దాదాపు కవిత్వం రాయగలవాళ్ళు పునరుక్తులకు పాల్పడటం సహజం. ఇందుకు సినిమాపేర్ల కంటే గొప్ప ఉదా హరణ మరొకటి ఉండదు. అన్నింటిలోనూ ప్రేమ, గూండా యిజం, సెంటిమెంట్, సుఖాంతం-ఉంటాయి. ఒకవేళ ఉంటే, నిష్పత్తుల తేడా ఉండొచ్చు. వ్యాపార ధోరణిలోనూ కీర్తికండూతిలోనూ ఒకర్నొకరు మించి పోతారు సినిమావోళ్ళు. ఏ సినిమాపేరు, ఏ సిని మాకైనా అన్వయించుకోవచ్చు. మరి హేతు వాదం మార్క్సిజం గలవాళ్ళు- ఈ దరిద్రం ఉండదు. జీవిత వైవిధ్యం- కొత్తకొత్త సమస్యలంతా వైవిధ్యంగా, విస్తారంగా ఉంటుంది.

అమ్మలపై, బాబాలపై విమర్శతో ప్రారంభిం చిన అశోక్‌కుమార్‌గారు-సామ్రాజ్యవాద వ్యతి రేకతతో రాటుదేలారు. సామ్రాజ్యవాద సమస్త కోణాలపై మినీ కవితాకత్తులు దూశారు.

**౦ నేడు, పుస్తకాలకు, పురుగులు /**
**రేపు, విదేశాలకు, పరుగులు !**
**౦ అమెరికా, కోర్టులో, భూమిలేదు /**
**భూమి, కోర్టులోనే, అమెరికాఉంది !**
**౦ కుల, దళితులు, చిరుభాగం /**
**శ్రమ, దళితులు, భూభాగం !**
**౦ దేశాలను, తెలిపేది, ఎగిరే జెండా /**
**దేశాలను, కలిపేది, ఎర్రని జెండా !**

కవితలు ఉదహరిస్తూ పోవడం విమర్శకుడి బలహీనత.కానీ కవితలన్నిటిలోగల ఆర్తినీ, ఆవేశాన్నీ, ఆదర్శాన్నీ-పట్టుకుని పాఠకులకు ఎత్తి చూపడం విమర్శకుని బాధ్యత.ఆ బాధ్యతనే తొలి కవితా సంపుటి నుంచీ- తొమ్మిదవ కవితా సంపుటి వరకూ అశోక్‌కుమార్‌గారు ఎదిగినతీరూ,సామాజిక రుగ్మత లని ఎండగట్టిన తీరూ వివరించాను.

చివరగా-విశాఖజిల్లా యలమంచిలిలో 'అవగాహన'గ్రంథాలయంలో ఈ మొత్తం 9 సంపు టాలు ఉన్నాయని, కొన్ని తొలి ముద్రణలు కూడా ఉన్నాయనీ చెప్పగలుగుతున్నందుకు గర్వంగా లేదు. కవికి - సమాజసేవ భావం, లేక గర్వం ఆ రెండూ తగదు.సమాజంనుంచి పొందిన జ్ఞానాన్నీ చైతన్యాన్నీ తిరిగి సమాజానికే అప్పగించాలన్న రుణభారంతో లేదా బాధ్యతతో ఈ గ్రంథాలయం నిర్వహిస్తున్నాను. అశోక్‌కుమార్‌గారే కాదు-వారిపై ప్రభావం కలిగిం చిన- శ్రీశ్రీ, రంగనాయకమ్మ సమగ్ర రచనలు చూడలన్నా రావొచ్చు. 'అవగాహన'లో ఎందరెందరో అశోక్‌కుమార్‌లు తయారుకావాలని ఆకాంక్ష. ■

## అక్షర హాలికులు

**అశోక్‌కుమార్**



## వల్లంపాటి వెంకటసుబ్బయ్య

**(1937 - 2007)**



**విమర్శాశిల్పం**

గురిఎరిగిన శస్త్రం
నలుపుతెలుపు శాస్త్రం
వివేచనావిమర్శ
వల్లంపాటి అస్త్రం

**అఆఇఈలు...**

అ - అమ్మ ఇ- ఇల్లు నిన్నటి స్వరం !
అ - అమెరికా ఇ - ఇంగ్లాండు నేటి జ్వరం !





# ఆరుపదుల అశోక్ కుమార్

రారాసి

**అది 1970 - 1971 - ఇది 2010 - 2011**

**మాది నాలుగు పదుల సంవత్సరాలుగా నిరాటంకంగా కొనసాగుతున్న ఆత్మీయ సోదర అనుబంధం. ఏవిధమైన పొరపొచ్చాలెరుగని ప్రేమానుబంధమే కాదు వైరుధ్యాల్లేని సైద్ధాంతిక ఐక్యతానుబంధం కూడా.**

**అశోక్‌కుమార్‌తో పరిచయం నా జీవితానికో టర్నింగ్ పాయింట్. నాలాగే అశోక్ కుమార్ జీవితంలో పెద్దాపురంలో గడిపిన కాలమ్ మేలు మలుపు అని నేను భావిస్తాను.**

అది 1970 – 71 పెద్దాపురం (తూ॥గో॥ జిల్లా)

మహరాణీ కాలేజీలో బి.కామ్ చదవడానికి కాకినాడ నుండి వాళ్ల అక్క గారింటికి వచ్చాడు. అప్పుడు నేను మెట్రిక్యులేషన్ ప్రైవేటుగా చదువుతూ అమాయకత్వం – అల్లరిలో మునిగివున్న రోజులు. అశోక్ కుమార్ ఎప్పుడూ పంక్చువాలిటీని పాటిస్తూ – సెల్ఫ్ డిసిప్లిన్‌కి పెట్టింది పేరు. అంటే ఉదయం 8 గంటలకు కాలేజీలో క్లాసులు స్టార్టవుతాయంటే – క్లాసురూములోకి 8-05నిముషాలకు ప్రవేశించేవాడు. అశోక్‌కుమార్ క్లాసురూమ్‌లోకి ప్రవేశించడంతో గడియారాల్లో టైమ్ సరిచేసుకోవచ్చని తోటి విద్యార్థులనుకునే వారంటే ఎటువంటి పంక్చువాలిటీ మైన్‌టైన్ చేసేవాడో అర్థం చేసుకోగలం. ఇది తను కాలేజీలో చదివినన్నాళ్లూ కొనసాగించాడంటే–ఎంతటి క్రమశిక్షణను అలవర్చు కున్నాడో చెప్పడానికో చిన్న ఉదాహరణ. తన చుట్టూ వున్న మనుష్యులను, పరిస్థితులను అంచనా వేయటంలోనూ, ఆ పరిస్థితుల్ని విప్పిచెప్పడంలోనూ, వాటిని తనకనుకూలంగా మార్చుకోవటంలోనూ తనదైన, మృదువైన కన్విన్సింగ్ శైలొకటుంటుంది. అలాగే 10, 15, 20 సంవత్సరాల వరకూ ప్రణాళికను రచించుకొని అది విజయవంతం కావటానికి కావాల్సిన పరిశ్రమ, దృఢత్వం పుష్కలంగా ఉన్నవాడు. కాబట్టే 'మహాప్రస్థానం' ముందుమాటలో గుడిపాటి వెంకటచలంగారు వెసులుబాటు యిచ్చినట్టు – 1976–77 మధ్యలో వదిలిన సాహిత్యవ్యాపకాన్ని 2003–2004ల్లో – అంతే ఊపుతో, అంతకంటే పరిణతితో కొనసాగింపునకు పూనుకోగలిగాడు. అందువల్లే మా సర్కిల్‌లో అశోక్‌కుమార్‌కు ఓ ప్రత్యేక స్థానం ఉంది.

అవి నేను యవ్వనంలోకి అడుగుపెడ్తున్నరోజులు. అశోక్‌కుమార్ అనే అద్భుతం నాకు కలవడంతో – నా జీవితం మధురమైన జ్ఞాపకాలెన్నో యిప్పటికీ తాజాగానే దాచుకోగలిగింది. నన్ను అపురూపంగా చూసుకోవడమే కాదు స్నేహం, ప్రేమ, విజ్ఞానాల్తో వ్యక్తిత్వం సంతరించుకునేలా మలిచాడు నన్ను. అందుకే

నాకతని పరిచయం అపురూపం కాదు అద్భుతం కూడా.

1971లోనే నీకు నచ్చే పుస్తకం అంటూ పడాల రామారావుగారి 'ఆంధ్రశ్రీ అల్లూరి సీతా రామరాజు'ను నాకు బహుమతిగా యిచ్చాడు. అప్పటికే నేను శ్రీశ్రీగారి 'మహాప్రస్థానాన్ని' చదివిన వేడిలో ఉన్నాను. ఒకసారి కుర్రాడన్నవాడు మహాకవి శ్రీశ్రీ 'మహాప్రస్థానా'న్ని చదివాడంటే వాడెప్పుడూ నిత్యయవ్వనుడే. శ్రీశ్రీని తాగింతర్వాత, శ్రీశ్రీచెప్పిన మరో ప్రపంచం గురించి తప్ప ఆలోచించడానికి ఈ భూమ్మీద మరేమీ మిగిలివుండదు. (కన్పించదు) 'మహాప్రస్థానం' పుస్తకాన్ని తాకిన చేతులకి ప్రవహించిన విద్యుత్-ఆ విద్యుత్ వల్ల కలిగిన షాక్-ఈ సమాజం-శ్రీశ్రీ కోరిన విప్లవాత్మక మార్పు పొందే వరకూ శరీరాన్ని వదలదని చాలామంది లాగే నేనూ నమ్ముతాను.

అప్పటికి నేను సి.రా.అనే కలం పేరుతో రాసేవాణ్ని. ఆ తర్వాత అశోక్‌కుమార్ సూచన మేరకు రామారావు సింగంపల్లిని 'రారాసి' మార్పుచేసి స్థిరపడ్డం జరిగింది.

పెద్దాపురంలో అప్పటికే కథలు రాస్తున్న దార్ల తిరుపతిరావు (ఆంధ్రాయూనివర్సిటీలో ఉద్యోగం చేసి రిటైర్ అయి విశాఖలో స్థిరపడ్డాడు).ముక్కామల దేవీ నాగమోహనరావు (టీచర్‌గా రిటైర్డ్ అయినట్లు తెలిసింది) మరికొంతమంది మిత్రుల్లో నిత్యం సాహిత్యచర్చ చేస్తూ సభలు, సమావేశాల్లో పాల్గొంటూ కవితలూ, కథలూ రాయడానికి కుస్తీ పట్టే వాళ్లం. అదే సమయంలో సాహిత్య చోరుల్ని వేటాడ్డం కూడా పనిగా పెట్టుకునే వాళ్లం.

భావకవి, గౌతమీకోకిల వేదుల సత్యనారాయణశాస్త్రి గారు పెద్దాపురం లూథరన్ హైస్కూల్‌లో టీచర్‌గా పనిచేసి రిటైర్డ్ అయి పెద్దాపురంలోనే వుండేవారు. వారి సాన్నిహిత్యంవల్ల -భావకవుల గురించి, వేదుల వారి కావ్యాల గురించీ, శాస్త్రిగారు బెంగాల్ నుంచి అనువదించిన విశ్వకవి రవీంద్రుని పుస్తకాల గురించీ ఇతర వంగసాహితీవేత్తల గురించి ఎన్నో విషయాలు శాస్త్రిగారివల్ల తెల్సుకోగలిగాను. అశోక్‌కుమార్ పెద్దాపురాన్ని వదిలి రామచంద్రపురం (తూ॥గో॥ జిల్లా)లో వాళ్ల తండ్రి వ్యాపారం (సైకిల్ స్టోర్స్) చూస్తున్నప్పుడు అదృష్టదీపక్‌తో పరిచయం కల్గింది. దీపక్ ద్వారా బి.వి.ఎస్.శాస్త్రి, కె.వి.ఎస్ వర్మ పరిచయమయ్యారు. బి.వి.ఎస్.శాస్త్రి అప్పటికే అన్ని సాహిత్య ప్రక్రియల్ని ఔపోసన పట్టటమే కాదు సాహితీవ్యాసంగాన్ని వృత్తిగాను, ఉపాధిగాను ఎంచుకున్నవారు. అదృష్టదీపక్-శ్రీశ్రీ వీరాభిమానిగా నోరున్నవాడు. (మంచి ఉపన్యాసకుడూ, గాయకుడూ అనే అర్థంలో) కె.వి.ఎస్.వర్మ కథా రచయిత, మీదు మిక్కిలి అదృష్టదీపక్‌కి మంచి మిత్రుడు కావటం వల్ల మాకూ మంచిమిత్రులయ్యారు. వీళ్ల పరిచయంతో ముఖ్యంగా దీపక్ పరిచయం వల్ల- దిగంబరసాహిత్యం గురించి, ఆ ఉద్యమం తర్వాతి పరిణామాలు తెలుసుకోగలిగాం. అలాగే సాహిత్యచర్చ కూడా లోతుగానే జరిగేది. సాహిత్యం-సిద్ధాంతం -ఆచరణ-వీటిలో తలమునకలై గడిపాం.

ఈ పరిచయాలు, సాహిత్య అభ్యుదయనాలు. అశోక్‌కుమార్ కిష్టమైన వృద్ధ గాంధీగారిని, గాంధీగారి శాంతిఅహింసల్ని త్యజించడానికి గాని, మానవ జాతిని మేల్కొలిపే యువతరం, రేపటితరం దూత అయిన శ్రీశ్రీని, శ్రీశ్రీ విప్లవాత్మక భావాల్ని స్వీకరించి ముందుకు నడవడానికి అశోక్‌కుమార్‌కు సహకరించామని ఆశిస్తాను. అందుకే పెద్దాపురంలో అతను గడిపిన కాలం నుండీ ఈ క్రమం అంతా అతని జీవితంలో గొప్ప మలుపుగా నేను భావిస్తాను.

1972 జనవరి 1వ తారీఖు

అశోక్‌కుమార్,కుమారిని కులాంతర వివాహం చేసుకున్నాడు. ఈ పెళ్లి దండలు మార్చుకొని మిత్రుల మధ్య వేడుకలా జరుపుకున్నాడు. ఆశయాల్ని వల్లించడం కాదు ఆచరించాలని తన వివాహవేడుక ద్వారా చెప్పడం-నన్నెంతో సంతోషపర్చింది. ఆచరణ వైపు అడుగేసి చూపించేతీరాలనే తలంపును, పట్టుదలను కల్గించింది. ఈపెళ్లివల్ల కష్టనష్టాల్ని, ఎదురయ్యే యిబ్బందుల్ని ముందుగా ఊహించి కూడా దృఢంగా అతను ముందుకు అడుగేయడం -నా కిప్పటికీ చాలా యిష్టమైన రోజు. ఆ వేడుక. అందుకే నా దృష్టిలో ఆ రోజుకు చాలా ప్రాధాన్యం ఉంది. పెద్దలు చెప్పినదార్లో నడవకపోవడమే గాక వారికి వ్యతిరేక మార్గంలో నడవటం,సాంఘిక కట్టుబాట్లను తెంచాచుకుని ముందుకు పోవాలని అశోక్‌కుమార్ ఆచరించి చూపించాడు.ఇది కొంత సంచలనం కలిగించింది. ఆ వివాహానికి హాజరవడమే కాదు ప్రశంసాపత్రాన్ని ఆ వివాహవేదిక మీద నేను చదవడం జరిగింది. ఇది మిత్రులందరిలో ఉత్సాహాన్ని, ఆవేశాన్ని నింపడమే కాదు ఆచరణవైపు ఆలోచన కలిగేలా చేసింది.

ఈ వివాహ సంబంధం ఇలాముగిసిందో లేదో మా ఇళ్లల్లో మా ఆదర్శాలపట్ల ఆగ్రహాలు, నిరసనలు చివరికి గొడవలు భారీగా మోగాయి. అన్ని విధాలుగా చెడిపోయిన అశోక్‌కుమార్‌తో స్నేహాన్ని చూస్తూ చూస్తూ ఏ కుటుంబంలోని పెద్దవాళ్లయినా ఎలా సహిస్తారు?అందుకే వీళ్ల ఆగ్రహాల్ని, దుఃఖాల్ని అన్నీ వాళ్లకే వదిలి నేను తాత్కాలికంగా నా మకాం కాకినాడకు మార్చాను. అప్పట్నుంచీ మాకు కొత్త కష్టాలు ప్రారంభం అయినా-అవేవీ మమ్మల్ని ఆపలేవుకదా! గుండెల్నిండా ఆశయం. ప్రక్కన కొండ లాంటి అన్న అశోక్ కూడా. బెదురేముంది?

మా ఇంట్లో వాళ్లు, నాతో రాజీపడ్డాక నేను నా స్వగ్రామం పెద్దాపురం చేరడంతో-మా కార్యక్రమాలు మళ్లీ ఊపందుకున్నాయి. నిరంతరం విప్లవ

## అక్షర హాలికులు

అశోక్‌కుమార్



## బి.వి.యస్.శాస్త్రి

**(1950-1999)**



## మహానగ్న

ప్రక్రియ ఏదైనా కావచ్చు
సాహిత్యం రగిలే కార్చిచ్చు
బివియస్ కలంనుండి అక్షరాలు
కదు రణనీయంగా కదలివచ్చు



# ఏంటట గొప్పా ?

**వై.కె.మూర్తి**

నువ్వు 'ఏకే' వా ?
అయితే ఏంటట గొప్పా
నేను 'వైకే' ను.

నువ్వు కవితలూ గట్రా రాస్తావా?
రాస్తే ఏంటట గొప్పా ?
నేను జోకులు కూడా రాస్తాను !

నువ్వు ఉండకోవాలా ఉంటావా?
ఉంటే ఏంటట గొప్పా ?
నేను బండకోవాలా ఉంటాను !

నీది రంగుజుట్టు ఉన్న బుర్రా ?
అయితే ఏంటట గొప్పా ?
నాది ఏ జుట్టూలేని బుర్ర !

నీకు అరవైఏళ్లొచ్చాయా?
వస్తే ఏంటట గొప్పా?
నాకెప్పుడో వచ్చాయ్ !

నువ్వు శ్రీశ్రీ మనవడివా ?
'మహాప్రస్థానం' కొడుకువా ?
అమ్మో ! అమ్మో ! ఐతే ఓకే !
ఈ వైకే హేట్సాఫ్ నీకే ! ■

సాహిత్యాన్ని, సిద్ధాంతాన్నీ అధ్యయనం చేస్తూ, ప్రచారం చేస్తున్న క్రమంలో కాకినాడలో అద్దేపల్లి రామమోహనరావు, వెంకట్రామయ్యగారు (నందనోదయ) లాంటి మిత్రులు పరిచయమయ్యారు. అద్దేపల్లి మాకు పెద్దదిక్కు. అన్ని సభలు,సమావేశాల్లో రామ్మోహన్‌రావుగారితోపాటు మిత్రులందరం కాలాన్ని మర్చిపోయి చర్చల్లో తేలిపోయేవారం. సాహిత్యాన్ని తెగతాగేవారం. జి.సుబ్బారావుగారు, కుమారస్వామిగారు,లక్ష్మీనారాయణగారు, చంద్రశేఖర్ గారు యిలా ఎంతోమంది మిత్రులు అందరికీ 'నారాయణ బార్బర్‌షాపు' కేంద్రం అయినప్పటికీ తెలుగు సాహిత్యాన్ని ఊపేస్తున్న విప్లవకవులందరూ మాకు ప్రేరణే. మాకు ఆదర్శమే. ముఖ్యంగా వరవరరావు, చెరబండరాజువంటి విప్లవకవులు, శివసాగర్, నగ్నమునివంటి రివల్యూషనరీ కవులు, ఉద్యమ కవులు, శ్రీకాకుళంలో పోరాటం Set back తర్వాత, విప్లవ సాహిత్యం రాష్ట్రమంతా ఉప్పెనలా ఎగుస్తున్న ఆ జ్ఞాపకాల్ని ఆరోజుల్నిప్పటికింకా కాకినాడలో నారాయణగారి బార్బర్‌షాపులో దాచుకున్నట్టే ఉంటుంది. అలాగే రాజమండ్రిలో కాటా నారాయణరావుగారు కేంద్రంగా ఉండేవారు. ఏలూరి సూర్యారావుగారు, సి.ఎస్.శర్మగారు, ఎంతో మంది మిత్రులుండేవారు. రాజమండ్రిలో మిత్రులు తరచూ పౌరహక్కుల వేదికమీదో, భారతచైనా మిత్రమండలి పేరుమీదో మహాకవిశ్రీశ్రీతో బాటూ విప్లవకవుల్తోటి బహిరంగ సభలు నిర్వహించేవారు.

1973లో అశోక్‌కుమార్ 'తల్లీ! ఎవరునువ్వు?' అంటూ జిల్లెళ్లమూడి అమ్మమీద మొట్టమొదటి బాణం సంధించాడు.ఆ దీర్ఘకవితకు, అద్దేపల్లి రామ్మోహనరావుగారి సుదీర్ఘ పీఠిక తోడై-పుస్తకంగా ప్రచురించబడటం-జరిగింది. ఈ పుస్తకాలు దొరికే అడ్రస్ : రారాసి,మెయిన్‌రోడ్,పెద్దాపురం.తూ॥ గో॥ జిల్లా. ఈ పుస్తకం మా యాక్టివిటీస్‌కి, ప్రచారానికీ అడ్రస్‌లా తయారయింది. మా కార్యక్రమాలను ఈ జిల్లాలోని ఇతర ప్రాంతాలకూ, ఇతర జిల్లాలకూ దూసుకెళ్లింది. మార్పు నాహ్వానించే యువకులెందర్నో నాకు పరిచయం చేసింది. ఈ ప్రతులకు నా అడ్రసుండటంవల్ల ప్రతినిత్యం కొత్త యువకులతో పరిచయం జరిగింది. ఒక ఆర్గనైజర్‌లాగ ఆ రోజుల్లో ప్రజల్లో ముఖ్యంగా యూత్‌ని ఎట్రాక్ట్ చేసిందంటే -దీని ప్రభావాన్ని ఊహించవచ్చు. ఆ తర్వాత సి.యస్.శర్మగారు గౌరవాధ్యక్షులుగా, అశోక్‌కుమార్ ప్రధాన కార్యదర్శిగా తూర్పుగోదావరి జిల్లాలో క్రాంతి రచయితల సంఘం ఏర్పాటయింది. ఏలూరి సూర్యారావుగారు 'ప్రజాసమస్యలు' పేరుతో ఒక పక్ష పత్రికను ప్రచురించేవారు. దీన్లో అద్దేపల్లి రామ్మోహనరావు గారితోబాటు ఆనాటి ప్రముఖవిప్లవకవులు, రచయితల రచనలుండేవి. అప్పట్లో బి.వి.ఎస్‌శాస్త్రి రాజమండ్రిలోఉండేవారు. బి.వి.ఎస్ శాస్త్రి గొప్ప కవి, సాహిత్యవేత్త కావటం వల్ల ఆ సాహిత్యంలోని అన్ని ప్రక్రియల్లోనూ-అటు కమర్షియల్‌గా యిటు విప్లవాత్మకంగా రాయగలిగేవాడు. శాస్త్రితోగడిపిన రోజులన్నీ -ఎంతో విలువైనవి.

అప్పట్లో మా డాషింగ్ హీరో-త్రిపురనేని మధుసూదనరావు గారు. త్రిపురనేని మాలో విప్లవ సిద్ధాంతంపట్ల అవగాహనను పెంచడంతోపాటు, సిద్ధాంత ప్రాతిపదిక మీద మంచి విప్లవ రచనలు చేయడానికి ప్రేరణ కలిగింది.

ఆ సమయంలోనే విప్లవభావాలున్న సాహితీ మిత్రులం కొందరం కాకినాడలో ప్రతి ఆదివారం 'కమ్యూనిస్ట్ మానిఫెస్టో'తో బాటు, ఇతర కమ్యూనిస్ట్ సాహిత్యాన్ని క్రమం తప్పకుండా చర్చించుకుంటూ, అధ్యయనం చేసేవారం.ఈ క్రమం అంతా మాలో విప్లవభావాలు పరిణతిపొందడానికి బాగా తోడ్పడ్డాయి.

1973లో వరంగల్‌లో విరసం సభలు, సాహిత్య పాఠశాల నిర్వహణ జరిగాయి. అప్పుడు మహాకవి శ్రీశ్రీని దగ్గరగా చూడ్డంతోబాటు ఆయనతో రెండు, మూడు రోజులు గడపడం జరిగింది. విప్లవ రచయితలు కె.వి.రమణారెడ్డి, వరవరరావు, చెరబండరాజు, నగ్నముని ఇలా అందర్నీ కలవడం జరిగింది. ఆ సమావేశాలకు అశోక్‌కుమార్, బివిఎస్ శాస్త్రి, నేను ముగ్గురం వెళ్లాం. అప్పుడే, అప్పటికే తెలంగాణ పల్లెల్లో విప్లవగేయాల్తో వీరవిహారం చేస్తున్న గద్దర్‌నీ, ఎన్.వేణుగోపాల్‌లాంటి యువ కవులెందరితోటో పరిచయంకలిగింది. మేం కాకినాడ విరసంయూనిట్ తాలూకు సభ్యత్వం అప్పుడే నమోదు చేసుకున్నాం. త్రిపురనేని మధుసూదనరావుగారి ప్రేరణతో అశోక్‌కుమార్ కన్వీనర్‌గా, నేను, నందనోదయ, రారాసి, ఈశ్వర్, విక్రాంత్, హైమ, ఉమ సభ్యులుగా కాకినాడ విరసం యూనిట్ ఏర్పడింది. అప్పుడు వరంగల్‌లో సాహిత్య పాఠశాల పూర్తయిన తర్వాత-వరంగల్‌నుండి-హనుమకొండ వరకూ బహుశా 6 కి॥మీ॥ శ్రీశ్రీ నాయకత్వంలో విరసం నిర్వహించిన లాంగ్‌మార్చ్‌లో శ్రీశ్రీతోబాటు నడవటం గొప్ప విప్లవానుభూతి. ఊరేగింపు ఒక కిలో మీటర్ నడిచిందో,లేదో జనం వెల్లువలా వచ్చి చేరారు. ఊరేగింపులోని జనం, విప్లవ రచయితలంతా ఒక ఎత్తయితే-శ్రీశ్రీ ఒక్కడే ఒక ఎత్తు అనిపించింది.ఊరేగింపులో విరసం జెండా పట్టుకొని ముందుగా నడుస్తున్న శ్రీశ్రీని చూస్తుంటే - ఇంత పోలీస్ హంగామా- ఆర్భాటమూ ఉన్న నాటి రాష్ట్ర ముఖ్యమంత్రి అయినా సరే (వ్యక్తిగత ఆలోచనల్తో నిమిత్తం లేకుండా) శ్రీశ్రీ వెనకే నడిచితీరాలన్నంత దర్పం, ఠీవి ఆయనలో కన్పించాయి. ఆయనలో ఎంతటి మిలిటెన్సీ దాగుందో కదా! అలాగే ఆ లాంగ్‌మార్చ్‌లో పాల్గొన్న జనంలో కూడా ఎంతటి పోరాట ఆతృత! దారిపొడుగునా గుండె నెత్తురులు

తర్పణ చేస్తూ 'పదండి ముందుకు పదండి త్రోసుకు' – అన్న వాక్యాలు ప్రజలై హోరెత్తుతూ–మార్చింగ్ చేస్తున్న దృశ్యం ఇప్పటికీ కన్పిస్తూనే ఉంది. ఆఖరున జరిగిన బహిరంగసభలో విప్లవ కవులు వరవరరావు, మధుసూదనరావు, జ్వాలాముఖి మొదలైన వారంతా –మహాకవి శ్రీశ్రీ అండ చూసుకొని రెచ్చిపోతున్న భావం కొట్టొచ్చినట్టు కన్పించింది.

మేం విరసం సభ్యులయిన కొన్ని రోజులకు ఒక చిన్న సంఘటన జరిగింది.

రాజమండ్రిలో పౌరహక్కుల సంఘం ఆధ్వ ర్యంలో శ్రీశ్రీ గారితోబాటు త్రిపురనేని మధు సూదన రావుగారు, ప్రత్తిపాటి వెంకటేశ్వర్లు మరి కొంతమంది ఉపన్యాసకులుగా బహిరంగ సభను ఏర్పాటు చేశారు – ఈ సభతోపాటు పెద్దాపురంలో కూడా బహిరంగ సభ ఏర్పాటు చేసుకోవడానికి శ్రీశ్రీగారి అనుమతిని ముందుగా పొందడం జరిగింది. కేవలం శ్రీశ్రీగారి కోసమే అక్కడ తెలుసు. అప్పటికే శ్రీశ్రీగారితో కాకినాడలో కొంత చనువు కూడా ఏర్పడింది. నేను పెద్దాపురంలో బహిరంగసభ నిర్వహణకు కావాల్సిన ఏర్పాట్లు పూర్తి చేసుకొని శ్రీశ్రీ గారిని తీసుకు రావడానికని రాజమండ్రి వెళ్లాను. కానీ శ్రీశ్రీగారు అనారోగ్యంగా ఉందంటూ పెద్దాపురం సభలో పాల్గో లేనని చెప్పారు. త్రిపురనేని మధుసూదనరావుగారు నచ్చచెప్పినా శ్రీశ్రీగారు ఆ సభలో పాల్గొనలేనని, డాక్టరు కాటా నారాయణరావు గారు మీ ఆరోగ్యం విషయంలో నేను దగ్గరుండీ అన్ని జాగ్రత్తలు తీసుకుం టారని హామీ ఇచ్చినా కూడా శ్రీశ్రీ గారు పాల్గొన డానికి ఇష్టపడలేదు. దాన్తో అందరూ నిరాశ పడ్డారు గాని నాకు మాత్రం శ్రీశ్రీ గారిని ఎలాగైనా పెద్దా పురం సభలో మాట్లాడించగలననే ధైర్యం సడలలేదు. ఎవరు చెప్పినా శ్రీశ్రీ గారు రాలేనంటున్నారు కాబట్టి ఆ సభను రద్దు చేసుకోమని మిత్రులంతా సలహా యిచ్చారు. మీటింగ్‌రద్దు చేసుకోవాల్సి వచ్చి నందుకు విచారించొద్దని నాకు ధైర్యం కూడా చెప్పారు.

ఆ సమయంలో శ్రీశ్రీ గారితో చివరిగా ఒక మాట చెప్తానని అందరినీ లాడ్జిరూము నుండి బయటకు పంపి తలుపు వేసి ఆయన ముందు నిలబడ్డాను. ఎప్పటిలాగానే ఎవరు నువ్వన్నట్టు నావైపు చూసిన శ్రీశ్రీగారికి నన్ను నేను మళ్లీ పరి చయం చేసుకొని చిన్న హెల్ప్ చెయ్యవలసిందిగా కోరారు. 'నన్ను మీతో పాటు మద్రాసు తీసుకొని పోయి ఏదైనా చిన్న ఉద్యోగం యిప్పించండి' అని సీరియస్‌గా అడిగాను దానికాయన వెంటనే కంగారు పడి విషయం ఏమిటని అడిగారు. 'మీరైనా పెద్దా పురం రండి–నన్నైనా మద్రాసు తీసుకుపొండి'. శ్రీశ్రీ గార్ని పెద్దాపురం ప్రజలెప్పుడూ చూడలేదు. అందు చేత అక్కడ జనం మిమ్మల్ని చూడ్డానికి ఆతృతగా ఉన్నారు. మిమ్మల్ని తీసుకొని వెళ్లకుండా మా ఊరు వెళ్లడం నాకు సాధ్యంకాదు అని చెప్పడంతో ఆయన నవ్వేసి–వస్తాను. ఏర్పాట్లు చేసుకోమని చెప్పి– ఆ రకంగా ఆ సభను విజయవంతం చేశారు.

మా ఇంట్లో భోజనం చేయడంతో పాటు అందరికీ నన్ను 'రాకాసి'గా పరిచయం చేశారు.

ఆ తర్వాత శ్రీశ్రీ గారితోబాటు, జ్వాలాముఖి, నిఖిలేశ్వర్‌లతో కొన్ని బహిరంగసభల్లో పాల్గొడం, శ్రీశ్రీ మతి మారకుండా చూసే బాధ్యతను తీసుకొని కూడా కట్టడి చేయలేకపోవడం జరిగింది.

ఆ తర్వాత కొన్ని రోజులకు విప్లవ రచయితలు కెవి రమణారెడ్డి, వరవరరావు, చెరబండరాజు, త్రిపురనేని మధుసూదనరావు వంటివారు ప్రమాద కారులని రాష్ట్ర ప్రభుత్వం భావించి అరెస్ట్ చేసింది.

అరెస్టులను నిరసిస్తూ రాష్ట్ర వ్యాప్తంగా ఆందోళ నలు, సభలూ వెల్లువెత్తాయి. భావ స్వాతంత్ర్యాన్ని కూడా అణగతొక్కడానికి రాష్ట్రప్రభుత్వం చేసిన కుట్రపూరిత నిర్బంధాన్ని వ్యతిరేకిస్తూ చాలా చోట్ల నిరసన ప్రదర్శనలూ జరిగాయి. దీంట్లో భాగంగానే కాకినాడ విరసం యూనిట్‌గా మేం కూడా 'కుట్ర– కుట్ర–కుట్ర' బులిటెన్‌ని ప్రచురిచండం జరిగింది. ఈ కుట్ర బులిటెన్‌కి నందనోదయ ఎడిటోరియల్ రాశాడు. అశోక్‌కుమార్ సెంటర్ స్ప్రెడ్‌లో విప్లవ రచయితల సంఘం స్వగతంగా పెద్ద కవిత రాశాడు. నేనూ, ఈశ్వర్ కవితలు రాశాం. కుట్రకోసం కొడవటి గంటి కుటుంబరావుగారు రాసి పంపిన వ్యాసం, శ్రీపతిగారి వ్యాసం ఈ బులిటెన్‌లో ప్రచురించడం జరిగాయి. ఈ కుట్ర బులిటెన్ విప్లవాభిమానుల్లో, సానుభూతిపరుల్లో మంచి ప్రభావాన్నే చూపింది.

**1974 :** అశోక్‌కుమార్ పుట్టపర్తి సత్య సాయి బాబా మీద 'శ్రీబాబామహాత్యం' అనే గేయం రాశాడు. మొదటగా ప్రచురించిన 'తల్లీ! ఎవరు నువ్వు?' అంటూ జిల్లెళ్లమూడి అమ్మమీద రాసిన గేయం కంటే – శ్రీ బాబా మహత్యం గేయం ఇంకా పదునుగా ఒచ్చింది. దాంట్లో బాబా శిష్యులు అక్కడికి వచ్చిన భక్తుల విషయాలన్నీ ముందుగా కూపీ లాగేసి బాబాకు అందిస్తారని చెప్తూ 'ఆ శిష్యుల గురించి' అవులిస్తే పేగులు లెక్కెట్టేస్తారు. ఎక్కువుంటే తెగ్గొట్టేస్తారు అంటాడు. ఈ మాటలు నేను ఇప్పటికీ సందర్భానుసారం చెప్తూవుంటాను. అలాగే ఆ గేయంలో కొటేషన్స్ చాలానే వున్నాయి. ఇవి మంచి కవితావేగంలో వచ్చాయి. కాబట్టి సామాన్యుడికి సూటిగా తాకి, ఎన్నో పుస్తకాలు ప్రచురించినంత గుర్తింపు, హేతువాద భావాలకో అడ్రస్ అన్నంతగా ప్రభావం కలిగింది అప్పట్లో.

అశోక్ కుమార్ వ్యక్తిగతం అయిన కుటుంబం గురించీ కొంచం యిక్కడ ముచ్చటించుకోకపోతే అతి ముఖ్యమైంది మిస్సయినట్లవుతుందనే ఈ మూడు మాటలు.

అశోక్ కుమార్ సాహిత్యపరంగా ఎటువంటి నిబద్ధత, ప్లానింగ్ పాటిస్తాడో – వ్యక్తిగతంగానూ,

## అక్షర హాలికులు

అశోక్‌కుమార్



### చలసాని ప్రసాద రావు

**(1939- 2002)**



### మాష్టర్ పీసు

కుంచె కలాల సరిసాగు
ప్రపంచం కబుర్ల పోగు
చలసాని ప్రసాదరావు
చురకళ పరవళ్ల వాగు

కుటుంబపరంగానూ అంతే నిబద్ధత, ప్లానింగ్ పాటిస్తాడు. 1972 జనవరి 1వ తారీఖున అతని వివాహవేడుకలకు శ్రీకారం చుట్టింది మొదలు - కుమార్తె జ్వలిత వివాహం, కుమారుడు విక్రాంత్ వివాహం జనవరి 1వ తారీఖునే జరపడం, అదీ తాను అనుసరించిన, నమ్మిన పద్ధతినే కొనసాగించడం - పండగలూ, సంప్రదాయ వేడుకలూ కాకుండా పుట్టినరోజుల్లాంటి సొంత వేడుకల్ని సకుటుంబంగా జరుపుకొనే ఏర్పాటు, చుట్టూవున్న వాళ్ల సంప్రదాయ పండుగల్ని ఘనంగా జరుపుకుంటున్నా, పిల్లలు చిన్న వాళ్లయినా, ఆ ప్రభావాన్ని వాళ్లపై పడకుండా పెంచడం చెప్పుకోదగ్గ విషయం. 40-45సం॥ నాటి స్నేహితం లేమూలనున్నా, వాళ్లతో ఏదో ఒక సందర్భాన్ని పురస్కరించుకొని సమాచార స్నేహ సంబంధాల్ని కొనసాగిస్తూ, వారితో స్నేహ సౌరభాల్ని తాజాగా నిలుపుకోడం అతని జీవనసరళిలో భాగంగా చేసుకున్నాడు. స్టాక్‌మార్కెట్ మాయాజాలంలో ఆరితేరిన వాళ్లకి - మార్కెట్ పెరిగినా - తరిగినా లాభం పిండగలరు. అలాగే అశోక్‌కుమార్ కూడా స్నేహితులు విసిగించినా, కోపించినా-స్నేహ పరిమళాన్ని పిండగలడు. అందుకే మొత్తంగా అతనో మంచి కమ్యూనికేటర్ అనిపిస్తుంది.

అలాగే తన కుటుంబాన్నంతా తనకిష్టమైన పద్ధతుల్లో తను నమ్మిన భావాలవైపు (వాళ్లు విసుక్కున్నా) నడిపించుకోడంలో దిట్ట. ఈ క్రమంలో తప్పనిసరిగా అక్కడక్కడా సన్నిహితులకు ఎదురయ్యే యిబ్బందులు, నిర్ణయాలు కటువుగా అన్పించిన సందర్భాలు ఉత్పన్నమైనా తను నమ్మిన రీతిలో నడుస్తూ తనవాళ్లను నడిపిస్తూ - అందుక్కావాల్సిన అన్ని జాగ్రత్తలు ఆర్థికపరంగా కూడా పాలించడం అతను అలవాటుగా చేసుకున్నాడు. చిన్నమాటలో చెప్పాలంటే ఒక మంచి సినిమా సక్సెస్‌కు కావాల్సిన సరంజామా అంతా నిత్యం సంచిలో వేసుకొని తిరుగుతున్నంత సాదాసీదాగా - ప్రొడ్యూసర్‌గా, డైరక్టర్‌గా, హీరోగా, విలన్‌గా, డిస్ట్రిబ్యూటర్‌గా, పబ్లిసిటీలో పండిపోయిన వ్యాపారవేత్తగా - అన్ని పాత్రల్ని ఏకకాలంలో నిర్వహిస్తూ - సక్సెస్ వైపు నడుస్తోన్న అశోక్‌కుమార్ వ్యక్తిగతం అనబడే కుటుంబ సినిమా విజయం.

2007-08 నుండి అందరివాడూ, అందని వాడూ అయిన మహాకవి శ్రీశ్రీని గురించి - శ్రీశ్రీ కోరిన విప్లవాత్మక భావాలను అందరికీ అందు బాటులోకి తేవాలని- ఒంటరిగా యజ్ఞం అంటారో- యాగం అంటారో(వాడుకభాషలో) అలాంటి కార్య క్రమం ప్రణాళికాబద్ధంగా అశోక్ కుమార్ మొదలు పెట్టాడు. మొదలు పెట్టిందగ్గర్నుంచీ పుంఖాను పుంఖాలుగా వస్తున్న అతని ఆలోచనలన్నిటినీ ఆచరా ణాత్మకంగా, నిర్మాణాత్మకంగా అనేక కోణాల్లో సభలూ, సమావేశాలైతేనేం, ప్రశ్నలూ-సమాధానాలు అయితేనేం-పుస్తకాలుగా వెలువరించడం రూపంలో ఐతేనేం ఆచరణలో పెడ్తున్నవాడు. బహుశా ఈ అక్షరయజ్ఞం అశోక్‌కుమార్ ఉన్నంత వరకూ కొన సాగుతుందని, అతనితో యిన్నేళ్ల నా పరిచయంతో నేను నమ్ముతున్నాను. శ్రీశ్రీలోని వెలుగు చూడని కోణాలన్నీ - బాగా బాగా మధించి శ్రీశ్రీని యింకా యింకా జనంలోకి తీసుకుపోవాలి.

కోట్లాది శ్రామిక ప్రజానీకమంతా శ్రీశ్రీని కవే అనుకుంటారో, మరింకేమనుకుంటారో గానీ - ఆ అశేష ప్రజానీకాన్ని సమ్మోహితున్నీ, మంత్రముగ్ధుల్నీ చేసి తను కూడా నడిపించుకున్న మాంత్రికుడూ, గొప్ప మాస్టారూ అయిన - శ్రీశ్రీ - ఒక్క 'మహా ప్రస్థానం' వల్లో, 'మరోప్రస్థానం' రాయడంవల్లో మాత్రమే గొప్పవాడై పోలేదు. 'నేనుసైతం సమిధ నొక్కటి ధారపోస్తాను'. ఎడారులూ, కొండలూ, గుట్టలూ అడ్డంకి కాదని - వీటిని దాటడానికి మార్పుకోరే మనుష్యులతో బాటు నడవడానికి ముందుకొచ్చాడు. ఆ విప్లవాత్మక మార్పుకోసం జరుగుతున్న పోరాటాల్నీ, త్యాగాల్నీ ఆవాహన చేసుకొని - తాను కూడా ఒక పోరాట జెండాలా మారి ప్రజల గుండెల్లో నిరంతరం ఎగురుతున్న వాడు. కనుకనే - శ్రీశ్రీ పరిశీలనలకైనా - పరిశోధనలకైనా అర్హుడు. ప్రతి పసిపాప నవ్వులో - బాల్యంలో - శ్రీశ్రీ కన్పించాలి. రేపటి సమాజంలో 'మరోమహాప్రస్థానాన్ని' రచించి అభివృద్ధి కోసం - ప్రకృతితో పోరాడే-గెలిచే-గొప్ప గొప్ప గేయాల్ని మనకందించే శ్రీశ్రీలు కాలాని కెప్పుడూ కావాలి. అందుకోసం అశోక్ కుమార్ - శ్రీశ్రీ భావాలను నిరంతరం - అవిశ్రాంతంగా - అందరికీ అందించే - ప్రయత్నం కొనసాగించాలి.

మాక్సిమ్ గోర్కీ పేరు సోవియట్ భూమికి అత్యంత ప్రియమైనదీ - ఆత్మయమైనదీ అని సోవియట్ కమ్యూనిస్ట్ పార్టీ సెంట్రల్ కమిటీ అన్నట్టు మహాకవి శ్రీశ్రీ పేరు శ్రామిక ప్రజావళి అంతిమ పోరాటానికి జరిపే విముక్తి గీతం కావాలి.

**నేడు 2010 - నవంబర్ - 6**

అరవై వసంతాల నా సోదరుడు
అమృత భాండంలాంటి శ్రీశ్రీని నిత్యం సేవిస్తూ
నూతన జవసత్వాలను సంతరించుకోవాలని
చిరకాలంగా నన్ను వేధిస్తున్న అనారోగ్యం
(స్పాండిలైటిస్) నుండి
తొందరల్లోనే బయటపడగలననే నమ్మకం
కొనసాగించగలననే హామీని
ఈ శుభ సందర్భంలో - యిస్తూ -
నీతోడే - నీవెంటే (వయసులోనే కాదు సుమా)
నీ సోదరుడి నాలుగు పదుల ఆత్మీయ
శుభాకాంక్షలివే.... ■

## అక్షర హాలికులు

అశోక్‌కుమార్



## భూషణం

**(1938-1999)**



## కొండగాలి

తూరుపు కథాభూషణం
బోనం నాగభూషణం
శ్రీకాకుళ గిరిజనాల
పోరాట అభిభాషణం

## ఉదయించే సూర్యుడు

నింగినిండా !
ఎగిరే ఎర్రని జెండా !





# 'ఒక శ్రీశ్రీ -ఒక అశోక్‌కుమార్'

దార్ల తిరుపతిరావు

సాహిత్య పరిచయం 1972లో జరిగితే అదే సమయంలో రారాసి ద్వారా అశోక్ పరిచయం అయ్యాడు.
మొట్టమొదట నేను కవిత రాసి రారాసికి చూపిస్తే నవ్వి బావుందన్నాడు.
కానీ నేను కథలు బాగా రాస్తానని ప్రోత్సహించింది, ఒక దృక్పథంలో నడిపించిందీ అశోకే.
నేను ఎలా రాస్తే బాగా రాస్తానో,తూ.గో.జిల్లా యాసలో రాస్తే బావుటుం దనీ నాలో ఆ యాసలో కథలు రాయించి ప్రోత్సహించిందీ ఆయనే.
ఆ ఊపులో రాసిందే 'గొప్పోళ్లు'.
దీపక్, వర్మ, నందనోదయ, సుబ్బారావు గారు, అద్దేపల్లి వారు వీరందర్నీ పరిచయం చేసిందీ అశోకే !.
అశోక్ కథలు రాయకపోయినా (రాస్తే బాగా రాయిగలరేమో!) చక్కగా విమర్శించగలడు, పరామర్శించగలడు, సమీక్షించగలడు.
నా కథలు చదివిన తర్వాత ఇప్పటికీ నాకు జ్ఞాపకం 'కథ ముగింపులో ఎందుకో తొందర పడ్డావు' అని తీర్పునిచ్చింది అశోకే!
అయితే మొదట్నించీ ఆయనికీ శ్రీశ్రీ అంటే అభిమానం! ఆ అభిమానంలో పుట్టుకొచ్చినవే 'శ్రీశ్రీ బులెటిన్లు', 'శ్రీశ్రీ-100' 'శ్రీశ్రీ క్విజ్'లు.
అశోక్ ఏ పనిచేసినా చిత్తశుద్ధితో చేస్తాడు. నాయకత్వ లక్షణాలు చాలా ఎక్కువ.
సాహిత్యానికి దూరమైన వాళ్లని కూడా బలవంతంగా దానికి దగ్గరగా ఈడ్చుకొస్తాడు.
ఎన్ని వ్యాపకాలున్నా నిద్ర పోతున్నప్పుడు తప్ప మిగిలిన అన్ని సమయాల్లో శ్రీశ్రీయే ఆయనకి వ్యాపకం.
35 సంవత్సరాల్నించి చూస్తున్నా అశోక్ సాహిత్యంలో కాలు పెట్టిన దగ్గర్నుంచీ యిప్పటి వరకూ శ్రీశ్రీ పల్లకీ మోసే బోయీలో ఆయనే మొదటి వాడు.
ఆ అభిమానం అతన్లోని సాహిత్యం ఆవిరయ్యేంత వరకూ ఉంటుందని నా నమ్మకం.
తన 'పొద్దు పూసింది ' కావ్యం వెనక అట్టమీద ప్రకటించినట్టు శ్రీశ్రీ అశోక్‌ని ఆవరించి, ఆవహించి ఉంటాడు.
కాబట్టే పేదల ఉదరాల ఆకలి గురించే రాయగలిగాడుగాని ప్రేయసి హృదయాల గురించి, అధరాల గురించి రాయలేక పోయాడు.
అశోక్ శ్రీశ్రీ గురించి ఇంకా చెయ్యాల్సింది - కొత్త తరానికి, ఈ నాటి స్కూల్ పిల్లలకీ ఎలా పరిచయం చెయ్యాలో ఆలోచించాలి.
అశోక్ చెయ్యగలడు, కొంగొత్తగా చేస్తాడు.
చేసే ఆరోగ్యం ఆయనకి ఉండాలని మనస్ఫూర్తిగా కోరుకుంటున్నాను.
ధాత్రి(ఈ పేరు కూడా అశోక్ పెట్టిందే)



## రైలు పట్టాలు

ప్రజలు

పోలీసులు





# చినుకుతో అశోక్....

లంకె జనార్ధన్

ఆరు పదుల అశోక్ కుమార్‌కి అభినందన సంచికగా చినుకు ముస్తాబవడం ఆనందాన్ని కలిగిస్తోంది. శ్రీ వాగ్దేవిటాలెంట్ సెర్చ్‌అసోసియేషన్ అని ఆంగ్లంలో ఎందుకు? తెలుగులోనే ఉండచ్చు కదా? అని ప్రశ్నించిన అశోక్ గారితో మొదటి పరిచయం 2005 లో నాకూ ... రాజగోపాల్‌కి కూడా

.... ఆ తరువాత చినుకు ప్రారంభించడం, తొలిసంచిక తీసుకు రావడంలో తెరవెనుక అశోక్ గారు పడిన శ్రమకు ప్రత్యక్ష సాక్షిని నేను. నిజానికి అప్పుడు ఆయన సంపాదక సభ్యుడుకూడా కాదు. ఆ తరువాత ఫీచర్స్ ఎడిటర్‌గా చినుకుతో అశోక్‌గారి అనుబంధాన్ని, అవినాభావ సంబంధాన్ని గుర్తుచేసుకోవడానికి, మొదటి రెండు సంవత్సరాల తన కృషిని శ్రీశ్రీ సాహిత్య నిధి పెట్టిన తర్వాత కూడా అప్పుడప్పుడు ఆయన స్పందించే తీరును గురించి తలచుకోవడమే ఈ నా చిన్న వ్యాసం యొక్క చిరుద్దేశ్యం.

2005 ఏప్రిల్‌లో చినుకుమాసపత్రిక తొలి సంచిక వెలువడింది. అప్పటినుండి సెంటర్‌స్ప్రెడ్‌లో అణువు శీర్షిక మినీ కవితలను ప్రచురించే కార్యక్రమాన్ని తన భుజస్కందాలపై వేసుకొని కొనసాగిస్తూ వచ్చారు. దానితోపాటు కొన్నేళ్లపాటు చివరిపేజీగా శ్రీశ్రీ క్విజ్‌ను కూడా కొనసాగించారు. ఈ చినుకు సంచికలను సాహితీ ప్రపంచానికి తెలియచేయడంకోసం తనతోపాటు సాహితీసేవచేస్తున్న ఎంతోమంది రచయితలతో రచనలు చినుకులో రాయించడానికి ప్రోత్సహించారు. కొంతకాలంపాటు తనే స్వయంగా ఫోన్‌లో మాట్లాడి రచనలను తెప్పించేవారు. అడ్రసులను సేకరించి చినకును పలువురికి పరిచయంచేశారు.

చినుకు మరింత ముందడుగు వేయడానికి కొన్ని శీర్షికలు ప్రవేశపెడితే బావుంటుందన్న తన ఆలోచనను మిత్రుడు రాజగోపాల్‌తో చర్చించి శీర్షికల ఏర్పాటుకు శ్రీకారం చుట్టారు. తనతో అత్యంత సన్నిహితుడైన కె.వి.యస్. వర్మగారితో 2005 జూన్ సంచికనుంచి 'ప్రతిధ్వని' శీర్షికను ప్రారంభించడంలో అశోక్ పాత్ర చెప్పుకోతగ్గది. అనంతరసెప్టెంబర్ 2005లో డా॥ అద్దేపల్లి రామ్మోహన్‌రావుతో 'నా గురించి నేను' అనే శీర్షికను తొలిసారిగా ప్రారంభించి సాహిత్యంలో ఉద్దండులైన పెద్దిభొట్ల, శివారెడ్డి, రంగనాయకమ్మ, నగ్నముని, జ్వాలాముఖి వంటి ప్రముఖుల స్వీయ అనుభవాలను ఈ శీర్షిక ద్వారా ఒక వేదికను ఏర్పాటు చేయటం జరిగింది. అశోక్‌కుమార్ దీనితో ఆగక ఆగస్ట్ 2005 సంచికనుంచి సాహిత్యంతో విశేషమయిన కృషి చేసి గతించిన అనేకమంది రచయితలను సాహితీ ప్రియులకు పరిచయం చేయాలన్న సంకల్పంతో తొలిసారిగా పురిపండ అప్పలస్వామిగారి జీవిత విశేషాలతో 'కలం యోధులు' అనే శీర్షికను ప్రారంభించి కొనసాగించారు. ఈ రకంగా చినుకులో అశోక్‌కుమార్‌కు 4-5 పేజీలు కలంయోధులు శీర్షికకు 32-33 పేజీలు అణువు శీర్షికకు 63-64 పేజీలు శ్రీశ్రీ క్విజ్ దాని జవాబుల వివరణలకు కేటాయించడం దాన్ని నిర్వహించడం విశేషంగా చెప్పుకోతగ్గ విషయం.

అశోక్ తన ప్రస్థానాన్ని కొనసాగిస్తూ తనూ ఒకడిగా మాలో ఒకడిగా ఉంటూ శీర్షికల నిర్వహ ణలతోపాటు పత్రిక నిర్వహణలో సలహా సంప్రదింపులకు చినుకుతో ఒక సంబంధాన్ని ఒక ఆత్మీయ అను బంధాన్ని సంపాదించాడు. ఈ నేపథ్యంలో చినుకు పత్రిక నిర్వహణకు ఒక ఎడిటోరియల్ బోర్డ్ అవసరం అన్న ఆలోచన రావటం ఆ ఆలోచనలో నవంబర్ 2005 సంచికనుంచి 'ఫీచర్స్ ఎడిటర్'గా చినుకులో తనూ ఒక కీలకమైన పాత్రను చేజిక్కించుకోవటం జరిగింది.

ప్రముఖ రచయితల పుస్తకాలను వారి రచనా వ్యాసంగాన్ని పాఠకులకు పరిచయం చేయాలన్న తలంపు రావటం, దీనితో ఆ శీర్షికను నిర్వహించడానికి ఒక ప్రముఖ కవి, విమర్శకుడు అయిన అద్దేపల్లి రామ్మోహనరావుని ఎంపికచేసి 'ఆవిష్కరణ' పేరున దీన్ని కొనసాగించటం జరిగింది. పాత తరానికి చెందిన ప్రముఖ కథకులని వారి కథల్ని పరిచయం చేయాలన్న ఉద్దేశంతో పెద్దిభొట్ల సుబ్బరామయ్యతో 'కథామృతం' శీర్షికను ప్రారంభించడం అలాగే అభ్యుదయ కవి అదృష్టదీపక్‌తో 'దీపకరాగం' శీర్షికను తన అభిమాన రచయిత్రి రంగ నాయకమ్మ గారితో చినుకు పత్రికలో శీర్షికను రాయుంచడం వంటి బాధ్యతను తీసుకొని అశోక్‌కుమార్ అతి ప్రయోజనకరమైన సాహిత్యాన్ని చినుకు పాఠకులకు అందించారు.

ప్రగతిశీల సాహితీవేత్త అయిన అశోక్‌కుమార్ అరవైయ్యోసంవత్సరంలోకి అడుగుపెడుతున్న సందర్భంలోయనకు నా శుభాకాంక్షలు. ■

## అక్షర హాలికులు

**అశోక్‌కుమార్**



## పులుపుల వెంకట శివయ్య

**( 1910 - 1976)**



## శివకేతనం

పలనాడు వెలలేని మాగాణిరా
సామ్యవాద రాజకీయవాణిరా
అలనాటి పులుపులవెంకటశివయ్య
పిడికిలి ఎత్తిన జనసేనానిరా

## గురజాడ జాడా! ఓ శ్రీశ్రీ వాడా !!



ఆస్తికతోన్మాదపు ఊరకుక్కలు చూడు ! మానవత్వాన్ని మానభంగం చేస్తున్నవి నేడు!
పుడుతుంది సెంటిమెంట్ల అంట్లజాతిరేపు ! మారిపోతుంది అవనిలో మానవత రూపు!
హేతువాద ఆయుధాలు చేతబట్టరా ! రోగాంగాలెల్ల కోసి తరిమి చావగొట్టరా !



# బడితె హేతువాది !

వై. ఈశ్వర్



## సుత్తీ కొడవలి

విడివిడిగా ఆకలిలోకం పనిముట్టు
కలివిడిగా దోపిడి లోకం పనిబట్టు !





# అశోక్‌కుమార్ తో..

'చినుకు' ఇంటర్వ్యూ

**చినుకు : అరవయ్యో పుట్టిన రోజుగా షష్టిపూర్తిని ఎలా ఫీలవుతున్నారు.**

అశోక్ : షష్టిపూర్తి అనేకంటే అరయ్యోపుట్టిన రోజనుకోవడమే నాకు బావుంటుంది.

**చినుకు : సరే అలానే అనుకుందాం. ఎలా ఫీల్ అవుతున్నారు.**

అశోక్ : అరవైఏళ్లు వయసొచ్చింది. ఇంతవరకు. ఏం చేయగలిగాం? ఏ చేశాం? ఇంకా ఏం చేయాలి? ఏం చేయగలం? అని సమీక్షించుకోడానికి ఒక సందర్భంగా ఫీలవుతాను. ఈ పుట్టిన రోజే కాదు ప్రతి పుట్టిన రోజూ అలానే ఫీలవుతూ వస్తున్నాను. ఇప్పటి వరకు యాభైతొమ్మిది చేసుకున్నాను. అరవయ్యోది చేసుకోబోతున్నాను. నాదే కాదు పెళ్లయ్యాక తనదీ, మా పిల్లలదీ ప్రతి పుట్టిన రోజూ చేసుకుంటూనే ఉన్నాం. పుట్టిన రోజు జరుపుకోవడం మాకందరికీ మా తండ్రి చేసిన అలవాటు. నాకు నచ్చి నేను కొనసాగిస్తున్నాను. మరీ ఎక్కువైతే ఎక్కడ పలచనవుతాయోనని, పుట్టిన రోజులు కుదరవు కాబట్టి పెళ్లి రోజులు కుదించుకున్నాం.

మా పుట్టిన రోజులూ మా పెళ్లిరోజులే మాకుటుంబానికి పండుగ రోజులు.

**చినుకు : కుదించుకున్నారా? అదెలా ?**

అశోక్ : మనసుంటే మార్గం ఉంటుంది కదా?ప్రత్యేకత ఉండే రోజు ఎంచుకుని( జనవరి ఒకటి)1972లో మేం పెళ్లి చేసుకున్నాం. మాయలూ, మంత్రాలూ, ముహూర్తాలూ లేని దండల మార్పిడి పెళ్లిళ్లే కాబట్టి మా అమ్మాయి, అబ్బాయి అదే రోజున పెళ్లిళ్లు చేసుకున్నారు. అలా మా కుటుంబానికి సంబంధించిన మూడు పండుగలు ఒకే రోజుకు తెచ్చుకున్నాం. అంటే ఇంతకు ముందువన్నీ కుటుంబ సభ్యుల మధ్య జరిగితే, ఇది బంధు మిత్రుల మధ్య జరుగుతోంది.

## అక్షర హాలికులు

**అశోక్ కుమార్**



## గుడిపాటి వెంకట చలం

**(1894 - 1979)**



## 'మహాచలం'

గుడిపాటి వెంకటచలం
అతివవాద మహోజ్వలం
స్త్రీల అణచివేతలపై
ఉప్పొంగిన లావానలం

**చినుకు : ఈ క్రమంలో ఏ సమస్యలూ ఎదురవ్వలేదా? కొడుకుగా, భర్తగా, తండ్రిగా, తాతగా, ఏదశలోనూ మీ ఆశయానికి భిన్నమైన ప్రయాణం సాగలేదని మీ సన్నిహితులు చెప్పేమాట. ఇదెలా సాధ్యమయింది ?**

అశోక్ : "…..ఇంటిలోని పోరు ఇంతింత కాదయా" అన్నాడు వేమన. అది లేకపోవడమే అతి ముఖ్యకారణం. కుటుంబ విషయాలన్నింటిలోనూ అభిప్రాయాలూ, ఆశయాలూ కలవడమే కాకుండా ఎన్నింటికో ఊపిరిపోసింది తనే. ఆ సహకారం తిరుగులేనిది. అటువంటి సహకారంఉంటే ఎన్ని పర్వతాలైనా ఎక్కొచ్చు. ఎన్ని సముద్రాలైనా ఈదొచ్చు. మా పిల్లలకు తల్లీ, గురువూ ఆవిడే. వాళ్లను ప్రయోజకులుగా తీర్చిదిద్దడంలో ఆవిడపాత్ర తిరుగులేనిది. మనిషనేవాడు సంపాదనకూపంలో తొత్తుగా కాకుండా పదిమందికి ఉపయోగపడే దీపంలోని ఒత్తుగా ఉండాలనేది ఆవిడ ఆశయం. ఆ ఆశయంతోనే నాకు సహకరించింది.

ఇద్దరమూ హేతువాదులమే కాబట్టి ఎదురైన సమస్యలను రాజీలేకుండా అధిగమించగలిగాం. చివరివరకు హేతువాదులుగానే ఉంటున్నాం. ఉంటాం. అలా ఉండేవాళ్లంటే ఇష్టం. అందుకే మాకు ఇష్టమైన హైమ, సమతా కోటేశ్వరరావుల కుటుంబమంటే ఎంతో ఇష్టం.

**చినుకు : మీ రచనలలో అయిదు ముద్రిత కావ్యాలూ, మరొక అముద్రిత కావ్యం హేతువాద రచనలే. అసలు మీరు హేతువాది ఎలా అయ్యారు.?**

అశోక్ : నేను హేతువాదిని కావడానికి రంగనాయకమ్మగారి రచనలే ముఖ్యకారణం.( నేను చెడిపోయానని అలా చెడిపోవడానికి కారణం రంగనాయకమ్మగారే అనేది నా తండ్రి అభిప్రాయం). రంగనాయకమ్మగారి తర్కం నాకు చాలా ఇష్టం. నాస్తిక సాహిత్యం, నాస్తిక ఉద్యమాలు మరింత స్ఫూర్తి నిచ్చాయి. మొండివాదాలు కాకుండా మార్క్సియన్ దృక్పథంతో హేతువాద రచనలు చేయడమూ, ఆర్థికదృష్టిలేని భౌతికవాదాల నిరుపయోగాన్ని ఎత్తి చూపుతూ హేతువాద సాహిత్యాన్ని రాసేవాళ్లం.ప్రచారం చేసేవాళ్లం.

**చినుకు : అరవై ఏళ్ల క్రితం పేరుగాబట్టి అడుగుతున్నాను, అశోక్‌కుమార్ అనేది మీ కలం పేరా? మీ తండ్రి గారు పెట్టినదేనా? మీ కుటుంబ నేపథ్యం గురించి కొద్దిగా….?**

అశోక్ : చాలామంది అలానే అనుకుంటారు. కాని కాదు. అశోక్‌కుమార్ అనేది అసలు పేరే. నా పేరుకు నేపథ్యం చెప్పాలంటే నా తండ్రి నేపథ్యం చెప్పాలి. తూర్పుగోదావరి జిల్లా రామచంద్రపురం తాలూకు పందలపాక గ్రామంలో పేరు పొందిన ఓ నూలుమిల్లులో మాతాత కూలీల మేస్త్రిగా పనిచేసేవారట. ఆయనకు మగపిల్లలు లేక మా నాయన్ని దత్తత చేసుకోవడం వలన ఆయన అనంతరం ఆ మేస్త్రీగిరి మా నాయన కొచ్చింది. ఎలిమెంటరీ స్కూలుతో చదువు ఆపేసినా వచ్చీరాని హిందీలో అందరినీ అదమాయిస్తూ ఉండేవారట. ఆ మిల్లు విదేశీ యంత్రాలతో పనిచెయ్యడం వలన ఆ యంత్రాలకు ఏదైనా అంతరాయంవస్తే బొంబాయి నుంచి ఆయంత్రాలను అమర్చిన కంపెనీ నిపుణులు వచ్చి సరిచేసేవారట. వాళ్ల సలహాలు తెలుసుకోడానికి హిందీ వచ్చినవాళ్లు లేక పోవడంతో ఆదాఆదా హిందీ వచ్చిన మా నాయనే అటు యజమాన్యానికీ, ఇటు యంత్రనిపుణులకీ అత్యవసరం అయిపోయారు. చిన్న చిన్న రిపేరులను చేపట్టడానికి, దానికి కావలసిన సలహాలు తీసుకోడానికీ, యంత్రాలకు అవసరపడే చిరుభాగాలు విడిభాగాలు తీసుకు రావడానికీ మా నాయన్నే అప్పుడప్పుడూ బొంబాయి పంపిస్తుండేవారట. అలా ఆయనలోని హిందీ ఏకజ్ఞానం అంతరించి ఇండియా లోకజ్ఞానం అంకురించింది.

అలా చురుగ్గా బొంబాయిలో పరిచయాలు అక్కడి వాళ్ల సహాయ సహకారాలతో మా ఊరు తాలూకా కేంద్రం రామచంద్రపురంలో 'జ్యోతి సైకిల్ స్టోర్స్' పేరున సైకిల్ విడిభాగాల షాపు ప్రారంభించారట. ఆయన వ్యాపారవ్యవహారాలు పెద్ద ఎత్తున సాగడంతో 'ఎస్.బి.అండ్ సన్స్'(సింగంపల్లి బంగారయ్య మరియు కొడుకులు అన్న మాట) పేరున రామచంద్రపురం, సామర్లకోట, పెద్దాపురం, అమలాపురం, తాడేపల్లిగూడెం, పందలపాక, రాజమండ్రి ఆరు పట్టణాలకు విస్తరించారట. సైకిల్స్ వ్యాపారంతో పాటూ హెచ్.ఎం.వి, కొలంబియా కంపెనీల డీలర్‌షిప్ తీసుకొని గ్రామఫోను రికార్డ్స్ వ్యాపారంకూడా చేశారు.

తన తొలిసంతానానికి తండ్రిపేరు, మలిసంతానికి తల్లిపేరు పెట్టుకున్నాక మూడో సంతానమైన నాకు మౌర్యఅశోకుడు పేరును ఆధునికంచేసి అశోక్‌కుమార్ అనీ (ఇది ఆయన మీద బొంబాయి ప్రభావం అన్నమాట), నా తరవాత వాడికి అరవిందఘోష్ పేరును అరవిందకుమార్ అనీ పెట్టారు. అక్కడితో ఆగిపోయింది గాని లేకుంటే మాఇంట్లో ఓ శివాజీ కుమార్ ఉండేవాడు.( ఆ తరువాత వాడికి ఆయన ఖరారు చేసుకున్న పేరు ఛత్రపతి శివాజీ)

**చినుకు : అంటే మీది కమ్యూనిస్టు నేపథ్య కుటుంబం కాదన్న మాట?**

అశోక్ : కాదు నూరుశాతం కాంగ్రెస్ నేపథ్య కుటుంబంగానే చెప్పుకోవాలి. మా నాయన కాంగ్రెస్‌కి వీరాభిమాని.భారత దేశానికి నెహ్రూ కుటుంబం ఎంతో త్యాగం చేసిందని, ఆ కుటుంబానికి భారత జాతి ఎంతో రుణపడిందని ఆయన నమ్మేవారు. నమ్మడమే కాకుండా మాకు నూరిపోసేవారు.కాంగ్రెస్ అంటే

అక్షర హాలికులు

అశోక్ కుమార్



స్మైల్

(1942-2008)



సంస్మైల్ ఒఖదే

హోరెత్తించిన ఖాళీసీసాలు
అలగా జనాల ఆక్రోశాలు
ఈస్మయిలు సాహిత్యప్రక్రియలకు
టెక్నిక్కే ఉచ్ఛ్వాసనిశ్వాసాలు

ఎంత అభిమానమంటే ఆగష్టు పదిహేనున, రిపబ్లిక్‌డే రోజున, గాంధీ జయంతి రోజున మాచేత మాఇంటి మీద జాతీయ పతాకం ఎగరేయించేవారు. మహాత్మాగాంధీ నుండి ఇందిరా గాంధీ వరకు ప్రముఖ కాంగ్రెస్ రాజకీయ నాయకుల ఫోటోలు మాఇంటి గోడలకు వేలాడుతూతుండేవి. ఒకసారి ఇంటికి వచ్చిన మా బంధువుల ఆవిడతో మా అమ్మ మా ఆయనది వ్యాపారం అని చెబితే, ఆవిడ ఆ ఫోటోలు చూసి ఫోటో ప్రేముల వ్యాపారమా?అని అడిగిందట. ఈ విషయం చెబుతూ మా అమ్మ తెగనవ్వేది.

**చినుకు : అక్షరాభ్యాసం సరే తెలుగు సాహిత్యాభ్యాసం ఎలా మొదలైంది?**

అశోక్ : అసలు రాయడం అనేది ఉత్తరాలతో ప్రారంభం. అప్పటికి ఎవరూ రచయితలు కాని మిత్రులం కొందరం ఉత్తరాలు పోటీపడి రాసేవాళ్లం. సుదీర్ఘంగా రాసుకునే వాళ్లం. ఆ రాయడంలో అందరిలోకీ నేనే సుదీర్ఘంగా రాసేవాడిని ఎంత సుదీర్ఘంగా అంటే విజ్‌డమ్ రూళ్ల పుస్తకాలు 40, 60, 80 పేజీలవి కొని ఉంచుకునేవాడిని. ఎవరైనా 10 పేజీల ఉత్తరంగాని రాస్తే, 40పేజీల పుస్తకం ప్రత్యుత్తరంగా రాసి పోస్టుచేసేవాడిని. అలా నేను రాసిన ఉత్తరాలలో అతి దీర్ఘమైంది 80 పేజీల విజ్‌డమ్ పుస్తకం ఒకటైతే, అలా రాసిన ఒక సుదీర్ఘకవితా ఉత్తరమే ( సమతా కోటేశ్వరరావు, ఆదిగా గల విజయవాడ సమత మిత్రులకు రాసింది.( నూతన సంవత్సర శుభాకాంక్షలుగా ఒకేకవితా ఉత్తరాన్ని కార్బన్ కాపీలు తీసి మిత్రులందరికీ పోస్టు చేశాను.) అది తరువాత కొద్దిపాటి మార్పులూ చేర్పులూ చోటు చేసుకుని 'శుభా కాంక్షలు'(2003) దీర్ఘ కావ్యంగా వెలుగు చూసింది.

ఈ ఉత్తర ప్రత్యుత్తరాలలో మేం పాటించిన మరో నియమం ఏమిటంటే, ఉత్తరానికి ప్రత్యుత్తరమే రాయాలిగాని, ముఖాముఖీ కలుసుకున్నా ఉత్తరంలోని విశేషాలు మాట్లాడుకోకూడదు. ఈ ఉత్తరాల ఆటకు ముఖ్యపాత్రధారులు సూత్రధారులు పెద్దాపురంలో ఉండే నా కజిన్స్ లక్ష్మి, రాంబాబులు. ఈ ఉత్తరాల ఆట పాటల వలనే నాలోని సృజనాత్మకత వెలుగు చూసిందని నమ్ముతున్నాను. రచయితయిన తరువాత ఎక్కువ ఉత్తర ప్రత్యుత్తరాల అనుభవం కొడవటిగంటి కుటుంబరావుగారితోనూ (మా మిత్ర బృందంలో కొ.కుతో ఎక్కువ ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపింది సమతా కోటేశ్వరరావు) సుదీర్ఘ ఉత్తర ప్రత్యుతరాల అను బంధం అనుభవం త్రిపురనేని మధుసూదనరావు(ఆయన విరసం కార్యదర్శిగా ఉన్నకాలం)గారితోనూ ఉంది.

**చినుకు : అంటే నూతన సంవత్సర శుభాకాంక్షలు ఒక దీర్ఘ కవితగా చెప్పారన్నమాట?**

అశోక్ : ఒక్క కవితగానే ఏమిటి ఇంకా ఎన్నో రకాలుగా- ముఖ్యంగా కాలేజీ రోజుల్లో. ఒక సంవత్సరం ఆఫ్‌సెట్‌లో నా ఫోటో బ్లాక్ చేయించి అచ్చేసిన కార్డుతో-మరో సంవత్సరం ఏ మిత్రుడికి ఎవరు అభిమానో తెలుసుకుని వారి చిత్రలనూ అమర్చి (కొన్ని నేను గీసిన లైన్ డ్రాయింగ్స్,కొన్ని స్టూడి యోఫోటోలు, కొన్ని అచ్చయిన ఫోటోలు నేను స్వయంగా తయారుచేసిన గ్రీటింగ్‌కార్డ్సుతో-(ఈ గ్రీటింగ్స్‌కి మా సర్కిల్లో పెద్దరెస్పాన్సే వచ్చింది). ఇక కుమారికైతే తన పద్దెనిమిదో పుట్టిన రోజుకి పద్దెనిమిది రచయితల (పద్దెనిమిదో రచయితను నేను)గీతాలతో తయారు చేసిన ఓ ఆల్బంను బహూకరిస్తూ శుభాకాంక్షలు చెప్పాను. 2003లో నా శుభాకాంక్షలు దీర్ఘకావ్యంతో పాఠకులకు శుభాకాంక్షలు చెప్పాను.

**చినుకు : సాహిత్యం ప్రక్రియలలో మీకు ఇష్టమైంది.**

అశోక్ : సాహిత్య ప్రక్రియలన్నింటా నాకు కవిత్వమంటే ఇష్టం. అందులో మినీకవిత్వమంటే మరీఇష్టం. అలా ఇష్టపడిన మినీకవిత్వం 50ఏళ్ల నుండీ రాస్తున్నాను. అంటే మినీకవితోద్యమానికి ముందు నుండీ రాస్తున్నాను. చిరుకవితలు మినీ కవితలుగా నామకరణం పొందక ముందు నుండీ రాస్తున్నాను ఈ మినీ కవితాభిమానమే "అక్షరం" శీర్షికతో రెండు సంవత్సరాల కాలం 'విశాలాంధ్ర' దినపత్రికలోనూ, "జ్ఞాన గుళికలు" శీర్షికతో సంవత్సర కాలం 'మానవ వికాసం' మాసపత్రికలోనూ మినీ కవితల్ని రాయించింది. ఈ మినీ కవితాభి మానమే రెండు సంవత్సరాలు నెలనెలా 'ప్రజాసాహితి' మాస పత్రికలో "అక్ష'రణం" చేయించింది. ఈ మినీ కవితా భిమానమే మహాకవి శ్రీశ్రీకి అంకితంచేస్తూ "శతఘ్ని"పేరున శ్రీశ్రీ శత జయంతి సంవత్సరంలో తీసుకు రాబోతున్న వేయికవుల మినీ కవితా సంకలనానికి ప్రేరణ. ఈ మినీ కవితాభిమానమే చినుకు మాసపత్రికలో నేను రాయడంతో పాటూ పదుగురితో రాయించే మినీకవితల వేదిక-అక్షరాల అణు సంధానం, 'అణువు' శీర్షికా నిర్వహణ.

శ్రీశ్రీ కారణంతోనే సాహిత్యంలోకి అడుగు పెట్టిన నా అచ్చయిన రచనలు-ఐదు దీర్ఘ కవితలైతే, ఐదు మినీకవితాసంపుటాలు. 'తంత్రం' అచ్చులో నా మొదటి మినీకవితల సంపుటి. పూర్తి రాజకీయ వ్యంగ్య మినీ కవితా సంపుటి. దాన్ని "కవిగా/ నాకు జన్మనిచ్చిన / మహాప్రస్థానం మహాకావ్యానికి" అంకిత మిచ్చాను. ఒక కావ్యాన్ని మరోకావ్యానికి అంకిత మివ్వడం తెలుగు సాహితీచరిత్రలో ఇదే ప్రథమం. ఎక్కడా అచ్చుకాని ఈ సంపుటిలోని 30 కవితల్ని 2004 ఎన్నికలముందు నెలరోజుల పాటూ రోజు కొకటిగా 'ఈనాడు' విజయవాడ సిటీ ఎడిషన్‌లో (ఎన్నిక ప్రభంజనం) ప్రచురించింది. ఆ తరువాత వెలువడిన నా మినీ కవితాసంపుటాలు 'పొద్దు పూసింది', 'ఆధ్యాత్మిక ర'హ'స్యాలు','వ్యూహం','గ్లోబలి'.

# అక్షర హాలికులు

**అశోక్ కుమార్**



**సూరపనేనిహరి**

**పురుషోత్తమరావు**

**(1935-2008)**



సాహిత్య సినిమా పరిజ్ఞానం
ఉద్యమాలవెన్నంటి ప్రయాణం
సూరపనేని పురుషోత్తమహరికి
మహాకవి శ్రీశ్రీ మరో ప్రాణం

చినుకు : మీరు రాసిన మొదటి మినీకవిత ఏది? దేనిమీద ?

అశోక్ : ఇక దేనిమీద-పోరాటం మీదే ! శ్రీశ్రీ ప్రభావంతో పాటు 70వ దశక ప్రథమార్ధ ప్రభావం కూడా పనిచేస్తున్న కాలం కదా!

కవిత శీర్షిక : ప్రారంభం

**చన్నులో పాలు చేరితే / శిశువు ప్రాణోదయం ప్రారంభం**
**కాగితమ్మీద సిరాపారితే / కవిత ప్రారంభం**
**పుడమి మీద వర్గ శత్రువు/ నెత్తురు పారితే పోరాటం ప్రారంభం.**

**చినుకు: ఎందరో అడగాలనుకున్న ప్రశ్న. ఇప్పటికి అవకాశం దక్కించుకున్న ప్రశ్న ఏమిటంటే మహాకవి శ్రీశ్రీ మిమ్మల్ని ఎలా ఆవహించాడు?**

అశోక్ : మహాప్రస్థానంతోనే శ్రీశ్రీ ఆవహించడం అందరి విషయంలోనూ జరిగేది. నా విషయంలో అందుకు భిన్నంగా జరిగింది. నాకు 'మహాప్రస్థానం' కంటే ముందే శ్రీశ్రీ పరిచయం జరిగింది.

దాని నేపథ్యం ఏమిటంటే- ఇంతకుమందే చెప్పాను కదా మా నాయనది సైకిల్ వ్యాపారంతో పాటూ, గ్రామఫోను రికార్డుల వ్యాపారమని. సినిమా విడుదలైన రోజున సినిమా చూడటం, సినిమా పాటల పుస్తకం కొని అందులోని పాపులర్ పాటలు నోట్‌చేసుకుని రికార్డింగ్ కంపెనీ కేటలాగ్‌లో ఆపాట నంబరుతో రికార్డులను ఆర్డరుపెట్టడం ఒక మా బిజినెస్ ప్రోసెస్. చూసి, విని, ఆనందించడం వరకే నేను పరిమితం. కాని పాటల పుస్తకంలోనూ, వెండితెర మీదా శ్రీశ్రీఅనే అక్షరాలు నన్ను అమితంగా ఆకర్షించేవి. అవి వెలుగుతున్న జ్యోతుల్లా అనిపించేవి. అంతే శ్రీశ్రీ అనే అక్షరాల కోసం, శ్రీశ్రీ అనే ఆయన రాసిన పాటలు ఏమిటో అని, ఆయన ఏపాటి రచయితో అని మా దగ్గరున్న పాటల పుస్తకాలు వెదికే వాడిని. ఆ వెదుకులాటలో మొదట తారస పడింది 'వెలుగునీడలు' పాటలపుస్తకం. ఆశ్చర్యమేసింది. తొమ్మిది పాటలకుగాను మూడుపాటలు తప్పించి మొత్తం పాటలన్నీ ఆయనవే. పట్టరాని సంతోషమేసింది. ఆ సంవత్సరం హృదయాన్ని పిండేసే గొప్ప విషాద సందేశ గీతం 'కలకానిది' కాగా దేశాన్ని ఉగ్రూతలూపిన సందేశగీతం 'పాడవోయి భారతీయుడా!'. అది బెస్ట్ సెల్లింగ్ రికార్డ్ ఆఫ్ ది ఇయర్ తెలిసింది. ఆ వెదుకులాటలో వెనక్కివెళ్లగా తారస పడిన మరో పుస్తకం 'మాంగల్యబలం' అందులోనూ రెండు మినహా అన్నీ ఆయన పాటలే. ముందుకు వెళ్తే 'భార్యాభర్తలు' 'ఇద్దరు మిత్రులు'. అప్పుడు నాకు పదో సంవత్సరం.

అక్కడి నుండి ఆ రెండు అక్షరాలకోసం వెండి తెర, పాటల పుస్తకాలు, గ్రామఫోను రికార్డులు వెదికే వాడిని. ఆవెదుకులాటలో తారసపడిన శ్రీశ్రీ ప్రతిపాటా అవకాశముండటం వలన మా షాపులో రికార్డు వేసుకుని వినేవాడిని. అద్భుతంగానూ, అపురూపంగానూ అనిపించేవి. అలా శ్రీశ్రీ పరిచయం అయ్యాడు. తరువాత శ్రీశ్రీ మేలురకం గీతాల రచయితే కాదు మేలుకొలిపే గీతాల రచయిత అన్నది 'మహాప్రస్థానం' చదివాక అర్థమయింది.

**చినుకు : మొదటిసారి మహాప్రస్థానం చదివినప్పుడు జ్వరమొచ్చినట్లయందని ఎందరో కవులూ, రచయితలూ చెప్పడం పరిపాటయి పోయింది. మీకూ అంతేనా?**

అశోక్ : నాకూనా ఏమిటి? ఆరోగ్యవంతుడైతే ఎవడికైనా వచ్చి తీరాలి ! రాలేదంటే వాడు ఖచ్చితంగా రోగిష్టి వాడే !

**చినుకు : 'మహాప్రస్థానం' చదివాకే మీరు కవి అయ్యారా?**

అశోక్ : నేనే కాదు తెలుగునాట మహాప్రస్థానం చదివి ఎందరో కవులయ్యారు, కమ్యూనిస్టులయ్యారు. నాలాంటి వారు కవులూ కమ్యూనిస్టులూ అయ్యారు.

'మహాప్రస్థానం'పై నా స్పందన ప్రతిస్పందనలు " శ్రీశ్రీ సంస్మరణ' (2008)లో ఓ మినీ కవిత "శ్రీశ్రీ మనవడు" శీర్షికన ఇలా చెప్పాను- " శ్రీశ్రీ కూతురు 'మహాప్రస్థానం" / నా తల్లి / నను గన్న తల్లి / కవిగా నాకు జన్మనిచ్చిన తల్లి! అందుకే నేను / శ్రీశ్రీకి వారసుణ్ణి / వరుసకు మనవణ్ణి !". దాని ముందు నా 'తంత్రం'(2004)లో కావ్యం ' కవిగా / నాకు జన్మనిచ్చిన / మహాప్రస్థానం / మహాకావ్యానికి" అంకితం.

**చినుకు : శ్రీశ్రీ సాహిత్యనిధి ఆలోచన-ఆచరణ- విజయం నేపథ్యం చెబుతారా?**

అశోక్: శతజయంతికి మూడు సంవత్సరాల ముందు ప్రారంభించినా శ్రీశ్రీ సాహిత్యనిధి శ్రీశ్రీ శతజయంతి కోసం ఏర్పాటయిందికాదు. ఇరవై సంవత్సరాల కాలం రాయడంలో విరామం ఉన్నా తెలుగు సాహిత్యాన్ని, సమాజ సాహిత్య పరిణామాలనూ సాహిత్య ఉద్యమాలనూ చదువుతూనే ఉన్నాను.

శ్రీశ్రీ గురించి, శ్రీశ్రీ సాహిత్యం గురించి ఏమైనా రాయాలి, ఏమైనా చేయాలి, అని ఎప్పటినుండో ఉన్న ఆలోచన కొత్త శతాబ్దిలో ఆచరణలోకి తీసుకురావాలి అనుకుంటున్న నాకు శ్రీశ్రీ ఇరవయ్యో వర్ధంతికి 2003లో పునర్మూల్యాంకనం పేరున శ్రీశ్రీపై జరిగిన అసత్యఅసాహిత్య దాడి ఓ పెద్దషాక్. అది కచ్చితంగా

గురజాడిని, శ్రీశ్రీని అడ్డంపెట్టుకుని మార్క్సిజంపై జరిగిన దాడి. కొత్త తరాన్ని పక్కదారి పట్టించే దాడి.

ఆ అవాస్తవాలను ఖండించడానికి అసమాన శ్రీశ్రీ సాహిత్యచైతన్యమే సమర్థవంతమైన ఆయుధం అనిపించింది. ఇదీ శ్రీశ్రీ సాహిత్యం. ఇదీ సమస్తాన్నీ చైతన్య పరచిన చారిత్రక సత్యం అంటూ శ్రీశ్రీ విరించిదీ, శ్రీశ్రీ గురించిదీ సాహిత్యాన్ని విపులంగా కొత్త తరానికి అందించడంలోని అవసరం కనిపించింది. సాహిత్య పఠనం సన్నగిల్లిన నేటి యువతరానికి ఎలా అందించాలనే మథనంలోంచి వెలిగిన ఆలోచన "శ్రీశ్రీక్విజ్'. క్విజ్ రూపంలో శ్రీశ్రీ గురించి, శ్రీశ్రీ సాహిత్యంగురించి చెప్పడం ఈ తరానికి దగ్గర కావడానికి సరైందిగా అనిపించింది. అలా రూపొందింది శ్రీశ్రీక్విజ్. కొత్త శతాబ్దిలోని శ్రీశ్రీపై ఆలోచన అలా 2003లో ఆచరణకొచ్చింది.

తరువాత 2005లో మిత్రుడు నండూరి రాజగోపాల్ ప్రారంభించిన చినుకు మాసపత్రిక ప్రారంభించడం 'శ్రీశ్రీక్విజ్' పన్నెండు నెలల పాటూ ప్రచురించడానికి స్వీకరించి ఇరవైనెలలు నెలలు ధారావాహికంగా ప్రచురించడం చాలామందికి తెలిసున్న విషయమే.

అత్యంత పాఠకుల ఆదరణ పొందినా చిరకాలం ఒక వ్యక్తి ( శ్రీశ్రీ శక్తేగాని శ్రీశ్రీవ్యక్తి కాదనుకోండి)పై ఓ శీర్షిక ఎల్లకాలం ఒక పత్రికలో కొనసాగడం వీలుకాదు కదా ! అందుకు ఓ సంస్థను ప్రారంభించి 'శ్రీశ్రీ క్విజ్' ప్రాధాన్యతతో ఒక త్రైమాస బులెటిన్ కొనసాగించాలనే ఆలోచనకు ఆచరణే, బులెటిన్ గా'శ్రీశ్రీ బులెటిన్' సంస్థగా శ్రీశ్రీ సాహిత్యనిధి.

శ్రీశ్రీ సాహిత్యనిధి సారథిగా నేనుంటున్నా శ్రీశ్రీ సాహిత్యనిధి వెనుక ఎందరిదో కృషీ, కసీ ఉంది. వీళ్ల సహకారం తిరుగులేనిది. దీనికి ఒకటి కాదు, తెలుగునాట వామపక్ష భావజాల సాహితీ సంస్థలు విరసం, అరసం, జనసాహితి, సాహితీ స్రవంతి నాలుగు దిక్కులై సహకారం అందిస్తున్నాయి.

శ్రీశ్రీ సాహిత్యనిధి జెండాకు కొండంత అండగా నిలిచిన శ్రీశ్రీ ప్రింటర్స్ విశ్వేశ్వరరావు, అడిగిన వెంటనే ఎంతో సమాచారాన్నిచ్చే చలసానిప్రసాద్, అడక్కుండానే ఎంతో సమాచారాన్ని అందించే కొత్తపల్లి రవిబాబు, తను తిరిగే ప్రతి సాహిత్యసభకు శ్రీశ్రీ ప్రచురణల పుస్తకాలను అందించే దివికుమార్ పుస్తకాల ప్రూఫ్ రీడింగ్‌లో రాత్రీపగలూ లెక్కచేయని సమతకోటేశ్వరరావు, రవిబాబు ఇచ్చే సహకారం ధన్యవాదాలతో తీర్చుకోలేనిది.

**చినుకు : శ్రీశ్రీ విరించివీ, శ్రీశ్రీ గురించివీ 'నూరు పుస్తకాల హోరు' బృహత్కార్యక్రమం ప్రారంభించారుకదా? అంత అవసరమా? విజయవంతంగా పూర్తి చేయగలగడం సాధ్యమేనా?**

అశోక్ : ఆలోచనలూ-అక్షరాలే కాదు పుస్తకాలూ వెల్లువలా రావాలి తప్ప, ఒకటి అరా వచ్చి ఒకరోజుకో ఒక నెలకో పరిమితం కాకకూడదనేది. పది సంవత్సరాల ప్రణాళిక అనుకుంటే నాలుగో సంవత్సరంలోకి అడుగుపెట్టాం. ఇప్పటికి 21 పుస్తకాలు అచ్చయ్యాయి మరో ఎనిమిది నవంబరులోగా అచ్చవుతున్నాయి. సంవత్సరాంతానికి 50 పుస్తకాలు పూర్తిచేయాలనుకుంటున్నాం. కచ్చితంగా 10 సంవత్సరాలలోపే పూర్తవుతుంది.

**చినుకు : ఒక రచయిత గురించి నూరు ప్రచురించడం, ఒక పత్రిక నడపడం, ఒక సాహిత్య సంస్థను స్థాపించడం అంటే ఇది బహుశా తెలుగు సాహిత్యంలోనే కాదు ప్రపంచ సాహిత్యంలో కూడా రికార్డేమో ?**

అశోక్ : కావచ్చు. శ్రీశ్రీ అంటేనే రికార్డులూ, రికార్డు బ్రేకులూ.

**చినుకు : శ్రీశ్రీ సాహిత్యనిధి గురించి శ్రీశ్రీ చలసాని ప్రసాద్‌గారి స్పందన ఏమిటి.**

అశోక్ : *"మేరువంతటి మహాకవి నిధులని / నిర్విరామంగా కూర్చి, పేర్చి, ఏర్చి*
*తెలుగు సమాజహృదయంలో నిక్షిప్తం చేస్తున్న 'శ్రీశ్రీ సాహిత్యనిధికి' అంకితం.*

అంటూ చలసాని ప్రసాద్ తన గ్రంథం 'చిరంజీవి శ్రీశ్రీ' (శ్రీశ్రీపై చలసాని సాహిత్య సర్వస్వం)ని శ్రీశ్రీ సాహిత్యనిధికి అంకితమివ్వడమే శ్రీశ్రీ సాహిత్యనిధికి లభించిన ఓ గొప్ప కాంప్లిమెంటు.

**చినుకు : సృజన,చేతన అద్భుతంగా కలిగిన మీలాంటివారు ఇలా ఒక విభాగానికే పరిమిత మయ పోవడం....?**

అశోక్ : శ్రీశ్రీకి కమిటవ్వడమంటే-సమాజానికి కమిటవ్వడం, చైతన్యానికి కమిటవ్వడం. సమకాలీన సమస్యలపై పోరాటాలకు కమిటవ్వడం. అంతకంటే ఏ రచయితయినా చేసేదేముంటుంది.

**చినుకు : చినుకు తెస్తున్న 'అరవై వసంతాల అశోక్‌కుమార్' ప్రత్యేక సంచికపై మీ స్పందన ఏమిటి?**

అశోక్ : నాలుగు మంచి మాటలతో ఓ ప్రత్యేక సంచిక వెలువడటం సంతోషమే అయినా, ఇలాంటి ప్రత్యేకసంచిక రావడానికి ఎంతో అర్హత ఉండాలి. ఆ విషయమేచెప్పి వారించబోయాను. చినుకు సంపాదక వర్గం ససేమిరా అంది.అది నామీద ఉన్న గౌరవం కావచ్చు.నా ఒళ్లు నా దగ్గరేఉంది, దీన్ని నేను గౌరవంగా స్వీకరిస్తున్నాను.ఇంతటి గౌరవాన్నిఅందిస్తున్న చినుకుకు మనస్ఫూర్తిగా కృతజ్ఞతలు తెలియజేసుకుంటున్నాను.■

## అక్షర హాలికులు

అశోక్ కుమార్



### వట్టికోట ఆళ్వారుస్వామి

**(1915 - 1994)**



## 'ప్రజల మనిషి'

గట్టి కోట ఆళ్వారు
ప్ర'జలహోరు' సెలయేరు
ఉద్యమాల సానబడిన
తెలంగాణ తల్వారు

## భట్టిప్రోలు
## నాగసుందరి స్మారక సంక్రాంతి
# కథానిక పోటీ

ం పోటీల్లో గెలుపొందిన కథా రచయితలకు ప్రథమ బహుమతిగా రూ. 1500/-లు, ద్వితీయ బహుమతిగా రూ. 1000/-లు, తృతీయ బహుమతిగా రూ. 500/-లు, కన్సొలేషన్ బహుమతులు (2-250) ఇవ్వబడును.

ం కథ నిడివి అచ్చులో ఒక పేజీకి మించరాదు.

ం రచయిత వివరాలు కథపై కాకుండా వేరే కాగితంపై పొందుపరచవలెను.

ం హామీపత్రం (ఈ కథ తన స్వంతరచన అని, దేనికి అనుకరణగాని, అనువాదంగాని కాదని, ఇంతవరకు ఈ కథ ప్రచురింపబడలేదని, ఏ యితర పత్రికలకు గాని, శ్రవ్య, దృశ్య మాధ్యమాలకు గాని పంపలేదని ధృవీకరణ పత్రం జతపరచాలి.

ం కథలు చేరవలసిన ముగింపు తేదీ : 15 డిసెంబర్ - 2010.

ం కవరుపై 'సంక్రాంతి కథానికల పోటీ'కి అని ఉదహరించాలి.

ఈ కథానికల పోటీలకు ప్రముఖ కథకులు, అనువాదకులు శ్రీ ఎల్.ఆర్.స్వామి, విశాఖపట్నం వారు స్పాన్సర్ చేస్తున్నారు.

**చినుకు మాసపత్రిక**

3వ అంతస్తు, దత్తాస్ నయాబజార్
రాజ్‌యువరాజ్ థియేటర్స్ ఎదురుగా, గాంధీనగర్.
విజయవాడ - 520003.

Ph : 0866-6640595 Cell : 98481 32208
E-mail : editor_chinuku@yahoo.com &
editor.chinuku@gmail.com

చినుకు ప్రచురణ ప్ర'యోగా'

# ఇంటింటా పుస్తక వసంతం

మనసుకీ, మేధకీ
ఉల్లాసంగా...ఉత్సాహంగా

**చినుకు**

చినుకు ప్రచురణలు
ఎందరో పుస్తక ప్రియులు! అందరికీ ఆహ్వానం

## వెయ్యిరూపాయలతో సభ్యులుగా చేరండి
## రూ.1650/- విలువగల పుస్తకాలు
## పొందండి

ప్రణాళిక వివరాలు

| | |
|---|---|
| 1. నెలనెలా రెండు పుస్తకాలు | |
| చొప్పున 12 నెలలపాటు | |
| చినుకు ప్రచురించే పుస్తకాలు | |
| ఒక్కొక్కటి రూ.50/- విలువ గలవి 24 పుస్తకాలు | రూ.1200 |
| 2. చినుకు వద్ద లభించే పుస్తకాల కేటలాగు | |
| (అంటే చినుకు పచురణలూ.. ప్రముఖ | |
| ప్రచురణల ప్రసిద్ధ రచనలూ..) నుంచి | |
| మీరు కోరుకున్న పుస్తకాల విలువ | రూ.300 |
| 3. ఒక సంవత్సరం పాటు 'చినుకు' పత్రిక | |
| (12 సంచికలు) మీకు లభించే మొత్తం | రూ.150 |
| పుస్తకాల విలువ | రూ.1,650 |

## ఆరుపదుల వేడుక - నవంబర్ 6, 2010



అల్లుడు కొడుకు సత్య, కూతురు జ్వలిత, మనవరాలు అనన్య, కొడుకు విక్రాంత్, కోడలు కూతురు సుధ, సహచరి కుమారితో....

BCR



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KLVA102M219 |
| పుస్తకం పేరు | చినుకు |
| తారీఖు | 07 February 2025 |
| ముందు అట్ట | Yes |
| వెనుక అట్ట | Yes |
| మొత్తం పేజీలు | 125 |
| పెద్ద సైజు పేజీలు | No |
| ఖాళీ పేజీలు | No |
| లేని పేజీలు | No |
| తయారు చేసినది | Priyanka |
| పేజీలు విడదీసినది | Priyanka |
| స్కాన్ చేసినది | [illegible] |
| పరీక్ష చేసినది | LAKSHMI |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |